పురాణవైర గ్రంథమాల

# నందోరాజాభవిష్యతి

గ్రంథకర్త

కవి సమ్రాట్

విశ్వనాథ సత్యనారాయణ




పబ్లిషర్సు:

ఉమా పబ్లిషర్సు

విజయవాడ-1.

# పురాణవైర గ్రంథమాలా పీఠిక

ఇవి పురాణవైరమను శీర్షికతో వ్రాయఁబడుచున్న పదునాఱు నవలలు. ఏనవల కానవలే. పదునాఱింటను కలిపి ఒకటే కథ యుండదు. ఒకదానితో నొకదానికి సంబంధ ముండదు. కొన్నింటియందు సంబంధమున్నను, అది ప్రధానము కాదు. కాని ఈనవల లన్నింటికి కలిపి పురాణవైర మన్న శీర్షిక యెందులకు? పురాణ వైరమన్న పే రెందులకు?

ఈ విషయము ఈనవలలో నచ్చటచ్చట పరామర్శింపఁబడును. మనకు వేదశాస్త్రపురాణేతిహాసములు గలవు. వానిలో పురాణ మున్నది. పురాణ మనఁగా నేమి? "పురాణం పంచలక్షణం" అని మనవా రన్నారు. పురాణ మైదు లక్షణములు కలది. సర్గము, ప్రతిసర్గము, మన్వంతరములు, రాజవంశములు, అనువంశములు, అని ఈ అయిదు లక్షణములు పురాణములయం దుండును. సర్గమనఁగా మొదట జరిగిన సృష్టి లక్షణము, మహాప్రళయము జరిగిన తరువాత తొలిసారి సృష్టియొక్క స్వరూప మెట్టిదనో అది సర్గము. తరువాత కొన్ని కొన్ని ప్రళయములు జరుగును. అప్పుడు మరల సృష్టి జరుగును. దాని పేరు ప్రతిసర్గము. మన పురాణములలో ఒక మనువు చెఱువునకు స్నానమునకు పోయినట్లు, ఒక చేప తన్ను రక్షించుమని అడుగఁగా, దానిని తన చెంబులో తీసికొనివచ్చెను. అది చెంబునకు పెద్దదై నాకు ఈచెంబు చాలుట లేదనఁగా పెద్దపాత్రలో వేసెను. అట్లు పెరిగి పెరిగి సముద్రములోఁ బడవేయఁదగినంత దయ్యెను. ఆచేప ఆ మనువుతో కొలఁది దినములలో సముద్రములు పొంగి భూమి మునిఁగి పోవును. లోకములో నున్న జీవరాశులలో ఒక్కొక్క జీవ

రాశి నొక్కొక్క వ్యక్తిగా తీసికొనివచ్చి నావపైన నెక్కినను.
ప్రళయానంతరమున మఱల సృష్టిని నిలుపుదువుగాని. అని
చెప్పఁగా నతఁడట్లు చేసెను. ఇది ప్రతిసర్గము. అనఁగా మహత్తు
అహంకారము మొదలగు వాటినుండి మఱల సృష్టి జరుగ
లేదు. మహాదహంకారాదులనుండి జరిగెడు సృష్టి సర్గము.
తత్సర్గమందున్న జీవరాసులయొక్క ప్రతులు మిగిల్చి
వానివలన మఱల సృష్టి సాగుట ప్రతిసర్గము. బైబిలులో
'నోవాస్ ఆర్క్' అని యున్నది. నోవా అనువాఁడు ఒక
యోడలో జీవరాసులయొక్క ప్రతులను తీసికొనివచ్చినట్లు దాని
వలన మఱల సృష్టి ప్రారంభమైనట్లు చెప్పఁబడినది. అది ప్రతి
సర్గము. సర్వ విద్యలు సర్వజ్ఞానము ఇతర దేశములకు భారత
దేశమునుండియే వెళ్ళినవి. అట్లు వెళ్ళిన జ్ఞానములో బైబిలు
లోని కథ యొకభాగము. మూఁడవది మన్వంతరములు. కృత
త్రేతాద్వాపర కలియుగములు నాల్గు కలిసినచో నొక
మహాయుగము. ఇట్టి మహాయుగములు 71 జరిగినచో నొక
మన్వంతరము. అట్టి పదునాల్గు మన్వంతరములు జరిగినచో
నప్పుడు మహాప్రళయము వచ్చును. ఈ లెక్క ఎక్కడ?
పాశ్చాత్యులు మనకు నేర్పెడి చరిత్రలోని లెక్క ఎక్కడ?
అల్పమైన యూహగల వారి మార్గమును మన మనుసరించు
చున్నాము. నాల్గవది రాజవంశము. సృష్ట్యాదియందుఁ గల
సూర్య చంద్రవంశ రాజుల చరిత్రములు మన పురాణము
లలో మన్నవి. అనువంశములనఁగా వారినుండి కలియుగములో
వచ్చిన బహు రాజవంశముల చరిత్రము. ఇది నేఁడు చరిత్ర
యనుచు పేరున కళాశాలలలో పాఠశాలలలో చదివింపఁబడు

విషయము. దానిని పాశ్చాత్య చరిత్రకారులు పలువిధము లుగా మార్చి పాడుచేసి వారి యిష్టమువచ్చినవి చదివించు చున్నారు. మన పెద్దలు వాని ననుసరించుచున్నారు. మనకు చరిత్ర జ్ఞానములేదని పాశ్చాత్య పండితులు నేర్పిరి. వారి చదువు చదివిన మన ఇంగ్లీషు పండితులు దానిని ప్రతిదినము చెప్పుచుందురు. కొందఱు నిజమే యనుకొనుచుండిరి. ఏ గూటిచిలుక ఆగూటిపలుకే పలుకునని యీ ఇంగ్లీషు చదువే చదివి పాశ్చాత్య సంప్రదాయమునందే తగుల్కొన్న బుద్ధులు వారి మాటలే విశ్వసించుటలోఁ దప్పేమియులేదు.

ఇంతకు చెప్పవచ్చిన దేమనఁగా మన పురాణములు చరిత్రయే. మన ఋషులకు చరిత్ర జ్ఞానములేదనుట, మన పూర్వ నాగరికతను ఎంత తక్కువ పఱచినచో వారి ఏలుబడి అంత గొప్పగా సాగునని పాశ్చాత్యులు పన్నిన పన్నుగడ.

ఇంగ్లీషువారు క్రైస్తవులు. బైబిలునందు విశ్వాసము కలవారు. పాశ్చాత్య దేశములన్నియు నింతే. వారి బైబిలులో సృష్టిక్రీస్తుపూర్వము రెండువేలపండ్లక్రింద జరిగినది. నూటి తొంబదియైదుకోట్ల సంవత్సరములపూర్వము మనసృష్టి జరిగిన దని మనవారు చెప్పుచున్నారు. ప్రతి సంవత్సరములో పంచాంగ మును తీసి చూడుడు సృష్ట్యాది గతాబ్దాః సృష్టి మొదలు పెట్టిన తరువాత కడచిన సంవత్సరములు. అవి ఎన్ని? నూట తొంబదియైదుకోట్ల పైచిల్లర. కలిగతాబ్దాః కలిలో గడచిన సంవత్సరములు. అవి ఎన్ని? అయిదువేల అరువది. ఇట్లు మన జ్యోతిష్కులు సంవత్సరము సంవత్సరము లెక్కపెట్టుకొని వచ్చుచున్నారు. దానిని కాదనుట యెట్లు? పాశ్చాత్యుల

బుద్ధి ప్రమాణ మెట్లు? క్రీస్తుశకము 1960. మఱి పదిలక్షల సంవత్సరములు జరిగిన తరువాత క్రీస్తుశకము నెట్లు లెక్కపెట్టుదురు ? వేలమీఁదనున్నప్పుడు లెక్కపెట్టవచ్చును. లక్షలు, కోట్లైనప్పుడెట్లు ? క్రీస్తు పూర్వమున లెక్కవేసినను, కోట్లమీఁదనున్న సంఖ్య వారి నెమరునకురాదు.

మన కలియుగము ప్రవేశించినప్పటికే వారికి లెక్క కుదురలేదాయె. వారి సృష్టి అప్పుడు జరిగిన ట్లాయెను. ఇది ఏమి లెక్క! అయిదువేల అరువది సంవత్సరముల క్రింద కలి ప్రవేశించెనని పంచాంగములు చెప్పుచున్నవి. భారతయుద్ధమప్పుడు జరిగినదని భారతములో దాఖలా లున్నవి. ఆర్యభట్టు మొదలైన మనపూర్వ ఖగోళ శాస్త్రజ్ఞులు వ్రాసిపెట్టినారు. వాని నన్నింటిని పాశ్చాత్యులు కాదన్నారు. ఇంగ్లీషు నేర్చిన మన పెద్దలు వారినే విశ్వసించుచున్నారు. మనవాంద్రకు పురాణములయందు చెప్పఁబడిన సర్గ ప్రతిసర్గములయందు విశ్వాసములేదు. డార్విను సిద్ధాంతమునందు విశ్వాసము.

మన దేశములో కొందఱు పెద్ద లీవిషయమును చాల పరిశ్రమచేసి పాశ్చాత్యుల సిద్ధాంతములు తప్పులని ఋజువు పరచినారు టి. యస్. నారాయణశాస్త్రిగారు శంకరుని కాలము నిర్ణయించుచు ఈ విషయములను సమగ్రముగా చర్చించి మహాభారతయుద్ధము సుమారు అయిదువేలేండ్ల క్రింద జరిగినట్లు నిరూపించిరి. తరువాత నడింపల్లి జగన్నాథరావుగారు నిరూపించిరి. తరువాత కోట వెంకటాచలముగారు మన సర్వచరిత్రము విస్పష్టముగా విలిఖించినారు.

గ్రీకుల రచనలలో సాండ్రకోటస్ అన్న మాట యున్నది. దానిని పాశ్చాత్యులు మౌర్యచంద్రగుప్తుఁడని యర్థము చెప్పినారు. దానిలో పురాణములలోని కలిరాజవంశ మంతయు తాఱుమాఱైనది. ఈయన గుప్తచంద్రగుప్తుఁడు గాని మౌర్యచంద్రగుప్తుఁడు గాఁడు. మనకు మగధరాజవంశ చరిత్ర యున్నది. కల్హణపండితుఁడు తన రాజతరంగిణిలో కాశ్మీర రాజ చరిత్రము పూర్తిగా వ్రాసినాఁడు. నేపాళరాజవంశ చరిత్రము సమగ్రముగ గలదు. గుప్తచంద్రగుప్తుని వదలి పెట్టి మౌర్యచంద్రగుప్తుఁ డనుటతో సర్వము నాశనమై పోయినది. పాశ్చాత్య చరిత్రకారులు. ఈ సిద్ధాంతము అకాండ తాండవము చేసినారు మనచరిత్రను వారియిష్టము వచ్చినట్లు మలఁచిరి. మన పండితులదియే చదువుచున్నారు. విద్యార్థులచేత అదియే చదివించుచున్నారు.

ఈ విషయము సమగ్రమముగ నెఱుఁగఁ గోరువారు భారతచరిత్రభాస్కర బిరుదాంకితులైన పండిత కోట వెంకటాచలముగారి గ్రంథములను చదువ వలయును. భారత యుద్ధము అయిదు వేల ఏండ్లక్రితము జరిగినదని తెలిసికొనఁగోరు వారు, నడింపల్లి జగన్నాథరావుగారు వ్రాసిన మహాభారత యుద్ధకాలనిర్ణయమును టి. యస్. నారాయణశాస్త్రిగారు వ్రాసిన శంకరాచార్యకాల నిర్ణయములను చదువవలయును. ఈ రెండు గ్రంథములు ఇంగ్లీషు భాషలో వ్రాయఁబడి యున్నవి. ఆ గ్రంథములు గ్రహములగొుక్క చారము, వాని లెక్కలు మొదలైన వానితో నిండియుండును.

ఈ చరిత్రను పలుమంది పాశ్చాత్యులుదిద్ది పాడు చేసిరి. పంక్తులు తప్పుచదివి దుర్వ్యాఖ్యానములుచేసి హిందువు యొక్కయు, బౌద్ధులయొక్కయు వ్రాతలను పరిహసించి దుర్మార్గములు చేసిరి. ఈ దౌర్మార్గ్యమును ప్రారంభించిన వాడు సర్ విలియమ్ జోన్సు. తరువాత చాలమంది పాశ్చాత్య చరిత్రకారులు వారి ననుసరించిరి. మన వేదాంతముల యందభిమానముగల మాక్సుముల్లరుకూడ చరిత్ర విషయములో దుష్టముగానే వ్రాసెను. ఇంగ్లీషులో నొక సామెత యున్నది. Blood is thicker than Water.

ఇంతకు సప్తర్షి మండలముయొక్క గమనముమీద మహాభారత యుద్ధకాల నిర్ణయము చేయబడవలయును. ఇది పెద్ద కథ. పోనిండు. పురాణముల ప్రకారము చూచినచో సప్తర్షి మండల చారమునుబట్టి లెక్కకట్టినచో సాండ్రకోటస్ సు ప్తచంద్రగుప్తుడని అంగీకరించినచో, నన్నియు సరిపోవును. సరిపోయెడు నీ లెక్కయుండగా, సరిపోని లెక్కకట్టి పురాణములు తప్పనుటలోని తెలివి ఏమి? అందులోని న్యాయమేమి? దానియందలి విశ్వాస మిట్టిది.

ఆ లెక్క ప్రకారము కలి ప్రవేశము మొదలు సంయుక్త పృథ్వీరాజుల కథ దనుక పాశ్చాత్యులు తాఱుమాఱు చేసిరి. ఆ కాలము అనగా సుమారు మూడు వేలయేండ్ల కాలము. మహమ్మదు గోరీ వచ్చువఱకు మన చరిత్రలో పాశ్చాత్యులు చేసిన యవక తవకలు కాదని నవలల రూపమున నిరూపించుటకు చేసెడి ప్రయత్న మిది.

అందుచేత దీనికి 'పురాణవైర'మని శీర్షిక యేర్పఱుపబడినది.

# పీ ఠి క.

మగధ రాజ్యమును శిశునాగ వంశము పోయి నందవంశ మె ట్లాక్రమించెనో ఈ నవలయందు నిరూపిత మగును. శిశు నాగ వంశపు రాజులు 10 మంది. వారిలో చివరివాఁడు మహా నంది. శిశునాగవంశము 360 ఏండ్లు రాజ్యము చేసెను. తరు వాత నందుఁడు మగధరాజ్యమునకు రాజయ్యెను. అతఁడు క్రీ. పూ. 1634 ఏట మగధరాజ్యమునకు రాజయ్యెను. ఈ నందుఁడు మహానందియొక్క యుంపుడుకత్తె కొడుకు. అప్ప టికే బుద్ధుఁ డుదయించి 200 ఏండ్లయినది. నందునకు మంత్రి రాక్షసుఁడన్న విషయము ముద్రారాక్షసమునుండి తీసికొన బడినది. ముద్రారాక్షసమునాఁటికి రాక్షసుఁడు వృద్ధుఁడు. ఆ రాక్షసునియొక్క మహా ప్రతిభ ఎట్టిదో అతఁడు నందునకు రాజ్య మెట్లు సంపాదించి పెట్టెనో సర్వ భారత దేశ మునెట్ల ట్లు వశము చేసిపెట్టెనో ఈ నవలలో వ్రాయబడినది. పురాణములలో ఈ నందుని గురించి "శాసిష్యతి మహాపద్మః ద్వితీయ ఇవభార్గవః" అని వ్రాయఁబడినది. ఇతఁడు రాజ వంశ ముల విషయములో 2 వ పరశురామునివలెనై నాఁడని చెప్పఁ బడినది. ఇతఁడు క్రీ. పూ. 1634 న రాజ్యమునకు వచ్చెను. అప్పటివఱకు సర్వ భారత దేశమునందు క్షత్రియులే రాజులు. నందుఁడు సర్వరాజ వంశములను నిర్మూలనము చేసెను. కలియుగ రాజ వృత్తాంతములోని, యీ నందునిఁగూర్చి సర్వ క్షత్రాంత కృత్ నృపః" అని వ్రాయఁబడినది. అతఁడు "సర్వ

క్షత్రియ వంశములను నిర్మూలించెను. ఐక్ష్వాకులను, పాంచాలురను, కౌరవులను, హైహాయులను, కాలకులను, ఏకలింగులను, శూరసేనులను, మైథిలులను నాశనము చేసెనని కలియుగ రాజవృత్తాంతము చెప్పుచున్నది. బ్రహ్మాండ పురాణములో ఇతనిని గురించి "సర్వక్షత్రం సముద్ధృత్య" అనగా సర్వ క్షత్రియులను నాశనముచేసి, అని వ్రాయబడినది. ఈ పురాణాంశమును ఆధారము చేసికొని ఈ నవల వ్రాయబడినది. నందునియొక్క రాజనీతి రాక్షసోపజ్ఞకముగా వ్రాయబడినది.

# నందో రాజా భవిష్యతి

## ౧

అది నడివేసఁగి. నడిమింటి సూర్యుఁడు మహాగ్ని గోళమువలె తేరిపారఁ జూడరాకుండ నుండెను. అతనిని చూచుటకుఁ బ్రయత్నముకూడ చేయరాదు. ఆ మహాగ్నులలో శరీర ముడుకెత్తుటయు నధికముగా నా యాతపములయం దున్నచో నొడలు బొబ్బలు పొక్కుటయు మొదలైన కార్యములచేత నా సూర్యుని తేరిచూడ రాకపోవుటయు నతని యగ్నిగోళత్వము, ననుమీయమానము లేగాని యాతఁ డెట్టివాఁడో తెలియదు. అంతటి తైక్ష్ణ్యము సూర్యబింబము నుండి నిర్గమించుచున్నను, త దాతపాగ్నికి జనులు పెక్కుఱు మరణించుచున్నను, నాతఁ డసహిష్ణువైయున్నను, జనము వీథులవెంట నడచుట మానలేదు. మహాటవులలో దావాగ్నులు చెలరేఁగునట. ఆ యగ్నులు పిపీలికలున్న భూవివరముల సామీప్యమునకు వచ్చుచుండును. ఆ పిపీలికలు వేలును లక్షలును తండోపతండములుగా మహాసైన్యములవలె బారులుతీర్చి సమాక్రమించి వచ్చుచున్న మంటల నార్పుటకుఁ బ్రయత్నించుచుండును. అవి కాళ్ళతో దుమ్మెగఁ బోయును. మొదటి బారులోనున్న లక్ష పిపీలికలు దగ్ధమైపోవును. కాని యా లక్ష పిపీలికల పాదములచేత చిమ్మఁబడిన దుమ్ము లెగఁ

బడివచ్చు మహాగ్నిని దాని పరిమాణములో సది కొంత చల్లార్చును. అగ్ని యొక్క లక్షదళము తరువాత మఱియొక లక్ష దళముగా కొన్ని లక్షల దళముల పిపీలికలు వచ్చి యా మంటనుఁ జల్లార్చును. ఆ మహాగ్నులు చల్లఁబడు వేళకు కొన్ని న్యర్బుదముల సంఖ్యగల పిపీకలు దగ్ధమైపోవును. కాని యా మంటలు చల్లారును. ఇది చాల విచిత్రమైన విషయము. మిగిలిన పిపీలికలు సంరక్షింపఁబడును. ఆ పిపీలికలు న్యర్బుదములు గాఁబోలు. అన్ని న్యర్బుద సంఖ్యలుగల పిపీలికలు వచ్చి మఱియు నన్ని న్యర్బుద సంఖ్యగల పిపీలికలను సంక్షించును. మరణించిన పిపీలికలకు లెక్కలేదు. వాని యెన్నిక లేదు. పిపీలికలు వచ్చి మంటలు చల్లార్చెనన్న మహావిషయ మొకటి గొప్పగా నున్నది. లోకమిట్లుండును. దుష్టరాజు యొక్క శాసనముచేత వేలాదిజనులు సంహరింపఁడుచుందురు. ఆ శాసనము నెదుర్కొని వేలాది జనులు మరణింతురు. తుద కా దుష్టరాజు నిర్మూలింపఁబడును. ఆ దుష్టరాజును నిర్మూలించుటకు కోటానుకోట్ల ప్రజలు మరణింతురు. కాని వానిని జయించితిమని పౌరుషవాక్యములు చెప్పుదురు. చూడఁ జూడఁగా నీ సృష్టిలో నొక మహాకార్యము జరుగుటకే ప్రాధాన్యముగాని తత్కార్యాచరణమునందు ప్రాణము లొసఁగిన పరిమిత సంఖ్యాకులైన మానవులయొక్క లెక్క లేనట్లున్నది. ప్రతిపక్షులు పదివేలమంది. వీరును పదివేల మంది. వారును వీరును యుద్ధముచేసిరి. ఒకవైపున నెక్కువ మంది చచ్చిరి. రెండవవైపున తక్కువమంది చచ్చిరి. ఏవైపున తక్కువమంది చచ్చిరో వారు గెలిచితిమనుకొనిరి.

ఇది న్యాయమే కావచ్చును. కాని ఒక్క రాజున్నాడు. ఒక్క సేనాపతి యున్నాఁడు. వారిద్దఱు మానవులను నల్లులను నలిపినట్లు నలుపుదురు. ఈ నలుపఁబడిన నల్లులు వేలును లక్షలును వానిని కుట్టుటచేత వాఁ డెప్పుడో మరణించును.

ఈ ప్రజలు గెలిచితిమనుకొనుటయే యాశ్చర్యము. ఒక్కని వధించుట కిన్ని ప్రాణములు హతమగుటలో నేమి న్యాయ్యమున్నది? ఏమి సామంజస్యమున్నది? ఏమి సంతోషమున్నది? మానవులు సంతోషింతురు. తమలో నెంతమంది చనిపోయిరో పరిగణించికొనరు. ఇంతకును ప్రజ లెవ్వరో వానిని సంహరించునదియే లేదు. వారి యదృష్ట విశేషమున నా ప్రజలలో నొకఁడు దుర్జనుఁడైన యారాజునకుఁ దీటైనవాఁడు, కుత్సితుఁడైన యా సేనాపతికి నుద్దియైనవాఁడు, బయలుదేరును. నిజమునకు వానిని సంహరించునది వీఁడు. సంతోషించునది ప్రజలు. తాము గెలిచితిమని వీ రనుకొందురు. అట్టి మహాపురుషుఁ డొకఁడు బయలుదేరువఱకు ప్రజలట్లే మలమల లాడిపోవుచుందురు. ఆ దుష్టరాజును ఆ దుష్ట సేనాపతిని నిజముగా నెదుర్కొనఁగల పురుషుఁ డొకఁ డుండును. వాఁడైనను వేళకోసమెదురు చూచుచుండును. ప్రజలు వానియందు తమ యాశలు నెలకొల్పికొని యుందురు. వాఁడు కదలఁడు. వాని దొకస్థితి. వాఁడు కొంత ప్రజలయందు దయకలవాఁడు, సానుభూతి కలవాఁడు మాత్రమే కాని యా దుష్టరాజునకు తీవ్రముగా ప్రతిపక్షము వహించెడు వాఁడు కాఁడు. అతఁడు తీవ్రముగా నారాజుతో ప్రతిపక్షము వహించుటకు పూర్వము, నెట్టి వానికి తగులవలయును. ఆ పట్టు

వానికి తగిలినఁగాని వాని జాలియు వాని సానుభూతియు ప్రజలకు సహాయకారులు కావు. ఆ నెట్టవానికి తగులుట కూడ ప్రజలయొక్క యదృష్టము మీఁద నాధారపడియుండును.

మహానంది రాజు. అతని సేనాపతి యుత్తుంగభుజుఁడు. ఇద్దఱు నిద్దఱు సూర్యుఁడును వహ్నియు. మహానంది మగధ రాజ్య సింహాసమునందున్న చక్రవర్తి. అతఁడు శిశునాగ వంశమువాఁడు. శిశునాగుని తరువాత పదియవరాజు. అతఁడు సంపూర్ణముగా స్త్రీలోలుఁడై సర్వాధికారము సేనాపతియైన యుత్తుంగభుజుని చేతులలోఁ బెట్టెను. చేతులలోఁ బెట్టెనను టకన్న రాజు చేతులు కాంతాసమాలింగన తత్పరములై యుండఁగా నుత్తుంగభుజుఁడు తనచేతులు చాచఁగా రాజకార్యములన్నియు వాని బాహాపంజరమునందుఁ దగుల్కొన్నవని చెప్పవచ్చును.

శిశునాగవంశము రాజ్యమునకు వచ్చిన తరువాత మూఁడు వందల యిరువదియేండ్లు గడచెను. భారత యుద్ధానంతరమున ధర్మరాజు ముప్పదియాఱేండ్లు రాజ్యము చేసెను. అప్పటినుండి కలి ప్రారంభించెను. ఆనాఁటినుండి బార్హద్రధులు వేయినాల్గుఱు సంవత్సరములు పాలించిరి. తరువాతఁ బ్రద్యోతవంశము నూటముప్పది యెనిమిది యేండ్లు రాజ్యము చేసెను. శిశునాగవంశము మూఁడువందల యిరువది యేండ్లు రాజ్యము చేసెను. అనఁగా కలి ప్రవేశించిన తరువాత పదునేను వందలనాల్గు సంవత్సరములు గడచిన వన్నమాట. ఆధునికుల లెక్క ప్రకారము క్రీ. పూ. పదునాఱువందల ముప్పదినాల్గవ యేఁడు. బుద్ధుఁడు జన్మించి అప్పటికి రెండువందల యేఁండ్లు

గడచెను. ఆయన మరణించి యప్పటికి సుమారు నూట యిరువది యేండ్లు గడచెను. ఆనాటికి బౌద్ధమతము దేశములో బాగుగా విజృంభించెను. బౌద్ధమతమునందనురాగము బలిసెను. ప్రపంచకమునకు ముక్తి వచ్చెనన్న భావము విజృంభించెను. యుగములుగా నేదో యొక దాస్యము మానవజాతి చేయుచున్నదనియు, నా దాస్యమునుండి మానవులు విడివడిరనియు, కొందఱి తలంపుగా నుండెను. బుద్ధుడు వచ్చి యహింసాబోధ చేసెను. యజ్ఞయాగాది క్రతువులు వలదనెను. సన్న్యాసమే పరమమైన యాచరణీయమైనదని బోధించెను. భగవంతుఁడు లేఁడనెను. మోక్షము మానవుని ప్రవర్తనమీఁద నాధారపడి యుండెనని చెప్పెను. మోక్షమన్న మాటయే లేదనెను. దానిపేరు నిర్వాణము. భగవంతుఁడు లేఁడు.

కొందఱు మహాపురుషులు జన్మించి కొన్ని మాటలు చెప్పుదురు. వారి శిష్యులు వానికి వ్యాఖ్యానము చేయుదురు. వానికి భాష్యములు వ్రాయుదురు. ఈ వ్యాఖ్యానము లీ భాష్యము లా మూలసూత్రములలో నున్నవో లేవో తెలియదు. కాని ఇవన్నియు నతఁడు చెప్పినట్లే పరిగణింపఁబడుచుండును. ఇట్లుండఁగా నిందులో నొక రహస్యమున్నది. ఆ మహాపురుషుఁడు ద్వంద్వాతీతుఁడు, లౌకిక భేదాతీతుఁడునై యుండును. కాని అతఁడు జన్మచేత నొక దేశమున నొక వర్ణమున నొక కుటుంబమున నొక పట్టణమున జన్మించుట తప్పదుగదా! ఆ దేశమువారు తమ దేశముయొక్క గొప్పఁదనము వానిజన్మించుటచేత గలిగినదన్న యహంకారము

ప్రాసకుండ నుండలేదు. అతఁడు పుట్టిన పట్టణవాసులు. అతఁడు పుట్టిన వర్ణమువారు. అతఁడు పుట్టిన కుటుంబమువారు. వాఁడుపుట్టి యహంకారాదులు పనికిరావనియు, మాత్సర్యములు తొలగించుకొనవలయుననియు, భేదరాహిత్యము లవలంబించుకొనవలయుననియు బోధించును. వానిబోధ వానిదే. వాని బంధువులయు, వాని వర్ణీయులయు, వాని శాఖీయులయు, వాని దేశీయులయు వేధ వారిదే. ఈరీతిగా ననంత కాలమునుండి యుద్భవించిన మహాపురుషుల బోధలన్నియు వ్యర్థములైనవని చెప్పవచ్చును. బుద్ధుఁడు క్షత్రియుఁడు. వర్ణాశ్రమాచారధర్మములు లేవని బోధించినాఁడు. సర్వప్రజలు సమానమని కంఠోక్తిగా చెప్పినవాఁడు. కాని బుద్ధుఁడు క్షత్రియుఁ డగుటచేత క్షత్రియులందఱు నాఁడు పొందిన యహంకారము, వారు చూపించిన దౌర్జన్యము, ఆయహంకారముతో వారు చేసిన ఘోరములు, లెక్కకు మిక్కుటములయ్యెను. అతఁడు వర్ణభేదము లేవని బోధించెను. అతఁ డేవర్ణమునం దుదయించెనో యావర్ణమువారికి, వర్ణభేదము లేవని బోధించినయతఁడు తమవర్ణమునం దుదయించుట యహంకారహేతువైనచో నింక నీ సృష్టిని బాగుచేయఁగలవాఁ డెవ్వఁడు? ఒకవంక బౌద్ధ సన్న్యాసులు తమ బౌద్ధమతమును బోధించుచునే యుండిరి. పలుమంది బ్రాహ్మణులు క్షత్రియులు తదితర వర్ణములవారు బౌద్ధమతములోఁ జేరుచునే యుండిరి. శిరోముండనము, కాషాయవస్త్రధారణము, భిక్షాపాత్రను చేఁబూనుట మొదలైన వ్యవహారములు వారు చేయుచునే యుండిరి. వర్ణములు వర్ణములుగానే యుండెను. అన్నిటికన్న నచ్చెరు

నైన విషయ మేమనఁగా-నొకఁడు బౌద్ధమతమును స్వీకరించెను. వాఁడు క్షత్రియుఁడు. మఱియొకఁడు బౌద్ధమతమును స్వీకరించెను. వాఁడు తక్కువ కులమువాఁడు. బౌద్ధమతమును స్వీకరించిన తరువాత నిద్దఱొక్కటియే కావలయును వాఁడు క్షత్రియ బౌద్ధుఁడు, వీఁ డవరజ బౌద్ధుఁడు. మానవ ప్రకృతి నిహన్యమానము కాఁదగినది కాఁదు. ఇంతకంటె నచ్చెరువైన సంగతి యేమనఁగా నొక క్షత్రియుఁడు తాను బౌద్ధమతమును స్వీకరించ లేదు. బౌద్ధమతము ప్రబలముగా నున్నది. ఆ బుద్ధుఁడు క్షత్రియుఁడని బౌద్ధమతము స్వీకరించని యీ క్షత్రియున కహంకారము. దీనికెవ్వఁడు చెప్పఁగలఁడు ? ఏది యెట్లైనను బుద్ధుఁడు చనిపోయినతరువాత నూటయిరువదియేండ్లకు బౌద్ధమతము విజృంభించుచున్న రోజులలో బుద్ధుఁడు జన్మతః క్షత్రియుఁడైన కారణమువలన క్షత్రియులు చెలరేగి పేటు రేగిపోవుచుండిరి. తత్పూర్వమున బ్రాహ్మణుల దధికారమనియు, నధికారము వారినుండి పోయి క్షత్రియులయందు సంక్రమించినదనియు, నది బ్రహ్మాండమైన పరివర్తనమనియు, దానితో నటు పొడిచెడి సూర్యుఁ డిటు పొడిచెననియు, నింక నదులు పశ్చిమ దిశయందు పుట్టి ప్రాగ్దిశకుఁ బ్రవహించు వనియు, క్షత్రియులు చేసెడి యహంకార వాదములకు మితి లేకుండెను. బ్రాహ్మణులకు నిలువ తావు లేకుండెను. తక్కువ కులమువారిమాట చెప్పనేటికి ? ఔనో కాదో బ్రాహ్మణులు తత్పూర్వమునందు నధికారము చేసిరని యొప్పికొందము. ఈ క్షత్రియులు వాని నణఁగఁద్రొక్కవచ్చును. వారిని హింసింపవచ్చును. మనుస్మృతులు చింపివేయవచ్చును.

శాస్త్రగ్రంథములమీఁద సంబూకృతి ప్రసరింపవచ్చును. తక్కిన వర్ణములవా రేమిచేసిరి? ఒక శూద్రుఁడున్నాఁడు. వాఁడు పూర్వము బ్రాహ్మణులనాఁడే బాగుగా నుండెడిదని యనుకొనెడివాఁడు. అందుచేత వాఁడు బ్రాహ్మణశూద్రుఁడు. ఇట్లు తక్కిన సర్వవర్ణములయందు బ్రాహ్మణులు భాసించిరి. తుదకు పర్యవసానమేమనఁగా నది బ్రాహ్మణహింసకాక సర్వవర్ణ హింసయు నైనది. అంతమాత్రముచేత క్షత్రియులందఱు సురక్షితముగా నుండిరనుటకును వీలులేదు. ఆ క్షత్రియులలో ననే కొందఱు బ్రాహ్మణ మతాభిమానులు కలరు. వారును బ్రాహ్మణులక్రిందనే లెక్క. తాత్పర్యతః బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, తదితర వర్ణములు, మొదలైన వివక్షయేలేదు. అన్ని వర్ణములవారునుఁ గలిసి యైనచో నటు బ్రాహ్మణులు లేనిచో నిటు క్షత్రియులు. ఈ బ్రాహ్మణ క్షత్రియ భేదము నాఁడు పెద్ద కాగడావలె వెలుఁగఁజొచ్చెను. ఈ క్షత్రియుల పొగ రెట్లు దిగవలయును? ఈ క్షత్రియు లెట్లు నాశన మగుదురు? మొదలైనది క్షత్రియ భావ విరోధి సంఘముయొక్క యాశాజ్యోతి. క్షత్రియాభిమానముగల సంఘమునకు నాశలేదు. వా రధికారములో నుండిరి. పై చేయి వారిది. వారు యథేచ్ఛముగా దుర్మార్గములు చేయుటయు, నహంకారముతో వర్తించుటయు, మాత్రమే చేయుచుండిరి. క్షత్రియాభిమానమునకు నాయువుపట్టు ఉత్తుంగభుజుఁడు. క్షత్రియుల యుబ్బు తగ్గించవలయునన్న యభిప్రాయము కలవారికి కైదండ నందుఁడు.

ఈ నందుఁ డెవ్వరు? ఇతఁడు చక్రవర్తియైన మహానంది
కుమారుఁడు. మఱి క్షత్రియుఁడేకదా? కాదు. మహానంది
తా నొకశూద్రస్త్రీని వివాహమాడెను. ఇతఁడామె యందు
కలిగిన సంతానము. ఇతఁడు శూద్రుఁడా? క్షత్రియుఁడా?
క్షత్రియులు వానిని క్షత్రియులుగాఁ బరిగణించినచో క్షత్రి
యుఁ డయ్యెడివాఁడే. వారితనిని శూద్రుఁడుగాఁ బరిగణించుట
చేత శూద్రుఁడయ్యెను. అందుచేత వారికి విరోధియయ్యెను.
నందుఁడు తక్కిన వారివంటివాఁడు కాఁడు. అతఁడు రాజ
కుమారుఁడు. అతని తల్లియందు రాజునకు మమకారము.
అతనియందు రాజునకు ప్రేమ. అతఁడును గొప్ప యధికారి.
వాని నేమి చేయుటకును వీలు లేదు. రాజునకు క్షత్రియాపత్న్య
ములందు కలిగిన పుత్రు లున్నారు. వారును నందుఁడును
నేకపితృ సంతానమే. కాని క్షేత్రభేదముచేత వారు వీనికన్న
నధికుల మనుకొందురు. ఇతనిని తక్కువగాఁ జూతురు. లోక
ములో బ్రాహ్మణులు, బ్రాహ్మణ పక్షపాతులు, క్షత్రియ
వ్యతిరేకులు కొల్లలుగా నున్నారు. వారిని చూచినట్లు, వారి
నగౌరవపఱచినట్లు, వారిని హింసించినట్లు, నందుని చేయుటకు
వీలు లేదు. పైగా నందుఁడు తనకెంత యధికారము కలదో
యంతటి యధికారము కలవాఁడు. ఒక విచిత్రమైన లక్షణము
చేత నీ క్షత్రియ మహంకారము తన నిర్మూలనమునకు
తానే హేతువును కొని తెచ్చికొన్నదైనది. తన నాశనమున
కైన హేతువును తానే సృష్టించుకొన్నది. ఇది లోకములోని
యొక రహస్యము. ఈ నందుఁ డాజానుబాహుఁడు. మహా
బలవంతుఁడు. నాలుగేనుఁగుల కెంత బలముండునో వానికంత

బల మున్నది. అతని మనస్సు లోతులలో ! తాను రాజ్యము
నకు నుత్తరాధికారి కావలయునన్న యాశయు పట్టుదలయు
నహంకారమునుఁ గలవు. అతనివైపున పెద్ద పక్షముఁ గలదు.
మంత్రులలో నధికారులలో సేనాపతులలో సేనలలో నెవ్వ
రెవ్వరు క్షత్రియులయొక్క బాధలకు గుఱియైనారో వారం
దఱు నందుని పక్షమువారు. తమ కేడుగడ నందుఁడని వా
రూహించుచుందురు. ఈ నందుని పరాక్రమము ప్రతిష్ఠయు
నొక్క మగధరాజ్యముతోఁ నాగలేదు. ఆర్యావర్తమున నంతి
టను నీ విభేద ముండనేయున్నది. ఈ క్షత్రియ దౌర్జన్యము పది
దేశములయందు తాండవించుచునే యున్నది. సర్వదేశముల
ప్రజలు దీనినెట్లు తొలఁగించుకొనవలయునని విచారించుకొను
చునే యున్నారు. అయోధ్య రాజ్యములో నైక్ష్వాకులు
పాలించుచుండిరి. పాంచాలమునందు పాంచాల రాజులు
పాలించుచుండిరి. హస్తిన ప్రాంతములందు కౌరవరాజులు
పాలించుచుండిరి. హైహయులు, కాలకులు, ఏకలింగులు,
శూరసేనులు, మైథిలులు, మొదలైన క్షత్రియవంశముల వా
రార్యావర్తము నంతటను పాలించుచుండిరి. అనాదినుండియు
నీ దేశమున నీ సర్వరాజ్యములయందు క్షత్రియులే పాలకులు.
ఇప్పుడు వచ్చిన క్రొత్తయేమి? ఒక్కటియే క్రొత్త. తత్పూర్వ
క్షత్రియులందఱు వర్ణాశ్రమధర్మ పరిపాలకు లగుటయు, నేఁటి
క్షత్రియులు వర్ణము లక్కఱలేదనుటయునని క్షత్రియు లధికు
లనుకొనుటయు నక్కడ వచ్చినది యిబ్బంది యంతయు -
ఇదివఱకు క్షత్రియులే రాజ్యము చేయవలయును, వారే సర్వ
ధర్మపరిపాలకు లన్న ప్రత్యయము సర్వజనులకు నుండెడిది.

ఆ క్షత్రియులు ప్రజాప్రతినిధులు. ప్రజలలో వారొకశాఖ. రాజ్యపాలన ధర్మము వారియందు నిష్ఠమైయున్నది. ఉండ వచ్చును. క్షత్రియుఁడు తా నీమహాసంఘమునం దొక యంగమనియు నితరాంగములకు పాలన కర్మచేత పుష్టి కూర్చెడివాఁడనియు నున్నంతసేపు క్షత్రియుఁడు పాలించుటలో ప్రజలకేమియు సేఁగిలేకుండెను. శరీరమునకు పుష్టి కూర్చవలయునన్న భావముతో నాహారమును భుజించుటయను కర్మ నోరు చేయుచున్నంతవఱకు నోరు శరీరమున కుపయుక్తమైనదే. సర్వావయవములు దానిమీఁద నాధారపడి యున్నవి. ఆనోరు శరీరపుష్టిమాట మఱచిపోయి తన రుచి కొఱకు తానదేపనిగఁ దిన నారంభించినచో శరీరమునకు బలహీనత యేర్పడును. అప్పు డది శరీరమునకు విరోధి. తక్కిన యంగములు దానికెదురు తిరుగును. దానిని తిననీయవు. దానికి డోకులు పుట్టించును. నోరు పూయించును. లాల కార్పించును. ఆ రీతిగా క్షత్రియుఁడు తాను చేసెడి పాలన కర్మచేత సంఘదేహమునకు పుష్టికరమైన వ్యవహారమునందు నిమగ్నుఁడు కాక తాను దురుద్ధతుఁడై తక్కిన సంఘమునందు ద్రోహియైనచో నా సంఘము వాని నెదిరించును. వానినిఁ గూలఁద్రోయును. వానినిఁ దిననీయదు. తిన్నది వానిచేత గ్రక్కించును. నాఁటి క్షత్రియుఁ డిట్టిస్థితిలో నుండెను.

మఱియు లోకమునందు క్షత్రియులను గుఱించి విపరీతమైన యేవగింపు పుట్టెను. పూర్వయుగములందు క్షత్రియులు క్షత్రియులుగాని కలియుగమునందలి క్షత్రియులు క్షత్రియత్వమునుగాని క్షత్రియగుణములనుగాని కోల్పోయిరని రాజ్యాపేక్ష

వారికి లేదనియు మఱల రాజ్యములు చేయుట బ్రాహ్మణులే చేయవలయుననియు నొక పెద్దరహస్యముగా నుద్భవించి యం దందు పౌక్కిన యొక యభిప్రాయము దృశ్యమాన మగు చుండెను. ఈ భావ ముదయించినప్పటినుండియు నార్యావర్తమున రాజ్యము చేయుచున్న సర్వ క్షత్రియ వంశములకు నొడళ్ళు మండిపో నారంభించెను. మఱియు చిత్రచిత్రములైన మాటలు బయలుదేరెను. ఏనాఁడో కృతయుగమునాఁడు క్షత్రియు లిట్లే పెచ్చు రేఁగిపోయిరి. వారి దౌర్జన్యములకు మితిలేకుండెను. ఆనాఁడు పరశురాముఁడు బయలుదేఱి తన గండ్రగొడ్డంట వెంట వెంట నిరువదియొక్కమాఱు క్షత్రియులను సంహ రించెను. అప్పటికి రాజుల పొంగు తగ్గెను. నేఁడు నట్లే కానున్నది యని ప్రజ లాడుకొన నారంభించిరి. తప్పకుండ కల్క్యవతారము బయలుదేఱును. నూటయిరువది యేండ్ల క్రింద చనిపోయిన బుద్ధుఁడే బుద్ధావతారము. తరువాత వచ్చెడి యవతారము కల్కియే కదా. పురాణములలో నైనచో నా యవతారము కలియుగాంతమున వచ్చునని వ్రాయఁబడియున్నది గాని వెంటనే వచ్చునని కొందఱు చెప్ప నారంభించిరి. క్షత్రియులు మాటిమాటికి భగవంతుఁ డెత్తిన యవతారములలో గొప్ప యవతారములన్నియు క్షత్రియులయందే యెత్తెనని, రాముఁడు క్షత్రియుఁడని, కృష్ణుఁడు క్షత్రియుఁడని, బుద్ధుఁడు క్షత్రియుఁడని యహంకా రోక్తులు సాగుచుండఁగాఁ, దత్ప్రతిపక్షులు పరశురాముఁడు బ్రాహ్మణుఁడనియు, వామనుఁడు బ్రాహ్మణుఁడనియుఁ కల్క్యవతారముకూడ భగవంతుఁడు బ్రాహ్మణులయందే

యెత్తుననియు వాదించుచుండిరి. ఇట్లు సర్వరాజ్యములు ద్వైధావిభక్తములైన కళపెడ క్రాగుచుండెను. ఎచ్చటను శాంతి లేకుండెను. దురధికారము చేయుచున్నవాని కున్నంత భయము మఱి యెవ్వరి కుండదు. అన్నిరాజ్యములు పాలించు క్షత్రియులు తమ దేశములలో సంప్రదాయములనుఁ జెడఁగొట్టి, బౌద్ధ సన్యాసులనుఁ జేరఁదీసి, సంఘవ్యవస్థ నిర్మూలనముచేసి, బ్రాహ్మణ కర్మలకు స్వస్తి చెప్పి, యజ్ఞయాగాది కర్మలను నిత్యము నిందించుచు, వేదశాస్త్రములకు నమర్యాదగా మాటాడుచు విశృంఖలముగాఁ బ్రవర్తించుచుండియు, నధికార మించుకయు లేనట్టి గతిమాలియున్నట్టి నిరాలంబముగా నున్నట్టి యా బ్రాహ్మణ మతమునుఁ గూర్చి భయపడ నారంభించిరి. బ్రాహ్మణులలో మహాపండితులైనవారందఱు బౌద్ధులై బౌద్ధ గ్రంథములను వ్రాయ నారంభించిరి. బౌద్ధ సిద్ధాంతములను నెలకొల్పుచుండిరి. వేదములయు నుపనిషత్తులయు నర్థములను ఖండింప నారంభించిరి. బ్రాహ్మణమతమున కాలంబము పండితులైన బ్రాహ్మణులు. ఆ పండితులైన బ్రాహ్మణులలో నెక్కువమంది బౌద్ధులుకాగా, బౌద్ధమత సిద్ధాంతములను సమర్థించెడివారు కాఁగా, నీ క్షత్రియులకు బ్రాహ్మణమతమన్నచో భయమెందులకో తెలియదు. ఆ బ్రాహ్మణ మతమునకు నీ పండితులైన బ్రాహ్మణులకంటె వేఱొకరూపమున్నదా? ఆ రూప మెట్టిది? దానికి కరచరణాద్యవయవములున్నవా? అది గాలిలో నుండునా? ఎప్పుడో హఠాత్తుగా ప్రత్యక్షమై భాసించునా? ఈ క్షత్రియులకుమాత్రము భయము హృదయములయందు నిత్యసన్నిహితమై యుండు

చుండెను. నిర్హేతుకమైన భయము, కారణ సామగ్రిలేని భయము, ప్రతిపక్షముయొక్క లీలయులేని యీ భయము నాటి సర్వక్షత్రియ ధరాపతులయందు నెలకొనియుండెను. ఎక్కడో ఎవ్వరో తమకు విరోధులుగా నుండి తమ రాజ్యములను కూలద్రోయుటకుఁ బ్రయత్నించుచున్నారని వారికి భయము. ఈ భయమును పురస్కరించుకొని నాటి సర్వక్షత్రియ రాజులు నైక్ష్వాక, పాంచాల, కౌరవ, హైహయ, శౌరసేన, మైథిలాదులు గిరివ్రజపురమున సమావేశమై యీ యాపద నెట్లు తొలఁగింపవలయునన్న విచారణ చేయుటకు నిశ్చయించుకొనుటచేత, నాటి మిడియెండ వేళ గిరివ్రజపురమున రాజసభాభవనమున నాసీనులై యుండిరి. ఆ సభా భవనమునకు నాల్గు ద్వారము లున్నవి. నాల్గుద్వారములవద్ద ఖడ్గధారులైన రాజభటులు కాపుండిరి. ద్వారములవద్దకు నెవ్వరును పోవుటకు వీలులేదు సరికదా తద్భవన ప్రాకారమునకుఁ గల పెద్ద గవనునుండియే యెవ్వరును లోనికి రాకూడదని, యెవ్వరిని రానీయరాదని రాజాజ్ఞ. అట్లుండఁగా నందుఁడు తాను లోనికిఁ బోవలయునని సంకల్పించెను. ఆ సంకల్పమతనికిఁ దన సొంతబుద్ధిలోనుండి పుట్టినది కాదు. ఎంతమంది రాజులు భిన్నరాజ్యములనుండి వచ్చిరో యా యా రాజ్యములనుండి యిచ్చట జరుగనున్న సమాచారమును గుర్తెఱుఁగుటకు ప్రతిపక్షులనుండికూడ రహస్యముగా జనులు వచ్చిరి. వారందఱును గొప్ప యధికారములయం దున్నవారే. కొందఱు సేనాపతులు. కొందఱు రాజభట దళాధిపతులు. కొందఱు ప్రకృతులు. కొందఱు పురపాలకులు. ఇట్టివా రంద

బునువచ్చి గిరివ్రజపురమునం దుండిరి. వారందఱు నందునితో రహస్యాలోచనములు జరుపుచుండిరి. ఇట్లు జరుగుచున్నదని యుత్తుంగభుజునకు తెలియును. ఉత్తుంగభుజుఁ డెన్నిమార్లో చక్రవర్తియైన మహానందితో నందునియొక్క యీ వ్యతిరేక పక్ష నాయకత్వమును గూర్చి విన్నవించెను. మహానంది యెప్పుడును పెడచెవినే పెట్టుచుండెను. నేఁడీమహా సభకు నందునివలన విఘ్నము లేర్పడునని యుత్తుంగ భుజుఁడు మహారాజుతో విన్నవించెను. అతనిని లోనికి రానీయవలదు. సభలో మనమేమి చెప్పికొందుమో వానికి తెలియనే తెలియునుగదా యని మహానంది యనెను. నందుని సభలోనికి రానీయవలదన్న యాజ్ఞపుట్టెను. అప్పటికి నుత్తుంగ భుజునికి భయమే. నందుని రాజభటులు లోనికి రానీయరు. పోవుట కాజ్ఞ లేదందురు. నందుఁడు మిన్నకుండఁడు. తాను సాహసించి లోనికిఁ జొరఁబడును. అంత మహాబలశాలి నెది రించెడివారు లేరు. అతఁ డచ్చటి సైనికులను వధించి లోనికి వచ్చినచో మహారాజతని నేమియు చేయఁడు. ఇది రాజాజ్ఞా వ్యతిక్రమణము. నందుఁడు శిక్షార్హుఁడని మహారాజుతో చెప్పి ఫలము లేదు. ఉత్తుంగభుజున కేమిచేయవలయునో తోఁప లేదు. అందుచేత నతఁడు సభాభవన ప్రాకారద్వారమున పది మదపు టేనుఁగులను నిలఁబెట్టి యుంచెను. నందుఁడు సాహసించి లోనికిఁ బ్రవేశించుటకుఁ బ్రయత్నించినచో మావటివాండ్రా యేనుఁగులను వానిమీఁదికిఁ బురికొల్పవలయును. ఆ గందర గోళములోఁ దాను మఱికొంత సైన్యమును తోడుతీసికొని పోవచ్చును. ఎట్లైనను నందునకు లోనికిఁ బ్రవేశము సంభ

వింపుడు. సర్వరాజులును చేయు రహస్య సమాలోచనములు బయటికి పొక్కనే పొక్కవు. ఇందులో మఱియొక చూపుడు కలదు. ఏస్థలము నందుని మీఁదికిఁ బురికొల్పినప్పుడు నందుఁడు వధింపఁబడినచో నతనికాపద గల్గినచోఁ దానేమని మహా రాజుతోఁ జెప్పవలయును? మహారాజు నందుని తల్లియందు బద్ధానురాగుఁడు. ఆమె మహానందునితోఁ జెప్పి యేదియైన చేయింపఁ గలదు. ఎట్లైనను దీనికంటె మార్గము లేదు. ప్రాకారద్వారముసందున్న యుద్ధానేకప రక్షకభటులతో నందుని కపకృతి జరుగరాదనియు, వారి ప్రధాన కర్తవ్యము నందుఁడు లోనికిఁ బ్రవేశింపకుండఁ జేయుట మాత్రమే యనియు గట్టిగా చెప్పెను. అంతటితో నుత్తుంగభుజుఁడు తృప్తిపడక తాను కూడ దూరముగా నొకనీడ ప్రవేశమున గుల్మము మీఁద నెక్కి ద్వారమువంకఁ జూచుచుండెను. కొంతసేపటికి నందుఁడు వచ్చెను. ఆయన గుఱ్ఱము మీఁద వచ్చెను. లోనికి పోఁబోవుచుండెను. ఇద్దఱు భటులు తమ యశ్వములను వాని వైపునకు మఱలించి "అయ్యా! మిమ్మును లోనికి రానీయవలదని రాజాజ్ఞ" యని విన్నవించిరి. నందుఁడు నేను నందుఁడను కానా నేను. భటుఁడు:— ఆ సంగతి మాకు తెలి యదు. ఇదివఱకెవ్వరు లోపలనుండిరో వారు కాక యితరులను రానీయవలదని రాజాజ్ఞ. నందుఁడు:— నాకొఱకొక నీతి మచ్చుట యనావృతమై యుండును. మహారాజుగారు నన్ను రావలదని నిషేధించరు. ఇది యెవరో నడిమివారు చేసిన కుతంత్రము — అనుచుండఁగా నుత్తుంగభుజుఁ డచ్చటికి వచ్చి "నడిమివారెవ్వరు చేసిరి? నడిమివారికి దీనితోఁ బ్రస క్తి

యేమి? ఇది మహారాజుగారి యాజ్ఞయే" యనెను. నందుఁడు—
ఇది నిస్సందేహముగా నడిమివారే చేసిరి. నా తండ్రి నాకు
వ్యతిరేకమైన యాజ్ఞ యొసంగఁడు. కుత్సితులెవరో మహారాజు
చెవిలో గొణ్ణములు పలికియుందురు. ఆ కుత్సితులను నేనె
ఱుఁగుదును. వారు నా కడుపులో మెదలుచునే యున్నారు.
వారిని నేను క్షమించను. ఉత్తుంగః— వారు మీ కడుపులో
మెదలుచున్నచో తమరును వారి కడుపులో మెదలుచునే
యుందురు. మీరు వారిని క్షమింపనిచో వారును మిమ్ము
క్షమింపరు. నందుఁడుః— వారంతటి పౌరుషశాలులైనచో
ఇదిగో నేనిచ్చట నున్నాను. నా చేతిలో ఖడ్గమున్నది.
వారును గుఱ్ఱము నెక్కియే యున్నారు. వారి చేతిలోనను
ఖడ్గమున్నది. రావచ్చును. ఉత్తుంగః— తమరన్నమాట నా
కర్థమగుట లేదు. నేను లోకసామాన్యముగా మాటాడితిని.
ఎంతవానికైనను శత్రువు లుందురు. ఒకనికొకఁడు శత్రువై
నపుడు వానినిఁ గూర్చి వీఁడెట్లు భావించునో వీనిని గూర్చి వాఁ
డట్లే భావించునని నా తాత్పర్యము. తమరు పరిగ్రహము చేసి
కొన్నచో నేనేమియుఁ జేయలేను. నందుఁడుః— ఏమయ్యా!
అంతలో నంత మెత్తఁబడి పోయితివి. నేను లోనికి వెళ్ళితిరె
దను. ఉత్తుంగః— వెళ్ళుట కేమియు వీలు లేదు. లోన క్షత్రియు
లందఱు సభ చేయుచున్నారు. నందుఁడుః— నేను క్షత్రియుఁ
డను కాననియా నీ యుద్దేశ్యము. ఉత్తుంగః— నే నామాట
యనలేదు. క్షత్రియులనగా ననేకదేశముల రాజులనియే నా
తాత్పర్యము. నందుఁడుః— కాదు లే, మొదట నన్న మాటయే
నిజము. మాట తప్పించుకొనుట యెందులకు? నేను వెళ్ళి

తీరెదను. ఉత్తుంగ:- వచ్చుటకేమియును ఫలులేదు. సంద్రుడు:- నా కెవరడ్డము వత్తురు. ఉత్తుంగ:- ఆ పనియేన్గు లడ్డముగ వచ్చును. నందుడు:- ఓయి యుత్తుంగభుజా! నీ వేన్గుల లక్షణము లెఱిఁగిన వాఁడవేనా? ఇంత యెండలో నేనుఁగులకు స్వాస్థ్యముండునా? మిటమిట లాడిపోవు నెండలో నేన్గులు నిలువలేవు. వాని వంక జూడుము. అవి త్రొక్కుళ్ళు పొందుచున్నవి. మఱి కొంతసేపటికి నున్మత్తములు కావచ్చును. మావంటి వారి నే సంహరించవచ్చును. ఆ యేన్గులను నామీఁదఁ బ్రయోగించి ఫలితములేదు. మఱియు మహారాజు నేను లోనికిఁ బ్రవేశింపకుండ మత్తగజములను సదింటి నిప్పుడు నా యుత్తరువని మీతోఁ జెప్పిరా? నేను మూర్ఛించి లోనికి బోవుటకు యత్నింతును. మీ రేన్గులను నా మీఁదికిఁ బురికొల్పుదురు. నా కాపద జరుగవచ్చును. నేను చనిపోవచ్చును. అది మీకు క్షేమమైన విషయమా? మిమ్ము మహారాజు మన్నించునా? నేను మీకు చేసిన యపకారమేమి? నేను క్షత్రియుఁడను కానని శిలాయూహ. నా తండ్రి క్షత్రియుఁడు. నా తల్లి కాదు. నేను సగము క్షత్రియుఁడనుకదా! దానికైన నంగీకరింతువా? నేను నా గుఱ్ఱమును లంఘింపఁజేసి నీ యేన్గుల కందకుండ సభాభవనమునందుఁ బ్రవేశింతును. నీ యేన్గు లేమిచేయును? మీ రేమి చేయుదురు? కనుక నన్ను న్యాయముగా లోనికిఁ బోనిండు. ఇప్పుడు నిక్షేపాత మెందులకు? కొందఱు భటులు చనిపోవుట యెందులకు? రెండు మూఁడేన్గులు చనిపోవుట యెందులకు? మనవిద్దఱము

యుద్ధమాడుట యెందులకు? నే నిచ్చటనే యుందును. బల
వంతముగా లోనికిఁ బ్రవేశింపరాను. మీరుపోయి మహారాజు
గారితోఁ నేను లోనికి రా వాంఛించుచున్నానని మనవి
చేయుడు. నే నిచ్చట నున్నానని చెప్పుడు. వా రప్పటికి
నంగీకరింపక పోయినచో నేను తిరిగి పోయెదను. మీరు నన్ను
మఱలఁ గనుగొని రండు.

ఉత్తుంగ భుజున కేమి చేయుటకును దోఁచ లేదు. తాను
మహారాజున కీసంగతి మనవి చేయుటకుఁ బోయినచో
నందుఁడు తన వెంటనే వచ్చును. రాజభటు లడ్డగించరు.
వచ్చిన నందుని లోనికి రావలదని రాజు నిషేధించఁడు.
రాజు కొడుకులు మువ్వురు తీవ్రముగా నందుని లోనికి
రానీయకుండ చేయుమని తనతోఁ గట్టిగాఁ జెప్పిరి. ఇతర
దేశపు రాజులకుఁగూడ నందునియం దిష్టము లేదు. వారంద
ఱతనినిఁ బ్రత్యర్థిగానే భావించుచుండిరి. ఈ సందిగ్ధస్థితిలో
నుత్తుంగ భుజుఁడేమి చేయవలయునో తెలియక తటపటా
యించుచుండెను. ఇంతలో నందుఁడు విచిత్రముగా నవ్వెను.
"ఓయి ఉత్తుంగభుజా! నేను లోనికి రానేరాను. నే నిన్నా
ళ్ళును క్షత్రియుఁడ ననుకొనుచుంటిని. నా యభిమాన
మంతయు నిన్నాళ్ళును నిజముగా నేవైపునకు మొగ్గ వల
యునో నాకే తెలియకుండ నున్నది. ఇన్నాళ్లు నే నేనిర్ణయ
మునకును రాలేదు. నేఁడు నీవు నా కానిర్ణయమును చేసిపెట్టి
తివి. నేను క్షత్రియుఁడను కాను. నేను క్షత్రియేతరుఁడను.
నేను శూద్రుఁడను. ఓయీ! ఇదిగో ఈ నిముసమున క్షత్రి
యులకుఁ బ్రబల విరోధి సముద్భవించినాఁడు. ఒక్క నా

సంగ్రహిని వదలిపెట్టి నేను సర్వ క్షత్రియులకు విరోధిని. నీకు ప్రబల విరోధిని. ఇంక నేమి జరుగునో చూచికొనుము. ఏకగర్భవాసులుకాని రాజు కొడుకులు మువ్వురు నాకు నగ్రజులు. సోదరులు కాదంతే. నీవు వారి మాటలకు నెక్కువ గౌరవ మిచ్చెడివాఁడవు. వారు నన్ను లోనికి రానీయవలదని నీతోఁ జెప్పిరి. నీవు వారి మాట పాలించుచున్నావు. అట్లే కానిమ్ము. ఈ దుష్ట క్షత్రియులకు దేశమంతయు విరోధముగా నున్నది. నేనిన్నాళ్ళు వారిపక్ష మవలంబింపలేను. ఇప్పు డవలంబించుచున్నాను." అని నందుఁడు వెడలిపోయెను.

౨

మాహిష్మతీపురము నొరసి రేవానది ప్రవహించుచున్నది. కొన్ని యార్యావర్తములోని నదులు పేరునకు నదులుగాని చూచుటకుఁగాని వైశాల్యమునకుఁగాని పెద్ద కుల్యలవలెనుండును. వీనిలో ననేక నదులు సృష్ట్యాది దినములలో, నొక మహాపతివ్రత నదిగా ప్రవహించుటయో, నొక ఋషియొక్క తపస్సు నదియై సాగుటయో, మొదలైన కథల కాశ్రితములై యలరారుచుండును. వెడల్పు తక్కువైనను నదులు లోతుగానే యుండును. పురాణకథ యున్నది. పూర్వము కార్తవీర్యార్జునుఁడు తన వేయిమంది భార్యలతో వచ్చి తన వేయి చేతులు చాచి, నది నడ్డగించినాఁడని, నదీ ప్రవాహముపొంగి కట్టలు పొరలి తత్ప్రాంత దేశము నంతయు

వఱదలుగాఁ గట్టినదని తదాశ్చర్యముచూచి ఫలాహరణార్థము వచ్చిన రేణుకాదేవి నివ్వెఱపోయి యచట తడయఁగా జమదగ్నిఋషి యామెయందు కోపించి తచ్ఛిరశ్ఛేదము చేయఁ గొడుకుల నాజ్ఞాపించుటయుఁ, గడసారపు బిడ్డయైన పరశు రాముఁడు తల్లి తల తరుగుటయు జరిగెనని యున్న కథనుఁ బురాణములే మఱచిపోలేదు సరికదా తత్ప్రాంతీయులును మఱచిపోలేదు. మాహిష్మతీ పురాధిపతులైన హైహయు లును మఱచిపోలేదు. లోకములో నొక యనుస్యూతమై యున్న భావములు మానవుల మనస్సులను పట్టుకొని వచ్చు చుండును. వందలు వేలు సంవత్సరములు గడచును. ఆభావ మట్లే యుండును. ముత్తాత యెవఁడో స్వర్గమునకుఁ బోయి రంభ నిద్రించుచుండఁగా నామె కైశికములోని పారిజాత పుష్పముల నెత్తికొని వచ్చెను. ఆ వంశములో జన్మించినవా రందఱు తాము తమ ముత్తాతవలె నా పూర్వపురుషునివలె నిద్రించుచున్న రంభా శిరోజభర సమలంకృత పారిజాత కుసుమ గుచ్ఛముల నపహరింప జన్మించినారని యనుకొను చుందురు. వాఁడేమాత్రపు ప్రతిభావంతుఁడైనను శృంగార భావోన్మత్తుఁడైనను పదేపది నవే కలలుకంచు నెవ్వతెయో యొక సౌందర్యవతియని పేరువడ్డ స్త్రీ నిద్రించుచుండఁగా నామె కొప్పులోనున్న గన్నేరు పూలో చేమంతి పూలో యపహరించి తాను తన ముత్తాతయంతవాఁడనని చెప్పికొను చుండును. ఆ హైహయుల రాజ్యములో నొక యింట నిట్లే జరిగినది వాని తాత యెవఁడో పూర్వము తా నొక మంత్ర వేత్తయై రంభా మంత్రమును జపించెను. రంభామంత్రమని

గొంకొఁడున్నది. దానిని నిశావేళయందు శ్మశానములో శవోపరిఁ గూర్చుండి జపము చేయవలయును. వాని జాతకములో నట్లు వ్రాసియున్నచో రంభ ప్రత్యక్షమగును. వానికి రంభా సంయోగము జరుగును. వాఁడు మఱియొక స్త్రీతో సంబంధము పెట్టుకొనరాదు. ఆ రంభ తనవద్దకు వచ్చుచుండును - పోవుచుండును. వాఁడు బ్రహ్మచారియై యుండవలయును. ఇట్లుండఁగా నా వంగసములోని పూర్వపురుషుఁడు వివాహమాడెను. అతనికి సంతానమును గలిగెను. రంభకు కోపము వచ్చెను. వాని మంత్రము చెడిపోయెను. ఆ రంభకు వానిమీఁద నెట్టి మమకారమో వానినిఁ జంపలేదు. పిచ్చివానినిఁ జేయలేదు. వానికిని రంభమీఁది మమకారము పోలేదు. సంతానము కలిగిన తరువాత వాఁడు మఱల రంభా వ్యాసక్త హృదయుఁడై మఱల రంభామంత్రమును పది రెట్లుగా జపించెను. వానివద్దకు రంభ రాలేదుగాని నిద్రించుచున్న రంభ వానికిఁ గనిపించెను. ఆమె తలలోఁ బారిజాతపు పూవు లున్నవి. వాఁ డాపుష్పములనుఁ దెచ్చి మిగిలిన జీవితమంతయు తత్స్మరణజనితమైన విలక్షణమైన యున్మాదముతో, నావైపున నున్మాది యీవైపున సంసారిగా చాలనాళ్లు బ్రదికెను. ఆ పారిజాతపుష్పము వచ్చినవారందఱకుఁ జూపించుచుండెను. ఇది కథ. ఇప్పుడావంగడములో నా పుష్పము లేదుగాని యా వంగసములోని వారు తత్కథను పునః పునః చెప్పికొనుచుందురు. ఆ వంగసములోని స్త్రీలుకూడ తమ పిల్లలను ముద్దాడుచు 'మా వాఁడు మా పూర్వ పురుషునివలె రంభ కొప్పులోని పారిజాత పుష్పములు తెచ్చునమ్మా' యనుచు నుందురు. రంభ కొప్పు

లోని పూవులు తెచ్చుట యది యేమంత గొప్ప విషయము.
అదియేమి భగీరథునివలె ధాత్రికి గంగానదినిఁ దెచ్చుటయా?
శ్రీరామచంద్రునివలె రావణ సంహారము చేయుటయా?
ఆదివరాహమువలె భూమిని ఎక్కటికోఱతో ప్రళయవారాశి
పైకి సంకురింపఁ జేయుటయా? మానవజాతియొక్క
వ్యామోహమున కవధియేమి? ఒక తల్లి తన కొడుకును
ముద్దాడుచు వాఁడు భవిష్యత్తులో బహుస్త్రీ సంయోగఘటిత
శృంగారాకృతి యగునని యాశించుటలోని యౌచిత్య
మెట్టిదో తెలియదు. తాను స్త్రీ. తన కొడుకు బహుస్త్రీ
వ్యాసక్తచిత్తుఁ డగుట యామెకు సంతోషహేతు వెట్లగునని
ప్రశ్న. స్త్రీగాని పురుషుఁడుగాని కామభావమునందు సమా
నులే. పురుషునకు స్త్రీ సమాగమవాంఛవలె స్త్రీకి పురుష
సమాగమవాంఛ యుండును. ఒక స్త్రీ తన కన్నకూతురు
బహు పురుష సమాగమ సంజనిత సుఖము పొందవలయునని
వాంఛింపదు. తనకొడుకు బహుస్త్రీ సంభోగజనిత సుఖమునుఁ
బొందవలయునని వాంఛించును. ఏ పురుషుఁడును తన కొడుకు
బహు కాంతాసక్తచిత్తుఁడై యుండవలయునని కోరినచోఁ
గోరునుగాని తన కూతురు బహుపురుష నిష్ఠచిత్తవృత్తియై
యుండవలయునని కోరఁడు. ఏ స్త్రీయైనను తనంత తాను
బహుపురుషగతచిత్తవృత్తి గావచ్చును. తన కూతుండ్రయం
దది వాంఛింపదు. ఆమె మనస్సులో నానాత్వమున్నది. ఆ
నానాత్వవాంఛా పరిపూర్తి తన కూతుండ్రయందుఁ గాక
తన కొడుకులయందు కలుగవలయునన్న వాంఛయే స్త్రీలు
తమ కొడుకులను "మావాఁడు స్వర్గమునకుఁ బోయి రంభను

తెచ్చునమ్మా" యనియు "మావానిని గంధర్వస్త్రీలు వరింతు రమ్మా" యనియు మొదలైన కోరికలు కోరించుకొనును. ఇంతే కనును ఒక వంశములో నెవడో యొకడు మంచియో చెడ్డయో, గొప్ప దనిపించుకొన్న యొక పనినిఁ జేసినచో నా వంశములోని తక్కినవారందఱు నట్లే చేయవలయునని యాశించుచుందురు. ఇది సరే. ఒక వంశములోఁ బూర్వుఁ డెవడో గొప్పవాఁడే. వాఁడు మఱియొకని చేతిలో దెబ్బతినెను. తక్కిన వంశములోనివారు వేనిచేతిలో తమ పూర్వుఁడు దెబ్బ తినెనో వాని వంశమువారిని గెల్చుట యొక మహాభిలాషగా నెంచుచుందురు. ఇదియొక విచిత్రమైన విష యము. రాముఁడు రావణాసురుని సంహరించెను. పది యుగములు గడచెను. అనఁగా కొన్ని కోట్ల సంవత్సరములు గడచెను. అప్పుడొక క్షత్రియవంశ మున్నది. ఆ వంశమువారు తాము రాముని వంశమువార మనుకొనుచుందురు. లంకలో ననో తత్ప్రాంతములయందో మఱియొక రున్నారు. వారు తాము రావణునివంశమువార మనుకొనుచుందురు. ఆవంశము వారి నీ వంశమువారు తక్కువగాఁ జూచుటయు, వారికి వీరికి విరోధము ప్రబలియుండుటయు, రాముని వంశమువారు రావ ణుని వంశమువారిని తక్కువగాఁజూచుచుండుటయు, రావణుని వంశములోనివాఁడు రాముని వంశములో వానిని సంహరించి నచో, తాను రామాయణకథను తాఱుమాఱు చేసినట్లు, వాల్మీకి మొగమునకు మసిపూసినట్లు, రామాయణ కథాపాఠకు లందఱిని వెఱ్ఱివాండ్రనుఁ జేసినట్లు భావించుటయుఁ గలదు. ఇది మానవజాతిలోనున్న యొక విచిత్రమైన వ్యామోహరేఖ.

ఆ రాముఁ డెవరు? ఆ రావణుఁ డెవరు? ఈ నడుమ నెన్ని
జీవకోటులు ప్రయాణము చేసినవి? ఎవనికర్మ యెట్టిది?
వీఁ డెవ్వఁడో తా నారామునితో ముడిపెట్టుకొనుట యేమి?
ఆ రామునకు వీనికి సంబంధమేమి? యను ప్రశ్నలు పుట్టి
నచో వీనికేమి సమాధానము? లోకము తత్పూర్వ వృత్తము
ననుసంధించియే బ్రతుకుచుండును. ఇదియే దానికి సమా
ధానము. పూర్వ మెన్నఁడును నెవ్వరునుఁ జేయనిపని తాను
చేయుదునని, లేదా చేసితినని యనుకొనెడు వాఁడొక
మూర్ఖుఁడు. పూర్వము చేయనిదెవ్వఁడును చేయలేఁడు. పూర్వ
కవులు వ్రాయని భావమును క్రొత్తగా నెవ్వఁడును వ్రాయ
లేఁడు. దానివంటిదే యిదియును. కొంచెము మార్చి క్రొత్త
దనుకొనును. నేఁడు సామ్యవాదము చెలరేఁగినది. దీని నేదో
త్రవ్వి స్వర్గమునందున్న గంగను భగీరథుఁడు ధాత్రికి తెచ్చి
నట్లు పాతాళమునందున్న భావమునుఁ బైకి చేదినట్లు కొందఱు
తాండవింతురు. అది యట్టిదేమియును కాదు. భారతములో
సౌగంధికాపహరణమునకు భీముఁడు వెళ్ళినాఁడు. ఆ పూవులు
మహాకాంతారమున నొక తటాకమునం దున్నవి. భీముఁ
డాపూవులనుఁ గోయఁబోఁగా నచటి యక్షులు తత్సరస్సు
కుబేరునిదనియు నెవ్వరును దానినిఁ జేరరాదనియు వారించిరి.
భీముఁడు వారితో కొండలమీఁద కురిసినవాన యిచట పల్ల
ముగా నున్నదని తటాకము గట్టెను. దీనికి కుబేరుఁ డెవ్వఁ
డధికారి యగుటకు?" నని వారితో ననెను. ఇది సామ్య
వాదమునకు పైమెట్టు వాదము. మఱియు నానుశాసనిక
పర్వములో నొకకథ యున్నది. ఒకరాజుకొడుకు రథమెక్కి—

రాజవీధుల వెంట బండిని తోలుకొనిపోవుచుండఁగా నొక పేద బ్రాహ్మణ బాలకుఁడు రథముక్రిందఁ బడెను. పెద్ద దెబ్బ తగిలెను. ప్రాణము మాత్రము పోలేదు. ఆ బ్రాహ్మణ బాలకుఁడు సామ్యవాద సిద్ధాంతమునంతయు మాటాడెను. ఇది భారతములో నున్నది. ఇది యెందుకు చెప్పవలసి వచ్చిన దనఁగా సృష్టిలో నేదియు క్రొత్తకాదు. క్రొత్త యనిపించు కొనునదంతయు మాఱిన పరిస్థితులే తప్ప మానవుని మనస్సు కానేకాదు. కామక్రోధ లోభాదులచ్చటనే యున్నవి. తిండి గుడ్డ సమస్యలచ్చటనే యున్నవి. రాజ్యము చేయవలయునన్న కోరిక యచ్చటనే యున్నది. రంభాది సంభోగవాంఛ యచ్చటనే యున్నది. రోగము లచ్చటనే యున్నవి. మృత్యువు కూడ నచ్చటనే యున్నది. ఏతాదృశ బహువిషయ సమాహార భూతమైన యీ సృష్టి తనలో తానే గిర గిర గిర తిరుగు చుండును.

ఈ రేవానది ప్రవహించుచున్నది. ఈ రేవానదిని నేఁటి మాహిష్మతీ రాజు నాఁటి కార్తవీర్యునివలె వేయిచేతులుండి ప్రవాహము నడ్డగించవలయునని వాంఛించెను. ఇతనికి వేయి చేతులే లేవు. రెండు చేతులే యున్నవి. మఱి యేమిచేయ వలయును? ఇదియుఁగాక వానికి మఱియొక యూహకలదు. పూర్వము భార్గవరాముఁడు కార్తవీర్యుని సంహరించెను. తానైనచోఁ బరశురాముని సులభముగా వధించెడివాఁడు. మగతనమన్నది యున్నచో నా పరశురాము నిప్పుడు రమ్మనుము. తా నిప్పుడు వానినేమి చేయునో? ఈ మాహిష్మతీ రాజునకు తల్లిదండ్రులు పెట్టినపేరు ప్రసేనజిత్తు. ఇతఁడు తన

పేరు యజ్ఞసుఁడుగా మార్చుకొనెను. అనఁగాఁ దాను కార్త వీర్యార్జునుఁ డన్నమాట. ఇతఁడు కూడ గిరివ్రజపురమున జరిగిన సర్వక్షత్రియకుమార సమావేశమునకు వెళ్ళి తిరిగి వచ్చినవాఁడే. ఆ సమావేశములో నేమి జరిగినదో యెవ్వరి కినిఁ దెలియదు. అచ్చటికి వెళ్ళిన కౌరవ పాంచాల హైహ యాదివంశ జనితులైన రాజులకే తెలియును.

ఈ యజ్ఞసుఁడు మాహిష్మతీపురమునకు వచ్చెను. వచ్చినప్పటినుండి యొక పదకమును నిర్మించెను. బ్రాహ్మణులు తమ స్వవృత్తిని చేయరాదు. వారు కట్టెలమ్ముకొని బ్రదుకవల యును. తన రాజ్యములో బ్రాహ్మణులకు సర్వవృత్తులు నుప సంహరింపఁబడుటచేత బ్రాహ్మణులందఱు కట్టెలమ్ముకొని బ్రతికెడివారే యైరి. కట్టెలమ్ముకొనుటకు గొడ్డలి చేతపుచ్చు కొని యడవులకుఁ బోవలయును. వానితో కట్టెలను కొట్టు కొని రావలయును. వాని నమ్ముకొని జీవించవలయును. ఈ రీతిగాఁ గొలఁది మాసములలో నా రాజ్యమునందలి బ్రాహ్మ ణులందఱు పరశురాములవలె నైరి. జుట్టు నడినెత్తిన ముడి వేయుదురు. బొడ్డువఱకు జందెములు. దోవతిపించెలు పను కకు బిగించి కట్టుదురు. గొడ్డలి బుజానవేసికొని తిరుగుచుం దురు. ప్రతివాఁడును పరశురాముఁడే. వారిలో నెవఁడు లొమ్ము బలిసియుండునో, యెవఁడు యువకుఁడో, వానిని రాజు పిలిపించును. ఆ బ్రాహ్మణుఁడు సభలోనికి వచ్చును. రాజు నకుఁ దనయందు దయగల్గినదని యా పిచ్చిబ్రాహ్మణుఁ డూహించును. వచ్చిన యా బ్రాహ్మణునిఁ జూచి యజ్ఞసుఁ డైన యీ హైహయవంశరాజు నే యజ్ఞసుఁడను. నీవు

పరశురాముఁడవు. నాతో యుద్ధమాడెదవా యనును. ఆ బ్రాహ్మణుఁడు "మహారాజా ! నేను పేదబ్రాహ్మణుఁడను. తమశక్తితో యుద్ధమాడుటకు వచ్చితినా? తమ రనుగ్రహించి యేదైన నిచ్చినచోఁ దీసికొని పోదును. పెండ్లము బిడ్డలను సాకికొన నెంచితినిగాని ప్రభువులతో నాకేమి విరోధ"మనును. అర్జునుఁడు నోటికివచ్చినట్లు పరశురామునిఁ దిట్టును. బ్రాహ్మణునిఁ దిట్టును. ఆ బ్రాహ్మణుఁ డేమిచేయును? అట్టి బ్రాహ్మణులలోఁ గొందఱకుఁ గోపమేరాదు. కోపమువచ్చిన కొందఱు దానిని దిగమ్రింగికొందురు. ఒకప్పుడొక బ్రాహ్మణుఁడు రాజుతో నిట్లనెను. "మహారాజా ! తమరితో నాకేమి విరోధము? మీరు మా యావును దొంగిలించితిరా! నా జనకుని వధించితిరా!" అనఁగా నీ మాట లా బ్రాహ్మణుని కుత్తుకఁగుఁ బట్టుకొన్నవి. వెంటనే యర్జునుఁడు పోయి యా బ్రాహ్మణుని కున్న యొక్క గోవును తోలించి తెచ్చికొనెను. అతని తండ్రిని వధించెను. అప్పు డా బ్రాహ్మణునకుఁ దెలిసెను. వాగ్వ్యాపారము మంచిదికాదు. వివేక మంతకంటె మంచిది కాదు. చమత్కారము తన శక్తికి తగిన ట్లుండవలెను గాని శక్తినిమించి చేసెడి చమత్కారము ప్రాణములమీఁదికి తెచ్చును. ఇది యా బ్రాహ్మణుఁడు తెలిసికొనిన మహా విషయము. ఆ బ్రాహ్మణుఁడు తన తండ్రియొక్క యపరకర్మ లెట్లో యొకట్లు చేసికొని మఱల రాజువద్దకువచ్చి "మహారాజా ! క్షమింపుడు ! నేను బ్రతుకుట కష్టముగా నున్నది. నా యావునైన నిప్పింపు" డనెను. అర్జునుఁడు "నీవు నాతో యుద్ధమాడి, నన్ను గెలిచి, నీ యావును నీవు తోలికొని

పొమ్మనెను. ఆ బ్రాహ్మణుఁడు నేనంతటి సామంతుఁడను కాను. నాకు యుద్ధవిద్య తెలియదు. కత్తి పుచ్చుకొనుటయే చేత కాదు. నేను తమతో నేమి యుద్ధమాడఁ గలను? నన్నిట్లు తమరు వదలిపెట్టినచోఁ జాలును. నాదారిని నేను పోయి యాయవారమున్నన్ని నాళ్లు బ్రతికెదఁనని చెప్పెను. ఆ బ్రాహ్మణుఁ డామాట లనకుండినను బాగుగా నుండెడిది. ఆ మాటలనుట చేతని ప్రాణము మీఁదికి వచ్చెను. ఒక్కొక్క తెలివితక్కువమాట యొక్కొక్కప్పుడు ప్రాణముల మీఁదికిఁ దెచ్చును. అర్జునుఁడు వానినిఁ బోనీయ నన లేదు. ఇతఁడు తననుఁ బోనిమ్మనెను. దానితోఁ రాజునకు వానినిఁ బోనీయ రాదనిపించెను. చివరి కా బ్రాహ్మణుఁడు రాజు సన్నిధానము నుండి నెత్తురు కారెడి మేనితో, కత్తులు గ్రుమ్మిన మేనితో, వెడలిపోయెను. రాజుయొక్క యిట్టి ప్రవర్తనచేత నారాజ్యములోని బ్రాహ్మణులందఱు గ్రుడ్డు కుడుచుచుండిరి. కట్టెలు కొట్టుకొని బ్రతుకుట తప్ప వారికి మఱియొక మార్గము లేదు. ఎప్పుడు వాఁడు రాజు కంటఁబడునో రాజు వానినెప్పుడు తన కొలువునకుఁ దీసికొనిపోవునో యెప్పు డేయొద్దడి కలుగునో తెలియదు. సామాన్యముగా యువకులై, బలిసియున్న, పుష్టిగానున్న బ్రాహ్మణులనే రాజిట్లు చేయుచుండుటచేత, బ్రాహ్మణులందఱు కట్టెలు కొట్టుటకు తమ కొడుకులను పంపించుట లేదు. బ్రాహ్మణవార్ధకమే గొడ్డళ్లు పుచ్చుకొని యడవులకు పోవుటయుఁ, గట్టెలు తెచ్చికొనుటయుఁ, జేయుచుండిరి. చేతిలో గొడ్డళ్ళులేని వట్టి కట్టెలమోపు శిరసులందు కలిగిన బ్రాహ్మణ కుమారులు వాని నమ్ముటకుఁ దిరుగుచుండిరి. ఎక్కువమంది

తమ శిరస్సులనుఁ గొరిగించుకొని తిరుగుచుండిరి. మూర్ధజములు జటాకృతిగా నున్నచో తాము రాజునకు పరశురామ భ్రాంతిహేతువుల మగుదుమని వారికి భయము. కొందఱు జందెములే బొడ్డులలో దోపికొని కట్టెలమ్ముకొని యింటికి వచ్చి యానాఁటికి గండము గడచినదని సంతోషించుచుండిరి. కాని బ్రాహ్మణుల గేహములలో నీ మహాపద యెట్లుత్తరింపఁ బడఁగలదన్న నిత్య చర్చలు జరుగుచునే యుండెను. రాజు యుద్ధమాడు మనుచున్నాఁడు. గదా మనలో బలిష్ఠుఁడైన నొకఁడు నిజముగా యుద్ధమేల యాడరాదు ? గొడ్డళ్ళున్నవి. పెద్ద పెద్ద గొడ్డళ్ళు చేయించుటయు, వానికి బాగుగా పదును పెట్టించుటయు, కత్తిదెబ్బ లొడ్డుకొనుటకు గొడ్డలితో నాతలి వానిని సంహరించుటకు ప్రయత్నించుటయు, నభ్యాసముచేసి రాజుతో యుద్ధమాడెడివాఁ డెవ్వఁడో యొకఁడు సిద్ధము కావలయునని యందఱును తీర్మానించికొందురు. వాఁడెవ్వఁడని ప్రశ్న. ఎవఁడైనను పౌరుషశాలియైన బ్రాహ్మణ యువకుఁడు తానట్లు చేయుదుననఁగాఁ దల్లి వారించును. తండ్రి వారించును. ఎవఁడో వచ్చి తమ యాపద కడ్డ పడవలయునుగాని తమకుఁ దాము తమ యాపదను తొలఁగించుకొనుటకు ప్రయత్నము చేయుదమన్న సాహస మాజాతికి లేదు. నిత్యమును ప్రతిబ్రాహ్మణ గృహమునందును రాజు నెవరు నియమింపవలయునన్న వృథా చర్చలు జరుగుచుండును. చివరకు వేదాంతవాక్యములతోఁ బర్యవసించును. వాని పాపమున వాఁడే పోవును. రావణుడు, హిరణ్యకశిపుఁడు, నముచి మొదలైన రాక్షసులే సంహరింపఁబడిరి. తాడితన్నిన

వాని తలతన్నెడివాఁడు గలఁడు. వాని పాపములు వానినే సంహరించును. రాజు ప్రజారంజకుఁడుగా నుండవలయునుగాని ప్రజాద్రోహియైన రాజు రాజు కాఁడు. స్మృతివాక్యములు, వేదవాక్యములు, పురాణకథలు, వ్యర్థప్రయత్నులైన బ్రాహ్మణుల యెండలో దినదిన మావృత్తిఁ గనుచుండెను. వారు మఱియు నిట్లందురు. కాదయ్యా! మనలో నెవఁడో యొకఁడు పోయి రాజుతో యుద్ధముచేయును. మనవాఁడే గెలుచును. రాజును వధించుననియే యనుకొందము. అంతటితో నైనదా? వెంటనే సైనికులందఱు మూగుదురు? రాజవంశీయులందఱు వత్తురు. ఆ బ్రాహ్మణయువకుని ముక్కలు ముక్కలుగా నరకుదురు. మఱియు నాలోచించినచో నంతటితోడ నాగదు. వాని వంశమును సర్వనాశనము చేయుదురు. పురువుల నేఱినట్లేఱుదురు. అప్పటికి నాగిపోవునన్న నమ్మకము లేదు. రాజవంశీయులును క్షత్రియ కుమారులును రాజభటులతో వచ్చి బ్రాహ్మణులపేటలోఁ గొంపలమీఁదపడి వరుసగా బ్రాహ్మణులను సంహరింతురు. దుర్జాతులైన మానవుల ప్రవృత్తి నెవడాకట్టఁగలఁడు? ఎవఁడో యెవనినో చంపెను. ఆ చంపినవాఁడొక వర్ణమునకు చెందియుండుట తప్పదుకదా? పనియుఁబాటయులేని దుర్జనులు, స్వల్పసిద్ధాంతములయందు నిమగ్నులైయున్న పాలసులు, కొన్నిభావముల ప్రచారముచేత కలుషితమైయున్న చిత్తవృత్తులుగల యల్పబుద్ధులు, దురావేశపరులు, నా చంపినవాని వర్ణమువారిమీఁదఁబడి వారిని వధింతురు. సామాన్యముగా రాజకీయముగా నొక యున్నతుఁడై దురుద్ధతుఁడైన వానిని రహస్యముగా నెవఁడో వధించె

ననఁగా వధించినవాఁడు బలహీనుఁడు. వానిపక్షము బలహీన
మైనది. వధింపఁబడినవాఁడు బలవంతుఁడు వానిపక్షము బల
వంతమైనది. అందుచేత వధించినవాని వర్ణమునకు నొక
యాపత్తి తెచ్చికొనుటయే యట్టి సాహస కృత్యమునకు
నిశ్చితమైన ఫలము. దాన బ్రాహ్మణులెవ్వరును నాఁటి
హైహయార్జునునితో యుద్ధమాడుటకుఁ దమలో నొకయువకుని
సిద్ధపఱచుట యవివేక నిదానమని చెప్పికొనుచుందురు. ఈ
సమస్యా పరిష్కారమెట్లు జరుగును? ఇది యిట్లుండఁగా
బ్రాహ్మణయువకు లెవ్వరును గొడ్డళ్ళతో నడవులలోఁగాని,
యూళ్ళ పొలిమేరలయందుఁగాని, గ్రామముల నడివీధులలోఁ
గాని కనిపించక పోవుటచేత నారాజు ఖిన్నుఁడయ్యెను. ఆలో
చనాపరుఁడయ్యెను. బ్రాహ్మణులందఱు సంహరింపఁబడిరా?
ఈ వృద్ధబ్రాహ్మణులే మిగిలియుండిరా? బ్రాహ్మణులలో
పౌరుషమే లేదా? లేదా యువకులందఱుఁ దనమీఁదికి
నెప్పుడో దండెత్తివచ్చుటకు రహస్యముగా యుద్ధ విద్యా
భ్యాసము చేయుచు నుండిరా? అవునో కాదో తెల్పికొను
టకుఁ బరశ్వథ ధారులైన యీ వృద్ధబ్రాహ్మణులనే కొంద
ఱినిఁ దీసికొనిపోయి వారివలనఁ దెలిసికొనవలయునని, పలు
మంది యీ బ్రాహ్మణ వృద్ధులనుఁ దన కొలువునకుఁ
దీసికొనిపోవుటయు, వారితోఁ దొలుతఁటి ప్రసంగములు
చేయుటయు, వారు మఱియుఁజప్పఁబడి మాటాడుటయు,
దానివెనుక నేదో రహస్యమున్నదని రాజున కనుమానము
వృద్ధియగుటయు, రాజభటులు బ్రాహ్మణుల యిండ్లలో
దూరి యువకులైన వారినిఁ బట్టుకొనివచ్చి రాజు ముం

దుంచుటయు, రాజు వారినిఁ గొందఱిని వధించియుఁ, గొందఱిని గారాపరచియు, గొందఱినిఁ బరాభవించియు, పంపుటతోఁ గ్రమక్రమముగా బ్రాహ్మణులకు దుఃఖమంతరించి క్రోధముద్భవించెను. పిల్లియైనను దాని నొక గదిలోఁ బెట్టి పాఱిపోవుటకు వీలులేకుండ ద్వారములును గవాక్షములును బంధించి హింసించుట ప్రారంభించినచో నది మీఁదపడి గ్రుడ్లు పీకునుగదా ? కుక్కలు వెంటపడి యూరపందినిఁ దరుమును. అది వెనుకకు తిరిగి మొరాయించును. ఇన్ని కుక్కలు దానినేమియుఁ జేయలేవు. దానికిని ముట్టెకలదు. దంతములు కలవు. తనకు ముట్టెకలదనియు దంతములు కలవనియు, నా క్రోధమునకు తన పిక్కను కుక్క కోఱలతోఁ బట్టుకొన్నప్పుడుగాని తెలియదు. ఎట్లును రాజు హింసించుచున్నాఁడు. ఎదిరించినను హింసించును. ఎదిరింపకపోయినను హింసించును. ఎదిరింపకుండ హింసింపఁబడుట యెందులకు ? ఎదిరించియే హింసింపఁబడుదము. ఇప్పటికే సగానికి సగము బ్రాహ్మణ్యము నశించిపోయినది. తక్కిన సగము నశించక ముందు బ్రాహ్మణులు కూడ నెదురు తిరుగఁ గలుగుదురుగా యనిపించికొని చత్తుమని వారు నిర్ణయించిరి. దేశములోఁ గూడ నందఱును బ్రాహ్మణవిరోధులే కారు. రాజవలంబించిన యీ దుష్టనీతి సర్వజనులకు నంగీకారముగా లేదు. ఇతర వర్ణముల వారు పెక్కుమంది దీని నేవగించుకొనుచున్నారు. ఏవగింపులో మాత్రము తారతమ్యము భాసించుచున్నది. కొందఱు రాజును పూర్తిగా నిందించుచున్నారు. కొందఱు న్యాయముకాదని జాలిమాటలు మాటాడుచున్నారు. వానిలో

సనేక భేదములుగా నున్నవి. బాధితులైనవారే కొంత ప్రయత్నము చేసినచో వారిలో నిస్సంశయముగా తమ పక్షమును గాఢముగా సమర్థించు వారుందురు. వారికి గూడ నుద్రేకము గల్గును. ధర్మము నధర్మము ననునవి, న్యాయ్య మన్యాయ్యమనునవి, తత్కాల పరిస్థితులచేత నేర్పడునవి కావు. తత్కాల పరిస్థితులచేత నేర్పడునవి యన్యాయము నధర్మమును. ధర్మమును న్యాయ్యమును నిత్యమైనవి. అవి సర్వజనుల హృదయాంతరాళములయం దుండును. ఎవఁడు తాత్కాలిక పరిస్థితులకు లొంగిపోవునో వానియందే యధర్మము నన్యాయ్యము నెలకొనును. బయటి హేతువుల యొత్తిడిచేత నట్టివారి సంఖ్య యధికముగా నుండవచ్చునుగాని వాఁడును మనస్సులో, మనస్సులో కానిచో వానిబుద్ధిలో, బుద్ధిలోఁ గానిచో వాని యాత్మలో, ననుకొనుచునే యుండును. వాని యాత్మద్రవ్యము కూడ నంత పుచ్చిపోయినచో నెవ్వరు చేసెడిదేమిలేదు. వాఁడంధతమస లోకములలో నున్నాడు. వాఁడు దైత్యులయొక్క మూలబలములోనివాఁడు. వానినిగుఱించి యెవ్వఁడును చెప్పలేఁడు. వారి సంఖ్యకూడ మిక్కిలి స్వల్పమైనది. అందుచేత శమప్రధాన చిత్తవృత్తిగల బ్రాహ్మణులు, సత్త్వగుణప్రధానమైన ప్రవృత్తిగల బ్రాహ్మణులు, రజోగుణము నవలంబించుటకు హైహయార్జునుఁడు వారిని ప్రోత్సాహపెట్టెను. వారిలో బ్రాహ్మణ్యముపోయి క్షత్రియత్వము నెలకొనెను. మానవుఁడైనంతనే బ్రాహ్మణుఁడు కానిమ్ము క్షత్రియుఁడు కానిమ్ము మఱి యింకొకఁడు కానిమ్ము వానికి నోటిలో

దంతము లున్నవి. వానితోఁ గొఱుకఁగలఁడు. చేతులకు గోళ్ళున్నవి. వానితో రక్కఁగలఁడు. పాదము లున్నవి. వానితోఁ దాడించఁగలఁడు. వానితో నాయా కార్యములు చేయవచ్చునని యూహగల్గుటయు, చేయక తప్పదన్న యొత్తిడి కలుగుటయు, జరిగినతోడనే బ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు కాఁడు. వైశ్యుఁడు వైశ్యుఁడుకాఁడు. వాని వర్ణధర్మ మంతరించి వాఁడాత్మరక్షణ పరాయణుఁడగును. ఆత్మరక్షణ పరాయణత్వము జంతుధర్మము. వాఁడు జంతువైనంతనే వానిని హింసించెడి జంతువువంటివాఁడే వాఁ డగుచున్నాఁడు. అప్పు డిద్దఱును జంతువులే. ఇద్దఱును పశువులే. ఇద్దఱును క్షుద్వ్యాపారాశ్రయులే. మనస్సు, బుద్ధి, న్యాయము, వివేకము మొదలైనవన్నియు నంతరించినవి. వివేకమన్నమాటకు శత్రువునెల్ల సంహరించవలయునన్న యాలోచనయే యర్థముగా మిగిలినది. ఒకజాతి నింకొక జాతిగాని, ఒకవర్ణము నింకొకపక్షముగాని బాధించుటయొక్క ఫలితమేమనఁగా సర్వమానవకోటిని పశుప్రాయముగా చేయుటకు యత్నించుటయగును.

ఈరీతిగా బ్రాహ్మణులు యువకులేమి, వృద్ధులేమి, స్త్రీలేమి, పురుషులేమి, మనము బ్రదుకవలయుననఁగా మనమెదిరించవలయును, శత్రువులను సంహరించనే వలయును. అది మనకుఁ జేతకాకపోయినను ప్రయత్నమేల మానవలయును. మనదగ్గఱ ఖడ్గములులేవు నిజమే. ఆ రాజే మనకిచ్చిన గొడ్డళ్ళున్నవికదా! కత్తితో నరకినచో మెడ తెగి, గొడ్డలితో నరకినచో తెగదా? గొడ్డలితో పలువిధములుగా

నరకుట చెట్లకొమ్మలు నేర్పినవిద్య. చెట్టుకొమ్మచివర నెండిన యొక భాగ మున్నది. చెట్టుచివరిదాక వెళ్ళెను. ఆధారము కొఱకు కుడిచేతితో పైకొమ్మ పట్టుకొనెను. గొడ్డలి నెడమ చేతితోఁబూని యెండిన కొమ్మ నరుకవలసివచ్చెను. నరికెను. ఎడమచేతి కభ్యాసమయ్యెను. ఒకకొమ్మను సూటిగా నరకుటకు వీలులేకపోయెను. కుడిచేయి యెడమవైపునకు త్రిప్పి గొడ్డలితోఁ బ్రక్కదెబ్బలతో దానిని ఖండించ వలసివచ్చెను. గొడ్డలి ముఖముపైకి త్రిప్పి క్రిందినుంచి శాఖను నరుకవలసి వచ్చెను. పైకొమ్మమీఁద నిలుచుండి క్రిందిశాఖను నరుక వలసి వచ్చెను. తానా ముఖముగా నిలుచుండి తన క్రిందనున్న వెనుకభాగమునందున్న కొమ్మను నరుకవలసి వచ్చెను. ఖడ్గ విద్యానిపుణుఁడన్నచో నింతియేకదా ! ఏవిద్యనైన నభ్యసించుట నింతియేకదా ! ఆ బ్రాహ్మణులు తామందఱు పరశువును శత్రువుమీఁద బహువిధములుగా నుపయోగింపఁగలమని తెలిసికొనిరి. ఆ దృష్టితో నభ్యాసము చేయువఱకు దానియందు నిష్ణాతులైరి. క్షత్రియుఁడు ఖడ్గము నెట్లుపయోగించునో సమిధలకొఱకుపయోగించిన, కాష్ఠముల కొఱకుపయోగించిన గొడ్డలిని బ్రాహ్మణుఁ డట్లుపయోగించెను. బ్రాహ్మణులయందు ప్రతిక్రియా భావావేశము తోఁచినంతనే తక్కిన వర్ణములవారు వందలమంది వేలమంది వారి ననుసరింప నారంభించిరి. మానవునిలో వర్ణావేశముకంటె, సిద్ధాంతావేశముకంటె, నితరునియం దుద్దీప్తమై భాసించుచున్న మనస్సు ననుసరించుట యందలి యావేశ మధికమైనది. అందుకనియే యీ సృష్టిలో నెవఁడో యొక మహాపురుషుఁడు

సముద్భవించుటయు, వాఁడేవర్ణములో జన్మించినాఁడన్న ప్రశ్న లేకుండ సర్వవర్ణములవారు వాని ననుసరించుటయు జరుగుచున్నది. జరుగఁ గలదు. ఒక మహావేశముయొక్క దీప్తి సహజముగా జనుల నాకర్షించును. ఈ బ్రాహ్మణుల దొక పక్షమయ్యెను. ఆ రాజ్యములో స్వల్పకాలములో వీరొక ప్రచండసేనక్రింద నేర్పాటైరి. అది యేమి చమత్కారమో, ఇంత విచిత్రముగా నింత శీఘ్రముగా వృద్ధిపొందిన యీ శత్రువుల బలము హైహయార్జునునకుఁ దెలియలేదు. దురధికారాంధ చిత్తులకుఁ దెలియదు.

ఇట్లుండఁగా నొకనాఁడు కనిపించక కనిపించక హైహయార్జునునకు నొక బ్రాహ్మణుఁడు తాను వేటకు వెళ్ళినపుడు వనమునందు కట్టెలు కొట్టుకొనుచుఁ గనిపించెను. అతఁడు వెడందఱొమ్మువాఁడు. ఆయన పరిఘభుజములవాఁడు. ఆకర్ణాంత నేత్రములవాఁడు. వృషస్కంధములవాఁడు. శిరస్సునందు జటాజూటము కలవాఁడు. ఆ జటాజూటమంత యెత్తేట్లున్నది? అది కృత్రిమమైనదా యథార్థమైనదా? అతని మెడలో జందెములున్నవి. ఆ యజ్ఞోపవీతము లంత స్వచ్ఛముగా నున్న వేమి? అతనికి దోవతి కట్టుకొనుటయే తెలియదా? ముద్దుగా పసిపిల్లవానికి దోవతి కట్టగా ముందు వెనుకటి పింజెలు సరిగా నత్తమిల్లక యొత్తిగిల్లి యుబ్బుగా నున్నట్లున్నది. ఆ దోవతి జాఱిపోవునని దానిపైన నతఁడు రజ్జువుతో బిగించెను. అతనిని చూచినంతటనే హైహయుఁడు పకాలున నవ్వి నీ వెవఁడవోయీ! నిజముగా పరశురాముఁడవా యేమి? యనెను. అతఁడు 'ప్రభూ! కట్టెలు కొట్టు

కొనుచున్నా' ననెను. హైహాయుఁడు నాతో యుద్ధము చేసెదవా ? యనెను. ఆ బ్రాహ్మణుఁడు "ఇక్కడ చేయను. మీ రాజమందిరములో నైనచోఁ జేసెద"ననెను. హైహా యుఁడది యేమి యని యడుగఁగా నతఁడు "నేనిచట మిమ్ము వధించినచో నేను దొంగతనముగాఁ జంపితి" నందురు. మీ సభలో నైనచో యుద్ధము న్యాయముగాఁ జేసినట్లుండు"ననెను. హైహాయునకుఁ బట్టరాని కోపము వచ్చెను. అప్పుడే కత్తి దూసి వానిని సంహరింపవలయు ననుకొనెను. కాని వాఁడు మహాబలశాలివలె కనుపించుచుండెను ఇది తనకోటలో నైననే మంచిది. వాఁడొకవేళ తన్ను మీఱినచో తాను కత్తి యుద్ధ ముపసంహరించి సైనికులచేత వానినిఁ బట్టించి సంహరిం పించవచ్చును. అతనిని సరే రమ్మనెను: రమ్మని, నేను గుఱ్ఱముమీఁదఁ బోవుచుండఁగా నీవు వెనుకవెనుకనుండి జాఱిపోయెద వేమో యనెను. అతఁడు నేను తమ గుఱ్ఱము వెంటనే పరుగెత్తుకొని వత్తును. నాతో మీ గుఱ్ఱము పరుగెత్తలే దనెను. హైహాయుఁడు గుఱ్ఱమును మిక్కిలి వేగముగా పరుగెత్తించెను. ఆ బ్రాహ్మణుఁడు దానితో సమానముగాఁ బరుగెత్త నారంభించెను. హైహాయునకు మెప్పు గలిగెను. "ఓయీ! నీవు గుఱ్ఱముమీఁద నెక్కుము. నేను పరుగెత్తుకొని వత్తు" ననెను. ఆ బ్రాహ్మణుఁడు నే నెక్కినచో మీ గుఱ్ఱము నడుము విరిగి చనిపోవు ననెను. హైహాయున కప్పుడు కొంత జ్ఞానోదయము కలిగెను. అతఁడు పురాణము లన్నియు విన్నవాఁడే. ప్రత్యేకముగా సర్వపురాణ ముల యందలి పరశురామావతార ఘట్టములు విన్నవాఁడు.

ఇతర కథఁగూడ వినెను. భీముఁడు బకాసురుని మీఁదికిఁ బోయినప్పుడు భీముని జూచి బకాసురుఁడు వాఁడు తన్ను వధించుటకు వచ్చినవాఁడని గ్రహించెను. ఆ భావము హైహయునకు తగిలెను. "నీవు నన్ను వధించుటకు వచ్చితివా" యనెను. ఆ బ్రాహ్మణుఁ డిట్లనెను. "అవును. నే నందుకే వచ్చితిని. నీ దేశములోని బ్రాహ్మణులందఱు నన్నుఁ బిలిపించిరి. నేను వచ్చితిని. నేను నిన్ను వధింతును" హైహయుఁడు "నీవు నన్ను నా కోటలో వధించలేవు. నిన్ను రాజభటులచేత బంధింపించి నిన్ను కారాగారములో వేసి చిత్రవధ చేయింతు" ననెను. ఆ బ్రాహ్మణుఁ డిట్లనెను. "ఓయి! పిచ్చిరాజా! నీ కోటలో నా యనుయాయులు వందమంది కలరు. అదిగో! నీ కోటవద్దకు వచ్చితిమి. కోట చుట్టును చూడుము. ఎంతమంది బ్రాహ్మణులును, తత్పక్షీయులును, నీవు చేయుచున్న దుర్మార్గములకుఁ గంటగించుకొన్న వారును, సాయుధపాణులై యున్నారో? నేఁడు నిన్ను వధింతును. నీవు నేఁడు వేటకు బయలుదేరుదువని నాకు తెలియును. నీ కోసమే నేనచ్చట నుంటిని. ఇచ్చట నంతయు సిద్ధము చేసితిని. నీ సేనలలో సగానికి సగము నా పక్షమువారు. నీ సేనానాయకులలో నుభయవేతను లున్నారు." అనఁగా హైహయుడు కోపపుఁగన్నులతో తీవ్రమైనయాలోచనతో నిట్లనెను. "ఉభయవేతనులనఁగా నెవరు? అనఁగా నా బ్రాహ్మణుఁడు "ఈమాత్రపు రాజనీతి తెలియనివాఁడవు. ఉభయవేతనులనఁగా రెండు జీతములు తీసికొనెడివారు. గూఢచారులు.

వారు నీవద్ద జీతము తీసికొందురు. నావద్ద జీతము తీసి
కొందురు. ఇది రాజనీతిలోని పారిభాషిక పదము. ఇప్పటి
కైనను నీవు నీ దౌర్మార్గ్యమును వదలి, వ్యర్థమైన నీ క్షత్రి
యాభిమానము వదలి, బుద్ధదేవుఁడు క్షత్రియులలో నుద్భ
వించినంత మాత్రాన క్షత్రియులే గొప్పవారనుకొనుటమాని,
రాజ్యమును ధర్మముగాఁ బాలింతునని నా పాదములమీఁదఁ
బడి వాగ్దానము చేసినచో నిన్ను మన్నింతును” అనెను.
ఆ మాటకుఁ దోకత్రొక్కిన త్రాచువలె హైహయుఁడు
గుఱ్ఱమును బ్రాహ్మణునిమీఁదికి దుమికించి కత్తితో నతనిని
ఖండింపఁబోయెను. అతఁ డంతటి శరీరముతో దెసకు లంఘిం
చుట, యశ్వముయొక్క పాదములు నఱకుట, గుఱ్ఱము మొగ్గ
తిలుట, హైహయుఁడు నేలఁ బడుట బ్రాహ్మణుఁడు వాని
ఖడ్గమును తీసికొని వాని తల నఱకుటయు నిదియంతయు
నిమేష వృత్తాంత మయ్యెను.

మాహిష్మతీపురము నాఁడొక యుద్ధభూమి. సర్వ
క్షత్రియ వంశము నిర్మూలింపఁబడెను. ఎవఁడో క్రొత్తరాజు
వచ్చెను. వాఁడు క్షత్రియుఁడు కాఁడు. బ్రాహ్మణుఁడు
కాఁడు. హైహయునిఁ జంపిన యా బ్రాహ్మణుఁడు మఱలఁ
గనిపించలేదు. అతఁడెవ్వరో యెవ్వరికినిఁ దెలియదు. రాజెవ
రైననేమి ? ఎద్దడి తీరినది.

# 3

భారతయుద్ధములో కౌరవు లందఱు నశించిరి. రాజ్యము యుధిష్ఠిరునకు సమకూడినది. అప్పటినుండి వారి వంశమునకు కౌరవవంశ మనియే పేరు. భారతమునందు దుర్యోధనాదులు కౌరవులు. యుధిష్ఠిరాదులు పాండవులు. కాని తరువాత తరువాత యుధిష్ఠిరాదులే కౌరవులు. యుధిష్ఠిరుని మనుమఁడు జనమేజయుఁడు. జనమేజయుని కుమారుఁడు శతానీకుఁడు. ఈ శతానీకుఁడు తన రాజధానిని హస్తినాపురమునుండి కౌశాంబికిఁ దరలించెను. ఇతని తరువాత చాలమంది రాజులు కొన్నాళ్లు హస్తినలో, కొన్నాళ్లు కౌశాంబిలో నుండుచు నుండిరి. శతానీకునితరువాత నిరువదిమంది రాజులు గడచిన తరువాత మఱల నొక రాజుపేరు శతానీకుఁడే. ఆ శతానీకుని కొడుకు ఉదయన మహారాజు. ఈ యుదయనుఁడు గజవిద్యా విశారదుఁడు. మహా సైనికుఁడు. సర్వ లలితకళలయందు నాఱితేరినవాఁడు. చాల సుందరుఁడైన పురుషుఁడు. అతని ప్రశస్తి సంస్కృత సారస్వతమునందు మందార పూఁదావులు ఘుమఘుమలాడు నచ్చరలపైఁట చెఱఁగులవలె, నందనవనపు కొలఁకుల నెదిగిన సప్తపర్ణసితచ్ఛదములవలె, శారదికబలాకాగరుదగ్రముల వలె, మానస సరోవిహార మరాళచ్ఛదాంతలలి తాష్టాపద రేఖలవలెఁ బ్రకాశించెను. ఆ యుదయనుఁడు తరువాత తరువాత వచ్చిన సర్వ సంస్కృతకవులకు వారి కథానాయకు

కుఁడుగా భాసించెను. ఆ యుదయనుని కుమారుని పేరు కిన్నరుఁడు. ఈ కిన్నరునిఁ గూర్చియే గుణాఢ్యుఁడు తన కథా సరిత్సాగరమును వ్రాసెను. అతని పేరు నరవాహనదత్తుఁడుగా గుణాఢ్యుఁడు స్వీకరించెను. అతఁడు విద్యాధర సామ్రాజ్యమునకుఁ జక్రవర్తి యైనాఁడని పెద్ద కథ పెంచెను. ఆ కథా సరిత్సాగరమే ప్రపంచకమంతటి సర్వకథలకు సంభవస్థానము. ఈ కిన్నరుని తరువాత కొద్దిమంది రాజులు కౌరవ వంశము నందు జన్మించిరి. ఉదయనునితండ్రి శతానీకుని నాఁటికే కౌరవవంశ ప్రశస్తి మిక్కిలి తగ్గిపోయెను. మొదటి శతానీకుని నాఁటికే తగ్గిపోయెను. అందుకనియే వారు తమ రాజధానిని హస్తిననుండి కౌశాంబికి తరలించుకొనిరి. ఈ కథాకాలము నాఁటికి రాజ్యము చేయుచున్న కౌరవరాజు పేరు క్షేమకుఁడు. కలి ప్రవేశించిన తరువాత పదునాల్గవందల యఱువది యెనిమిదవ యేట- అనఁగా క్రీస్తు పూర్వము పదునాఱువందల ముప్పదినాల్గవ యేట నీక్షేమకుఁడు కౌశాంబియందు రాజ్యము చేయుచుండెను. ఈ కౌశాంబీనగరము ప్రయాగక్షేత్రమునకు దగ్గఱ, యమునానది గంగానదిలో కలువకమున్న కొంత దవ్వున నెగువ నీ కౌశాంబి యున్నది. అచ్చము యమున యొడ్డున లేదు. ప్రయాగ రెండు నదులు కలిసినచోట నుండగా కౌశాంబి నదులు కలిసిన యెగువ పంగలోఁ గలదు. అచ్చట క్షేమకుఁడు రాజ్యము చేయుచుండెను. కౌరవులకుఁ దొలినాఁటి ప్రశస్తిలేదు. ఉదయనునినాఁటికిఁ గొంత ప్రశస్తి వచ్చెను గాని యా యుదయనుని ప్రశస్తి లలితవిద్యా విషయకమై: పరాక్రమసంబంధి కాలేదు. ఆ యుదయనుని

మంత్రిపేరు యౌగంధరాయణుఁడు. ఆయన మహామేధావి. భారత దేశమునందు కలికాలములో మహా మంత్రులుగా పేరువడ్డవారిలో యౌగంధరాయణుఁడు మొదటివాఁడు. అంతటి మహాధీమణుఁడును చిన్న రాజ్యమునకు మంత్రి యగుట చేత నాయనకు రాఁదగిన కీర్తి వచ్చినది గాని మఱలఁ గౌరవ రాజ్యమునకు గౌరవము రాలేదు. క్షేమకుఁడు రాజ్యమునకు వచ్చినంత వారి ప్రశస్తి మఱియును దిగజాఱిపోయినది. కౌశాంబి చుట్టుపట్లతప్ప కౌరవ వంశమునకు నేలెడురాజ్యము లేదు. కలిగిన గౌరవము లేదు. మొదటి శతానీకునినాఁటికే మగధరాజ్య ప్రతిష్ఠ విజృంభించెను. ఆ మగధరాజ్యముతోఁ బాటు కోసలరాజ్యముకూడ నార్యావర్తమున బలవంతమైన రాజ్యముగా నుండెను గాని తక్కినవన్నియు చిన్న రాజ్యములై యుండెను. ఆ నాఁటి కార్యావర్తమున పదునాఱు రాజ్యములు కలవు. వానిలోఁ బ్రసిద్ధమైనది మగధరాజ్యమును, కోసలరాజ్యమును. తక్కిన రాజులందఱు చిన్న చిన్నవారు. కోసలరాజ్య మైక్ష్వాకుల చేతిలో నున్నది. కౌరవ్యులు కౌశాంబియం దున్నారు. పాంచాలురు మగధరాజ్యమునకు దూరముగా నున్నారు. మైథిలులు, శౌరసేనులు, నేకలింగులు కాలకులు మొదలైనవారు చిన్నచిన్న రాజ్యములుగా నేర్పడి యుండిరి. ఈ రాజ్యములలో కౌశాంబీపతులైన కౌరవుల కొక గౌరవము కలదు. వారు పాండవ వంశ సంజాతులని యీ పదునేనువందల యేండ్లు తక్కిన యార్యావర్తపు రాజులు వారిని గౌరవించుచునే యుండిరి. అందుచేత క్షేమకున కొక మర్యాద గలదు. ఒక గౌరవము కలదు. అతనిది పెద్ద

రాజ్యము కాకపోయినను, పెద్ద పలుకుబడి లేకపోయినను
నార్యావర్తమునందలి మహారాజులు గుమికూడి యొకయాలో
చన చేసినచో దానికి తప్పకుండ క్షేమకునిఁ బిలుతురు. అతని
మాటలు విందురు. దానిని పరామర్శింతురు. ఈ గౌరవము
క్షేమకునికిఁ గలదు. అతఁడు స్వంతముగా గొప్ప రాజ్యము
కలిగి గొప్ప సేనలు కలిగి తీక్ష్ణుఁడైన ప్రతిస్పర్ధి కాకపోయినను
వాని మాటకున్న పాటింపుచేత, నతనినిఁగూడఁ బ్రబలశత్రువు
గానే విజేతయైనవాఁడు పరిగణించవలయును. ఎవఁడు
సర్వార్యావర్తమును తన చేతిక్రిందికిఁ దీసికొన నెంచునో,
యెవఁడు సర్వక్షత్రియ నిర్మూలనము చేయ భావించునో,
వానికి క్షేమకుని నిరోధించుట తొలుతటి కార్యములలో
నొకటి. మఱియు నొక్క విషయము కలదు. ఎవఁడు క్షేమ
కుని సంహరించి యీ స్వల్పమైన కౌరవ రాజ్యమునుఁ దా
నపహరించునో, వాఁడు నాఁటినుండి నిస్సంశయముగా సర్వ
క్షత్రియ విరోధి. అతనిని నిర్మూలించకుండ సర్వక్షత్ర నాశ
నము చేయుటకు వీలులేదు. నిర్మూలించిన వెంటనే సర్వ
క్షత్రియు లొక్కటి యగుదురు. పాండవులనాఁటినుండి వచ్చు
చున్న మర్యాదవలన కౌశాంబీ నగరాధిపతులకే విచిత్రమైన
స్థితి యార్యావర్తమునందు కలదు. ఆ క్షేమకుని సంహరించ
వలయునా? వలదా? ఒక సామాన్యుఁడైన రాజైనను
కౌశాంబిమీఁదికి దండెత్తి పోయినచో సులభముగా గెలువ
వచ్చును. కాని దానితో సర్వక్షత్రియ విరోధము కొని తెచ్చి
కొన్నట్లే. క్షేమకుఁడున్నన్నినాళ్లు సర్వక్షత్రియులను సాధిం
చుట సాధ్యముకాదు ఈ పదునాఱురాజ్యములకు క్షేమకుని

మాట వేదవాక్యము వంటిది. ఆ క్షేమకుని వయస్సు, మన కథా కాలమునాఁటికి నూట యిరువది యేండ్లు. ఉదయన మహారాజు రాజ్యము చేసినప్పుడు గిరివ్రజపురములో బార్హద్రథ వంశీయుఁడైన రిపుంజయుఁడు పోయి ప్రద్యోతుఁడు రాజయ్యెను. ప్రద్యోతవంశపురాజులైదుగురు. వారైదుగురు నూటముప్పది యెనిమిదేండ్లు రాజ్యము చేసిరి. తరువాత గిరివ్రజపురము అనఁగా మగధరాజ్యము శిశునాగుల చేతిలోనికి వచ్చెను. శిశునాగుని మొదలు నేఁటి మహానందివఱకు వీరు పదిమంది రాజులు. వీరు మూఁడువందల యిరువది యేండ్లు రాజ్యము చేసిరి. ఈ మూఁడువందల యిరువదియు నానూట ముప్పది యెనిమిదియు వెరసి నాల్గువందల తొంబది యెనిమిదేండ్లు అనఁగా నైదువందల యేండ్లు కౌశాంబిలో రాజ్యము చేసిన రాజులసంఖ్య యైదుమాత్రమే. ఉదయనుని కుమారుఁడైన కిన్నరుఁడే యనేక సంవత్సరములు రాజ్యము చేసెనని చెప్పుదురు. ఆయన విద్యాధరుఁడై శివప్రసాదము వడసి దీర్ఘకాలము జీవించెను. ఈ రోజులలోఁగూడ వందయేండ్లు బ్రతికినవారు కలరు. నూట యిరువదియేఁడ్లు బ్రతికినవారు కూడ కలరు. మొత్తముమీఁద నేఁడు జనుల యాయుర్దాయములు తక్కువై పోవుటచేత కొందఱు పూర్వరాజుల దీర్ఘాయుర్దాయములను నేఁడు విశ్వసింపలేక పోవుచున్నారు గాని యాయైదువందల యేండ్లలోఁ గౌశాంబీపతు లైదుగురే యైరి. ఈ క్షేమక మహారాజునకు నాఁటికి వంద యిరువది యేండ్లు. మిక్కిలి వృద్ధుఁడు. వృద్ధుఁడేకాక గొప్ప పండితుఁడు. ఆయన తన నాల్గుతరముల క్రిందటి తాతగారైన యుదయనమహారాజు

యొక్కయు నతనికుమారుఁడైన నరవాహనదత్తుఁడను మాఱుపేరుగల కిన్నరునియొక్కయు శతసహస్రకథలు చెప్పఁగలవాఁడు. ఆయనతో మాటాడుచున్నపుడు వాని పూర్వకథా పాండిత్యమువలననైననేమి, యతని వైదుష్యముచేతనైననేమి, యతని వాక్చమత్కార నైపుణ్యముచేతనైననేమి, యతని వయస్సుచేతనైననేమి, యతఁడు సర్వపూజ్యుఁడుగా నుండెను. ఆయన చేసిన దొక్కటే పొరపాటు. గిరివ్రజపురమునందు రాజధానిలో సర్వ క్షత్రియులు సామంత మండపమున క్షత్రియేతరులను మల మల మాడ్చుట యెట్టిదన్న విచారణ జరిగినపుడు తాను రాకుండ నుండవలసినది. ఆయన కీగోల తెలియదు. సామాన్యముగా నిట్టి సభలు జరిగినపుడు తాను పెద్దవాఁడగుటచేత వారు పిలుతురు. తాను పోవును. అట్లు వెళ్లెను. ఆ సభలో క్షేమకుఁడుండుటవలననే సభయైన నెల లోపుగా సర్వ బ్రాహ్మణులు నార్యావర్తమున సంహరింపఁబడకుండ మిగిలిరి. అందుచేతనే హైహయార్జునుఁడు సంహరింపఁబడెను. లేనిచో నంతకాలము పట్టదు. సర్వబ్రాహ్మణవధయు జరిగియే యున్నచో నేమై యుండెడిదో తెలియదు.

మగధరాజ్యములో బౌద్ధమతము పీట వెట్టికొని కూర్చున్నది. గిరివ్రజపురములోని నాఁటి బౌద్ధమత పరిస్థితులు వేఱే విషయము. క్షేమకుఁడు బౌద్ధుఁడు కాఁడు. అందఱు రాజులు బౌద్ధులే యైరి. మహా బలవంతులైన మాగధులు బౌద్ధులగుట చిన్న చిన్న రాజు లందఱు బౌద్ధులగుటయే గొప్ప యనుకొనిరి. నేఁటి మగధసామ్రాజ్యాధినేతయైన మహానందియొక్క ముత్తాత

యజాతశత్రుఁడు బౌద్ధమతమును మగధరాజ్యమునఁ బ్రవేశ పెట్టెను. అతని తండ్రి బింబిసారుఁడును బుద్ధుఁడును పినతల్లి పెదతల్లి బిడ్డలని చెప్పుదురు. బుద్ధుఁడు తాను నిర్వాణమును సాధించిన తరువాత బింబిసారుని వచ్చి చూచెను. బింబి సారుఁడు బౌద్ధుఁడయ్యెను. ఆ బింబిసారుని వధించి వాని కొడుకైన యజాతశత్రుఁడు రాజయ్యెను. తక్కిన రాజు లందఱు బౌద్ధులైరి. క్షేమకుఁడు బౌద్ధుఁడు కాలేదు. క్షేమకుని నేఁటి నాడులలో భగవంతుఁడు గీత లెవనికి చెప్పెనో వాని నెత్తురు ప్రవహించుచుండెను. అర్జునుని మనుమఁడు పరీక్షిత్తు, పరీక్షిత్తు కుమారుఁడు జనమేజయుఁడు. వారిది కౌరవ్య వంశ మనుటకన్న నర్జున వంశమనియో, యభిమన్యు వంశమనియో పరీక్షిద్వంశమనియో యనుట సమంజసము. కౌరవ వంశ మును కాకపోలేదు. కౌశాంబీనగరముగాని, యా చిన్న రాజ్యముగాని, సర్వమైన యార్యావర్తము బౌద్ధమతముచేత సమావరింపఁ బడినను తాను నైయాసికమైన విశ్వాసములు గాని సంప్రదాయములుగాని పరిత్యజించుట జరుగదు. క్షేమ కుఁడే కాదు, వారి పూజ్యులందఱు భారత భాగవతములకు శిష్యులు. బ్రహ్మసూత్రాధ్యేతలు. పార్థసారథి పదభక్తులు, నిత్యము గీతా పారాయణము చేసెడివారు. ఒక్క యార్యా వర్తమే కాదు. వింధ్యకు దక్షిణమునందున్న రాజ్యములలో కూడ భారత భాగవతములు, నష్టాదశ పురాణములు, బ్రహ్మ సూత్రములు భగవద్గీతయు వ్యాపించిన వనఁగా దానికిఁ గార ణము కౌశాంబీరాజ్యము. కౌశాంబీరాజ్యమునందు సేనల కంటె ప్రాయసగాం డ్రెక్కువ. భూర్జపత్రములమీఁదఁ, దాళ

పత్రములమీఁద, సన్నని వలిపంపు గుడ్డలమీఁద, భారత భాగవతములు, బ్రహ్మసూత్రములును, భగవద్గీతయు, వ్రాయఁబడి భారతదేశమున నేప్రాంతమువారు వచ్చి యడిగినను గ్రంథము లీయఁబడుచుండెను. భారత దేశమున నలుమూలలనుండి బ్రాహ్మణులు వత్తురు, నెలలతరబడి కౌశాంబిలో నుండి యా గ్రంథములను వ్రాసికొని పోవుదురు. పరదేశపు రాజులు తమ కాగ్రంథముల ప్రతులు కావలయునని కౌశాంబీపతులకు వార్తలు పంపింతురు. కౌశాంబీపతులు గ్రంథముల నా రాజసభలకుఁ బంపింతురు. ఆ పదునేనువందల సంవత్సరములు కౌశాంబి వైయాసికమైన మహానాగరకతకు, వైదుష్యమునకు, విద్యాపీఠముగా నుండెను. సర్వ వైదికమైన విజ్ఞానమునకు వ్యాసుఁడు కోశము. ఆ కోశమే అంబ. అందుచేత నా పట్టణమునకు కౌశాంబి యనుపేరు వచ్చెను. ఆ సర్వజ్ఞానమును కౌశాంబీ నగరాధిపతులు భారత దేశమునందు పంచిపెట్టుచుండఁగా బౌద్ధమతము సుమారు నూటయెనుబది యేండ్లుగా దేశమునందు క్రమ క్రమముగా విజృంభింపసాగెను. కౌశాంబీనగరము చూచుచు నూరకుండెను. ఆ నగర మేమి చేయఁగలదు? ప్రయాగ వెనుక దాఁగికొనియుండెను. అందులో మఱియును తనకు దగ్గఱన్న గయలో నామతము సముద్భవించెను. ఆ మత మచ్చటినుండి యుత్తరముగా ప్రయాణము చేసెనుగనుక సరిపోయినది. పదియడుగులు వెనుకకు వేసినచో కౌశాంబిపని యేమయ్యెడిదో తెలిసెడిది. పాపమా మతము ప్రయాగదెసకు మళ్ళక పాటలీపుత్రము, గిరివ్రజపురము, శ్రావస్తి, వైశాలి మొదలైన వైపులకు చొచ్చుకొనిపోయెను.

ఇట్లు విజృంభించుచున్న బౌద్ధమతమునందు క్షేమకున కను రాగములేదు. కాని యతఁడేమి చేయఁగలఁడు? అందఱు క్షత్రి యులును బౌద్ధులే. మేము క్షత్రియులము. నీవు మాకు పెద్దవు. నీవు రమ్మని పిలువఁగా మీకు బౌద్ధులు, నేను రానని చెప్పవా? నేను పెద్దవాఁడను గనుక వత్తునని చెప్పవా? వారు క్షత్రియులు. క్షత్రియధర్మము పాలించినచో నీయనను పిలువ వచ్చును. ఈయన వెళ్ళవచ్చును. వారు క్షత్రియ ధర్మమును పాలించరు. బౌద్ధధర్మమును పాలింతురు. నీవు వచ్చి మాకు హితోపదేశము చెప్పుము. ఈయన పోయి వారన్నది కాదనుటకు వీలులేదు. ఔననుటకు వీలులేదు. మొన్నటి గిరివ్రజపురమునందలి సామంతభవనములో జరిగిన సమావేశములో యువకులైన రాజులందఱు బ్రాహ్మణుల నందఱిని సంహరించుటకే పట్టుదలపూని యుండఁగా, మహా నందియొకఁడును, క్షేమకుఁ డొకఁడును, నది దుష్టమైనపని యట్లు చేయరాదని యువకులను వారించి, యేయే విషయము లందు బ్రాహ్మణులు ద్రోహులుగాఁ గనిపింతురో యా యా విషయములందు వారిని నిగ్రహించుడని చెప్పిరి. ఆసభ జరిగిన చోటు సామంత ప్రాసాద మని పిలువఁబడును. ఈపేరితో బౌద్ధమతమునందు నొక గ్రంథముకూడ బయలుదేరెను ఆ గ్రంథముపేరు "సామంత పాసాదిక." దీనిసంగతి మఱల జెప్పఁబడును. ఈ క్షేమకుఁ డిట్టివాఁడు.

క్షేమకునకుఁ గుమారుఁ డున్నాఁడు. ఆయన పేరు నిరమిత్రుఁడు. క్షేమకుని తండ్రిపేరు నిరమిత్రుఁడు. తాత గారిపేరే మనుమునికిఁ బెట్టిరి. ఈ నిరమిత్రుఁడు కలి ప్రవే

పత్రములమీఁద, సన్నని వలిసంపు గుడ్డలమీఁద, భారత భాగవతములు, బ్రహ్మసూత్రములును, భగవద్గీతయు, వ్రాయఁబడి భారతదేశమున నేప్రాంతమువారు వచ్చి యడిగినను గ్రంథము లీయఁబడుచుండెను. భారత దేశమున పలు మూలలనుండి బ్రాహ్మణులు వత్తురు, నెలలతరబడి కౌశాంబిలో నుండి యా గ్రంథములను వ్రాసికొని పోవుదురు. పర దేశపు రాజులు తమ కా గ్రంథముల ప్రతులు కావలయునని కౌశాంబీపతులకు వార్తలు పంపింతురు. కౌశాంబీపతులు గ్రంథముల నా రాజసభలకుఁ బంపింతురు. ఆ పదునేనువందల సంవత్సరములు కౌశాంబి వైయాసికమైన మహానాగరకతకు, వైదుష్యమునకు, విద్యాపీఠముగా నుండెను. సర్వ వైదికమైన విజ్ఞానమునకు వ్యాసుఁడు కోశము. ఆ కోశమే అంబ. అందు చేత నా పట్టణమునకు కౌశాంబి యనుపేరు వచ్చెను. ఆ సర్వజ్ఞానమును కౌశాంబీ నగరాధిపతులు భారత దేశమునందు పంచిపెట్టుచుండఁగా బౌద్ధమతము సుమారు నూటయేనుబది యేండ్లుగా దేశమునందు క్రమ క్రమముగా విజృంభింపసాగెను. కౌశాంబీనగరము చూచుచు నూరకుండెను. ఆ నగర మేమి చేయఁగలదు? ప్రయాగ వెనుక దాఁగికొనియుండెను. అందులో మఱియును తనకు దగ్గఱున్న గయలో నామతము సముద్భవించెను. ఆ మత మచ్చటినుండి యుత్తరముగా ప్రయాణము చేసెనుగనుక సరిపోయినది. పదియడుగులు వెనుకకు వేసినచో కౌశాంబిపని యేమయ్యెడిదో తెలిసెడిది. పాపమా మతము ప్రయాగదెసకు మళ్ళక పాటలీపుత్రము, గిరివ్రజపురము, శ్రావస్తి, వైశాలి మొదలైన వైపులకు చొచ్చుకొనిపోయెను.

ఇట్లు విజృంభించుచున్న బౌద్ధమతమునందు క్షేమకున కనురాగములేదు. కాని యతఁడేమి చేయఁగలఁడు? అందఱు క్షత్రియులును బౌద్ధులే. మేము క్షత్రియులము. నీవు మాకు పెద్దవు. నీవు రమ్మని పిలువఁగా మీరు బౌద్ధులు, నేను రానని చెప్పనా? నేను పెద్దవాఁడను గనుక వత్తునని చెప్పనా? వారు క్షత్రియులు. క్షత్రియధర్మము పాలించినచో నీయనను పిలువ వచ్చును. ఈయన వెళ్ళవచ్చును. వారు క్షత్రియధర్మమును పాలించరు. బౌద్ధధర్మమును పాలింతురు. నీవు వచ్చి మాకు హితోపదేశము చెప్పుము. ఈయన పోయి వారన్నది కాదనుటకు వీలులేదు. ఔననుటకు వీలులేదు. మొన్నటి గిరివ్రజపురమునందలి సామంతభవనములో జరిగిన సమావేశములో యువకులైన రాజులందఱు బ్రాహ్మణుల నందఱిని సంహరించుటకే పట్టుదలపూని యుండఁగా, మహానందియొకఁడును, క్షేమకుఁ డొకఁడును, నది దుష్టమైనపని యట్లు చేయరాదని యువకులను వారించి, యేయే విషయములందు బ్రాహ్మణులు ద్రోహులుగాఁ గనిపింతురో యా యా విషయములందు వారిని నిగ్రహించుడని చెప్పిరి. ఆసభ జరిగిన చోటు సామంత ప్రాసాద మని పిలువఁబడును. ఈపేరితో బౌద్ధమతమునందు నొక గ్రంథముకూడ బయలుదేరెను ఆ గ్రంథముపేరు "సామంత పాసాదిక." దీనిసంగతి ముందుఁ జెప్పఁబడును. ఈ క్షేమకుఁ డిట్టివాఁడు.

క్షేమకునకుఁ గుమారుఁ డున్నాఁడు. ఆయన పేరు నిరమిత్రుఁడు. క్షేమకుని తండ్రిపేరు నిరమిత్రుఁడు. తాతగారిపేరే మనుమనికిఁ బెట్టిరి. ఈ నిరమిత్రుఁడు కలి ప్రవే

శించినది మొదలు నాఁటివఱకు ముప్పదిమంది రాజులు కౌరవవంశమున జన్మించి హస్తినలోఁగాని కౌశాంబిలోఁగాని పాలించుచుండఁగా, వారందఱును వేదశాస్త్ర పురాణముల యందు విశ్వాసము కలవారై యుండఁగా, సందఱును వైయా సికములైన సర్వగ్రంథములకుఁ రక్షకులే కాక సర్వవైదిక మైన విజ్ఞానమునకు మూలకంబములు కాఁగా, తాను సంప్రదాయేతర మైన మార్గము నవలంబించుచుండెను. భారత భాగవతములు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతయు వ్రాసి పంచిపెట్టఁబడుట యతని కనిష్టముగా నుండెను. కాని రాజు తదనుకూలుఁడు. తండ్రిమాట కెదురాడలేఁడు. తండ్రి వృద్ధుఁడయ్యెను. అతఁడు చనిపోయిన తరువాత రాజ్యము తనచేతిలోనికే వచ్చును. అప్పుడే తనరాజ్యమును బౌద్ధముచేయును. ఈపురాణములను పీనిని తాను తిరస్కరించును. కౌశాంబీనగరము వైదిక వాఙ్మయప్రచారస్థానము కారాదు. ఈ నిరమిత్రుఁడు గిరి వ్రజమునందలి సామంత ప్రాసాదమునందు జరిగిన సభకు పోలేదు. తండ్రి వెళ్ళుచున్నాఁడని తాను వెళ్ళలేదు. తాను వెళ్ళినచో తండ్రికి వ్యతిరేకముగా మాటాడవలయును. తండ్రికిఁ గోపము రావచ్చును. తా నిట్టివాఁడని తండ్రికిఁ దెలియును, గాని ప్రత్యక్షముగాఁ దెలియదు. ఆ నిరమిత్రున కింకొక యహంకారముకలదు. తన్నుఁజూచి బౌద్ధులైన మాగధ కోసలులు కౌశాంబీరాజ్యమును రక్షించుచున్నారని. లేనిచో బౌద్ధమతమున కంత వ్యతిరేకమైన యీ రాజ్యము నుండనీయరు. నిజముగా బౌద్ధమతమునకు నిరమిత్రుఁ డను కొన్నంత తీవ్రతలేదు. బౌద్ధులలోననే రెండు పక్షములు

కలవు. ఆపక్షములు రెండును రెండుగాఁ జీలియున్నవి. ఒకరి కొకరికి పొత్తులేదు. మగధరాజ్యములోని బౌద్ధమతమే యథార్థమైన మతమా? కాదా? యను సందేహ మున్నది. ఈ సందేహమునకు పునాదివేసినవాఁ డజాతశత్రువు. నాఁటినుండియు నది యట్లే సాగుచున్నది. మగధరాజ్యమునందలి బౌద్ధమతము వేఱు. తక్కిన రాజ్యములందలి బౌద్ధమతము వేఱు. ఆ రెండు మతములకు సరిపడదు. వారు నిజమైన బౌద్ధులు కారని వీ రందురు. వీరు నిజమైన బౌద్ధులు కారని వారందురు. బుద్ధుఁడు నిర్వాణము పొందిననాఁడే యీ భేదమున కంకురార్పణ జరిగినది. ఎట్లైనను నిది యొక క్రొత్తమతము. మానవులకు క్రొత్త యొక వింత - ప్రాత యొక రోత. నిరమిత్రుఁ డీ భావములో నున్నాఁడు.

ఎవఁడైన నొక్కఁడు సర్వక్షత్రియ నిర్మూలనము చేయవలయునని సంకల్పించినచో, వాఁడు బౌద్ధమతమును కంటగించుకొనుచున్నవాఁడైనచో, నీ బౌద్ధమతమే నాఁడు క్షత్రియుల దురహంకారమునకు హేతువైన దనుకొన్నచో కౌశాంబీ నగరము తాను స్వాధీనము చేసికొనుటకు క్షేమకుఁ డడ్డువచ్చునా? నిరమిత్రునివలన నా రాజ్యమునుకూడ నాశనము చేయవలయునా? క్షేమకుఁడు గతించిన తరువాత నట్టిపని చేయవచ్చును లే యని యూరకున్నచో నాఁటికి తొండముదిరి యూసరవెల్లి కావచ్చును. నెల రెండు నెలలలో హైహయుఁ డూసరవెల్లి యయ్యెను. చిన్న చిన్న రాజు లగుచునేయున్నారు. చిన్న చిన్న రాజ్యములలోఁ గౌశాంబి యెన్నో కారణముల చేత ముఖ్యమైనది. క్షేమకుఁడు వృద్ధుఁడు. సత్పురుషుఁడు,

పండితుఁడు. అతనిని సంహరించుట యెట్లు? నిరమిత్రుని సంహరించవచ్చును. నిరమిత్రుఁడు సంహరింపఁబడెనేని క్షేమకుఁడు వృద్ధుఁడేమి చేయఁగలఁడు? క్షేమకుని తరువాతఁ గురువంశ మనినయే యుండదు. దానియంతట నదియే యంతరించును. అదికాక యింకొక రహస్య మున్నది. క్షేమకునికిఁగల పుత్రప్రేమ నిరవధికమైనది. ద్రోణాచార్యునకు నశ్వత్థామయం దెంతప్రేమయో నిరమిత్రునియందు క్షేమకున కంత ప్రేమ. ఆ సంగతి నిరమిత్రునకుఁ దెలియును. అందుకనియే నిరమిత్రుఁడు క్షేమకుని సంహరించలేదు. తండ్రికిఁ దనయందంత ప్రేమయున్నది. అట్టితండ్రినిఁ దాను సంహరించి రాజ్యముఁగొనుటకు నిరమిత్రుని మన స్సంగీకరించలేదు. వృద్ధుఁడు కదా! మఱియొక్క సంవత్సరము మఱియొక్క సంవత్సరమని నిరమిత్రుఁడు గడపుచుండెను. క్షేమకుఁడు మరణించిన తరువాత నిరమిత్రుఁడేమిచేయునో యెవ్వరికినిఁ దెలియదు. నిరమిత్రునిఁ గూర్చి జనులకందఱకు భయము. ఆర్యావర్తమునందలితక్కిన క్షత్రియులకే భయము. ఆ నిరమిత్రుఁడు మహాబలశాలి. అతఁడు ఖడ్గవిద్య నేర్వలేదు. ధనుర్విద్య నేర్వలేదు. అతఁడు గదా యుద్ధనిపుణుఁడు. ఈగదాయుద్ధవిద్య బలరామునితో దుర్యోధనునితో నంతరించినది. కాని ద్వారకానగర పరిసరములయందును హస్తిపుర పరిసరములయందును చిన్నచిన్న పల్లెలలో యల్పాల్పములైన రాజ్యములలో నది యుండనే యున్నది. ఆ సంప్రదాయము సాగుచునేయున్నది. హస్తినాపురమునుండి యీవిద్య వేయి యేండ్లక్రిందనే కౌశాంబికి వచ్చెను. ఆ విద్యాప్రాశస్త్యము లోకమునందు తగ్గిపోయెను.

కాని కౌశాంబిలో నదియున్నది. నిరమిత్రుఁడావిద్య నభ్య
సించెను. తాను భీముఁడ ననుకొనును. తాను దుర్యోధనుఁడ
ననుకొనును. తాను బలరాముఁడ ననుకొనును. అతఁడు
మహా బలశాలి. అతఁడు గద చేఁబూనినపుడు భీమునివలె
నేన్గులనైన నెగఁగఁగలఁడు. అందులో సందేహము లేదు. తాను
నైదికమతమునకు వ్యతిరేకిమైనను గదాయుద్ధ విషయమున
మాత్రము తాను బలదేవునితో సామ్యము తెచ్చికొనును.
నిరమిత్రుని హేతువుగాఁ గౌశాంబిలో, ప్రయాగలో, సార
నాథమున, గదాయుద్ధము నేర్చినవారు కలరు. దానికిఁ గొంత
ప్రశస్తివచ్చెను. కాని యది యంతరించిన విద్య యగుటచేత
దానికిఁ బెద్దయాదరము లేదు. కొందఱు క్షత్రియకుమారులు
స్వవిద్యా ప్రదర్శనము జరుపు మహోత్సవములయందు నిర
మిత్రుఁడు తన గదా పాండిత్యము ప్రదర్శించుటయుఁ గలదు.
అది యంతర్హితమైన విద్య. దానియందితఁడు నేర్పుకలవాఁ
డని నలువు రనుటయేగాని యొక మహాధానుష్కునివలె,
నొక మహాశబ్ద విద్యావేత్తనువలె, నిరమిత్రునిఁ జూచుట
రాజకుమారు లెవ్వరు చేయలేదు. అతఁడు తీక్ష్ణుఁడని మహా
బలశాలియని గదాపాణియైనచో, వానిముందు నిలువలేమని
యందఱకుఁ దెలియును. అందుచేత నతఁడన్నచో భయము.
ఈ నిరమిత్రుఁడు హైహయునివలె మఱియు నితర రాజులవలె
కౌశాంబిని గగ్గోలునకు తెచ్చెడివాఁడే. క్షేమకుఁ డడ్డము
వచ్చెను. వెనుకటికి శివుఁడు బాణాసురునకు వరములన్నియు
నిచ్చెను. మహాబలము నిచ్చెను. అతనియెదుట శత్రువు
నిలువలేకుండఁ జేసెను. వానిచేతుల తీటపోవుటకు మార్గము

కనిపించలేదు. నిరమిత్రుస్థితి యేర్పడినది. తాను గదావిద్య
యందు బలరాము నంతటివాఁడు. దుర్యోధన మహారా జం
తటివాఁడు. బలమునందు భీమునంతటివాఁడు. తన గదావిద్య
యెవరిమీఁద చూపించవలయును? అతనికిఁ దెలియలేదు.
ఎప్పుడో యొకప్పుడు సర్వక్షత్రియ కుమారులు గిరివ్రజపురము
ననో, అయోధ్యలోననో, కపిలవస్తు నగరముననో, సమావేశ
ములు జరిపినపుడు తన విద్యను వినోదముకొఱకు ప్రదర్శించు
టయేకాని తన్నెదిరించినవాఁ డెవ్వఁడునులేఁడు. తన గొప్ప
దనమును నిరూపించికొనుటకు వీలులేకపోయెను. పరరాజ్య
ములమీఁద దండెత్తి యుద్ధములో భీముఁ డేన్గులను త్రుళ్ళనేసి
నట్లు తానుగూడ చేయుటకు తాను రాజే కాఁడాయెను.
తాను రాజైన మఱునాఁడు కౌశాంబీ రాజ్యము గంగా,
యమునా సంగమపు పంగలలో కూర్చుండెదు. అది కపిలవస్తు
పురముదాఁక ప్రాకును. శోణానది పుట్టినచోటు రూపనాభము;
దానిపఱకు ప్రాకును. అతనిమనస్సులో నెన్నియోయూహాలు
కలవు. భీముఁడు కృష్ణార్జునులతోఁగూడి గిరివ్రజపురమునకేగి
జరాసంధుని సంహరించెను. తానట్లు మహానందికుమారు
లను వధించవలయును. ఈ యార్యావర్తము తొలినాఁడు
కౌరవులది. తాను కౌరవుఁడు. నేఁడు కోసలులును, మాగధు
లును నార్యావర్తముమీఁద నధికారముఁ జేయుచున్నారు.
తాను మహానంది కుమారులను తన గదకు బలియిచ్చినచో
మగధరాజ్య మాక్రమించినచో మఱల నార్యావర్తమంతయుఁ
గౌరవుల దగును. కోసలులు మాగధులకన్న పూర్వులు. కృత
యుగమునాఁటి వంశము కోసలవంశము. ద్వాపరాంతము

నందుఁ బ్రసిద్ధికివచ్చినది మాగధవంశము. పైగా మగధ రాజ్యము సంపాదించుట తేలికైనపని. ఎందుకనఁగా కలి యుగారంభము తరువాత గిరివ్రజపురమున నప్పుడే రెండు రాజవంశములు మారినవి. బార్హద్రథులు పోయిరి. ప్రద్యోతులు పోయిరి. ఇప్పుడు శిశునాగులు రాజ్యము చేయుచున్నారు. వీరుపోయి మఱియొకరు రావచ్చును. వచ్చునన్నట్లు ప్రతీకకలదు. ఈకాలమునందు మగధ రాజ్యము పాలించుచున్న రాజవంశముపోయి యీ రాజ్యము మఱియెవ్వరికో సంక్రమించునని లోకమునందు నానుడి కలదు. కాలజ్ఞులైన వారట్లు చెప్పిరట. చెప్పుచురట. జ్యోతిర్వేత్తలు దానిని దృఢపరచుచున్నారు. కనుక దాను గిరివ్రజము మీఁదికి దండెత్తిపోయి మహానందియొక్క ముప్పురు కొడుకులను సంహరించి రాజ్య మాక్రమింపవచ్చును.

ఇంతయు నిట్లుండఁగా నతనివిద్య యధీతిదశను దాటిపోలేదు. కొంచెముగా బోధదశను పొందినదిగాని యాచరణదశ దానికి లేనేలేదు. తాను దన గదావిద్య నెవరిమీఁద ప్రయోగించును. తనకున్న పదియేన్గులను నుగ్గునూచముగాఁ జంపికొనునా? తనవద్దగదా విద్యాభ్యాసము చేయుటకువచ్చిన శిష్యులను సంహరించునా ? తా నొంటరిగా పరరాజ్యముల మీఁదికిఁ బోవునా ? ఇట్టిస్థితిలో నుండఁగా నిన్నియేండ్లు గడువఁగా నతనివద్ద నీవిద్య నభ్యసించిన కొందఱు రాజకుమారులకడ నెవరో యాటవికులును బర్వత నివాసులునైనవారు కొందఱు దీనిని నేర్చికొనిరి. హిమవత్పర్వతములో నేపాళదేశమునకు వెనుకఁ బర్వతములలోఁ గొండలలో నీవిద్య

మిక్కిలిగా నభ్యసించుచున్నారనియు, వారందఱు తన్నే గురువుగా భావించుచున్నారనియు, నందులో నొక్కఁడు తన శిష్య పరంపరలోని వాఁడయ్యును దన్ను గౌరవింపఁడనియుఁ దన కంటె నాతఁడే మహా విద్యావంతుఁడ నని వానికి గర్వమున్న దనియు, గర్వమేకాక నిరమిత్రుని తూలనాడుటయు వాఁడు చేయుననియు, ఆ నిరమిత్రుఁడంత వాఁడైనచో నేఁడీ! నా యెదుటవచ్చి నిలువుమని యహంకారోక్తులు పలుకుచుండు ననియు, నాయుడవులు కుశీనగరమునకు సమీపమున నున్న వనియు, కుశీనగరమునకుఁ బశ్చిమమున లంబిని యను నగరము గలదనియు, తన్నగరానుబంధిగాఁగల పర్వతములలో నతఁ డొక పల్లెలో నుండుననియు, వానితో నితఁడు నీకొఱకు మహారాజకుమారుఁడైన నిరమిత్రుఁడు, అందులో పాండవ వంశ సంజాతుఁడు, మఱియు నర్జునుని సంతానము, వట్టి దూటవికుఁడవు నీవు. నీతో యుద్ధమాడుటకు ప్రయాగ నుండి యింత దూరము వచ్చునా? నీ కంతటి యహంకార మున్నచో మేము నిన్ను తీసికొని పోదుము. కౌశాంబికి పోదము. అచ్చటనే నిరమిత్రునితో యుద్ధమాడవచ్చును" అని చెప్పెననియు, వాఁడు "నాకేమి గరుజు? నాకేమి రాజ్యములు కావలయునా? కీర్తి కావలయునా? నేను భీమునంతవాఁడ నను కొనుచున్నానా? బలరామునకుఁగల గదాకౌశలమంతయు నావద్దనే యున్నదనుకొనుచున్నానా? నా కాదురభిమాన మును లేదు. పట్టుదలయు లేదు. ఆయన గదావిద్యలోఁ దనకంటె గొప్పవాఁడు లేఁడనుకొనుచున్నాఁడుగదా! అంత కంటె గొప్పవాఁడు లేఁడని మీ రనుచున్నారు. ఆయన

యనుకొనుచున్నాఁడో లేదో నాకు తెలియదు. ఆయన యంతటి వాఁడని మీ రనుచున్నారు. నేను కాదనుచున్నాను. నే నాయనను గదా యుద్ధములో నోడించలేకపోయినచో నాపేరు తీసి మాఱుపేరు పెట్టికొందును. మీ కాయనయే గొప్పవాఁడన్న విశ్వాస మున్నచో మీ రాయన నిచ్చటికి తెచ్చికొనుడు. అది మీ యవసరము కాని నా యవసరము కాదనుచున్నాఁడని"యు, నీ మొదలైన వార్తలు రెండు మూఁడు నెలలు నిరమిత్రుఁడు వినలేకపోయెను. విన్నప్పుడెల్ల నతనికిఁ గోపము వచ్చుచుండెను. వాఁ డెవ్వఁడో యాటవికుఁడు. ఈ విద్య తనవద్ద నేర్చినవారివద్ద నేర్చినవాఁడు. ఒక్కొక్కని దురహంకార మట్లుండును. తాను కౌరవవంశ సంజాతుఁడు. రాజకుమారుఁడు. అట్టివాని కహంకార మున్నచో నందము-చందము. సేవకుల కహంకారముండును. పరమ నీచవృత్తి చేయువాని కహంకారముండును. అహం కారమునకు సాగుబాటునకును శక్తిసామర్థ్యములకును సంబంధము లేదు. వాఁ డొక జానపదుఁడు. వాఁడొక యాటవికుఁడు. వాఁడొక మోటువాఁడు. అనాగరకుఁడు. భిల్లుల జాతికి చెందినవాఁడు. వానితో నేమని చాలసార్లు తన్నుఁ దాను సంబాళించుకొనెను. తన శిష్యులైనవారు శిష్యులవెంట వచ్చినవారు, తన్నుఁ బ్రోత్సాహపఱచిరి. "రాజకుమారా! మీ సంగతి కాదు. వాఁడట్లనినచో మీకు వచ్చిన ప్రతిష్ఠా భంగము లేదు. మాటిమాటికి వాని మాటలు మేము వినలేకున్నాము. మాయందు దయయుంచి మమ్ము మన్నించి మా కోరిక తీర్చుటకైనను మీరు నెసులుబాటు చేసికొని

యొక్కసారి యేదో పని పెట్టికొని యీ ప్రాంతములకు వచ్చి
నచో వాని పొగ రడఁగును. మే మెవ్వరము వాని నెదు
ర్కొన లేకున్నాము. వాఁడింతటిమానిసి. వాని చేతిలోని గద
పెద్ద మద్దిచెట్టంత యుండును. నిజముగా తమ రచ్చటికి
విచ్చేసినచో వాఁడు పలాయనమంత్రము పఠించునని మాకుఁ
దెలియును. మీరు కుశీనగరమునకు దయచేయుడు. వాఁడు
కాలికి బుద్ధిచెప్పును. మీరు కుశీనగరములో నున్నన్ని నాళ్ళు
వాఁడు పోయి యేకొండ గుహలలోనో దాఁగికొనును. మీరు
వెనుకకు తిరిగి రావచ్చును. తరువాత వాఁడు మా ముందు
మి మ్మగౌరవపరచుచు మాటాడలేఁడు. మేము నల్వురము
వానిని నీసీ యందుము. ఓయి యుత్తర కుమారుఁడా! యని
వెక్కిరింతుము. మాకు తృప్తి కలుగును. మేము మీశిష్యు
లము కావున, మే మెవ్వరము వానితో నెదుర్కొనలేము
కావున, మా పరువు నిలబడవలయునన్నచో మీరొక్కసారి
యీ దెసకు రావలయునని యభ్యర్థించుచున్నామని పదేపదే
ప్రార్థించఁగా నిరమిత్రుఁ డంగీకరించెను. తాను బదరీ నారా
యణము చూచి వత్తునని తండ్రివద్ద సెలవుఁ దీసికొనెను. తన
కొడుకు బదరీ నారాయణమునకు పోవుదుననఁగా క్షేమకుఁడు
మిక్కిలి సంతోషించెను. బదరీనారాయణమనఁగా వారి సొత్తు.
అది నరనారాయణులు తపస్సుచేసిన చోటు. ఆనరనారాయణు
లిద్దఱును కృష్ణార్జునులై మహాభారతయుద్ధమును నిర్వహించిన
మహాత్ములు. అక్కడ కృష్ణుఁ డున్నాఁడు. అర్జునుఁడున్నాఁడు.
క్షేమకుఁడు సంతోషముతో కొడుకున కనుజ్ఞ యిచ్చెను.
తానెట్లును బదరి పోలేఁడు. బదరినుండి తిరిగి వచ్చిన కొడు

కునుఁ గౌఁగిలించుకొన్నచో తనకాయము పవిత్రమగునను కొనెను.

నిరమిత్రుఁడు నెలనాళ్ళలో గిరివ్రజము మీఁదుగా, రామపురము, నందగడముమీఁదుగా, హిమాలయము చేరి పశ్చిమముగాఁ బ్రయాణముచేసి కుశీనగరమును చేరెను. ఇతని శిష్యులు వానికిఁ గబురంపిరి. వాఁడు కుశీనగరము వచ్చుట కంగీకరించలేదు. తన నివాస భూములైన యడవులలో గదా విద్య నభ్యసించు పెద్ద గరిడీ ప్రదేశము కలదు. దానియందు యుద్ధముచేయుట కభ్యంతరము లేదనెను. పారిపోవు ననుకొనిన వాఁడు పారిపోలేదు. నిరమిత్రుఁడును సంశయపడెను. వాఁడు యుద్ధముచేసెడివాఁడేగాని పీంద అన్నట్లు పారిపోయెడివాఁడు గాఁడు. ఇన్నాళ్ళకు తన గదావిద్యకుఁ జాతుర్థ్యము కలిగెనని నిరమిత్రుఁడు సంతోషించెను. అతని మనస్సులో నొక్కటియే సందేహము. వాఁడెవఁడో యాటవికుఁడు. తనకుఁ దీటైన క్షత్రియుఁడు కాఁడు.

ఒకనాఁడు యుద్ధము జరిగెను. వాఁడు మహా బలశాలి. వానిని నిరమిత్రుఁ డేమియుఁ జేయలేనని యుద్ధ మారంభించిన మొదటి గడియలోనే తెలిసికొనెను. వానికిఁ దన కున్నంత కౌశలములేదు. కాని వానికి నాలుగేనుఁగుల కున్నంత బల మున్నట్లుండెను. తాను కొట్టిన దెబ్బయు వానికి తగులుట లేదు. తుట్టతుదకు తాను నేలమీఁదఁ బడిపోయెను. వాఁడు తన శిరస్సును గదాదండముతో వ్రక్కలింపఁ బోవుచున్నాఁ డన్న విషయమే నిరమిత్రుని జీవునకు చిట్టచివరి యూహ.

కొడుకు చనిపోయెనన్నవార్త క్షేమకునకుఁ దెలిసెను. ఆయన తత్క్షణమే ప్రాణములను వదలెను. అక్కడ నెవఁడో రాజయ్యెను. ఎట్లయ్యెనో ఎందుకయ్యెనో యెవ్వరికినిఁ దెలియదు.



సింధునది హిమవత్పర్వతములో జన్మించి దక్షిణముగాఁ బ్రవహించి సింధు సముద్రములోఁ జేరుచున్నది. ఏ మహానది యైనను తా నెంతమేరఁ బ్రవహించునో అందులో సగము మేర నామె యొక చిన్న నది. ఇతర నదులు వచ్చి యామెతోఁ గలియును. ఆ కలిసెడు నంతవఱకు నా నదికిఁ బ్రాముఖ్యము కలదు. అన్ని నదులు కలిసిన తరువాత మహా ప్రవాహమై సముద్రమునఁ జేరఁబోవు వేళకు ముందొక కొన్ని వందల యోజనముల మేర నామె మహా ప్రవాహ ముగా నుండును. తత్పూర్వ మొకొక్కప్పు డామెను కలియఁ బోవు నదులే యామెయకంటె విశాలములై జలభరితములై మహా ప్రవాహములై యుండవచ్చును. ఉండవచ్చునేకాదు; ఉండును. కొండలు వదలి పల్లపు ప్రదేశమునకు నది దిగిన తరువాత యా నదికి వఱదలువచ్చిన వనఁగా నానదికి శాఖా నదియైన యొక నది యామెకు వఱదలు దెప్పించెను. ఆమె యంతట నామెకు వఱదలు వచ్చిన కథ కొంత మృగ్యమైన విషయమే. ఒక్క భాగీరథీనదిని తొలఁగించినచోఁ దక్కిన

నదులన్నియు నిట్టివే సింధునది తాను ప్రవహించిన సగము
మేర నామె సామాన్యపు నదియే కాని యామె తక్కిన నదు
లన్నిటికంటె దైర్ఘ్యముకలది. ఆమెలో వచ్చి మఱియు నాల్గు
నదులు కలిసెను. కలిసిన నాల్గు నదులలో మూఁడు నదులు
తమ్ముఁదాము కలిసికొని యొక్కసారి వచ్చి కలిసినవి. ఆ
మూఁడు నదులు వచ్చి సింధునదిని కలిసినతరువాత కొంత
దూరము పోయినతరువాత శతద్రూనది కలిసినది. ఆ మూఁడు
నదులు కలియకమునుపే గోకులీనది వచ్చి కలిసినది. ఆ
మూఁడు నదులు సుదామయు విపాశయు. మూఁడవది అంత
పేరు- ప్రతిష్ఠలు కలది కాదు. మఱల శతద్రు ప్రసిద్ధురాలు.
ఈ శతద్రూనదికి వచ్చిన ప్రాధాన్యము పురాణ ప్రసిద్ధమే.
పూర్వము విశ్వామిత్రుఁడు వశిష్ఠముని వంద కుమారులను
చంపఁగా నాయన దుఃఖముతో నా నదిలో నుఱుకఁగా నామె
వంద విధముల చెదరిపోయినది. అందుచేత నామెకు శతద్రు
వన్న పేరు వచ్చినది. శతద్రువనగా వేయి పాయలుగా
ప్రవహించినదని యర్థముకాదు. శత విధముల ద్రవించినదని
యర్థము. ఆమె భగవంతుఁడైన శ్రీవశిష్ఠుని పరమశాంతమైన
మూర్తి ప్రథమ జీవలక్షణమైన దుఃఖముచేతఁ దల్లడిల్లఁగా,
నా భగవంతుని శరీరస్పర్శచేత నేమి కావలయునో తెలియక
శతధా ద్రవించినది. జీవుఁడున్నాఁడు. వాని ప్రథమ స్వరూ
పము దుఃఖము. దానినుండి కామము జనించినది. జీవుఁడు
తద్దుఃఖాపనయనము చేసికొందమని కామమును స్వీకరించెను.
కామమువలన సుఖము సంపాదించి దుఃఖమును తొలఁగించు
కొన వలయునని వాని యుద్దేశ్యము. ఆ కామముతో నాగి

నచో నెట్లుండెనిదో? ఆ కామము వంటి క్రోధ లోభ
మోహ మద మాత్సర్యములు జన్మించెను. వానితోఁ గామము
సుఖహేతువు కాక మఱియు దుఃఖహేతు వయ్యెను. ఈ
కామము నడుమ నున్నది. దానికి వెనుక జీవునకు సహజ
లక్షణమైన దుఃఖ మున్నది. ఈతల క్రోధాదులచేత పుట్టిన
దుఃఖ మున్నది. ఈ రెండు దుఃఖముల నడుమ నీకామ మిసు
కటఁ బడిపోవుచున్నది. తొలుతటి దుఃఖము ప్రథమ వికా
రము. కామజన్యమైన లౌకిక దుఃఖము వికార వికారము.
మహర్షియైన వశిష్ఠునకు వికార వికారమైన దుఃఖము లేదు.
తొలుతటి దుఃఖమును లేదు. కాని పుత్ర మరణా యాస
జనితమైన వికార వికార దుఃఖము కల్గినది. దానితో జీవ
లక్షణమైన దుఃఖ సమ్మేళనము పొందినది. ఈ రెండు దుఃఖ
ములు విడివిడిగా నున్నపుడు దేనికదియే భోగ్యమగును. జీవ
గత దుఃఖము మిక్కిలిగా భాసించినచో వైరాగ్యోదయమై
జీవుఁడు మోక్షమార్గమునుఁ బట్టును. వికారజమైన దుఃఖము
మిక్కిలిగా నున్నచో శరీరముతోఁ దపించును. అది వాని
కర్మ ఫలితమో, తదనంతర జన్మహేతుకమైన సంస్కారము
గానో, పరిణమించును. ఈ రెండు దుఃఖము లొక్కటిగా
నగుట యెప్పుడును లేదు. నిత్యశాంతవృత్తి భగవంతుఁడు.
వశిష్ఠునకు జీవగత దుఃఖ వృత్తి లేదు. కాని వశిష్ఠుఁడుగా
బ్రహ్మయొక్క యాదేశానుసారముగా జన్మించినపుడు తద్దుఃఖ
హేతువుగాని జన్మ లేదు గనుకఁ దద్దుఃఖము మూలభూతమైన
వికారముగా నున్నది. శతసుత మరణముచేత వికారజమైన
దుఃఖము వికృతిరహితమైన వశిష్ఠుని యాత్మనుండి విలక్షణ

ముగా సముద్భవించెను. వికారము లేనిచోట వికారమునుండి కలిగెడు వికార మెట్లు కలుగును? ఎప్పుడు వికారజన్యమైన పుత్రమరణ దుఃఖము, జన్మించుటకు వీలులేని వశిష్ఠాత్మ యందు జన్మించెనో యా దుఃఖ మేమిచేసినదనఁగా నిర్వికార మైన వశిష్ఠుని బ్రహ్మపదార్థ భూతమైన యాత్మ ద్రవ్యమందు జీవలక్షణాధిక్యముఁ గల్పించెను. తొలుతటిదుఃఖ ముండఁగా దానినిఁబట్టి రెండవ దుఃఖము జన్మించును. ఇచ్చట రెండవ దుఃఖమునుండి మొదటి దుఃఖము జన్మించవలసిన స్థితివచ్చెను. ఇది వ్యత్యస్తమైన విషయము. దీనికి సృష్టియొక్క ప్రథమ వివర్తమైన జలము తల్లడిల్లి పోయెను. అందుచేత పాసమా మహానది శతద్రు వయ్యెను. ఆ శతధాత్వము నదీరూప సంబంధమైనది కాదు. జలగతలక్షణ సంబంధమైనది. అగ్ని నుండి జలములు సముద్భవించెను. జలములనుండి పృథివి సముద్భవించెను. పృథివిలో సర్వ వికారములు ప్రారంభించెను. పృథివీగత సర్వవికార సమాహారభూతమైన లౌకిక దుఃఖము జలాకృతిమ ప్రథమ వికారమునకు బిడ్డవంటిది. సృష్టిలో ననులోమమేగాని భూత విషయములయందు విలోమము లేదు. ఆకాశమునుండి వాయువు, వాయువునుండి యగ్ని, అగ్నినుండి యప్పులు, అప్పునుండి పృథివి, పృథివినుండి యోషధులు, వానినుండి యన్నము, అన్నమునుండి జీవుఁడు — ఇది సృష్టియొక్క యనులోమ విధానము. ఈ యనులోమ విధానము మఱల వెనుక వెనుకకు పోయి విలోమమార్గమున నాకాశ మగుటలేదు. మానవుఁడు తాను పరమేశ్వరైక్యమును పొందవలయుననఁగా భావనాపటిమచేత చిత్తశుద్ధిచేత బుద్ధిని

నిలబెట్టుకొనుటచేతఁ గావలసినదేశాని, నే నన్నమునందుఁ బ్రవేశించెదను, తరువాత నోషధులయందుఁ బైన పృథివియందు, మిగిలి జలమునందు, నుపరి యగ్నియందు, కడచి వాయువునందు, నెగిరి యాకాశమునందు నగుదునన్న విలోమ విధానము లేదు. వశిష్ఠుని దుఃఖమునందు వచ్చిన విపరీత ప్రాశయ పరిస్థితి యిది. ఈ దుఃఖ మా దుఃఖమును చెలరేఁగింప లేదు. భగవంతుఁడైన వశిష్ఠునియందు దిట్టి విపరీతపరిస్థితి యేర్పడఁగ సృష్టియొక్క ప్రథమాకృతియైన జల భూతము తల్లడిల్లి పోయెను. ఆ శతద్రువు సింధునదిలోఁ గలసినది. ఎచ్చట కలసినది? సింధువానైపున, తానీనైపున, నడుమ మూడునదులు. సింధునదికి సుదామానదికి నడుమ నున్నది కేకయదేశము. విపాశా నది క్రింద బాహ్లీక దేశము. బాహ్లీకమునకు నెల్లయైన నదికిని శతద్రువునకును నడుమ నున్న దేశము బాహ్లీకములలో చేరునో మఱి దేనిలో చేరునో తెలియదు. ఇంతకును శతద్రూనది యార్యావర్తమును రెండుగా విభాగించినట్లైనది. శతద్రూనదియొక్క పశ్చిమభాగ మంతయు సృష్ట్యాది నుండియుఁ దక్షిణ యార్యావర్తమును మించి యొక విలక్షణమైన బుద్ధితో నాచారములతో వెలయుచునే యుండెను. ఎవ్వారెవ్వరు వైదికమతమును నిరసించి పెడదిరిగి తచ్చిన్నలక్షణములు సంపాదించికొని గాంధారమును దాటిపోయి రామఠ బర్బర పారద హూణశాక కిరాతదరదోత్తర బాహ్లీక సింహాకటకోర గాభిసార దేశములయందలి జనులుగా నేర్పడిరో, వారందఱును శతద్రూనదీ నిర్మితవశిష్ఠ మహర్షి దుఃఖజనిత విలక్షణ సంస్కార జనితమైన యొక జాతిగా

నిచట సంకురించి, గాంధారములుదాటి, మ్లేచ్ఛజాతులుగాఁ బరిణమించిరి. ఈ వైదునదులు ప్రవహించుమేర నార్య నాగరకత కొంచెము పలుచఁబడ నారంభించినది. సింధునది దాటిన తరువాత గాంధార దేశములందు మఱికొంత పలుచఁ బడినది. ఆ వెనుక మ్లేచ్ఛరాజ్యములున్నవి. వానిలోకూడఁ గొన్ని యార్యమతము ననుసరించుచునే యుండెను. కొన్ని పూర్తిగా మ్లేచ్ఛములయ్యెను. ఆర్యములైన దేశములయందుఁ గూడఁ గొన్ని భావములు మ్లేచ్ఛభావ సంకరములుగా నుండు చుండెను.

కలియుగము ప్రారంభించకముందే యీ మ్లేచ్ఛజాతులు కొంచెము కొంచెము తలయెత్త నారంభించెను. అవి తల యెత్తుట యారంభించినది మొదలు వానియొక్క సర్వమైన యాశలు నహంకారమును గర్వమును తా మెచ్చటనుండి చెడిపోయి యితరములైనవో, యా మాతృనాగరకతయందు బద్ధవిరోధములై, తాఁజెడిన కోతి వనమెల్లఁ జెఱచునన్నట్టు లార్యావర్తమునంతయు మ్లేచ్ఛముఁ జేయవలయునని పట్టు దలతో నదేపనిగా వేలసంవత్సరములు ప్రయత్నించుటయు, నప్పు డప్పుడు సఫలము లగుటయు, పలునాళ్లార్య క్షత్రియుల చేత పరాభూతములై పరాధూతము లగుటయు నిట్లు గడచుచు వచ్చెను. ఆర్యులైన క్షత్రియులు మ్లేచ్ఛభావ దూషితులై నప్పుడు పూర్వమున్నదే వారి మ్లేచ్ఛభావమునణఁచుటకు వారి కంటె నధికమైన మ్లేచ్ఛభావముగల యవన శక బాహ్లీకాదు లను సృష్టించుచు వచ్చిరి. విశ్వామిత్రుఁడు వశిష్ఠుని గోవు నపహరించినపుడు గోరోమ కూపములనుండి శకయవనాదులు

పలుమంది నిర్గమించిరి. అదివఱకే మనునిర్మిత ధర్మమున
కెదురుతిరిగిన జనులుపోయి దరదాది దేశము లాక్రమించిరి.
ఈ పరిశిష్టసైన్యములుకూడ నచ్చటకే పోయి మ్లేచ్ఛబలము
క్రమ క్రమముగా వృద్ధిపొంద నారంభించెను. ఈ మ్లేచ్ఛులలో
నాదిములు పంచసింధు దేశనివాసులు. వారచ్చట సమృద్ధిగా
జలము నెఱుఁగుదురు. తిండి నెఱుఁగుదురు. వారు పోయిన
దేశములు ఱాతినేల. అచ్చట పంట లేదు. జలసమృద్ధి లేదు.
క్రమముగా వారు స్నానము చేయకుండుట యాచారముగాఁ
బెంచికొనిరి. నీరు లేనప్పుడు స్నానమెట్లు చేయుదురు? వారు
త్రాగుటకు నీరుదొరుకుటయే దుర్లభముగా నుండెను. మఱియుఁ
గొండలలో నడవులలోఁ దిరుగుటచేత మోటువారై వన్య
జంతు ప్రకృతులై యనాగరకులై, మ్లేచ్ఛులై, కిరాతులై,
నిత్య క్రోధమే సహజగుణమై, దొంగిలించుట వృత్తియై, యిత
రులనుఁ జంపుట పాపమో కాదో తెలియని స్థితిలోనుండి,
జనము పెరిగినకొలంది యాహారము దొరకుట కష్టమై, యాహా
రము సమృద్ధిగా దొరకెడి స్థలము పంచ సింధు దేశమని
పరంపరగా వారి గుంపులలోఁ జెప్పికొనెడి మాటయై, పంచ
సింధు దేశముమీఁదికి దాడి వెడలుటయన్న విషయమే వారి
జన్మలకు చరితార్థమైన విషయమై యుండుచుండిరి. ఎన్నాళ్ళు
పంచ సింధు దేశమునందుఁగాని, దానికి తూర్పుననున్న
యార్యావర్తమునందుఁగాని, సమర్థులైన సుక్షత్రియ ధరా
పతులుండిరో, అన్నాళ్లు వారికి పంచ సింధు దేశము సమాక్ర
మించుట సాధ్యము కాకపోయెను. అప్పు డప్పుడు కాశ్మీరము
మీఁదికి, త్రిగర్త కాంభోజములమీఁదికి, వారు దాడి వెడలు

టయుఁ దాత్కాలికముగా వాని నాక్రమించుటయు. మఱల క్షత్రియ రాజులు వారినిఁ బాఱఁద్రోలుటయు. జరుగుచు నుండెను. రామాయణకాలము జరిగిన తరువాతనే కేకయరాజ్యము నామమాత్రముగా మిగిలెను. తరువాత భారత యుద్ధానంతమున బాహ్లీకరాజ్యము సన్నగిల్లెను. భారత యుద్ధముతో పాంచాల దేశములకు పేరు ప్రతిష్ఠలు వచ్చెను. ద్రౌపది పాంచాలి. ఆమె పాండవుల భార్య. పాండవులు జగజ్జేగీయమాన పరాక్రమవంతులు. నాఁటినుండి పాంచాలురు బాహ్లీక కేకయ మద్ర రోహిత దేశాధీశులకంటె ప్రతిష్ఠావంతులై, పంచ సింధు దేశమును సమాక్రమించికొని, తత్ప్రాంతముల తలకట్టు రాజ్యముగా భాసించుచు వచ్చిరి. అప్పట నున్న చిన్న చిన్న రాజ్యములమీఁదఁ బాంచాలఁ సాధికారముఁ జేయఁ జొచ్చెనది. పాంచాలాధిపతి యొక్క యడుగు జాడలలోఁ స్వతస్థములైన చిన్నచిన్న రాజ్యములు మెలఁగఁ జొచ్చెను. అందుకనియే గిరివ్రజపురమునందు సామంత ప్రాసాదమునందు జరిగిన సర్వ క్షత్రియ సమావేశమునందు పంచసింధు దేశమునందుండి వచ్చినవాఁడొక్క పాంచాల దేశాధిపతియే. ఆ రాజులు తాము ద్రుపద మహారాజు సంతానమని చెప్పుకొనుచుందురు. భారత యుద్ధములో ధృష్టద్యుమ్నుఁడు చనిపోయెను. అతని కొడుకు పాంచాల దేశమునకు రాజయ్యెను. భారత యుద్ధములో త్రిగర్త కాంభోజాభిసార మద్ర కేకయాధిపతులు వధింపఁబడిరి. ఇంచుమించుగా నా రాజ్యములలో నెక్కువ భాగము పాంచాలదేశములో చేరెను. కేకయరాజ్యమంతరించెను. బాహ్లీక రాజ్య మంతరించెను. మద్రరాష్ట్రి

మంత్రించెను. దశార్ణదేశములు రూపుమాసెను. ఆ యా ప్రాంతములన్నియుఁ గలిసి పాంచాలరాజ్య మేర్పడెను. మహాభారతయుద్ధములో శకుని వధతో గాంధారరాజ్యముయొక్క బలము పోయెను. గాంధారదేశ మొకచిన్నదేశముగా మిగిలిపోయెను. గాంధార రాజులకు కాశ్మీర కాంభోజదేశములతోఁ జుట్టరికములు కలవు. శకుని మేనల్లుఁడే భారతయుద్ధము నాఁటి వాని కాశ్మీరరాజయ్యెను. ఎట్లైనను పాంచాలదేశమే ప్రధానమైన దేశ మయ్యెను. ఆ పాంచాలదేశమునకు చుట్టుపట్టునున్న మ్లేచ్ఛదేశముల యొత్తిడి నిత్యము నుండుచునే యుండెను. మ్లేచ్ఛులార్యధర్మ వ్యతిరేకులు. ఇట్లుండఁగా కడచిన నూటయిరువది వత్సరములనుండి బౌద్ధమత మొకటి ప్రబలినది. ఆర్యమతములుకాని సర్వమతములు ప్రాగ్దిశనుండి పశ్చిమదిశకు పోవుటయే పనిగాఁబెట్టుకొన్నవి. అది వాని సహజమైనస్థితి. తూర్పున నుదయించిన సూర్యుఁడు నడిమింటికెక్కియేమిచేయును? క్రమముగా పడమటికి దిగును, అస్తమించును. సూర్యదేవుఁడు జ్ఞానమునకు ప్రతీక వెలుఁగునకు చిహ్న. జ్యోతిరాకృతి. అది క్రమముగా పడమటికి వ్యాపించునుగదా! చీఁకట్లు పడమట నుదయించును. అవి క్రమముగా తూర్పునకుఁ బ్రాకును. సృష్ట్యాది పరమేశ్వర భావదీప్తియొక్క గమనము నిట్టియున్నది. ఆర్యావర్తమున నుదయించి యుపనిషత్తులయందు నడిమింటి సూర్యుని వెలుఁగులు వెలిఁగించి ధర్మభ్రష్టమైన పడమటికిఁ బ్రయాణించి అస్తమించి ముద్దకట్టిన చీఁకట్లు మరలఁ దూర్పుదెసకుఁ బ్రయాణించుటలోఁ దప్పేమి? బౌద్ధమతముకూడ నుత్తరకోసలములం దుదయించి

పడమటికే ప్రయాణించెను. మహానంది మగధముల నేలు నాటికి బౌద్ధభిక్షువులు పాంచాలదేశమున దాని చుట్టుప్రక్కలనున్న దేశములయందు పలుమంది యుండిరి. ఉండుట యేకాదు. శ్రావస్తి, సారనాథ, కాశీ ప్రముఖములైన స్థలములయందున్న బౌద్ధభిక్షువులకంటె వారి కధికమర్యాద గలుగుటగూడ సంభవించెను. ఇచ్చట బౌద్ధమతము చిత్రచిత్రములైన యూహాలతో మార్పులుపొంద నారంభించెను. పడమటి దేశముల యందలి బౌద్ధమతము తొలుతటి యపూర్వమైనదియు, బుద్ధుడు బ్రతికి యుండగా నాయన బోధించిన యపూర్వమైన బోధనల మీదనే యాధారపడి ప్రవర్తించు నర్హతులు కలదియు, నైన శుద్ధిగా నుండెను. ఆనాడు పశ్చిమ దేశములయందు సంభూత శాణవాసి యనియు రేవతుడనియు గొప్ప బౌద్ధమును లిద్దరు నివసించుచుండిరి. వారు గొప్ప మునులు. ఇంద్రియ నిగ్రహములు కలవారు. గొప్ప మర్యాదకలవారు. వారివలన మ్లేచ్ఛుల యొత్తిడి పాంచాలదేశములందు తగ్గెను. మ్లేచ్ఛులకు మనుధర్మమందున్న ద్వేషము వేదమార్గమునందున్న ద్వేషము వైదికేతర మార్గములందు లేదు. బౌద్ధులు వేదము నంగీకరించరు. రామకృష్ణులు భగవదవతారము లనరు. వర్ణాశ్రమాచారధర్మము లంగీకరించరు. అందుచేత వారు మ్లేచ్ఛులలో మ్లేచ్ఛులు. కాని సన్న్యాసమును స్వీకరింతురు. భిక్షాటన మంగీకరింతురు. కావిగుడ్డలు కట్టుదురు. ఈ మొదలైన లక్షణములతో వైదిక మార్గమునందుగల చివరి యాశ్రమము నంగీకరించినట్లైనది. వీరియందు వైదిక వాసన పోలేదు. కాని చాలభాగ మవైదికులు. ఇది స్థూలముగా బౌద్ధులను

గూర్చి మ్లేచ్ఛులకున్న యభిప్రాయము. పాంచాలదేశపు రాజైనను తక్కిన చిన్నరాజులైనను బౌద్ధమతమును స్వీకరించుటచేత మ్లేచ్ఛులకు, వారికి మతాభిప్రాయములలో కొంత సామరస్యము కుదిరెను. నిస్సంశయముగా పాంచాలురా సమయమునందు సర్వభారతదేశమును దమ యాధిపత్యము క్రిందికిఁ దీసికొనుటకుఁ బ్రయత్నించినచోఁ గానరాగల కాలము. ఇంచుమించుగా రాజులందఱు బౌద్ధులు. బౌద్ధులనఁగా నా యా ప్రాంతములందున్న ప్రసిద్ధులైన బౌద్ధసన్న్యాసులకు శిష్యులు. ప్రాగ్దేశములందున్న బౌద్ధసన్న్యాసులకు నాచారములలోఁగాని సిద్ధాంతములలోఁగాని సంశయములు గలిగినచో, తత్సంశయ నివారణకొఱకు పశ్చిమదిశయందున్న పాంచాలాది దేశముల యందలి బౌద్ధసన్న్యాసులనుఁ దీర్పుచెప్పుటకు పిలుచుచుండెడివారు. బుద్ధునకు జన్మస్థానమైన ప్రాగ్దేశములయందు బౌద్ధ సిద్ధాంతములు తమ యొక్క గట్టితనమును లోపింపఁజేసికొన్నవి. దూరమునందలి వారు బుద్ధుని ప్రథమోపన్యాసముల సారాంశము స్పష్టముగా నలవఱచుకొన్న యింద్రియ విజేతలైన పరమ సన్న్యాసులు.

పాంచాలదేశపు రాజు తా నీపరిస్థితిని చక్కఁగా సవగతము చేసికొని తన రాజ్యమును పెంపొందింపఁజేసికొని సర్వభారతదేశ మాక్రమించుకొనఁగలిగినంత శక్తిత్రయము కలవాఁడు కాఁడాయెను. కాఁగా నందజితో పాటు తాను క్షత్రియుఁడన్న దురభిమానము కలవాఁడే యయ్యెను. ప్రజలు వర్ణాశ్రమాచారధర్మములకు వ్యతిరేకమైన బౌద్ధమతమునందభిమానము కలవారై యుండిరి. వర్ణాశ్రమాది వ్యతిరేక

భావముకలిగిన మ్లేచ్ఛులను వారి భావములను, నిరాదరించి నిరాకరించెడు స్థితిలో నేఁటి పంచ సింధుదేశవాసులును, గాంధారదేశవాసులును నుండిరి. రాజుమాత్రము క్షత్రియాభిమాని. తన్మతాభిమాని కాఁడు. కాని యొకదాని కొకటి పోసఁగుట లేదు. రాజు క్షత్రియాభిమానము వదలలేకున్నాఁడు. ఆరాజు గిరివ్రజపురమునకు తత్సమావేశమునకుఁ బోవుట యే యప్పటి ప్రజలలో మర్యాదగలిగి, పలుకుబడిగలిగి, యధికారము గలిగినవారి కిష్టము లేదు. అట్టిస్థితి పాంచాలము నందున్నది. ఆ రాజు తొలఁగింపబడినచోఁ నారాజవంశము పాలన క్రియనుండి బాహిరింపఁబడినచోఁ ప్రజల కిష్టమైన విషయమే. క్షత్రియుఁడు కానివాఁడెవ్వఁడో రాజగును. వాఁడు బౌద్ధుఁడైనచో మఱియు నిష్టము.

ఇట్లుండఁగా పాంచాలములయందు గాంధారముల యందు రాజునకు వ్యతిరేకమైన యభిప్రాయములు సన్న సన్నగా సూచింపఁబడుటయు నవి క్రమ క్రమముగా బలమును సంపాదించుకొనుటయు జరుగుచు వచ్చెను. అదివఱ కా దేశములయందు నెవరో ప్రసిద్ధులైన బౌద్ధ సన్యాసులుండుట యే తప్ప వారి సంఖ్య బహుళముగా లేదు. గిరివ్రజపురము సామంత ప్రాసాదమునందు జరిగిన క్షత్రియ సమావేశము తరువాత నెలదినములలో తూర్పుదేశమునుండి పశ్చిమదేశము లకు కొన్నివందలమంది బౌద్ధ భిక్షువులు వోయిరి. వారు జనపదములయందు యథేచ్ఛముగాఁ దిరుగుచు, భిక్షాటనము జేయుచు, బౌద్ధమతము నుపదేశించుచు నొక్కొక్క జనపదమునందో, పట్టణమునందో నివాస మేర్పఱచికొని శిష్యులను

సమకూర్చికొని వారికి బోధసేయుచు, గిరివ్రజపురమునందు జరిగిన క్షత్రియ సమావేశము బౌద్ధమతమునకు వ్యతిరేకమైన దనియు, నా సమావేశములో బుద్ధుఁడు భగవంతుఁడే కాఁడనియు, నతఁడును మానవుఁడే యనియు ముఖ్యమైన యెన్నో బుద్ధనిందలు బౌద్ధమత వ్యతిరేకాభిప్రాయములు నిర్ధారింపఁ బడినవనియు, మఱియు నప్పటి రాజకుమారులు బౌద్ధులను హింసించుటకే రహస్యముగా తీర్మానించికొనిరనియు, చిత్ర చిత్రములైన కల్పనలతో రహస్య ప్రచారములు చేయనారంభించిరి. నాల్గైదు నెలలు గడచునప్పటికి నా ప్రాంతములం దెక్కువభాగము రాజునకు వ్యతిరేకులైరి. వ్యతిరేకులగుటయేకాదు, రాజునుగూర్చి భయపడఁ జొచ్చిరి. ఎప్పుడు రాజు తన దమననీతి ప్రారంభించునో యని భీతి వహింప నారంభించిరి.

బాహ్లీకదేశములో నలగిరియని యొక జనపదముకలదు. ఆ జనపదములో ననాదిగా నొక కుటుంబ మున్నది. వారు ద్రుపదమహారాజు సంతానమని చెప్పికొందురు. ద్రుపదునకు నెవర్తెయో యొక స్త్రీకి వారి మూలపురుషుఁడు సంభవించె ననియు, వారివంశము ధృష్టద్యుమ్న ప్రముఖులచేత తరిమి వేయఁబడినదనియు, వారువచ్చి బాహ్లీకదేశములో నివసించు చుంటిమనియు, చెప్పికొనుట యీ పదునేను వందల సంవత్సరములనుండియు జరుగుచునే యున్నది. ఇట్టి వంశమొకఁ డున్నదని అప్పుడప్పుడు పాంచాల రాజులకుఁ దెలియును. వారు వీరినిగుఱించి పట్టించికొనలేదు. ఈ వంశమువారును తమకు

రాజ్యము గావలయునన్న యాశ యెప్పుడును పడలేదు. ఊరికే వంశమర్యాదలు పూర్వుల గొప్పతనములు మొదలైన ప్రస్తావములు జరిగినప్పుడు నా కిట్లు చెప్పికొనుచుండుట యలవాటు. నిజమో కాదో కాని పాంచాల రాజధానిలో రాజకోటలో రాజ వంశములోఁగల కొన్ని యలవాట్లు నాచారములు వారి వంశములోఁగూడ కలవు. ఇన్నివందల యేండ్లు జరిగిన తరువాత నా వంశములో వంశధరుఁడన్న నొకఁ డుదయించెను. వాఁడు తానే పాంచాలరాజ్యమున కధిపతిననియు, ద్రుపదుని నిజమైన సంతానము తాముగాని ధృష్టద్యుమ్నాదులు కాదనియు, ధృష్టద్యుమ్నుఁడును ద్రౌపదియును ద్రుపదుని కడుపునఁ బుట్టిన వారు కారు. వా రగ్నిహోత్రమునందు జన్మించిరి. మా పూర్వుఁడే ద్రుపదుని భార్యయందు జన్మించినవాఁడు. అర్జునునితో విరోధించి ద్రుపదుఁ డగ్నియందు వేల్చెను. అప్పుడు ద్రౌపదియు ధృష్టద్యుమ్నుఁడును జన్మించిరి. ద్రోణునిమీఁద పగ తీర్చికొనుటకు ద్రుపదుఁడు ద్రౌపది నర్జునున కిచ్చెను. ధృష్టద్యుమ్నుఁడు ద్రోణుని సంహరించునని యతఁ డాశపడెను. అందుచేత ధృష్టద్యుమ్నునకు రాజ్యమిచ్చెను. నిజమైన సంతానము మేము, నడుమ నడుమఁ బడితిమి యని పెద్ద రాద్ధాంతముఁ జేయసాగెను. అతఁడొక యున్మాదియని జనులు చెప్పికొనసాగిరి. ఇట్లుండఁగా నీ వంశధరునకు నొక యండ దొరకెను. అతఁ డెవఁడో గొప్ప వీరుఁడు! వానినిఁ గలసికొని నిజముగా రాజ్యము మీఁదే. నేను పాంచాల రాజ్యము నీ కిప్పించెదనని వంశధరునకు మహారాజు వేషమును వేసి చిన్న చిన్న రాజులు, పెద్ద పెద్ద

రాజులవద్దకు నతనినిఁ దీసికొనిపోయెను. వారందఱును భాగ
తములోని కథ నెఱిఁగినవారే గావున నతఁడు చెప్పిన మాట
లను విశ్వసించిరి. ధృష్టద్యుమ్నుఁడును ద్రౌపదియును నగ్ని
యందు సంభవించినచో ద్రుపదునకు భార్య యుండవలయును
గదా! ఆమెయందు సంతాన మేల యుండి యుండరాదు.
తన భార్యను బిడ్డలను ద్రుపదుఁ డేల వదలిపెట్టియున్నచో
ద్రుపదుఁ డట్టివాఁడే. సహాధ్యాయియైన ద్రోణుని నీ మొగము
నే నెఱుఁగను పొమ్మనెను. అయన ధనమదాంధుఁడు. తాను
వారి ద్రోణునితోడి పగ యతనిని గ్రుడ్డివానినిఁ జేసెను. కన్న
కొడుకును నడలనడచి ధృష్టద్యుమ్నునిఁ జెఱబట్టెను, మొదలైన
విధముగా వాదన సాగెను. వంశధరుఁడు పదిమంది రాజుల
వద్దకు పోయి వచ్చుటతో నతనికొక పక్షము బయలుదేరెను.
కొందఱు కాదన్నను కొందఱౌనన్నవారుఁ గలరు. ఆ వంశము
వారు కొంత యాస్తి పాస్తులు కలవారు. వంశధరుఁడు తన
యీ ప్రయత్నములోఁ దనకున్న యాస్తియంతయు వ్యయపెట్టి
మహారాజ లక్షణములతో బ్రతుక నారంభించెను. అతని
కంఠమై నిలిచి పదిమంది రాజులవద్దకుఁ దీసికొని వెళ్ళినవాఁడు
వంశధరుని యీ రాజలక్షణములు సాగుటకు ధనమును
తీసికొని వచ్చి యిచ్చుచుండెను. అతఁడొక నెలనాళ్ళలో
బలిసి పుంజయ్యెను. విపాశా నదియొడ్డున నొక చిన్న కోట
కట్టెను. ఆ కోటలో నతఁడు నివసించుచుండెను. అతనివద్దఁ
గొన్ని రత్నములు చేరెను. అవి యెచ్చటినుండి వచ్చెనో
యెవ్వరికినిఁ దెలియదు. చిన్న చిన్న రాజుల నందఱును
దర్శించుటకుఁ బోయినప్పుడు వంశధరుఁ డొక్కొక్క రత్న

ములను కానుకగాఁ దీసికొన్న యీ చిన్న చిన్న రాజులు
వంశధరుని యేనుఁగులతో గుఱ్ఱములతో పూజింప నారంభించిరి.
వంశధరుఁడు ధనవంతుఁడని నాల్గుమూలలఁ దెలిసెను. పలు
మంది ప్రజ లతని పంచఁ జేరిరి. అదియొక చిన్న సేనగా
సిద్ధమయ్యెను. అతని రత్నపు కానుకలు వానివద్ద నొక
రెండువందల గుఱ్ఱములను పది యేన్గులనుఁ దెచ్చెను. అతఁడు
తన గుఱ్ఱపు దళమును వేయిఁ జేసెను. ఏన్గులను నలుఁ
బదింటినిఁ జేసెను. అయిదువేల సైన్యమునుఁ జేసెను. ఇది
యంతయు నైదారు నెలలలో జరిగిన పని. చూచెడివారికి
వింతగా నుండెను. కాని వంశధరుఁడు బాహ్లీక దేశమువాఁడు.
మఱియు శతద్రూనదికి సమీప భూములవాఁడు. ఇప్పు డితఁడు
కట్టిన కోట విపాశా నదియొడ్డున నున్నది. అచ్చటివారు
వంశధరుని నున్మాదిగా నెఱుఁగరు. క్రమక్రమముగా నతఁడు
పాంచాలాధిపతియైయున్న పోరుతోడనే విపాశా నదియొడ్డు
పొడుగునను చెప్పికొనఁబడుచు వచ్చెను ఒకనాఁడు వంశ
ధరుఁడు పాంచాల రాజునకు రాయబార మంపెను. ఈ
రాజ్యము మాది. మీది కాదు. మేము నిజమైన వారసు
లము. మీరు మా యాస్తిని పదునేనువందల సంవత్సరము
లనుభవించిరి. ఇప్పటికైనను రాజ్యాధికారము వదలికొని
మా రాజ్యము మాకిచ్చుట న్యాయము. దానికి మీ రొక
వేళ నంగీకరించక పోయినచో రాజ్యము చెఱిసగము చేసికొని
భుజింతము. అంతియేకాని యచ్చముగా మీరే యనుభ
వించుట న్యాయము కాదని యీ రాయబారి పాంచాల
రాజసభలో వక్కాణించఁగా పాంచాలరాజు నవ్వెను.

'పోరా పిచ్చివాఁడా' యనెను. వంశధరుని నెచ్చెలిగాని కొందఱు
సభలోనివారు పకపక నవ్వి "పిచ్చివాఁడు వీఁడు కాఁడు.
వాని రా"జని యెకసక్కెములాడిరి. రాయబారి వచ్చి వంశ
ధరునితోఁ జెప్పెను. వంశధరుఁడు తల వంచికొని యూరకుం
డెను. అతని యంతరంగుఁడైనవాఁడు ప్రక్క నుండెను. వంశ
ధరునకు రావలసిన కోప మప్పటికి వచ్చెను. అతఁ డిట్లనెను.
"ఓరీ! పూర్వము పాండవులు రాజ్యమునందు సగముభాగ
మిమ్మనఁగా దుర్యోధనుఁ డీయ ననెను. ఆ పాండవుల
పక్షమున వారి పూర్వులు యుద్ధము చేసిరి. ఆమాత్రమైన
జ్ఞాన ముండవలదా? నాఁడు సగభాగ మిమ్మన్న పాండవుల
యొక్క యర్ధభాగముకొఱకు తాము యుద్ధము చేసినవారు
కదా! నేఁడు వంశధర మహారాజునకు యర్ధరాజ్య మీయను
మని యే మొగములతో నన్నారు" అని యతఁ డనఁగా వంశ
ధరునకుఁ గూడఁ గోపము వచ్చెను. అతఁడు నవేమాట
లనెను. ఇప్పుడేమి చేయవలయుననఁగా నేమి చేయవలయు
నన్న ప్రశ్న పుట్టెను. మఱల రాయబారి నంపి మేము
యుద్ధమునకు వచ్చుచున్నామని వారితోఁ జెప్పి రావలయు
ననిరి. రాయబారిని పంపుట యెందులకు? వెంటనే బయలు
దేరి యుద్ధమునకుఁ బోవుట కర్తవ్యమని కొందఱనిరి. అండ
డైనవాఁడు ముందు రాయబార మంపుటయే మంచి దనెను.
రాయబార మంపినను వా రంగీకరించరు. అప్పుడెట్లు యుద్ధ
మునకు బయలుదేరి పోవలయునని యా సహాయుఁడు చెప్పి
యుద్ధమునకు బయలుదేరి వేళను నిర్ణయించి సేనాపతిని నిర్ణ
యించి, దండయాత్రా లక్షణమంతయును నిరూపించి, తాను

వానిని పాంచాల నగరమునందుఁ గలిసికొందుమని వెడలిపోయెను. రాయబారి పోయి పాంచాల రాజసభలో "మీరు రాజ్యమునం దర్ధభాగ మీయక పోయినచో మా రాజు దండెత్తి వచ్చుచున్నాఁడని" చెప్పెను. అప్పుడును వారు నవ్విరి. ఈ రాజెవఁడు? వానికి రాజ్యమునందలి భాగాప్తి యెట్టిది? వాఁ డెచ్చట నున్నాఁడు? వాని యునికియే యెవ్వరెఱుఁగరే? వాఁడు దండెత్తి వచ్చుటయేమి? అని జను లనుకొనుచుండఁగా వంశోద్ధరు నెఱిఁగిన కొంతమంది యట్టివాఁ డున్నాఁడని చెప్పిరి. ఎవరో యొకరిద్దఱు విపాశయొడ్డున కట్టిన కోట వర్తమానము తెలిసినవారు నిజమేనని యన్నారు. ఆ రాజు సంగతి తెలియదాయె. అట్టివాఁ డున్నాఁడనియే తెలియదాయె. వాని బల మెట్టిదో తెలియదాయె. ఎవఁడో రాజు తమ మీఁదికి దండెత్తి వచ్చుచున్నాఁడని తాము యుద్ధమునకుఁ బ్రయత్నము చేయుటయా? వలదా? ఆ రాజు రాజే కాఁడాయెను. వంశోద్ధరుఁడు దండెత్తి వచ్చెను. ద్రుపదుని పురము ముట్టడింపఁబడెను. ఆ పురమునందు యుద్ధ ప్రయత్నము లేమియు లేవు. దుర్గ మున్నది. అగడిత యున్నది. కోటకు బురుజు లున్నవి. కొంత సైన్య మున్నది. నలుబది గుఱ్ఱములతో, నాల్గువేల పదాతులతో వంశోద్ధరుఁ డెత్తి వచ్చెను. ఎంత యుద్ధప్రయత్నము లేకున్నను పాంచాలరాజులు వీరిని విదలించ లేకపోలేదు. పాంచాల సైన్యము శిక్ష పొందినది. సేనాపతులుకూడ శిక్షితులును, యుద్ధనీతి విశారదులును. కాని యేలాకో ఇది దండెత్తి వచ్చుట కాదని, ఇది యుద్ధము కాదని, వాఁడొక రాజు కాఁడని యొక తిరస్కార భావము

జనులయందు వ్యాపించియుండెను. ఒక యర్ధరాత్రమున తన యేన్గులతో గుఱ్ఱాలతో వంశధరుఁడు కోట పశ్చిమ ద్వారమును దాఁకెను. అప్పుడుఁ గొంత యుద్ధము జరిగెను. లోనుండి యెవరో తలుపులు తీసిరి. ఇతని సైన్యమంతయు లోనికిఁ బోయినది. మఱునాఁటికి ప్రసిద్ధమైన యుద్ధము లేదు. ఒక ప్రక్క గందరగోళము లేదు. వంశధరుని సైనికులు రాజుకోటను చుట్టి యుండిరి. మంత్రు లుండిరి. సేనాను లుండిరి. ఆ సైనికులు నీ సైనికులును కలిసి తిరుగుచుండిరి. ఇది యొక విచిత్రముగా నుండెను. సభా భవనమునందు ప్రసిద్ధమైన సింహాపీఠమీఁద పాంచాలరాజు కూర్చుండి యుండెను. అప్పుడు వంశధరుఁడు వచ్చెను. రాజను నేను, నీవు సింహాసనమునుండి దిగి నన్ను కూర్చుండనిత్తువా? లేనిచో నిన్ను వధించి నేను గూర్చుండుద ననెను. మంత్రులందఱు నవ్విరి. రాజు కత్తిఁబూని వాని మీఁదికిఁ బోయెను. వంశధరుఁడు యుద్ధ విద్యా విశారదుఁడు కాఁడు. పాంచాలరాజు తన మీఁదికి వచ్చుచుండఁగా నతఁడొక మాట యనెను. "నేను రాజును. నేను యుద్ధము చేయను. నా సేనాపతి నీతో యుద్ధము చేయును. నా సేనాపతి యోడినచో నేను నీ రాజ్యముమీఁద నాకుఁగల యస్వాతను పరిత్యజించి వెడలిపోయెదను." అనఁగా వంశధరుని వెనుకనుండి యొక మహావీరుఁడు సాయుధుఁడు ప్రచ్ఛన్న వేషధారి ముందునకు వచ్చెను. వెంటనే సభలో సరేనన్నచో సరే నన్నారు. ఇది తులాయుద్ధ మన్నారు. ఎవఁడు గెలిచినచో రాజ్యము వాని దన్నారు. ఇట్లనెడివారు చాలమంది యున్నను కొందఱు వృద్ధ మంత్రులు దీని నంగీకరించలేదు. వారి మాట

లను విన్నవారు లేరు. తులాయుద్ధము జరిగెను. పాంచాల రాజు యుద్ధమునందు వధింపఁబడెను. అతని రాజవంశము రాజ బంధువులు భార్యలు పుత్రులు నెవరిచేతనో ప్రోత్సాహ పెట్టఁబడి కోటనుండి పారిపోయిరి. వంశధరునకు రాజ్యము వచ్చెను. వంశధరుఁడు రాజయ్యెను గాని వంశధరునియందు మంత్రులకు సేనాపతులకు గౌరవ మున్నట్లు కనిపించు లేదు. ఈ వంశధరునకు భార్యయు పిల్లలును కలరా? వారు నీల గిరియం దున్నారు. అంతయు నొక విచిత్రముగా నున్నది. రాజ్యము రాజ్యముగానే యున్నది. రాజు పోయి క్రొత్తరాజు వచ్చెను. పాంచాల రాజుతోఁ దులాయుద్ధము చేసినవాఁ డెవఁడో యెవ్వరికినిఁ దెలియదు. కొందఱకుఁ దెలిసియే చెప్పుట లేదనిపించెను. గిరివ్రజపురమున నొక విప్లవము జరుగును. అప్పుడుగాని యీ సమస్య తేలదని కొంద ఱనిరి.



ఆ కాలమున బలవంతములైన రాజ్యములు రెండు. ఒకటి మగధరాజ్యము. రెండు కోసలరాజ్యము. దక్షిణ కోస లము నుత్తర కోసలమని రామాయణ కాలమునుండియు నున్న రాజ్యములే. కోసలాధిపతియైన దశరథరాజు కూఁతురు. అనఁగా నుత్తర కోసలేశ్వరుని దుహిత. ఉత్తర కోసలరాజ వంశము వేఱు. దక్షిణ కోసలరాజ వంశము వేఱు. వారికి వీరికి యుగములుగా సంబంధ బాంధవ్యములు కలవు. మగధ

జనులయందు వ్యాపించియుండెను. ఒక యర్ధరాత్రమున తన యేనుగులతో గుఱ్ఱాలతో వంశధరుఁడు కోట పెద్దగవనును దాఁకెను. అచ్చటఁ గొంత యుద్ధము జరిగెను. లోనుండి యెవరో తలుపులు తీసిరి. ఇతని సైన్యమంతయు లోనికిఁ బోయినది. మఱునాఁటి ప్రొద్దున యుద్ధము లేదు. ఒక పెద్ద గందరగోళము లేదు. వంశధరుని సైనికులు రాచకోలువును చుట్టి యుండిరి. మంత్రు లుండిరి. సేనాపతు లుండిరి. ఆ సైని కులు నీ సైనికులును కలిసి తిరుగుచుండిరి. ఇది యొక విడ్డూ రముగా నుండెను. సభా భవనమునందు ప్రధానమైన సింహ పీఠిమీఁద పాంచాలరాజు కూర్చుండి యుండెను. అప్పుడు వంశధరుఁడు వచ్చెను. రాజను నేను, నీవు సింహాసనమునుండి దిగి నన్ను కూర్చుండనిత్తువా? లేనిచో నిన్ను వధించి నేను గూర్చుందు ననెను. మంత్రులందఱు నవ్విరి. రాజు కత్తిఁబూని వాని మీఁదికిఁ బోయెను. వంశధరుఁడు యుద్ధ విద్యా విశా రదుఁడు కాఁడు. పాంచాల రాజు తన మీఁదికి వచ్చుచుండఁగా నతఁడొక మాట యనెను. "నేను రాజును. నేను యుద్ధము చేయను. నా సేనాపతి నీతో యుద్ధము చేయును. నా సేనా పతి యోడినచో నేను నీ రాజ్యముమీఁద నాకుఁగల యర్హ తను పరిత్యజించి వెడలిపోయెదను." అనఁగా వంశధరుని వెనుక నుండి యొక మహావీరుఁడు సాయుధుఁడు ప్రచ్ఛన్న వేషధారి ముందునకు వచ్చెను. వెంటనే సభలో సరేనన్నచో సరే నన్నారు. ఇది తులాయుద్ధ మన్నారు. ఎవఁడు గెలిచినచో రాజ్యము వాని దన్నారు. ఇట్లనెడివారు చాలమంది యున్నను కొందఱు వృద్ధ మంత్రులు దీని నంగీకరించలేదు. వారి మాట

లను విన్నవారు లేరు. తులాయుద్ధము జరిగెను. పాంచాల రాజు యుద్ధమునందు వధింపఁబడెను. అతని రాజంశము రాజ బంధువులు భార్యలు పుత్రులు నెవరిచేతనో ప్రోత్సాహ పెట్టఁబడి కోటనుండి పాటిపోయిరి. వంశధరునకు రాజ్యము వచ్చెను. వంశధరుఁడు రాజయ్యెను గాని వంశధరునియందు మంత్రులకు సేనాపతులకు గౌరవ మున్నట్లే కనిపించ లేదు. ఈ వంశధరునకు భార్యయు పిల్లలును కలరా ? వారు నీల గిరియం దున్నారు. అంతయు నొక విచిత్రముగా నున్నది. రాజ్యము రాజ్యముగానే యున్నది. రాజు పోయి క్రొత్తరాజు వచ్చెను. పాంచాల రాజుతోఁ దులాయుద్ధము చేసినవాఁ డెవఁడో యెవ్వరికినిఁ దెలియదు. కొందఱకుఁ దెలిసియే చెప్పుట లేదనిపించెను. గిరివ్రజపురమున నొక విప్లవము జరుగును. అప్పుడుగాని యీ సమస్య తేలదని కొంద ఱనిరి.



ఆ కాలమున బలవంతములైన రాజ్యములు రెండు. ఒకటి మగధరాజ్యము. రెండు కోసలరాజ్యము దక్షిణ కోస లము నుత్తర కోసలమని రామాయణ కాలమునుండియు నున్న రాజ్యములే. కోసలాధిపతియైన దశరథరాజు కూతురు. అనఁగా నుత్తర కోసలేశ్వరుని దుహిత. ఉత్తర కోసలరాజ వంశము వేఱు. దక్షిణ కోసలరాజ వంశము వేఱు. వారికి వీరికి యుగములుగా సంబంధ బాంధవ్యములు కలవు. మగధ

కోసలములు నొకదానితో నొకటి స్పర్ధవహించి యొకరిమీఁద నొకరు దండెత్తుట యెప్పుడును జరుగలేదు. దానికి కారణ మొక టున్నది. ఆ కారణ మీ రెండురాజ్యముల నడుమనున్న విదేహరాజ్యము. విదేహ రాజ్యమునకు రాజధాని మిథిల. విదేహ రాజ్యమునకు నుత్తరమున కిరాత బర్బర శకరాజ్యము లున్నవి. ఈ మూఁడు రాజ్యములు మ్లేచ్ఛరాజ్యములు. వానికిఁ బశ్చిమముగా మల్లదేశమని కలదు. మల్లదేశమునకుఁ గ్రింద మిథిలకు పడమట భల్లట దేశము కలదు. ఈ మూఁడు రాజ్యములు మగధ కోసలరాజ్యములకు మధ్య కలవు. మల్ల రాజ్యమనఁగా నచ్చట మల్లు రధికముగా నుందురు. వారు యుద్ధ నిపుణులు. అచ్చటినుండియే పలుమంది రాజులు తమ సైన్యములలోనికి సైనికులను సమకూర్చి కొందురు. వారు దృఢకాయులు. మోటుమానిసులు. చూచుచు చూచుచు కొండమీఁదినుంచి దూకుదురు. నీటిలో మునిఁగి యోజనము మేర పైకిఁ దేలకుండ నదులలో నీదుదురు. ఇట్టి లక్షణములు వారియందు కలవు. మల్లదేశయోధు లధికముగాఁ గలిగిన సైన్యము యుద్ధమునందు జయించుటలో నాశ్చర్యములేదు. మల్లదేశము లే మగధరాజ్య సైన్యములో సగానికి సగ మున్నారు. అదియే మగధరాజ్యబలము. ఈ మల్లదేశము లేనిచోఁ బ్రక్కనున్న కిరాతబర్బర శకరాష్ట్రముల యందలి మ్లేచ్ఛుల యొత్తిడి యెవ్వరికైన నుండెడిది. ఆమ్లేచ్ఛులభయ ము మల్లదేశమువలన రాజ్యములకు లేకుండెను. కిరాత బర్బరశకులు మోటువారైనచో మల్లదేశీయులు వారికి నాల్గురెట్లు మోటువారు. మల్లదేశము మగధములకంటె కోస

లములకు దగ్గఱిది. మల్లదేశమునకు రాజున్నాఁడు. ఆ రాజు
నకు చక్రవర్తి యగుదమనిగాని తన రాజ్యము విస్తరింపఁ
జేయుదమనిగాని కోరికయే లేదు. అది యేదో యితర
రాజ్యములకు సైనికులను సమకూర్చిపెట్టెడి యొక దేశముగా
నుండిపోయెను. కొన్ని వందల యేండ్లనుండి నేఁటి భారత
దేశమున నేపాళదేశ మెట్లున్నదో నాఁడు మల్లదేశ మట్లుం
డెడిది. అక్కడ రాజున్నాఁడు. పాలించుచున్నాఁడు. వారి
పంటలు వారే పండించుకొందురు. ఆ రాజ్యముమీఁది
కెవ్వరు యుద్ధమునకుఁ బోరు. ఏ రాజ్యము యుద్ధము చేయు
టకు యోగ్యులైన సైనికులను సమకూర్చుచున్నదో యా
రాజ్యముమీఁదికి యుద్ధమున కెవ్వఁడు పోవును? ఆ రాజ్య
మట్లే యుండెను. మఱియు నా రాజ్యముయొక్క యునికిచేత
శక బర్బర కిరాత రాజ్యములు నియమింపఁబడియున్నవి. అందు
చేత మల్లదేశమువంకకే యెవ్వఁడు చూడఁడు. ఒక మహాదేశ
ములో నొక మహాభూఖండములోఁ బెక్కు రాజ్యములున్నచో
వారిలోఁ గొందఱు ప్రబలులై యున్నచో వారు తమ భూ
ఖండ భద్రతను తమ దేశ భద్రతను సంరక్షించుకొనుటకు
నిట్టి కొన్ని చిన్నరాజ్యములను రాజ్యములుగా నుంతురు.
వానిమీఁదికి బలవంతులైన రాజులు యుద్ధములకుఁబోరు. అవి
యుండుట దేశ భద్రత. ఈ బలవంతమైన రాజ్యముల యుని
కికి నది భద్రతాస్థానము. ఈ శక బర్బర కిరాత మల్లదేశము
లట్టివి. వానిని కదలించెడివాఁడు లేఁడు. ఏదో మహావిప్లవము
వచ్చినపుడుగాని వాని స్థితికి భంగములేదు. అట్టి దేశములు
ప్రాగ్దిశనున్న మగధములకుఁ బశ్చిమముననున్న కోసలములకు

త్రాసునకు ముల్లువంటివి. ఈ రాజ్యములక్రింద విదేహ రాజ్యము కలదు. ఈ విదేహరాజ్యము యుగయుగములుగా నొక మర్యాదను సంపాదించికొన్నది. ఆ మర్యాద నిమినాఁటి నుండి వచ్చెను. యాజ్ఞవల్క్యునిచేత నా మర్యాద వేయి రెట్లు వృద్ధిపొందింపఁబడెను. శ్రీరామచంద్రుని భార్యయైన సీతామహాదేవిచేత విశ్వేశ్వరస్వామిచేత కాశీనగరమువలె మిథిలానగరము పవిత్ర మయ్యెను. స్థిరప్రతిష్ఠ కలదియయ్యెను. ఒకజాతియొక్క గౌరవము విచిత్రముగా నుండును. మధురలో శ్రీకృష్ణుఁడు జన్మించెను. వారణాసీ క్షేత్రమున విశ్వేశ్వర స్వామి యావిర్భవించెను. మిథిలలో జానకీదేవి యవతరించెను. కపిలవస్తు నగరమున బుద్ధుఁ డుదయించెను. వందలు వేలు సంవత్సరములు గతించెను. గతించుచున్నవి. ఆస్థలములకున్న పవిత్రత యా స్థలములదే. వానికున్న మర్యాద వానిదే. ఈ మహానగరములుకల దేశములమీఁదికి నెవ్వరు దండెత్తిపోరు. భిన్నమతస్థులు దండెత్తి వచ్చినను వాని పావిత్ర్యమును కలుషితము చేయరు. ఒకవేళ నెవఁడో తుచ్ఛుఁడు వాని పావిత్ర్యమును కొంత భంగింపఁజేసినను మఱల నీదేశముయొక్క దైవభావము వానిని సముద్ధరించు చుండును. అట్లే మూఁడు యుగములు విదేహరాజ్యము విదేహ రాజ్యముగానే యుండును. ఇతర రాజ్యము లొకదానితో నొకటి పోరాడుకొన్నవి. వారిని వీ రాక్రమించిరి. వీరిని వా రాక్రమించిరి. ఎవ్వఁడును విదేహ రాజ్యముమీఁదికి దండయాత్రపోయినట్లు లేదు. ఆరాజులు శాంతులు క్షమావంతులు. ప్రజాక్షేమము కొఱకే వారు బ్రదుకుదురు. వారి దైనందినచర్య యారణ్యక

ములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, పురాణములు, శాస్త్రములు చదివికొనుటతో, చర్చించికొనుటతో, నితరులకు బోధించుటతో, సాగుచుండును. అట్టిది మిథిలారాజ్యము. నాఁటి మిథిలాపతి యుశీనరుఁడు. ఆయన వృద్ధుఁడు. వేద వేదాంగములు చదివినవాఁడు. పూర్వయుగముల యందలి మిథిలాపతులు బ్రహ్మజ్ఞానులని ప్రతీతి. ఉశీనరుఁడు కాక పోలేదు. ఔనో కాదో తెలియదుకాని యాయననుఁ జూచినచోఁ బరమశాంతుఁడనియే యనిపించును. ఆయనకు సంతానము లేదు. ఆయన మహావేత్త. ఆయనను కాంక్షఁ జెందును. పలుమంది యుశీనరునివద్దకుఁ బోయి పూర్వ భాగవత చరిత్రయు, భవిష్యద్భారత చరిత్రయుఁ దెలిసికొని వచ్చుచుందురు. బౌద్ధమతము కపిలవస్తు నగరమున సముద్భవించి నాల్గుపక్కల కెగఁబ్రాకినది. కోసలదేశము నాక్రమించినది. మగధదేశ పాంచాలములలోఁ బ్రయాణముచేసినది. విదేహ దేశమును తాఁకలేకపోయెను. ఉశీనరుని యౌదార్యము, సౌభాగ్యము, వేదవేదాంగ వేత్తృత్వము, బౌద్ధమతమును దూరముగా నుంచెను. పలుమంది బౌద్ధసన్న్యాసులు రాజును బౌద్ధమతానుయాయిగాఁ జేయవలయునని విదేహములకుఁ బోవుటయు మిథిలలో రాజుతో వాదించుటయుఁ జేయలేక తిరిగివచ్చుటయు నిట్లు జరుగుచుండెను. సర్వ బౌద్ధమత సిద్ధాంతముల నుశీనరుఁడు విమర్శించుచుండెను. ఆయన యంతట యాయన వాని విమర్శకుఁబోఁడు. అర్హతులు వెళ్ళి యాయనను కదలించనచో నాయన చెప్పెడి వాదములకు వీరు సమాధానములు చెప్పలేక తిరిగివత్తురు. బౌద్ధమతముయొక్క ప్రథమ

సిద్ధాంతము కార్యకారణ చక్రము. అజ్ఞానము క్రియఁగాఁబర్య వసించును. అది విజ్ఞాన మగును. నామరూపములు వహించును. షడింద్రియములు, స్పర్శ, అనుభూతి, ఆశ, గ్రహణము, పరిణామము, జన్మము, దుఃఖము నిట్లు మాఱుచుండును. దుఃఖమునుఁ జంపినచో నజ్ఞానము నశించునని వారి ప్రథమ సిద్ధాంతము. దీనిని బౌద్ధులైన యర్హాతులు చెప్పఁగా నుశీనరుఁడు చిఱునవ్వు నవ్వెను. ఆరాజు కొంత చమత్కారి. ఆయన యొకసారి యిట్లనెను. "ఓయీ! మన మొకకూరఁ జేసికొందుము. ఆకూర కొకకాయ కావలయును. ఆకాయను కాయగా తినలేము. కాన ముక్కలు ముక్కలు చేయుదుము. అప్పుడు ముక్కలు పుట్టినవి. ఆ ముక్కలను కడుగవలయును గాన ప్రక్షాళనకర్మ పుట్టినది. పచ్చివానికంటె నుడికినవి దంతములకు సుఖముగా నుండును గాన దానియం దుష్ణకర్మ యుదయించినది. అన్నికాయలు విస్పష్టమైన షడ్రసముల లోనికిఁ జేరవు గావున వానియందొక రసాధానముఁ జేయుటకు లవణము మిశ్రితమగుట జరిగినది. అట్లే తిరుగమూఁత పుట్టినది. ఆ కాయతోఁ గూర వండవలయునని యెందుకు సంకల్పించితివి? ఆకర్మ యెందుకుఁ బుట్టెను? రుచియన్నది మొట్ట మొదట జిహ్వామీఁద నున్నది గనుకఁ బుట్టినది. జిహ్వయందలి రుచినుండి శాకము, కర్తనము, క్షాళనము, పచనము, లవణాది వస్తు మిశ్రణము పుట్టినవి. లవణాది మిశ్రణమును తొలఁగించినచో రుచి నశించును." అని యాయన చెప్పి నవ్వఁగా నాయనతో వాదించుటకుఁబోయిన యర్హాతుఁడు వెలవెలఁ బోయెను. అది వాదనగాఁ గనిపించలేదు.

వాదనను వ్యర్థముచేయుటకు హాస్యముకంటె నధికమైన యాయుధములేదు. అంతటి వాదనా పద్ధతియు హాస్యమును జోడించి వికృతవాదన ప్రారంభించినచో నది వ్యర్థమైపోవును. పరిహాస భాజనమగును. అది న్యాయమైన వాదనకాదు. కాని ప్రతిస్పర్థి యొక దుష్టసిద్ధాంతమునుఁ బ్రతిపాదించినపుడు ప్రాతవస్తువే క్రొత్త వస్తువుగా దీపింపఁజేయఁ బోయినపుడు పండితుఁడైన వాఁడేమిచేయును? దిగ్భ్రాంతి పొందును. అజ్ఞానము, కర్మ, దుఃఖము మొదలైనవి వేదములం దున్నవి. ఉపనిషత్తుల యందున్నవి. శాస్త్రముల యందున్నవి. పురాణముల యందున్నవి. అవి యేవో క్రొత్తవిషయములుగా నజ్ఞాతులువచ్చి యుశీనరునివద్ద చెప్పినప్పు డుశీనరుఁ డేమిచేయును! సర్వవిద్యల కొక స్థితియున్నది. ఆ విద్య లొకచోట పుట్టును. అన్నివిద్యలు నందఱకు నర్థముకావు. కొందఱు వానిని నేర్తురు. నేర్చినవారందఱు నిష్ణాతులుకారు. కొందఱే నిష్ణాతు లగుదురు. వారివలన నా విద్యలు నిలుచుండును. సామాన్య జనుల కావిద్యలలోని సూక్ష్మములు తెలియవు. తెలియక పోయినను దద్విద్యా రహస్యములు జాతిమీఁద నాచరణలోనికి పెట్టఁబడినపుడు దాని సత్ఫలితము లందఱు ననుభవించు చుందురు. తద్గత సిద్ధాంతములలోని రహస్యములు వాని చర్యలు వానిలోని నిగూఢ తర్కములు సామాన్యుల కక్కఱలేదు. ఒక నది కానకట్ట కట్టఁబడెను. నదీజలము లచ్చట నిలచెను. పెద్దవంతెన కట్టఁబడెను. తూములు కట్టఁబడెను. కాలువలు త్రవ్వఁబడెను. వానినుండి పంటకాలువలు వచ్చెను. వానిలోనుండి పెద్దబోదెలు, చిన్నబోదెలు, చిన్న

బోదియనుండి నీరు, చేనిలోనికి జానపదుఁడైన యమాయకుఁ
డైన రైతు మళ్ళించుకొనును. వాని పొలము పండును. వానికిఁ
బొలము పండుట ముఖ్యమా ? ఆనకట్టయొక్క నిర్మాణము,
కట్టిన తూములు మొదలైన యాయా సమస్త శాస్త్రాభిజ్ఞతయుఁ
ప్రధానమా ? ఈ శాస్త్రాభిజ్ఞత పరిధానమైనచో వాఁడు
పండించనే లేఁడు. ఇట్లు శాస్త్ర రహస్యములు విద్వన్నిష్ఠములై
యుండి తత్ఫలితములు సర్వ ప్రజోపయోగార్థము నగుట
సృష్టియొక్క స్థితి. దీనిని విప్లవకారుఁడు తారుమారు
చేయును. జానపదుఁడై యమాయకుఁడైన మానిసి కితవుల
చేత వంచింపబడి, యోగ్యమైన శాంతమైన జీవితమునుండి
నిగ్రహింపఁబడి, తనకుఁ దాఁ జేటు తెచ్చికొనుటయేగాక,
యేది సువ్యవస్థితమైన విషయమో, దానియందు తనకుఁ
దెలియకుండ ప్రళయమును సంపాదించుచున్నాఁడు. అజ్ఞా
నము, ఇంద్రియములు, విషయములు, వాని యాకర్షణ,
దుఃఖము, మొదలైనవి విచారణ శీలునకు యోగ్యమైన
భావనా స్థానములు. లోకమునందలి సర్వవిషయములు
దశలు దశలుగా నుండును. కృత్రిముఁడు వాదించునప్పుడు
భిన్నదశాగతములైన విషయములను కలిపి వాదించును. ఒక
దానినుండి మఱొకదానికి లంఘించును. సామాన్యులకు వాని
వాదన సోపపత్తికముగా నున్నట్లే కనిపించును. ఒకఁడు
పూర్వ విషయములనే మఱొకరీతిగాఁ జెప్పి, దాను క్రొత్త
సిద్ధాంతమును నిర్మించితి ననును. మూర్ఖులు నిజమనుకొందురు
వానివెంటఁ బడుదురు. ఇట్లనంతకాలమున భిన్న భిన్న కాల
ములయందు భిన్న భిన్న దేశములయందు చిత్ర చిత్రము

లైన సిద్ధాంతములు పుట్టుటయు నా సిద్ధాంతము లెవని చేతనో ప్రవచింపఁ బడుటయు, వాని కనుయాయులు బయలు దేఱుటయు, నిట్లు జరుగుట గలదు. ఇట్లుండఁగా నొక్క కాలము, నొక ప్రదేశము, నొక జీవుఁడు, నధిక మహత్త్వ గర్భమునం దిమిడించికొని యుండునది సంభవించు చుండును. గ్రహణ కాల మున్నది. ఆకాలమునం దధికశక్తియున్నది. పర్వదినము లున్నవి. వానియం దధికశక్తి కలదు. అధికశక్తి యనఁగా భౌమము కాని యొక లక్షణము వానియందు భాసించుచుండును. గ్రహణమున సూర్యచంద్రులు రాహుగ్రస్తులగుట యని పురాణములు చెప్పును. భూచ్ఛాయ వానియందు పడునని శాస్త్రములు చెప్పును. ఎట్లైనను తత్కాలమునందుఁ గొంత మహిమ కలదు. మహిమ యనఁగా సామాన్యార్థము కాదు. 'మహత్త్వ' అన్న శబ్దములోని యర్థము - ఆధిక్యమని లౌకికేతర మైనదని యర్థము. అట్లే యొక ప్రదేశమునందుఁ గొంత మహిమ యుండును. అట్లే కొందఱు జీవులందు కొంత మహిమ సన్నిహితమై యుండును. ఒకఁడు పెద్ద వక్తయై వాని మాట పలుమంది వినుదు రనఁగా నా జీవునియందొక మహిమ యున్నదని యర్థము. ఈ సర్వమహిమలు విలక్షణముగా నుండును. ఒక పురుషునియందలి మహిమ లౌకికాతిశాయి యైన కొన్ని ప్రదర్శనలు సేయుటకు వీలుగానుండును. బుద్ధుని జీవితము లోననే రెం డుదాహరణలు చూపించ వచ్చును. ఉరువేలా గ్రామమునందు కాశ్యపుఁడన్న బ్రాహ్మణుఁడు జటాధారియై యజ్ఞము చేయుచుండెను. అప్పటికి బుద్ధుఁడు పోయెను. యజ్ఞమునందు సామాన్యమైన యగ్ని నుపయో

గింపరాదు. అశ్వత్థ దారుఖండములు రాపిడిపెట్టి సముద్భ
విల్లిన యగ్నితోడనే యజ్ఞకార్యము నిర్వర్తింపఁ బడవల
యును. దారువు లెంత యొరిపిడి పెట్టినను వహ్ని సముద్భ
వించలేదు. బుద్ధుఁడు తనయనుజ్ఞ లేకుండ నగ్ని ప్రజ్వరిల్ల
దని చెప్పెను. బుద్ధుఁ డనుజ్ఞ యిచ్చిన తరువాత నగ్ని ప్రజ్వ
లించెను. ఆ కాశ్యపుఁడు తద్యజ్ఞమునందలి ఋత్విక్కులు
మొదలైన వారందఱు బుద్ధునకు శిష్యులైరి. ఈస్థితిని విచా
రించినచో నా బ్రాహ్మణులు బుద్ధునికి శిష్యులేల కావలయును?
అతఁ డగ్నిని ప్రజ్వరిల్లఁ జేయనీయలేదు. అది ప్రత్యక్షమైన
విషయము. యజ్ఞము జరిగినచో నేఫలితము పుట్టునో యది
యప్రత్యక్షమైన విషయము. కాశ్యపాదులు ప్రత్యక్షమైన
విషయమునం దధికాభిమానము కలవారు. ఆ బుద్ధునియొక్క
జీవలక్షణమునం దొక మహిమ యున్నది. దానినిఁజూచి కాశ్య
పాదులు నివ్వెఱపోయిరి. బుద్ధుఁ డంతటి సర్వజ్ఞుఁ డైనచో
సర్వేశ్వరుఁ డైనచో మఱియొకపని యేల చేయలేదు?
బుద్ధుఁడింక రెండేండ్లకు నిర్వాణము పొందు ననఁగాఁ
గపిలవస్తు నగరమున నొక మహా విప్లవము సంభవించెను.
కోసలరాజ్యాధిపతియైన ప్రసేనజిత్తు కుమారుఁడు విధుధవుఁడు
శాక్యరాజులకు మనుమఁడు. ప్రసేనజిత్తుభార్య శాక్యరాజుల
యాఁడుబిడ్డ. ఇతఁడు తాతగారిని మేనమామలను చూచి
వత్తమని కపిలవస్తు నగరమునకుఁ బోయెను. అప్పటికే
కపిలవస్తు రాజవంశమునకు తల దిరిగిపోయెను. బుద్ధునివంటి
వాఁడు మనవంశములో నుదయించెను. మనకంటె గొప్ప
వాండ్రెవరు? సర్వక్షత్రియ వంశములకు మనవంశము మకు

టాయమానమైనది. ఏతాదృశ భావములచేత కపిలవస్తు రాజ
వంశము గర్వముచేత నిండి యొడలు తెలియక యుండెను.
పూర్వము ద్వారకా నగరమునందలి యాదవులు కూడ నిట్లే
యైరిగదా ? భగవంతుడు మా వంశమువాడు. మా యింట
నుదయించెను. మాకన్న గొప్పవా రెవరు ? ఋషులందఱు
భగవంతునికి బంటులు. ఋషులు మాముందు లెక్కయేమి ?
అని కదా దుర్వాసుడు వచ్చినప్పు డొక్క యదుకుమా
రునికి గర్భిణీవేషము వేసి వీని కేమిబిడ్డ పుట్టు నని యడిగిరి. ఆబిడ్డే
సర్వ యదువంశ సంహారకమైన బిడ్డ. అట్లే కపిలవస్తు రాజ
కుటుంబము పొగరు మీఱియుండెను. కన్ను మిన్నుగానక
యుండెను. బుద్ధుడంతటి శాంతియు, క్షమయు, సహింపయు,
నింద్రియ నిగ్రహమును బోధించెనుగదా ! తన కులమునం
దున్న యా రాజకుమారులకే యీ గుణములు పట్టుపడలే
దేమి ? సరే. ఆ విధుధవుడు తమకంటె దక్కువ వా
డనియు, వాని రాజవంశము తమ వంశముకంటె దక్కువ
దనియు, వాని మేనమామలు వాని బావమఱదులు వాని నెక
సక్కెములాడిరి. హేళనచేసిరి. పరాభవించిరి. అతడు
కోపముతో తిరిగిపోయెను. ఆనాటికి ప్రసేనజిత్తు బ్రతికియుం
డెను. బుద్ధుడు విధుధవుని బతిమాలెను, శాంతపఱచుటకు
బ్రయత్నించెను. అప్పటి కతడు ఊరకుండెను. కాని యతని
మనసులోని మంట చల్లారలేదు. తండ్రి చనిపోయినంతనే
యతడు కపిలవస్తు నగరము మీదికి దాడివెడలెను. ఉత్తర
కోసల రాజ్యము చిన్నది. దక్షిణకోసల రాజ్యము పెద్దది.
అతని దండయాత్ర ముందు కపిలవస్తువు నిలువలేదు. అతడు

తాతయనక, మామయనక, బావమఱదియనక, మేనల్లుఁడనక, కపిలవస్తు నగరమునందలి రాజవంశీయుండన్న ప్రతివానిని కత్తివాదరకెఱఁ జేసెను. ఈ వార్త తరువాత బుద్ధునకుఁ దెలిసెను. బుద్ధుఁడు తాను శాంత్యుపన్యాసములు సేయుచుండెను. ఈ వార్త యతని మనస్సులోనికి శాంతి తీసికొని రాలేదు. ఈ రెండు కథలకేమి సంబంధము? బుద్ధుఁ డగ్నిహోత్రుని మీఁద నధికారియైనచో మృత్యువు మీఁద కాలేఁడా? తన బంధువులయొక్క వధ నాపికొనలేఁడా? తానంతటి శాంతచిత్తుఁడైనచో బంధుమరణమున కేంపుకు విలపించెను? ఆ విధుఢవు నెందుకు శిక్షించలేదు? అసలు తాను నిజముగా సన్యాసియైనచో తన బంధువులందఱు విధుఢవునిఁ బరిహాసించినప్పుడు వానికిఁ గోపమురాఁగాఁ దాను బతిమాలుట యెందులకు? అతనినిఁ బ్రశమిత చిత్తునిఁ జేయుటకుఁ బ్రయత్న మెందులకు?

ఈదృశములైన వాదనలతో నుశీనరుఁడు బౌద్ధసన్యాసులనుఁ గాదనుచుండెను. వారును వెదలిపోవుచుండిరి. ఈ వాదనలొక్క యుశీనరుఁడే చేయలేదు. దేశమునందు పలుమంది చేయుచుండిరి. సామాన్యులే కాదు. బౌద్ధసన్యాసుల లోననే యీ వాదములు చేసెడివారు కలరు. వారిలోఁ బ్రసిద్ధులు కూడ నున్నారు. అందుచేత విదేహరాజ్యమునందు బౌద్ధమతము వ్యాపించలేదు. ఉశీనరుఁడు బ్రతికియున్నన్నినాళ్ళు వ్యాపించదు. అంతే యందులోని రహస్యము. ఇంక నాలోచించికొనవచ్చును. ఒక సిద్ధాంతము ప్రబలినదనఁగా, నొకమతము ప్రబలినదనఁగా, వానినిఁ బ్రవచించి ప్రచారము

చేసెడి వారిసంఖ్య యధికమగుటయేకాక వారు కొంత విద్వాం సులగుటయు, మూఢులైన సామాన్యజనులమీఁద నధికారము చేయఁగలిగిన జీవశక్తితో పుట్టుట జరుగుటయుఁ గారణములు. ఈ లెక్కగా నేసిద్ధాంతము నేమతమును నిత్యములు కావు, స్థిరములు కావు, యథార్థములు కావు, కాకపోవలయును. నిజానికట్లే యున్నదిగదా! అప్పుడక్కడ వాఁడాసిద్ధాంత మును జేసెను. అది కొన్నాళ్ళు బ్రతికెను. తరువాతఁ జచ్చెను. ఒకచోట బ్రదికియుండెను. మఱియొకచోటఁ బూడ్చిపెట్టఁబడెను. ఈ యనియతమైన పరిస్థితిలో నోయి యర్హాతుఁడా! మా విదేహ దేశముతో నీకేమిపని? నేను చనిపోయిన తరువాత రమ్మని యుశీనరుఁ డనుచుండెను. ఒకప్పు డుశీనరుఁ డింకొక్కమాట యనెను. నేను చనిపోయిన తరువాత నీవే వత్తువన్న నమ్మకమేమి? నీకుమారుఁడు మఱి యొకఁడు వచ్చునేమో! సర్వవాదములు మృత్యువునందుఁ బర్యవసించును. నేను చనిపోయిన తరువాత నేమగునోయన్న వారితో వాదనలేదు. అందుచేత నుశీనరునితో వాదము లేక పోయెను. అర్హాతులు విదేహరాజ్యము మీఁద నాశవదలు కొనిరి. కాని యుశీనరుని తరువాత నొకవేళ నాశపెట్టు కొన్నచో పెట్టుకొవచ్చు ననుకొనిరి. ఆశ రెండు విధములు. లౌకికమైన యాశ, మానిసి బ్రతికియున్నన్నినాళ్ళందును. లౌకికమైన యాశయనఁగా రాజ్య స్త్రీధనాధికార సుఖ సంబంధమైన యాశ, రెండవయాశ, తాను విశ్వసించుచున్న విషయమే నిజమైనది. అదే సర్వకాలములయం దుండవలసి నది. దానినే తన శిష్యులును తన కుటుంబమును సర్వకాల

ములందు నిలబెట్టవలయునన్న దూశ. ఈ యాశ పాశ్చాత్య దేశముల "రాజు చిరకాలము వర్ధిల్లుగాక" అన్న వాక్యము లోని యర్థమువంటి యర్థమును గూర్చిన యాశ. అట్టి యాశతో సిద్ధాంత ప్రతిపాదకులు మత ప్రవర్తకులు, వారి యనుయాయులును ప్రవర్తింతురు. ఎట్లైనను విదేహరాజ్య ముశీనరుని తరువాత నేమి కావలయునన్నది ప్రశ్న. ఇట్లుండఁగా నానాఁడు భారతదేశమున నొకా నొక పురుషునకు నుశీనరుని తరువాత విదేహదేశము లేమగునన్న ప్రశ్న కాక యుశీనరుఁ డదెదోయగుట యెప్పుడన్న ప్రశ్న పుట్టినది. అతనికి కోసలమాగధముల నడుమ విదేహదేశమని యొకఁడుండుట యిష్టములేదు. మల్లదేశ ముండుట యిష్టములేదు. శక బర్బర కిరాతదేశము లుండుట యిష్టములేదు. ఇవి లేనిచో మగధ కోసలములు రెండును నొకదానితో నొకటి తాఁకిసిల్లి యుద్ధముచేసి యేదోయగును. అది యేమైనను సరే, యీ రెండు రాజ్యముల మధ్య మహాసంఘర్షణము జరుగవలయును. అందుచేత విదేహరాజ్యము శీఘ్రముగా నంతరించవలయును. వృద్ధుఁడైన యుశీనరుఁడు సహజమైన మృతిపొందువఱకుఁ గూడ నతఁడు ప్రతీక్షించలేఁడు.

దిన దినాభివృద్ధి పొందుచున్న యీ బౌద్ధమత భిక్షుకులు నర్హతులు వారి యనుయాయులమధ్య వేదమతము సన్నగిలిపోవుచుండెను. యజ్ఞయాగాది క్రతువులు చేయుట దోషమైపోయెను. ఎవఁడైన బ్రాహ్మణుఁడు యజ్ఞ మారంభించినచో నతఁడు రహస్యముగా చేసికొనవలయును. ఎంత రహస్యముగాఁ జేసినను నెట్లో యొకట్లు తెలియునుగదా !

తెలిసిన యంతనే వందమంది బౌద్ధభిక్షువులు పదివేలమంది సామాన్యప్రజలు మూఁగుదురు. ఈ సామాన్య ప్రజలు బౌద్ధ మతాభిమానులో కాదో బౌద్ధులకు తెలియదు. వారి కంతకు ముందే తెలియదు. అది యొక మూఁక. ఆకాలమున యజ్ఞ యాగాది క్రతువులయందు చంపఁబడెడు మేక హింస పొందు చున్నదని బౌద్ధులు చెప్పనారంభించిరి. అది హింస యనిరి. అందఱు నొప్పికొనిరి. దైనందినముగా నా దినములలో మాంస ము తినని గృహమే లేదు. బౌద్ధభిక్షుకులు కూడ తినెడివారు. ఒక బ్రాహ్మణుఁడు నాల్గువేదములు చదివినవాఁడు సోమ యాగము చేయుద మనుకొనెను. దానికిఁ దగిన ప్రయత్నము లన్నియుఁ జేసికొనెను. చివరకు బౌద్ధుల దండయాత్రతో విఘటితమై పోవునని యాయనకు భయము. ఆయన శతవృద్ధు. వయసులోని బ్రాహ్మణుఁడైనచో మానివేసెడివాఁడో యేమి చేసెడివాఁడో ? యజ్ఞము చేయుటకుఁ దగిన ప్రదేశమే యాయనకు లభించలేదు. అది విదేహ రాజ్యమైనచో నంత యాపద యుండెడిదికాదు. కాని యది కోసల రాజ్యములో నున్న గ్రామము. అచ్చముగా కోసల రాజ్యమునం దున్న దని చెప్పుటకును వీలు లేదు. భల్లటరాజ్యముయొక్కయు కోసలరాజ్యముయొక్కయుఁ బొలిమేరలలో నున్నది. నిజ ముగా నా గ్రామము భల్లటరాజ్యములోనిదే కాని కోసలులు బలవంతులగుటచేత నా గ్రామము తమదిగానే వ్యవహరిం చుచు వచ్చిరి. భల్లటులు మాటాడలేదు. ఆ బ్రాహ్మణుఁడు పోయి భల్లటరాజు నభ్యర్థించెను. భల్లటుఁడు తన యభ యము నొసంగెను. కాని కోసలరాజైన సుమిత్రుఁడు తీవ్ర

మైన బౌద్ధమతావలంబి. ఆతఁడేదైన చేసినచో భల్లటాధిపతి తాను చేయఁగలిగినది లేదు. ఆసంగతి యా బ్రాహ్మణు నకునుఁ దెలియును. పోయి సుమిత్రు నాశ్రయించి నందు వలనఁ బ్రయోజనము లేదు. మిథిలాపతి యుశీనరునిఁ బోయి యాశ్రయించినచో నుశీనరుఁడు వచ్చి యచ్చట నిలిచినచో సుమిత్రుఁడు వచ్చినను పెద్ద యాపద లేదు. ఉశీనరుని యందలి గౌరవము చేత సుమిత్రుఁడు తొలఁగిపోవును. అందుచేత నా బ్రాహ్మణుఁడు నలుఁబదియామడ దూరము నడచి పోయి యుశీనరు నభ్యర్థించెను. ఉశీనరుఁడు జాలిఁగొని సరే నయ్యా బ్రాహ్మణుఁడా! నేను వత్తును కాని కోసల ప్రజలు ధూర్తులు. సుమిత్రుఁడు వచ్చినచో విచారము లేదు. కోసల ధూర్త బౌద్ధాభిమానులు నన్ను గౌరవింతురని విశ్వాసము లేదు. రమ్మన్నచో వత్తు ననెను. తన కార్యమునందలి యాశచేత నా బ్రాహ్మణుఁడు మిథిలాపతిని తప్పక రమ్మని కోరెను. ఉశీనరుఁడు రాజు గనుక రెండేన్గులతో నేఁబది గుఱ్ఱాలతో నైదువందలమంది పదాతులతో పదిరథములతో నా క్రతువు స్థానమునకుఁ బోయెను. ఒక దేశపురాజు తాను ప్రయాణము చేయుచున్నప్పుడు సహజముగా నతని వెంటఁ గొంత సిబ్బంది యుండును. ఈ సిబ్బంది యటువంటిదే. కాని కొందఱు కుటి లురు వీనికి చిత్ర చిత్ర వ్యాఖ్యానములు చేసిరి. ఆ గ్రామము నకు భల్లటుని రాజ్యముగుండ బోవలయును. భల్లటుని యనుజ్ఞ లేకుండ నుశీనరుఁడు తన యీ సేనతో నా యజ్ఞము చేయు బ్రాహ్మణుని గ్రామమునకుఁ బోవుట భల్లటుని పరాభవిం చుట వంటిది. ఉశీనరుఁడు తానచటికిఁ బోయి చేసెడు నంత

మాత్రము భల్లాటుఁడు చేయలేఁడా? భల్లటుఁడు మాత్రము రాజుగాఁడా? ఇట్టి దుష్టవాక్యములు భల్లటునితో చెప్పఁబడి, యారాజు నిజమే ననుకొని, మఱికొందఱి హితోపదేశముచేతఁ దాను కూడ కొన్ని యేన్గులు గుఱ్ఱములు పదాతులనుఁ దీసికొని యాయజ్ఞస్థానమునకుఁ బోయెను ఉశీనరునిమీఁద యుద్ధమునకుఁ బోయెనా! ఎందుకు పోయెనో తెలియదు. కాని యాగము జరిగెడు ప్రదేశమునం దొక నైపున నుశీనరుఁడును, మఱియొక నైపున భల్లటాధిపతియుఁ దమ శిబిరము లేర్పఱచికొని యుండిరి. ఇట్లుండఁగా నెవ్వరో కోసలాధిపతియైన సుమిత్రుని చెవిలో నూదిరి. ఏమనియనఁగా "అయ్యా! తమరు బౌద్ధులు. ఆ బ్రాహ్మణుఁడు యజ్ఞముచేయఁ బోవుచున్నాఁడు. అది జీవహింస. భగవంతుఁడైన బుద్ధుఁడు చెప్పిన విషయము. ఆ గ్రామము తమ రాజ్యములోనిది. మీ రాజ్యములోని బ్రాహ్మణుఁ డొకఁ డిట్లు యజ్ఞము చేయుటకు సాహసించుటయే తమకుఁ దలవంపు. నిన్న కాక మొన్న గిరివ్రజపురమున సామంత ప్రాసాదమున మీ రాజు లందఱు నను కొన్న దేమి? ఇంతలో మిమ్ముఁ గాదన్నట్లు విదేహ భల్లటాధిపతులు తమ సైన్యములతో వచ్చి ప్రత్యక్షముగా మీ రాజ్యములోనున్న గ్రామములో బౌద్ధమతమున కవమానము చేయుటయేమి? మీ రూరకుండుటయేమి?" యని కొండెములు చెప్పిరి. సుమిత్రుఁడు వయసులో నున్నవాఁడు. బుద్ధుఁడు రెండేండ్లకు చనిపోవుననఁగా కోసల రాజ్యాధిపతియైన ప్రసేనజిత్తు మరణించెను. కపిలవస్తు నగరమునందలి సర్వరాజవంశమును ప్రసేనజిత్తుకొడుకు విధుధవుఁడు సంహరిం

చెను. విధుధవుని యనన్నగారు కాహ్యుద్రకుఁడు. అతనికొడుకు కుందకుఁడు. ఆతని కొడుకు సురథుఁడు. సురథుని కుమారుఁడు సుమిత్రుఁడు. బుద్ధుఁడు డానాఁటికి చనిపోయి నూట యిరువది యేండ్లైనది. ఈ నూట యిరువది యేండ్లలో నీ సలుగురు రాజుల కోసములందు రాజ్యము చేసిరి. చివరివాఁడు సుమిత్రుఁడు. అతఁడు చిన్నవాఁడు. పాతికయేండ్లవాఁడు. కన్ను మిన్ను తెలియనివాఁడు. ఉశీనరుని మర్యాద యెఱుఁగనివాఁడు. విధుధవుఁడు కపిలవస్తు రాజవంశ సంహారము చేసినప్పటినుండియు కోసలములందలి బౌద్ధులు శ్రావస్తి, బౌద్ధులకంటె తామే గొప్పవార మనుకొనుచుండిరి. శ్రావస్తి కపిలవస్తువు, కాశీనగరము, గిరివ్రజము మొదలైన సర్వభాగములయందున్న బౌద్ధులు వజ్జి భిక్షుకు లని పిలువఁబడుదురు. వారు ప్రబలురు. ఇతర పట్టణములందున్న బౌద్ధులు వారు చేసెడి యాచారములకు నంగీకరించరు. వారి వారి నడుమ చాల భేదములు కలవు, లోనలోన విరోధములు కలవు. అందుచేతఁ గోసలములోని బౌద్ధులు తాము వజ్జిభిక్షుకులకంటె నధికులమని యనుచుందురు. తామే బుద్ధధర్మమును పాలించుచుంటి మను కొందురు. సుమిత్రుఁడు నట్టి యభిప్రాయము కలవాఁడే. అతఁడొక పెద్ద సైన్యమును తీసికొని యాగ్రామమునకుఁ బోయెను. కోసల సైన్యము వచ్చినంతనే యుశీనరుఁడును, భల్లటుఁడునుఁ గొంత సందేహపడిరి. ఉశీనరుఁడు సుమిత్రునిఁ గలిసికొని మాటాడ వలయు ననుకొనెను. ఇంతలోఁ గొందఱు బౌద్ధభిక్షుకులు మిథిలాపతివద్దకువచ్చి వాదింప నారంభించిరి. మిథిలకుఁబోయి వాదించుటవేఱు. కోసలదేశ గ్రామము నందుండి వాదించుట

వేఱు. వారి వాదసరణి యంతయు తార్కికముగాక దౌష్ట్యముక్రిందఁ బ్రబలెను. ఉశీనరుఁడన్నచో నితర రాజులకు గౌరవమే. బౌద్ధభిక్షుల కేమిగౌరవము? బౌద్ధభిక్షుకులలోఁ గూడఁ బండితులైనవా రుశీనరుని మన్నింతురు. గౌరవింతురు. పండితుఁడని యాదరింతురు. వృద్ధుఁడని గౌరవము నెఱపుదురు. పండితులైన బౌద్ధభిక్షువులు నిన్న మొన్నటి దాఁక బ్రాహ్మణులే. వారికి విదేహాధిపతులన్నచో గౌరవము సహజము. ఈ వాదించుటకు వచ్చిన బౌద్ధభిక్షువులు నీచకులముల నుండి బౌద్ధమతముఁ బుచ్చుకొన్నవారు. ఒకఁ డంబష్ఠుఁడు. ఒకఁడు రజకుఁడు. మఱియొకఁడు కిరాతుఁడు. ఇట్టి వారందఱు బౌద్ధభిక్షుకులై వారు వచ్చి యేమి వాదింతురు? వారి వాదన యంతయుఁ గాష్ఠములతో జరుగును. కాని పైకి బౌద్ధభిక్షువులు. సన్న్యాసులు. ఉశీనరుఁడు మిక్కిలి యోర్పుతోడ నే వారితో మాటాడెను. మీతో నెందులకు కోసల మహారాజును నేనేపోయి చూచి యాయనతోఁ జెప్పెదు ననెను. అనఁగా నందులో నొకఁడు యజ్ఞార్థము మేకలనుఁ జంపుట హింస గాదా యనెను. అనఁగా నుశీనరుఁడు మౌనమవలంబించినచో సరిపోయెడిది. ఆయన యిట్లనెను. "ఓయీ! ఒక్క యజ్ఞములో మేకను చంపుటయే హింసయా! దిన దినము నేఁ డింటింటను మాంసాహారము తినుచున్నారు. మీ బౌద్ధభిక్షువులును మాంసాహారమును తినుచున్నారు. మేకలు పశువులు చంపఁబడకుండ మాంస మెట్లువచ్చును? మీ బుద్ధుఁడే మాంసమునుఁ దినెడివాఁడు. భిక్షగా నెళ్లైనచోట మాంసమును భిక్ష బెట్టుదురు. మీకోసము ప్రత్యేకముగా

మేకను చంపిరన్నచో మీరు స్వీకరింపరాదని యట్లు కానిచో మాంసభిక్ష స్వీకరింప వచ్చునని మీ బుద్ధుడు చెప్పెనుగదా? ఇదియేమి యహింసామార్గ" మనెను. బుద్ధుడట్లు చెప్పినమాట నిజమే! బౌద్ధులలో పండితులైనవారే బుద్ధుడు చెప్పిన కొన్ని సిద్ధాంతములను నమ్ముటలేదు. వట్టిమూర్ఖ, వట్టి మందమైన యా బౌద్ధ భిక్షుకులకు బ్రహ్మాండమైన కోపము వచ్చినది. ఒకరి నొకరు త్రోసికొనిరి. ఒకడు పోయి యుశీనరుని మీదబడెను. ఆరాజుతోనున్న కొలది సిబ్బంది యేమియుఁ జేయ లేక పోయెను. ఆ త్రొక్కిడిలో నుశీనరుడు చనిపోయెను. సుమిత్రునిసేనలు భల్లటునియు, నుశీనరునియు సైన్యములను వధించెను. అంతలో నూరకుండక కోసలరాజ సైన్యము భల్లట దేశము నాక్రమించెను. భల్లటరాజవంశమును సంహరించెను. మిథిలానగరమునకుఁ బోయెను. మిథిల నాక్రమించెను. విదేహ రాజవంశములోఁ గొందఱు పాఱిపోయిరి. కొందఱు వధింపఁ బడిరి. ఈ వర్తమానము గిరివ్రజ సభానంతరమున నాలు నెలల తరువాత జరిగినది.

౯

ఆ కాలమున ప్రజలయొక్క వినోదము లనంతములు. ఆ వినోదములు తత్తద్దేశాధిపతులు యిండ్లలో జరిగెడు శుభ కార్య సమయముల యందును, తత్తద్దేవతల జాతరలయందును

కొన్ని పండుగలయందును, యథేచ్ఛముగా జరుగుచుండెడివి. మానవుఁడు తా నేదో యొక వినోదము లేకుండ బ్రదుక లేఁడు. వానికి కూడు — గుడ్డ వలయుటకంటె వినోద మధికము గావలయును. ఇది మానవ స్వభావములోని విచిత్రమైన గుణము. ఇంటిలోఁ దల్లియో భార్యయో దీర్ఘవ్యాధిగ్రస్తలై యటమటించుచుందురు. వాఁడు నాటకము చూచుటకుఁ బోవును. వానిని కొందఱు విమర్శింతురు. మఱికొందఱు వానిని సమర్థింతురు. అది యిల్లా? యమలోక మాయెను. కొంచెముసేపు మనస్సునకు తెఱపి లేకుండ వాఁడేమి చనిపోవలయునా? యని సమర్థింతురు. అనఁగా సమర్థించినవారు కూడ వినోదబుద్ధులు. వినోద మక్కఱలే దనెడివాఁడు సామాన్య మానవ లోకమున నుండఁడు. రేపు ప్రొద్దున మహా యుద్ధము జరుగఁబోవుచున్నది. ఆ రాత్రిపూట రాజులు వినోదింతురు. ప్రజలుకూడ నంతియే. ఇది యెందుచేత నని విచారింపఁగా వినోదమునందు స్వార్థరహితమైన యొక సుఖమున్నది. ఆనంద మున్నది. స్వార్థరహితమైన సుఖమును స్వార్థ సహితమైన సుఖముకంటె మానవుఁ డధికముగా మన్నించును. స్వార్థసహితమైన సుఖము నిజముగా సుఖము కాదు. స్వార్థతా రహితమైన సుఖమే యథార్థమైన సుఖము. ఇదియ యథార్థమైన దెందుకో? అది యథార్థమైన దెందుకు? ఒక లౌకికమై ప్రయోజనమును వాంఛించి యొక పురుషుఁడొక కార్యమునుఁ జేయును. వానిని లోకము ప్రశంసింపదు. లాభాపేక్ష లేకుండ స్వార్థరహితముగ జనోపయోగముకొఱకు

నొకఁ డొక కార్యమునుఁ జేయును. వానిని లోకము మహాను
భావుఁడని గౌరవించును. ఈ రెంటియందలి భేదమేమి ?

మతములను నిర్మింతురు. రాజ్యములను పాలింతురు.
సంఘములను సంస్కరించుటకు తీర్చిదిద్దుటకు బయలుదేఱు
దురు. వారి యిష్టమువచ్చిన సిద్ధాంతముల నిర్మించికొందురు.
మానవునకు మత మిచ్చినను సంఘలక్షణ మిదియని నిర్ణ
యించినను మఱి యేదిచేసినను చేయవలసిన పద్ధతి యేమనగా
మానవు'లున్నారు. వారి స్వభావమున్నది. వారి ప్రకృతి
యున్నది. వారి యలవాట్లున్నవి. వారి వాంఛ లున్నవి.
వారికి వ్యాధు లున్నవి. మృత్యు వున్నది. ఈ యన్నింటిని
విచారించి సంఘమునో మతమునో రాజ్యమునో నిర్మింపవల
యును. అట్లు నిర్మింపఁబడినవి చిరకాల ముండును. లేనిచో
నిర్మించినవాని కత్తికి పదు నెన్నాళ్ళుండునో యన్నా
ళ్ళుండును.

మానవుఁడు వినోదమును వాంఛించుచున్నాఁడు. వినో
దము పలువిధములు. అన్నింటికి సామాన్య లక్షణమొకఁ
డున్నది. ఒక పురుషుఁడో యొక స్త్రీయో లేనిచోఁ గొందఱు
గుంపుగాఁ గూడియో యొక విద్యా ప్రదర్శనముఁ జేయుదురు.
దానిని చూచి జను లానందింతురు. ఈ యానందమునకును
మానవుఁడు పొందెడు నితరానందములకును నేమియు సంబం
ధములేదు. వివాహ మాడెను. కొడుకు కలిగెను. పెద్ద
యుద్యోగము వచ్చెను. ఒక నిధి దొరకెను. ఆనాఁడు నిధి
దొరకినవాఁడు తనకు నిధి దొరకిన సాఫల్యము నాఁటిరాత్రి
నాటకమును చూచి యానందించుటగా భావించును. ఇందు

లోని రహస్యమేమి ? మానవుఁడు స్వేచ్ఛముగాఁ దనలోనున్న యొక యవ్యాజమైన యహేతుకమైన బహిర్విషయ సంస్పర్శ మాలిన యొక యానందమును వెలికిఁ బ్రదర్శింప నెంచు చున్నాఁడు. సర్వజనులకుఁ దమలో నాశక్తియున్నదని తెలి యును.



ఇప్పు డిద్దఱు. ఒకఁడు విద్య ప్రదర్శించెడి వాఁడు. రెండవవాఁ డానందించెడి వాఁడు. విద్యా ప్రదర్శనము చేసెడి వాఁడు. స్వాహంకార నిష్ఠుఁడు. విద్యను చూచెడివాఁడు స్వానందనిష్ఠుఁడు. వీ రిద్దఱే సృష్టిలో నిజముగా నున్నవారు. స్వాహంకార నిష్ఠుఁడు. స్వానంద నిష్ఠుఁడు. వీ రిద్దఱినిమించి సృష్టి లేదు. సర్వసృష్టియు వీరి నాశ్రయించియే జరుగు చున్నది. వీ రిద్దఱిలో స్వానందనిష్ఠుఁడు నిష్క్రియుఁడు. వాఁడు చేసెడి దేమియులేదు. ఆ స్వానంద నిష్ఠతా లక్ష ణము భిక్షుక లక్షణము. సన్న్యాసి లక్షణము. స్వాహంకార నిష్ఠతా లక్షణము. సంసారి లక్షణము. స్త్రీ ధనాధికార వాంఛాదుల లక్షణము. మానవుఁడు స్వానంద నిష్ఠతాలక్ష ణమునందు వ్యగ్రుఁడు కాఁడు. స్వాహంకార నిష్ఠతా లక్షణము నందు వ్యగ్రుఁడు. ఇదియే లోకమునకుఁ బరలోకమునకు భేదము. ఈ స్వాహంకార నిష్ఠలోఁ గొంతభాగము పరు లకు వినోదహేతువగుట యాశ్చర్యము. నిజానికి స్వాహం కార నిష్ఠుఁడు పరులకు వినోదము కల్పించు సంఘసేవకుఁడు. వాఁడే శూద్రుఁడు. స్వానంద నిష్ఠతాలక్షణము కలవాఁడు బ్రాహ్మణుఁడు. క్షత్రియుఁడు మఱియొకఁడు. వాఁడు వీ రిద్దఱకు నడుమ నహంకారానందముల వినిమయమో పంచు

టయో మొదలైన కార్యములు చేయుటకు కేర్పడినవాఁడు. ఈ ధర్మములు భిన్నములుగాఁ గన్పించినను ఒక్కొకప్పు డొక్కఁడే పురుషుఁడు స్వాహంకార నిష్ఠుఁడు మఱియొక వేళ స్వానంద నిష్ఠుఁడు. స్వానంద నిష్ఠతయందుకంటె స్వాహంకార నిష్ఠతయందు మానవులకు నభిరుచి యెక్కువ. లోకముయొక్క కీడంతయు నచ్చటనున్నది. ఆనాఁటి రాజ్యములలో సౌరసేన రాజ్యము నేకలింగ రాజ్యము, కాలక రాజ్యములు గలవు. వారును నొకవిధముగా నాఁడు ప్రబలురే. ఎవ్వఁడు సర్వార్యావర్తము నొక్క గొడుగుక్రిందికి తేవలయునని యెంచునో వానికి వారును సంహరింపఁబడఁదగినవారే. ఈ మూఁడు రాజ్యములు నదులయొడ్డులందు కలవు. నదుల యొడ్డునఁగల నగరములలో కాలువలయొడ్డుననున్న జనపదములలో సముద్రతీరముననున్న పల్లెలలో నీతకొట్టుట యెఱుఁగనివా రుండరు. అది యొకవిద్యగా జనము గౌరవింతురు. ఈఁతలో నెన్నివిధములు. ఒకఁడు నీళ్ళలో నిలుచుండి చేతులలో నీళ్ళను కొట్టుచు నీదును. దానిని నిలువీఁత యందురు. ఒకఁడు పొట్టమీఁద పండుకొని చేతులతో నీళ్ళు వెనుకకుఁ ద్రోయుచుఁ బడవవలె పోవును. అది యొకటి. మఱియొకఁడు వెలికింతలుగా నీళ్ళమీఁద పరుండి కాళ్ళతో నీళ్ళను తాడించుచు త్రిప్పిన చేతులతో నీళ్ళను కాళ్ళవైపునకుఁ ద్రోసికొంచుఁ దేలిపోవుచుండును. ఇదియొకటి. మఱి యొకఁడు నీటిలోఁ బార్శ్వమునందు పరుండి యొక చెవి నీళ్ళలోనుంచి సగము మొగము కనఁబడుచుండఁగాఁ బక్కవాటుగా నీదును. ఇట్లెన్నియో కలవు. ఇవికాక మఱికొన్ని గలవు. ఎట్లైన

స్థలమునుండి నీటిమడుగులోనికి గభాలున దూకుట. ఇది యభ్యాసముచేతఁ గొందఱు సులభముగా చేయుదురు. బల శాలులైన కొందఱు నదులు వఱదలమీఁదనుండి మహాప్రవాహముగా వచ్చునపుడు కఱ్ఱల సాహాయ్యముతో నెంతదూర మైన నీదికొని పోదురు. మఱికొంద ఱసహాయశూరులై యే యాధారము లేకుండ మహానదీ ప్రవాహముల నుత్తరింతురు. మఱికొందఱు మొసళ్ళుగల మడుగులలో దూకి వాని కంఠ కుండ నొడ్డున కీదికొని వత్తురు. ఇంకఁ గొందఱు తమ వెంట ఖడ్గములను తీసికొనిపోయి తమరిని కంటూడు మొసలి నెదిరించి దానినిఁ గత్తితో చీల్చి వధించి బయటకు వత్తురు. కొన్ని చోట్ల జలపాతము లుండును. ఆ జలపాతములు పడెడి చోటు మహాఖాతముగా నుండును. సంతతధారగా పైనుండి జలము పడుచుండును. ఆధారవెంటఁ బడినవాఁడు వేల యేం డ్లుగా వందల యేండ్లుగా నట్లు పడుచున్న జలమహాధార క్రిందనున్న పర్వతమును తాడిలోతునన్నో రెండుతాళ్ళ లోతు ననో త్రవ్వి చేసిన మహాగర్తమునందు నట్టడుగునకు పోవును. పైనుండి జలధార యా యడుగునకుఁ బోయిన వానినిఁబైకి లేవనీయదు. జలమునందు వస్తువును పైకి లేవఁగొట్టు గుణ మున్నది. ఆ గుణమున జలధార యణఁచుచుండును. అట్టి మడుగుననుండి పైకిలేచి వచ్చుటకు మానవునకు శరీరమునం దమితమైన బలము కావలయును. ఏకలింగదేశమున కాలక దేశమున శూరసేన దేశమున నిట్టి మహా జలపాతములుకలవు. అఖాతములైన మడువులు కలవు, గంగా యమునా నదులు వాని శాఖలతో నా దేశములందు విజృంభించుచున్నవి. ఆ

మూఁడు దేశములలో నిదియొక మహావిద్య. ఇది వినోదము. ఈ విద్యా ప్రదర్శనమును ఈ వినోదమును నట్టి సామాన్య ప్రజల నాశ్రయించి యున్న వేకావు. ఆ రాజ వంశములవారు వీనిలో పోటీలు నడపుదురు. తాము పాల్గొందురు. గెలిచిన వానికి బహుమానము లిత్తురు. సంవత్సరమున కొక్కసారియో రెండుసార్లో యీ వినోదము లా మూఁడు రాజ్యములకుఁ గలిపి జరుగుచుండును. ఆ యుత్సవముల కొఱకు జనులు వేలు లక్షలు గుంపులుగా వచ్చుచుందురు. బండ్లు కట్టుకొని వచ్చుచుందురు. తీర్థప్రజగా వచ్చుచుందురు. మానవులకు వినోదము కావలయును. ఆ వినోదము తన సంఘమునకు తన కుటుంబ మర్యాదకు, తన మతాభిప్రాయములకు, తన మర్యాదకు తగినదియని యుండనక్కఱలేదు. బౌద్ధు లుత్సవములు చేసికొందురు. హిందువు లుత్సవములఁ జేసి కొందురు. బౌద్ధులువచ్చి వానియందుఁ బాల్గొందురు. సామాన్య జనులకుఁ గావలసినది వినోదముకాని మతముకాదు. ఇంతమంది సామాన్య జనులను మా మతము లోనికిఁ జేర్చికొన్నామని నాఁటి బౌద్ధులుగాని మఱి యింకొక కాలమునాఁటి ఇంకొక క్రొత్తమతము వారుగాని సంతోషించెడి సంతోషము నిరర్థకమైనది.

అట్టి మహోత్సవములు సామాన్యముగా శూరసేన రాజ్యములోననే జరుగును. అందే జరుగుటకుఁ బెద్దకారణమున్నది. శూరసేన రాజ్యములో నుండి యమునానది ప్రవహించుచున్నది. ఆ యమున మూఁడుచోట్ల మహాజలపాతము లుగాఁ బడుచున్నది. మఱియు నొకచోట జలపాతమైనంతనే

ఇసుకమలకల కొండలగుండ క్రోసెడుదూరము ప్రవహించును. ఆ కొండలలోనున్న ప్రవాహము మొసళ్ళచేత నిండియుండు నని ప్రతీతి. ఆ జలపాతమునందు దూకి యీ క్రోసెడు మేర నీది యెవ్వఁడు దిగువనున్న చోటికి వచ్చునో వానికి రాజు వేయి హేమనిష్కములిచ్చును. ఈ వేయి నిష్కముల కోసము నేఁటేట కొన్నివందలమంది తమ ప్రాణములను గోల్పోవుదురు. అక్కడ దూకి మునిఁగినవాఁడేగాని యిచ్చటఁ దేలి వేయి నిష్కములకు చేసాచిన వాఁడు లేఁడు. పూర్వ మొక్కఁడో యొకఁడో యిద్దఱో జేసిరట. నూటయేఁబది యేండ్ల క్రింద శూరసేన రాజవంశములోని యొకఁడు తా నట్లీదికొని వచ్చె ననియు, నతని యంతటి మహాపురుషుఁడు లేఁడనియుఁ, బ్రథగాఁ చెప్పికొందురు. ఇందులో నింకొక విషయ మున్నది. సామాన్యుఁ డెవ్వఁడో యీపని చేసినచో వానికి హేమ నిష్కములును వచ్చును. కీర్తి కొంచెము వచ్చును. ఆ పనియే యొక రాజకుమారుఁడు చేసినచో వానికి వేయి నిష్కములు వచ్చునుగాని వానికి వానితో నెక్కువ ప్రయోజనము లేదు. అందుచేత భగవంతుఁడు వాని కెక్కువ కీర్తిఁ దెచ్చును.

ఇది యిట్లుండఁగా నీ విద్యయందు నాఁటి ప్రదర్శనములలో నొకరికన్న నొకరు గొప్పవార మనిపించి కొనుటకు నీ మూఁడు రాజవంశముల రాజకుమారులలోఁ జెప్పరానంత స్పర్ధయున్నది. ఆ జలపాతములో దూకి ఈ క్రోసెడు దూరము నీది యెవ్వఁడు వచ్చునో వాఁడు మహావీరుఁడు. వాని ముందు తక్కిన రాజకుమారులు పనికిరారు. అట్టి కార్య మేనాఁడు

చేయవలయునోగాని మఱునాఁటినుండి వాఁడు మూఁడు
రాజ్యములమీఁద నధికారము చేయఁగలఁడు. ఏలయనఁగా
మూఁడు రాజ్యముల ప్రజలు వానిని మహావీరునిగా మన్నిం
తురు. వాని మాట కెదురులేదు. వాఁడు తక్కిన రెండు
రాజ్యముల మీఁద దండెత్తవచ్చును. సులభముగా నా
రాజ్యములను స్వవశముఁ జేసికొనవచ్చును. ఇందులో
నింకొక మర్మమున్నది. ఆ మూఁడు దేశముల రాజవంశముల
వారు బంధువులు. వారికి వారికి సంబంధ బాంధవ్యములు
కలవు. కొన్నివందల యేండ్లనుండి యీ బాంధవ్యము వచ్చు
చున్నది. ఆ బాంధవ్యముతోపాటు నా మూఁడు రాజవంశ
ముల నడుమనున్న మాత్సర్యమును వచ్చుచున్నది. అంద
ఱును గలిసికొన్నప్పుడు బంధుత్వ మర్యాద కవధిలేదు.
ప్రదర్శించెడు ప్రేమకు మితిలేదు. సౌహార్దమున కంతులేదు.
మనసులలో మాత్రము ప్రతివాఁడు తన వంశమే గొప్పది
యనియు తక్కిన రెండు వంశములు తక్కువ వనియే యను
కొనుచుండును. పరోక్షమునందు వారిని వీరు వీరిని వారుఁ
దూలనాఁడుచుందురు. అట్లొకరి నొకరు తూలనాడుదురని
యొకరొకరికిఁ దెలియును. తెలిసియు నూరకుందురు.
అందుచేత నితర రాజవంశముల వారు వీరి మువ్వురి
నధమ క్షత్రియులుగాఁ బరిగణింతురు. క్షత్రియుఁడైన
వాఁడు తన్ను బంధువు నిందించినను సహించలేఁడు. విధు
ధవుఁడు కోసలరాజపుత్రుఁడు. కపిలవస్తునగరరాజులు మేన
మామలు మేనల్లుఁడును వారు చేసిన పరాభవము విధు
ధవుఁడు సహించెనా? నిజమైన క్షత్రియుఁడు సహించలేఁడు.

ఇట్లుండఁగా శూరసేన కాలకై కలింగ వంశజులు వారిలో వారొకరి నొకరు పరాభవించికొందురు. ఒకరి నొకరు మఱల బంధువులుగాఁ జూచికొందురు. మూఁడు వంశము లధమ క్షత్రియ వంశములు, శౌర్య గుణమునకు దూరమైన వంశములు; ఐనను క్షత్రియులేకదా! ఆర్యావర్తమునందలి యందఱు క్షత్రియులు కలిసికొన్నప్పుడే మూఁడు వంశముల వారుఁ గలసికొన్నప్పుడు వీరిని తక్కిన క్షత్రియు లవమాన పఱచరు. ఈ మూఁడు వంశములవారు కలిసికట్టుగా మను చుందురు. అది వారి బలము. వారిలో వారికి స్పర్ధ లున్న మాట నిజమే. వారి స్పర్ధ విచిత్రమైనది. ఒక వంశము వాని కన్న మఱియొక వంశమువాఁ డధికుఁ డనిపించుకొనుటకు యమునా జలపాతమున దూకి క్రోసెడుదూర మీఁది బయటికి వచ్చుటయే యా యాధిక్య చిహ్నము. అట్లొకఁడు వచ్చినా తక్కిన రెండు వంశములవారు వానికి లోఁబడినవా రనియే యర్థము. వారి వారిలో యుద్ధము చేయుదురు. ఇట్టిది యొకఁడు మహాశూరుఁ డనిపించుకొన్నను తక్కిన రెండు వంశములు పొందెడు నవమానమును లేదు. ఇది యేమి యుద్ధమా? బహు పరాక్రమ విలసనమా? రాజనీతిజ్ఞతయా? ధర్మమును సముద్ధరించుటయా? అయినను మానవునియొక్క స్వల్ప భావముయొక్క లక్షణ మట్టిది. ఇద్దఱు వీరులుందురు. ఇద్దఱు పండితు లుందురు. వారి స్పర్ధ విద్యా విషయము. వారిలో నొక్కని కొక్క చోట నేదో యొక చిన్న గౌరవము జరుగును. ఈ రెండవవాని కింకొకచోట జరుగ వచ్చును. ఆ గౌరవము వారి విద్యా సంబంధమైనది కాదు.

ఆ గౌరవము పొందినవాఁడు తాత్కాలికముగా నా రెండవ వాని కంటె గొప్పవాఁడ ననుకొనును. ఇదియేమి చమత్కారము. స్పర్ధ విద్యావిషయ మాయెను. వీని నెవఁడో విందునకు పిలిచెను. వానినిఁ బిలువలేదు. అది వానికంటె తనకు గొప్పయైన మనుకొనుట మానవునియొక్క స్వల్పబుద్ధి లక్షణము. వాఁడు మఱల మహాపండితుఁడు. మానవులలో గొప్ప బుద్ధి యెక్కడ నుండవలయుననఁగా నిక్కడ నుండునని జనమాడు కొనెడువాఁడు.

ఈ మూఁడు రాజవంశములయందు దీ మాత్సర్యము కలదు. ఏ యేట నీపోటీలు జరుగును. రాజకుమారు లాపోటీలలో పాల్గొనుట తమకు మర్యాదానష్ట మనుకొందురు. నడుమ నడుమ కొన్ని సంవత్సరములకు నా పోటీలు రాజకుమారుల మధ్యనే జరుగును. ఆయేట సామాన్యప్రజలు వానిలోఁ బాల్గొనరాదు. అట్టి సంవత్సరమునఁ దక్కిన సంవత్సరము లందుకంటె వచ్చెడు ప్రజ లిబ్బడియు, ముబ్బడియు. ఆ యేడాదియందు మూఁడు వంశముల రాజకుమారులు నీపోటీలలోఁ బాల్గొనున ట్లేర్పాటుఁ జేయఁబడినది. ఆమూఁడు రాజ్యముల ప్రజలు మనసులలో నుయ్యాల లూగిపోయిరి. పోటీ లింకను నెలనాళ్ళున్నవనఁగా బాటలు క్రిక్కిరిసిపోయెను. రెండు నెలలకుఁ గావలసిన యాహార సామగ్రి మూటకట్టికొని బండ్లమీఁద నాలు బిడ్డలతో ముసలమ్మలతో జను లాజల పాత ప్రదేశములకు బయలుదేఱిరి. అవియేమి దేవోత్సవమా? ఒక రాజుయొక్క పట్టాభిషేకమా?

జనమెక్కడచోట నుండుటకు వీలులేదు. జలపాతము పడుచోటనే యెక్కువమంది జన ముందురు. అది యంతయు రాళ్ళప్రదేశము. అచ్చటికి నాలుగైదువందల గజములు దూరమున నొక యూరున్నది. జనమందఱు పోయి నా యూరిలో నుందురు. అప్పుడప్పుడు పోయి యా జలపాతమునుఁ జూచి వచ్చుచుందురు. అదుగో అతఁడు జలపాతమున దూకునని చూపించుకొనుటయు, ఆయన యా రాజకుమారుఁడని చెప్పికొనుటయు, జాతరకొరకు వచ్చిన దుకాణములలోఁ జిల్లర వస్తువులు కొనుటయు, ఏ గోడపంచనో వండుకొని తినుటయు, అచ్చటనున్న యొక చిన్న దేవాలయములోనికిఁ బోయి చూచి వచ్చుటయు. జలపాతమువద్దకుఁబోయి కొంతసే పటునిటు తిరుగుటయు నింతకంటె నా వచ్చిన వేలాదిప్రజలు లక్షలాది ప్రజలు చూచెడి దేమియు లేదు. ఈఁతగాండ్రు జలపాతమునుండి దూకుచున్నప్పుడు చూచెడివారి సంఖ్య తక్కువే. ఆ జలపాతము క్రిందనున్న మహాఖాతమున మునిఁగి పైకి తేలుటయే యొక మహాశూర లక్షణము. చాలమంది దూకినవారు దూకినట్లే యుందురు.

ఇట్లు నిర్ణయింపఁబడిన యా మహోత్సవ దినములు సమీపించినవి.

ఎప్పుడు పూర్తిగా రాజకులములవారే యా జలపాత క్రీడలలోఁ బాల్గొందురో యాయేట జలపాత సమీప ప్రదేశము గజ తురగ పదాతి బహు సేనాసంకులమై యుండును. మూఁడు రాజ కుటుంబములవారు పెద్ద పెద్ద గుడారములు వేయుదురు.

ఆ గుడారములలోని భాగములన్నియు రాజసౌధములే. తివాచీలు, పట్టుకంబళ్లు, రతనపు తోరణాలు, కేళకుళులు, సింహాసనములు, కత్తులు కటారులు, చెప్పరానంత భోగము తత్ప్రదేశముల యందు నిండి యుండును. ఈ యేడాదియం దింకొక విశేషము కలదు. రాజులుకూడ వచ్చి ఏకలింగ కాలక శూరసేనాధిపతులు తమ కొడుకులతో భార్యలతో రాజధానులు వదలి యచ్చటికి వచ్చిరి. ఎవఁడో యన్నట్లు శత్రునైన రాజు తత్సమయమున వారి రాజధానులకు పోయి సులభముగా నా రాజ్యముల నాక్రమించవచ్చును. సేనలన్నియు నిచ్చటనే యున్నవి. రాజవీరులంద ఱిచ్చటనే యున్నారు. వారి రాజధానులలో మంత్రులు మాత్రమే మిగిలియుండిరి. కొద్దిపాటి సైనికులు మాత్రమే రాజధానులయం దుంచఁబడిరి.

ఈ జలపాతమువద్ద నిట్లు సమావేశమైన యా మూఁడు రాజ కుటుంబములు పరస్పర బాంధవ్యములు కలవారు కనుక విందులు విలాసములతో కాలము గడుపఁ జొచ్చిరి. జలపాతమునందు దూకుటకు పోటీలలో పాల్గొనుటకు నిర్దేశించిన దినము పది పదునేను నాళ్ళున్నదనఁగానే వారంద ఱచ్చటఁ గూడిరి. ప్రతి సాయంకాలమందుఁ గ్రీడలలో నంద ఱునుఁ బాల్గొంచు వచ్చిరి. ఈ యేడాది విశేషమేమనఁగాఁ బరదేశములనుండి యెవ్వరెవ్వరో జలపాత లంఘన విద్యాపటిష్ఠులైనవారు వందమందినఱకు వచ్చిరి. హరిద్వారమునుండి వచ్చిరి. నర్మదా నదీప్రాంతీయులు వచ్చిరి. కొందఱు దాక్షిణాత్యులు వచ్చిరి. అసలు పోటీలు పదునేను దినములున్నను ప్రతిదిన ముదయమునను సాయంత్రమునను తద్విద్యా నిష్ణా

తులు జలపాతము దగ్గరకుఁ బోవుటయు చూచుటయు ౦
క్రోసెడు మేర యిరుకు కొండలలోనుండి యీదుటయు
గుచునే యున్నది. జన మనేకులు ప్రొద్దున నిద్దుర లే
వెంటనే యిరుకు కాలువకిటు నటుఁ గల కొండపోవిరి
వెగఁ బ్రాకి ప్రొద్దు గ్రుంకువఱకు నచ్చటనే యుండుచుం
అచ్చటనుండి యీఁతగాండ్రను చూచుచుండిరి. అది వే
చమత్కారమో యా యిరుకు కాలువలోఁ బూర్వ
మొసళ్లుండెడివని ప్రతీతి. ఈ పది పదేను దినములు మొ
యున్నదే కనిపించలేదు. పలుమంది సుఖముగా నీది ద
క్రోసెడు దూరము తుదినున్న గ్రామమునకుఁ జేరిన వా
కలరు. ఇంతకును దొలినాఁటి భయము పోయినట్లు క
చెను. క్రొత్తగా వచ్చిన వందమంది యీఁతగాండ్రు మూ
రాజ కుటుంబములయం దున్న రాజకుమారులకుఁ బ
యము గలవారైరి. కొందఱు శూరసేన రాజకుమారుల
స్నేహితులు. కొందఱు కాలక రాజకుమారులకు మిత్రు
మిగిలిన వారేకలింగాధిపతుల బిడ్డలకు చెలికాండ్రు.
రీతిగా మూఁడు రాజకుటుంబములలోని యువకులు
యీఁతగాండ్ర చెలిమితో నిపుణులు జలపాతములో దూ
వారు కూడ దూకుటయు, పౌరుషములు పెంచికొనుట
ధైర్యములు ప్రబలించికొనుటయు, ప్రాస్తావికముగా సహావ[illegible]
మికలు గూడ వృద్ధిపొందుటయు జరిగినది. ఆ స్నేహి
ప్రోత్సాహమో, లేక యాగాలిలో నేదైన విపరీత లక్షణ
ప్రవేశించినదో, వారందఱికి నాఁడు తాము క్రొత్తగా క్షత్రి
జన్మమెత్తి సల్లనిపించినదో వారిలో స్పర్ధ లెక్కువ వై

అహంకారోక్తు లెక్కువయైనవి. పూర్వమువలె వారి కొకర మొకరము బంధువులమని యనుకొని పరోక్తులను సహించు లక్షణము తక్కువైనది, ఆ పదునేను దినములలో బావ మఱఁది యని యొక రాజకుమారుఁడు పరాచిక మాడుటయు, పూర్వమువలెఁ గాక పరాచక మాడఁబడిన వానికిఁ గోపము వచ్చుటయు, నితనికిఁ గోపమురాఁగా రెండవ వాఁడు మున్ను వలె సర్దుకొనిపోక వాఁడు నెదిరించుటయు చివరకు క్షత్రియుద్ధ ముగాఁ దేలుటయు జరుగుచు వచ్చెను. క్షత్రియుద్ధము చివర మాత్రము వధలు లేకుండ బంధుత్వమే పర్యవసించుచు వచ్చెను. కాని పరిస్థితులు మాఱిపోయినవి. మాత్సర్యములు ప్రధానమైనవి. క్షత్రియాహంకారమునకే యాధిక్యము కలు గుచు వచ్చెను.

ఈ జలపాత లంఘనములో నెవరెవరు పాల్గొననలయు నన్న విషయము చర్చనీయమై నిర్ణయించ వలసిరాఁగా దానినిఁ గూర్చి మూఁడు రాజ్యములవారును నాల్గైదు దిన ములు పెద్ద పెద్ద సభలు చేసిరి. ఒకఁడు దూకుననఁగా మఱి యొకఁడేల దూకరాదన్న ప్రశ్న. రాజు కొడుకు దూకనలయు ననఁగా రాజేల దూకరాదని ప్రశ్న. పెద్దలు దూకినప్పుడు పిన్నలేల దూకరాదని ప్రశ్న. చాలమందికి నేటి క్రోసెడు దూరమున్న యిరుకు కాలువ యీదుటలో భయము పోయి నది. ఏమైన భయము మిగిలినచో జలపాతమునందు దూకు టకే మిగిలియున్నది. ఆ యడుగునకు పోయినవాఁడు పైకి వచ్చుట యెట్లని. ఆ జలపాతము తానొక్కధారగాఁ బడదు.

కొన్నివందల యడుగుల పొడుగుగా నున్న కొండయంచు
నుండి యొకటే ధారగా పడల్పుగా నెండవేసిన పుణ్యస్త్రీల
చీరలవలె, నూరేగింపునకు బయలుదేఱఁ దీసిన దేవళపు
గుఱ్ఱాల మొగములయందు ప్రేలాడుచున్న ముత్యాలసరు
ములవలె, నైరావణాభ్రముల వివాహవేళా నిర్గమిత బంధు
సంతావళ స్త్రీసమూహమువలె, శరత్కాలపు మేఘములు
దిగ్గి వచ్చి కొండయంచుల సేవించి యుత్సవము జేసికొంచు
నటు నిటు పచారుచేయుచున్న సందడివలె, స్వర్గలోకమునుండి
శివజటా జూటమునకు దిగుచున్న మందాకినీశోభ స్ఫూర్తివహించి
నట్లు సర్వకాలములయందు విడంబించుచున్న యులుపసు
టధికపు టింద్రచాప వికీర్ణ చిత్ర చిత్ర వర్ణచ్ఛవి సంకలిత
రమణీయ చందన కుంకుమ కర్పూరాది బహు వస్తు విన్యస్త
సంగత రంగవల్లీ రమణీయ వరుణదేవతా గృహాంగణములవలె
నిత్య భ్రాంతి హేతువై, నిత్యదర్శన వేళా సముత్సాహ సంజ
నకమై, యాశ్చర్య హేతుకమై దర్శనమాత్ర సంపాదయితృ
నిర్వాణమై, దగ్గఱకుపోయి నిలుచున్నంత మాత్రమున
విదలించు శీకరములచేత పరాచికము లాడుచున్నట్లై, లీలా
ప్రసారిత హస్తాగ్రపాత జలబిందు భరభాగ నిర్ఘాత పంచా
గుళియై, నేలమీఁద కట్టిన పడియలు, కుల్యలు, నాళికలు
మొదలైనవాని సౌభాగ్యముచేత నిలు నిలువయున్న పడియల
లోని నాచు పసిపిల్లలకు తొడిగిన నీలిరంగుల బొందు
చొక్కాలవలె తూములవలెనున్న రెండు పొడుగైన ఱాళ్ళ
మధ్య ప్రవహించు కాలువలు ప్రాతరాతపములయందు నెండ
వేసిన తెల్ల యంగీలు గాలికి కొట్టుకొని పోవుచు కొట్టుకొని

పోనట్లు గనిపించుచు జలపాతము జరిగిన తరువాత నేఁబది గజములవఱకు తత్ప్రపతనవేళా సముత్పతిత డిండీర ఖండములు తొలుత పెద్ద పెద్ద గోపురములవలె గడవఁగా గడవఁగా గోపురములు చిన్న చిన్న వగుచు నింతమేర సర్వము డిండీరమయమే గాని యచ్ఛమైన జలోపరిభాగ దర్శనమన్నది లేకుండ నంతటి జలప్రదేశమునందు నొక పెడ చెదురుగా మొలిచిన కలువ కాడ యెట్టిగా నొంటరియైన పూవును వికసింపఁజేసి దాని సౌందర్యమును, దాని యునికియు కన్నులు కలిగిన చారితార్థ్యమును నిరూపించుచు నీ యొంటరి కలువపూవు తా నచ్చట నెట్లు మొలిచెను? ఎట్లు నిలచెను? ఎట్లు విచ్చెను? ఆ యొక్క పూవే యెందుకు వచ్చెను? ఆయొక్క పూవుచేత నా ప్రవాహము ప్రవాహమంతయుఁ జూడ నెంతో ముచ్చటగా నుండి పదిమంది యాడుపడుచులుగల యింట నొక్క చిన్నితమ్ముఁడు పుట్టినట్లు, పదిమంది మగ సంతానముగల భార్యాభర్తల కడుపున నొక్క యాడుపిల్ల పుట్టినట్లు, ఆ యాడుపిల్ల చిదిపి దీపము పెట్టఁదగిన యంతటి యందాల బిడ్డ యైనట్లు, కళపెళలాడు స్వభావముగల సౌందర్యవతి యైన ధీరాధీరయైన నాయిక విలాసముగా చూచి యొక చిన్న నవ్వు నవ్వినట్లు, వచ్చిన సర్వ జనులకు నా యేకాకియైన కల్హారపుష్పము విరతిలేని సౌందర్య జిజ్ఞాసువులకంటు చూపులే సమాహార భూతమై యా పూవుగాఁ బరిణమించినదా యన్నట్లు, అటు జలపాత రామణీయకము చూడవలయునా, యిట్లీ యొక్క కలువపూవు టందము చూడవలయునా యన్నట్లు విరాజిల్లుచు నున్నది.

ఒకనాఁటి సాయంకాలమున నీ మహోత్సవ దర్శన బుద్ధియైన యొక కుటుంబము వచ్చినది. ఆ కుటుంబము వ్యక్తియులు వారు ముగ్గురే. వయసు మీఱిన తలిదండ్రులును పదునాల్గు పదునేనేండ్ల కూఁతురును. ఆ పిల్ల వచ్చి నచ్చిన తరువాత సర్వజనులు నాఁకలువపూవు వంకఁ జూచుట మాని వేసిరి. రాజకుమారుల కందఱకు బహిఃస్పర్శలు పోయినవి. స్పర్శయున్న గుణము దానియంతట నది సర్వ రాజకుమారుల హృదయ గోళములయం దుపసంహరించుకొన్నది. అప్పట కూడుకట్టి కూర్చున్నది. మూఁడు రాజకులములలో నున్న రాజకుమారులందఱు నై దారువందల మందికలరు. రాజుల కుమారులు రాజుల తమ్ముండ్రు, పినతండ్రి కొడుకులు, మేనమామల కొడుకులు, మేనత్తల బిడ్డలు నందఱు కలరు. బంధుత్వమును బట్టి రాజునకు దగ్గఱివారు సమధికులు, కొంచెము దూరపు చుట్ట మైనకొలఁది కొంత ఠీవి తగ్గినట్లు, కొంత మర్యాద తగ్గినట్లు, ఎంత తగ్గినను రాజవంశీయుఁడే.

ఆ బాలిక వచ్చినప్పటినుండియు జలపాతముయొక్క ప్రాముఖ్యమే పోయినది. అదివఱ కాజలపాతము విభూతి మైనిండ నలఁదికొనిన శివుఁడు పాదములకు వెండిగజ్జెలు కట్టికొని తలలపై తళతళలాడు మణులతోడి తెల్లని పాముల నలంకరించికొని తాండవించుచున్న ట్లుండెడిది నేఁ డూరకే రోదన ధ్వనులు చేయ నారంభించినది. పూర్వము తెల్లని నురువులతో మొల్లపు నవ్వులు నవ్వెడి జలపాతము నేఁడు వృథాగా నోటివెంట నురుసు గ్రక్కుచున్నది. ఆ పిల్లయంత

యందకత్తియ యున్న వార్త మువ్వురు రాజులకుఁ గూడ తెలిసెను. ఆ పిల్లను చూచుటకు వారును దహదహ పడిరి. ఏవో సన్నివేశములు కలిపించుకొని యామెను వారును చూచిరి. సర్వమన్మథ భావమును గుండెలలోఁ దోఁచిరి. ఆమె నిజముగా మానుషియేనా? ఆ కన్నులు కన్నులేనా? ఆమె మాంసాస్థి రక్త మయమైన శరీరముపైన చర్మముతో నున్న ప్రాణమూఁడు నిజమైన బొమ్మయేనా? సౌందర్యమన్న వస్తువు విలక్షణమైనది. అది కలిగించెడి భ్రాంతి మఱియేదియు కలిపించలేదు. ఆఱువందలమంది రాజకుమారులకు మువ్వురు రాజులకు నాయొక్క బాలిక సమానమైన వాంఛను కలిగించుటయే యాశ్చర్యము. ఈ వాంఛ యీ యాఱువందల మువ్వురకుఁ గలిగినదన్న సంగతియొక్క చోటఁ దెలియదు. ఆఱువందల మూఁడుచోట్ల తెలియును. ప్రతియొక్క చోటి తెలివిడియు తక్కిన యాఱువందల రెండుచోట్లకూడ తెలియును. ఆ పిల్ల యెవరు? ఆ పిల్ల దల్లిదండ్రుల దేయూరు? వారు సూర్యవంశీయులా? చంద్రవంశీయులా? ఆస్తిపరులా? కారా? ఆ పిల్ల నెవరికిత్తురు? ఆ పిల్ల యేమి చదివినది? ఆమె నామధేయమేమి? ఏదో యేవో? ఇట్టి విషయములు కనుగొనవలయునన్న వార్తా ప్రవాహములు ఆఱువందల మూఁడు బయలుదేరినవి. పోయెడి ప్రవాహము. వచ్చెడు ప్రవాహము. తెఱపిలేని యీ వార్తలు తట్టుకొనుట యామె తండ్రి కిక్కట్టయిపోయెను. ఆ పిల్లను తమకిమ్మని సూర్యోదయమునం దొక వార్త. గడియ ప్రొద్దెక్కిన తరు

వాత యొక వార్త. రాత్రి రెండుజాములవఱకు వార్తలే వార్తలు.

పది దినములైన తరువాత నొకు మహావిషయము తెలిసెను. ఆ పిల్ల జలపాతమునందు దూకఁ గలదట. దూకి ఇరుకటమైన యొక క్రోసెడు మేర కొండల నడిమి కాలువలో నీదఁ గలదట. ఆ మెతో నీది యెవఁడు ఆ మెకున్నంత సామ ర్థ్యము వెలార్చునో వాని నామె వివాహము చేసికొనునట. ఇది యామె స్వయంవర సమయము. అందుకనియే యా బాలిక నచ్చటకు నామె తలిదండ్రులు తీసికొని వచ్చిరి. వారి యూరచ్చటికి నర్ధయోజనము మేర నున్నది. ఆ పిల్ల దిన దిన మచ్చటికి వచ్చును. ప్రతిదినము జలపాతము నందు దూకును. ఆ కాలువ యీదును. ఈ సంగతి తత్రత్యులైన సర్వ జను లకు విదితమైనదే.

నిజమున కామె తన యీ సామర్థ్యమును రాజకుమారు లకుఁ దెలియఁ జేయవలయుననియు, నదియొక వినోదముగా భావింపఁ జేయవలయుననియు, మాత్రమే వచ్చెను. అట్లు మాత్రమే వచ్చినట్లు చాలమందికిఁ దెలియవచ్చెను. ఇప్పుడు ప్రతి రాజకుమారుఁడు నామెను పెండ్లి చేసికొనవలయునన్న యూహ వెలార్చుటకో వార్తలు పంపుటతో నామె తలి దండ్రులు వేఱొకమార్గము లేక నామె వివాహమునకే నియ మముఁ గలిపించిరి.

ఈ నియమమేర్పడిన తోడనే తెప్ప జలపాతమునందు దూకుట కిష్టపడని రాజకుమారుఁడే యా యాఱువందల

మందిలో లేకపోయెను. ముప్పది రాజులే దూకుటకు సంసిద్ధపడిరి.

ఆఱువందల మందియు నొక్కసారి దూకుదురా? దూకిన తరువాత యీదుటలోనే నేర్పు లేదు. దూకెడు లక్షణములో కూడ నేర్పున్నది. జలము ప్రపాతముగాఁ బడుచున్న ధారవెంట మానిసి సన్నగా జాఱి రావలయును. నిజముగా నది దూకుటయే కాదు. ఆ జలధారలో నిశ్చలముగా క్రింది వఱకు వచ్చుట యదియొక విచిత్రమైన నేర్పు. ఆ కొండ యంచునుండి ప్రవాహముతోఁ బాటుగా నొయ్యారముగాఁ దాను గూడ జలమే యన్నట్లు జాఱెడు వాని నేర్పు వేఱు. అంగుళాంగుళము దూకుటలో, పడియలో పడుటలో, మునుఁగుటలో, తేలుటలో, తేలిన వెంటనే ప్రదర్శించు సౌలభ్యములో, సర్వత్ర నీతగానియొక్క నేర్పు, నైపుణ్యము, చాతుర్యము నుండును. ఆమె యొడ్డున నిలుచుండును. అందఱు దూకఁగా చూచును. ఎవఁడెట్టి నేర్పుకలవాఁడో తానే పరీక్షించును. అందఱు దూకిన తరువాత తాను దూకును. కలిసి యీదుకొనిపోవుచుండవలయును. ఎవఁడెట్టి నేర్పుగలవాఁడో తాను పరీక్షించఁ గలఁదు. తనంత వేగముగా నెవఁడీదఁగలఁడో చూడఁగలదు. ఇట్లుండఁగా నీ రాజకుమారులలోఁ గొందఱు తొలుత నామె జలపాతము వెంట దూకుట, కొంత యీదుటయుఁ జూచినఁగాని యీ స్వయంవర లక్షణము తమకు సంపూర్తిగా నర్థము కాదనిరి. రేపు ప్రొద్దున నీ పోటీ లనఁగా నా సాయంకాలమున నామె యొడల నత్తుకొనిన చిక్కని దుస్తులతో నా జలపాతము వెంటఁ గ్రిందికి జాఱెను.

ఆమెనుఁ జూడవలయునని యీ యాఱువందలమంది గుంపు గూడిరి. అన్నిగజముల వెడల్పున్న యీ జలధార నడుమ నొకచోట నెక్క పెద్ద వేయి యేండ్ల మఱ్ఱిచెట్టు బోద యెంత లావుండునో యంత లావు ధారగాఁ బడుచున్నది. ఆమె యీ ధారలోనుండి క్రింది మడుగులోనికిఁ బడెను. ఆమె యెవ్వరికినిఁ గనిపించలేదు. కొండపై ప్రవాహమునందు దిగుట మాత్రమే చూచిరి. జలాంతర్లీనయై వచ్చెను. ధారాంతర్లీనయై దిగెను. మడువులోనుండి లేచుటయుఁ గనిపించనే లేదు. మడువు ప్రవాహము కట్టెను. వందగజములదూరాన నామె నీటిపైకి వచ్చి యీదుచుండఁగా జన మటు చూచిరి. ఈదుటలో, ధారవెంట పడుటలో, మడువునుండి లేచుటలో నామె నేర్పెట్టిదో యెవ్వరికిఁ దెలియలేదు. ఆ యాఱువందల మంది రాజకుమారులలో సేవకుఁడు త్రాగుటకు మంచినీళ్ళిచ్చినచో నా చెంబెడు నీళ్ళలో పడి చచ్చిపోవుదుమేమో యన్నంతటి జలభయముగల వాఁడుకూడ మఱునాఁటి ప్రొద్దున జలపాతము వెంట దూఁకుటకు సిద్ధపడిరి.

ఆఱువందల ముప్వురు జలపాతమునందు దూఁకిరి. పాతాళము నంటుచున్న యీ మడువునుండి యెందఱు పైకి వచ్చిరో తెలియదు. ఎంద ఱీదిరో తెలియదు. కొంద ఱీదుచున్నట్లు కనిపించినది. ఆ మలకల కొండల నడిమి యిరుకు కాల్వలలో మొసళ్ళు లేవన్నారు గాని మొసళ్లున్నవి. చాలమంది రాజకుమారులను మొసళ్ళీడ్చుకొని పోయినవి. చిట్టచివరికైన ఫలిత మేమనఁగా శూరసేన కాలకై కలింగ

రాజ్యములు మూఁడును క్షత్రియకుమారుఁడన్న పురుగు మిగులని వయ్యెను. తరువాత నాల్గు దినములకు గజయాఁతి గాంగ్రడకు జలమునందు మునిఁగి కొన్ని గంటలు నిలువఁగలిగిన వారికి మూఁడు రాజ్యములు కలిపి పాలించుట కేర్పడిన యొక క్రొత్త రాజు బహుమానము లిచ్చెను. బంగారు నాణెములు పంచిపెట్టెను. ఆ మూఁడు దేశములు నిఃక్షత్రియము లయ్యెను.

# ౭

గిరివ్రజపురమున సామంత ప్రాసాదమున జరిగిన సర్వ క్షత్రియ సమావేశానంతరము నాలు నెలల లోపుగా జరిగిన యితరరాష్ట్రములందలి సమాచారములు పూర్వాధ్యాయము లందు చెప్పఁబడినవి. అవి యన్నియు నితర రాజవంశములనుఁ గుఱించిన కథలు. ఈ యాలు నెలలలో మగధమున నెన్నియో జరిగినవి. ఆ జరిగినవన్నియు రాజకీయములు కాకపోయినను, తుట్టతుదకు రాజకీయముగానే పరిణమించవలసి వచ్చుటచేతఁ దదితర కథలుకూడ చెప్పక తప్పదు. ఏ మతమును రాజుల యొక్క బలము లేకుండ వృద్ధిపొందదు. రెండువందల యేండ్ల నాఁటి నుండియు బౌద్ధమతము రాజులయొక్క బలముచేతనే వృద్ధి పొందుచు వచ్చెను. తొట్టతొలుత బుద్ధుఁడే యుత్తర కోసల రాజకుమారుఁడగుట పుట్టుకలోననే బిడ్డ బలిష్ఠముగాఁ

బుట్టినది. ఆ బిడ్డ పెరుగుదల దానికిఁ గలిగిన బాలారిష్టములు, వేసిన మందులు, నిచ్చిన బలవర్ధ కౌషధములు, నా బిడ్డను చంపుటకు చేయఁబడ్డ ప్రయత్నములు, నివి యన్నియు నిచ్చటఁ జెప్పవలసియుండఁగా నన్నింటికన్న యొక మహాపద మగధ రాజ్యమున కలుగుటచేత వానినిఁ జెప్పుట కొంచె మాలస్యము కాక తప్పదు.

ఎప్పుడు కోసలరాజు సుమిత్రుఁడు భల్లట విదేహరాజ్యము లాక్రమించెనో, కోసల సైన్యములు మగధరాజ్యపు పొలిమేరలకు వచ్చినవని యప్పుడే నిర్ధారణమైన విషయము. కోసలులు మాగధులు స్నేహితులుగదా! సర్వక్షత్రియ సమావేశములో తలకట్లు వీరిద్దఱేకదా! వీరేకదా బ్రాహ్మణులను సర్వనిర్మూలనము చేసి వర్ణాశ్రమాచార వ్యవస్థకు నిండుసున్న చుట్టుదమని తలపెట్టినవారు. ఇప్పుడు వీరిద్దఱికే యీ యొకరి పొలిమేర మీఁది కొకరు వచ్చుటచేత నిన్నటి మైత్రి నేఁటి విరోధమయ్యెను. కోసలరాజైన సుమిత్రుఁడు సర్వరాజమర్యాదలను ధ్వంసము చేసెను. లక్షల సంవత్సరములుగా నున్న విదేహ రాజ్యమును మ్రింగివేసెను. ఇంతకంటె దౌర్జన్యము లేదు. ఇంతకంటె మిత్రద్రోహము లేదు.

కోసలదేశములందున్న బౌద్ధభిక్షుకులు శ్రావస్తీ కాశీ నగర మగధరాజ్యములయందున్న శ్రమణులకంటె నుత్తములమని యనుకొనుచుందురు. శ్రావస్తీ పురాదులయందున్న బౌద్ధులకు 'వజ్జిభిక్షుకు'లని పేరు. ఈ వజ్జిభిక్షుకులు బుద్ధుని నిజమైన మతము నవలంబించుటలేదనియు, వారియందు దురా

చారములు కలవనియు, నింకెన్నియో యారోపణలు వజ్జి భిక్షుకులమీఁద కోసల బౌద్ధభిక్షుకులు నిత్యము చేయు చుందురు. అది వేఱే కథ. అందుచేత కోసల బౌద్ధులమతము స్వీకరించిన కోసలరాజులు తా మధికులమన్న గర్వము కల వారు. సుమిత్రునితండ్రి కొద్ది యేండ్ల క్రిందనే గతిపోయెను. సుమిత్రునకు రాజ్యము వచ్చెను. తన పినముత్తాత కపిలవస్తు నగర రాజవంశమును నిర్మూలించినాఁడన్న విషయము వానికిఁ దానట్లు సర్వరాజ వంశములను నిర్మూలనము చేయఁగలనన్న ప్రత్యయమునకు విచిత్రమైన హేతువు. భల్లట దేశపుఁ బొలిమేరల లోని యా గ్రామమునందలి బ్రాహ్మణుని యజ్ఞము సుమిత్రున కొక సాకు. ఎప్పుడు భల్లట విదేహములను మ్రింగి మగధ మునిఁగిటికిఁ దన యేనుగులనుఁ దరలింతునాయని యతఁడు నిత్యము ప్రతీక్షించుచునే యుండెను. మగధరాజు మహానంది. అతఁడు వృద్ధుఁడు గనుక తాను యువకుఁడు గనుక మగధ రాజ్యమును సులభముగా జయించువచ్చునని యతఁ డాశపడు చుండును. ఆ యాశ నిరాధారమైనదని యతనికిఁ దెలియును. తెలిసియు నాశపడుట మూర్ఖుని లక్షణము. అతనికెట్లు దెలియుననఁగా మహానంది పేరునకు మాత్రమే రాజు. రాజ్యమంతయు నతని పెద్దకొడుకుఁ గాలాశోకుఁడు చూచు చుండును. సర్వాధికారము కాలాశోకునిది. కాలాశోకుఁడు ప్రధానములైన సర్వకార్యములనుఁ దండ్రికి చెప్పకుండనే చేయుచుండును. అప్రధానములైన వానినిఁ దండ్రికిఁ జెప్పును. ఇది యిట్లు చేయవలయునని నేననుకొనుచుంటిని/ తమరికి మనవిచేసి చేయుట న్యాయ్యముకదా యని మనవి

చేయుచుంటివని తండ్రితో ననును. తండ్రి ఇది యెట్లు చేసిన
నేమి? నీవు చేసిన యోచన నాకుఁ జెప్పకుండఁ జేసితివి. అది
ముఖ్యమైనది. ఇది యముఖ్యమైనది. అముఖ్యమైన కార్య
ములు నాతోఁ జెప్పి నా యంగీకారముతోడనే రాజ్యము
చేయుచున్నట్లుగా నభినయించుచున్నావని యనును. గాలా
శోకునకుఁ గోపము వచ్చినట్లు నటించును. ఆ వ్యవహారములో
తమను వ్యతిరేకాభిప్రాయము కలిగియుందురని నే ననుకొనన
లేదు. అయినచో రేపటినుండి మీ రాజ్య వ్యవహారము
మీరే చూచికొనుడనును. మహానంది తనకెందుకని యూరక
కుండును. మహానంది యొక్క తక్కిన యిద్దఱు కుమారుళ్ళు
స్త్రీలోలురు. వ్యసనులు. దుర్వ్యాపారాసక్త నిమగ్నులు. వారికి
రాజ్య ప్రసక్తియే పట్టదు. కాలాశోకుఁడే యప్రాప్తమైన
రాజుగా దేశమునందు వ్యవహరింపఁ బడుచుండెను. ఉత్తుంగ
భుజుఁడను సేనాని. ఈ యిద్దఱొక పనిఁజేసి మఱియొక పనిఁ
జేయరని నమ్మకము లేదు. దేనికో యొక లక్ష నిష్కములు
కావలసివచ్చెను. బొక్కసములోని డబ్బు తీయుటకుఁ గాలా
శోకుఁ డంగీకరించఁడు. ఉత్తుంగభుజుఁడు కొంత సైన్యమునుఁ
దీసికొని పట్టణముల మీఁదికిఁ బోవును. గొప్ప వర్తకులు,
గొప్ప ధనవంతులు నైన వారి యిండ్లకుఁ బోయి రాజునకిన్ని
నిష్కములు కావలయు నిమ్మనును. రాజునకు నీయవలసిన
పన్ని దివఱకే యిచ్చితిమి. ప్రస్తుతము మావద్ద డబ్బు లేదం
దురు. సైనికులు వారి యిండ్ల మీఁదఁ బడి దోచుకొందురు.
సేనాపతి వాకిటిలో నుండును. సైనికు లిండ్లలోనికిఁ బోదురు.
వారు లోనికిఁ బోయి చేసెడి యత్యాచారములకు మితి లేదు.

ఈ ధనవంతులు వర్తకులు తరువాతఁ గొన్నాళ్ళకుఁ బోయి మహానందితో మనవి చేసికొందురు. ఆయన కొడుకును పిలిచి యడుగును. కాలాశోకుఁడు తనకుఁ దెలియదనియు, నుత్తుంగభుజునకే తెలియవలయుననియుఁ, జెప్పఁగా నుత్తుంగభుజునకు వార్తఁ బంపఁగా నుత్తుంగభుజుఁడు వచ్చి యా పురముయొక్క రక్షక భటాధికారిని సైనిక ప్రతినిధినిఁ గనుగొని యేమి జరిగెనో మనవి చేయుదు ననును. ఆ వచ్చినవా రుత్తుంగభుజునిఁ జూచుచుఁ జూచుచు నితఁడే వచ్చెనని చెప్పలేరు. చెప్పినచో నా క్రూరుఁడు వారి నచ్చటనే వధించునేమో? వారు మఱల తిరిగి యింటికిఁ బోవుట జరుగనే జరుగదేమో! తరువాత నెలకో రెండు నెలలకో మహానంది యుత్తుంగభుజుని నా విషయమునఁ బ్రశ్నించుట సంభవించినచో, నతఁడు "నేను వార్తను కనుగొంటిని. అందు సైనికులదేమియు తప్పు లేదు. న్యాయముగాఁ గావలసిన పన్నే రక్షక భటు లడిగిరట. ఎన్ని సార్లడిగినను ధనవంతు లీయలేదట. ఆ యూరిలోని ధనవంతులు తా మొక సంఘముగా నేర్పడిరి. అన్ని యూళ్ళలో నిట్టి సంఘము లున్నవి. ప్రత్యేకముగా నా యూరి సంఘము వారు సర్వాధికారములు తామే చేయవలయుననియు, రక్షక భటు లనవసరమనియు, సైనిక ప్రతినిధి యూరికి బరువుగా నున్నాఁడనియు, వారూరకే గ్రామపుసొమ్ము తినుటయేగాని వారివలన జరిగెడి విశేష కార్యములు లేవనియు, నిట్టి యభిప్రాయములు కలవారు. అందుచేత వారీయవలసిన పన్ను సైనిక ప్రతినిధి బలవంతముగా తీసికొనక తప్పక వచ్చెను. తమరు ధర్మరాజులు గనుక దోషమంతయు నధికారులయం

దున్నట్లు తమరితో వచ్చి మనవిచేయుదు రనును. మహా
నంది నిజమే యనుకొనును. ఇట్లే యొకప్పుడు జనపదముల
మీఁదికిఁ బోదురు. వారు షడంశమును మున్నే చెల్లించి
యుందురు. మఱియొక షడంశ మిమ్మని వీరు బలవంత పెట్టు
దురు. వారు కాదందురు. చివరకు వారిని హింసింతురు. జన
పదములు ఘోషిల్లిపోవుచుండును. మగధరాజ్యమునందు
శాంతి లేదు. మగధరాజులు యథార్థమైన బౌద్ధులును కారు.
పూర్వకాలపు వైదిక ధర్మమును పరిపాలించు క్షత్రియులును
కారు. ఈ మాగధు లట్లగుటకుఁ గారణము వేఱ యున్నది.

ప్రజలు శిశునాగ వంశమెప్పు డంతరించునాయని
గూర్చుండిరి. ఉత్తుంగభుజుఁ డెప్పుడు గతించునాయని కూర్చుం
డిరి. కాలాశోకుఁ డెట్లును పదికాలాలపాటు బ్రతికెడువాఁడు
కాఁడని వారు తీర్మానించుకొనిరి. ఏ విప్లవమో రావచ్చును.
నందుఁడు రాజు కావచ్చును. నందో రాజా భవిష్యతి !
ఈ యాశతో మాగధులు బ్రతుకుచున్నారు.

సుమిత్రుఁడు మహానంది వృద్ధుఁడన్న ధైర్యముచేత
భల్లట విదేహము లాక్రమించలేదు. మాగధ ప్రజలలో
నున్న యీ విప్లవభావము వానికిఁ దెలియును. తాను దండెత్తి
వచ్చినంతనే సర్వప్రజలు తన సైన్యములోఁ జేరుదురని
యాతఁ డనుకొనెను. నిజముగా రాజు మహానంది కాఁడు.
కాలాశోకుఁడే. కాలాశోకుఁడు యువకుఁడే. వట్టి యువ
కుఁడు కాఁడు. పరమధూర్తుఁడు. సైనిక జీవి. ఉత్తుంగ
భుజుఁడు కుడిభుజముగాఁ గలవాఁడు. ఆ యుత్తుంగభుజుఁడు

కిరాతుఁడు. వానికిఁ దలిదండ్రులని లేరు. సోదరుఁడని లేఁడు. అట్టి యుద్ధకుశలుఁడు కర్కోటకుఁడున్న మగధరాజ్యము మీఁదికి సుమిత్రుఁడు పోవుట వివేకమైన పనికాదు. కాని సుమిత్రుఁడు మగధరాజ్యము మీఁదికిఁ బోలేదుగదా. భల్లట విదేహము నాక్రమించెను. తాను విదేహ మాక్రమించినంతనే మాగధులైన ప్రజలు గుంపులు గుంపులుగా తనవద్దకు వచ్చి "మహారాజా! మేమిన్ని యిక్కట్లు పడు చున్నాము. నే మేమియు మాటాడము. మేము మీ పక్షమందే యున్నాము. మీరు మా రాజును వధించి, మా రాజు కొడుకులను సంహరించి, రాజ్యమును స్వీకరించి, మమ్ము న్యాయముగా పాలించుడని యభ్యర్థింతురని యతఁడనుకొనెను. అతఁడు విదేహము నాక్రమించి పది దినము లైనది. ఏ నగర ప్రజలును వచ్చి తన్నభ్యర్థించలేదు, సరికదా! తన సైనికులు పొలిమేరలలోనున్న జనపదములు మీఁదికిఁ బోగాఁ నా జానపదులు వీరితో యుద్ధము చేయుటయు, వారికి వీరికి చిన్న చిన్న కయ్యములు జరుగుటయు, నుభయ పక్షములువారును గొంతమంది మరణించుటయు జరిగెను. ఈ వార్తలు గిరివ్రజపురమునకుఁ జేరెను. కాలాశోకుఁ డుత్తుంగభుజునితో నిప్పు డేమి చేయుద మనెను. ఉత్తుంగభుజుఁడు సైన్యమునుఁ దీసి కొని కోసలులకెదురు పోవుద మనెను. సైన్యములను సమాయత్త పఱచెను. ఇంతలోఁ గాలాశోకుఁడు నెటుపోయి యెటు వచ్చునో తండ్రికిఁ జెప్పుట మంచిదని యీ వార్త తండ్రి చెవిని వేసెను. ఆయన యిట్లనెను. "వారు మన దేశము మీఁదికి దండెత్తి రాలేదు. ఎత్తి వచ్చిన చిన్నెలు లేవు.

ఉశీనరుఁడు వారి రాజ్యములోనున్న పల్లియలోనికి వెళ్ళెను. అంతటి పండితుఁడు నంతటి వృద్ధుఁడు నట్టి యనీతికార్యము చేయవలసినదికాదు. భిన్న రాజ్యములనుండి భిన్న వర్తమానములు వచ్చుచున్నవి. కలిపురుషుఁడు వేయి వేషములు వేసి యారాజ్యమునందలి ధరాపాలకుల నందఱకు దుర్నీతులు బోధించుచున్నాఁ డన్నట్లున్నది. ఇప్పుడు మనము కోసలముల మీఁదికి దండెత్తరాదు. అతనితోఁ బోయి సామముగాఁ జెప్పవలయును. ఓయీ! యీ భల్లట విదేహదేశములు మనకుఁ బొలిమేర రాజ్యములు. వాని సుస్థితిమీఁద మన సుస్థితి యాధారపడి యున్నది. అట్టి రాజ్యములను నీవు లుప్తములను చేయుట రాజనీతికాదు. ఆర్యావర్తమునందలి సర్వరాజ్యములకు సంబంధించిన యుత్తమనీతి కాదు. కావున నీవు భల్లట విదేహములనుండి తొలఁగి, యా రాజుల బంధువులెవరో విచారించి, వారి కారాజ్యములిచ్చి, మనము తొల్లింటి వలెనే మైత్రిగా నుండుట మంచిది, అని వార్తపంపవలయును. అతఁడు దానిని నిస్సంశయముగా నంగీకరించి తాను తొలఁగి పోవును. ఈ కాలమున నేదో యొక క్షత్రియ నాశక ధూమకేతు వంకురించినట్లు తోఁచుచున్నది. నిజముగా నీ సమయమునందు తక్కిన యార్యావర్తమునందలి సర్వరాజ్యాధిపతులనుఁ గలిసి యిట్టి రాయబారము కోసలునకుఁ బంపించ వలసినవేళ. కాని, కౌరవవంశమట్లు నిర్మూలింపఁబడెను. శూరసేను లట్లు సంహరింపఁబడిరి. పాంచాలురు మఱొకరీతి వధింపఁబడిరి. హైహయు లింకొక విధమున నాశనము చేయఁబడిరి. ఇదియంతయు నీ యాఱు నెలలలో జరిగిన వ్యవహారము.

నేను వలదన్నకొలఁది నీవు క్షత్రియకుమార సమావేశము జరిపితివి. యుగములుగా వచ్చుచున్న వర్ణాశ్రమాచార ధర్మ వ్యవస్థను నాశనము చేయుటకా మీరందఱునుఁ బుట్టితిరి. మీలో మొట్ట మొదటివాఁడు బుద్ధుఁడు. అతఁడు మన క్షత్రియజాతికిఁ జేసిన యపచారమున కవధిలేదు. మన ధర్మము మనకు లేదు. వర్ణములు లేనిచో క్షత్రియుఁడే రాజ్యము చేయనక్కఱలేదు. ఎవఁడు పట్టినవాఁడే రాజ్యము చేయవచ్చును. రేపు శూద్రుఁడు రాజు కావచ్చును. ఎల్లుండి బ్రాహ్మణుఁడు రాజు కావచ్చును. అవలెల్లుండి మ్లేచ్ఛుఁడొకఁడు వచ్చి రాజు కావచ్చును. ఎవఁడు రాజైనచో వాఁడే రాజు. వానియందలి భక్తియే రాజభక్తి. ఈ రీతిగా సర్వ క్షత్రియ వంశములు చిత్ర చిత్రములుగా సంహరింపఁబడినవి. అందఱు రాజులను పిలిచి కోసలునకు నిది నీతికాదని చెప్పి పంపుటకు నితర రాజులే లేరాయెను. క్షత్రియు లందఱు పాంచాలాది దేశములయందు రాజులుగా లేకుండఁగాఁ నెవ్వరో యెవ్వరో రాజులుగా నియమింపఁ బడిరని వినవచ్చుచున్నది. ఆ నియమింపఁబడిన వారెవ్వరు? నియమించినవాఁ డెవ్వఁడు? ఇదియంతయు రహస్యముగా నున్నది. క్షత్రియకుమార సమావేశమునాఁడు మీ రందఱుఁ గలిసి నందుని లోనికి రానీయలేదు. ఆనాఁడు మొదలు నేఁటివఱకు నందుఁ డేమైనాఁడో తెలియదు. మన దేశమును వదలి లేచిపోయెను. అతఁడు మహాబలశాలి. బుద్ధిమంతుఁడు. అతనిని సేనానాయకునిగాఁ జేసికొని నీవు చక్కఁగా రాజ్యమునుఁ బాలించుకొందువని నేననుకొంటిని. నీ వీ యుత్తుంగభుజునిఁ దెచ్చికొంటివి. ఇతఁడు

చెప్పెడు నబద్ధములకు మితిలేదు. నాకుఁ దెలియుచునే
యున్నది. ఇతఁడు మూళ్ళమీఁద పడి దోఁచుచున్నాఁడు. నే
నడిగినచోఁ బ్రజలు న్యాయముగా నీవు వేసిన పన్నులిచ్చుట
లేదని బలవంతముగాఁ బుచ్చుకొనవలసి వచ్చినదని యిచ్చటి
సైనిక ప్రతినిధులు తనకు వార్తఁ బంపినట్లుగా దుష్టములైన
యబద్ధములు నాతో నాడును. నీవు రాజ్యము చూచికొను
చుంటివిగదా! మఱల నే నెందు కిందులో జోక్యము కలి
గించుకొనవలయునని నే ననుకొను చున్నాను. ఇప్పుడు
చూడుము. కోసలుని వెనుకకు మఱలి పొమ్మనుటకు మన
మెవ్వరము? సర్వార్యావర్తమునందలి రాజులందఱును కలిసి
యేవార్త పంపవలయునో యా వార్త నీ వొక్కఁడవు పంపు
టకు నీ కే మధికారమున్నది! అతఁడు పోఁడు. పదిమంది
క్షత్రియ భూపతులు కలిసి వానిమీఁదఁ బెట్టిగలిగిన యాక్షే
యేమికలదు? నీవును వాఁడును యుద్ధము చేయవలయును.
నీ ప్రజలందఱు నీయందు సుముఖులుగా లేరు. నీవు వారిని
బాధించితివి. వారి ధనము నధికముగా నడ్డదిడ్డపు పేర్లుచెప్పి
యపహరించితివి. నేను రహస్య చారులవలన వార్తలు విను
చునే యున్నాను. ఈ శిశునాగ వంశ మెప్పు డంతరించునా
యని వా రెదురు చూచుచున్నారు. ఈ యుత్తుంగ భుజుఁ
డెట్లు నశించునా యని వా రాకాంక్షించు చున్నారు. నీకునుఁ
దెలిసియే యుండును. నందుఁడు రాజైనఁగాని యీ దేశము
నం దీవిప్లవము పోదని వారనుకొనుచున్నారు."

అనఁగాఁ గాలాశోకుఁడు "నాయనగారూ! నే నేమైన
నన్నచోఁ దమకుఁ గోపము వచ్చునుగాని నందుఁడు శూద్రుఁడు.

వాఁడు రాజెట్లగును ?” అనెను. మహానంది “దేశమంతయు బౌద్ధమైన తరువాత శూద్రుఁడేమి ? క్షత్రియుఁడేమి ? బ్రాహ్మణుల నందఱిని కత్తివాదరఁ బెట్టవలయునని మీరనుకొంటిరి గదా ! ఈ దేశమున నొక్క బ్రాహ్మణుఁడే యుండెనా ! బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు మువ్వురును ద్విజులే. క్షత్రియులకు వేదములందు నమ్మకము పోయెను. బ్రాహ్మణులను సంహరింతురు. వైశ్యులు గలరు. వారికి నమ్మకము పోలేదు వారి నేమిచేయుదువు ? వారినిఁగూడ సంహరింతువా ? ఓయీ ! వైశ్యులనఁగా దేశముయొక్క జీవనము. పండిన పంట నాల్గుమూలలఁ బంచిపెట్టువాఁడు వాఁడు. నేసిన గుడ్డ నదిమంది కందిచ్చువాఁడు వాఁడు. వాఁడు లేనిచో వస్తు వినిమయమన్నది లేదు. వస్తు వినిమయము లేనిచో సంఘ జీవనము లేదు. వైశ్యుఁడు వేదధర్మమునుండి తక్కిన వర్ణముల వారిపలె నంత శీఘ్రముగాఁ దొలఁగిపోఁడు. ఇంటిలో స్త్రీ యెట్టిదో దేశములో వైశ్యుఁ డట్టివాఁడు. సంప్రదాయ రక్షకులు వారిద్దఱును. ఒక దేశమునందున్న యొక మతమునుగాని యొక సిద్ధాంతమునుగాని నిర్మూలించ వలయునన్నచో తొట్టతొలుత నది నిర్మూలింపఁ బడవలసిన చోటు వైశ్యకులము. వారిని నీవు నిర్మూలించలేవు. అది సాధ్యము కాదు. వారిని నిర్మూలించినచో దేశమే లేదు. జాతియే లేదు. అందుచేత బ్రాహ్మణులను నిర్మూలించి యేమి ప్రయోజనము ? అదియుకాక నోయి కొడుకా ! కాలాశోకుఁడా ! ఇంకొక్కమాట చెప్పెదను. బుద్ధుని గొప్పదన మేమున్నది ? బుద్ధుని గొప్పవానినిగాఁ జేసినవాఁ డెవ్వఁడో తెలియునా ?

కాశ్యపుఁడు. కాశ్యపుఁ డెవ్వఁడు ? బ్రాహ్మణుఁడు. ఆనందునివలన బుద్ధుఁడు గొప్పవాఁడు కాలేదు. కాశ్యపుని వలన నైనాఁడు. బుద్ధుఁడు మరణించి నప్పుడు వాని కొందఱు శిష్యులు దుఃఖపడుచున్నారు. అప్పుడు వారిలో సుభద్రుఁ డను నొక భిక్షుకుఁడు కలఁడు. ఆ యేడ్చుచున్న శిష్యులతో సుభద్రుఁ డిట్లు చెప్పెను. "ఓయీ ! యెందు కేడ్చెదరు ? పీడ వదలి పోయినది. బ్రతికి యున్న న్ని దినములు మనలను బ్రతుకనిచ్చినాఁడా ! ఆపని దోషము, ఈపని దోషమని యుపన్యాసము లిచ్చెడివాఁడు. తానుమాత్రము సరిగా నుండెనా ? తన దగ్గఱివారు తన కెంత చెప్పిరో యంతే జేసెడి వాఁడు. ఆయన యేమియు దేవుఁడు కాఁడు. దేవుఁడైనచో నాకలియు నిద్రయు పరితాపమును మనకువలెనే యాయనకు నెందు కుండవలయును? ఆయన బ్రదికి యున్ననాళ్ళలో తన వెన్నెముక యంట నెప్పుడును బాధగా నున్నదను చుండెడి వాఁడు. భగవంతున కట్టి బాధయుండునా ? ఆయన మనకు కొన్ని మంచిమాటలు చెప్పిపోయెను. వాని నాచరింతము. అంతియేగాని యాయనను గూర్చి విలపింప వలసిన యవ సరము నాకుఁ గనిపించుట లేదు." అని సుభద్రుఁ డనఁగాఁ దక్కినవా రందఱు అంగీకరించిరి. అప్పుడు కాశ్యపునకు భయము వేసెను కాశ్యపుఁడు మహాసంఘము నేర్పాటు చేసెను. బుద్ధుని మాటలన్నియు ప్రోవుచేసెను. దాని నొక వేదముగా నిర్మించెను. కావున బౌద్ధమతమును నిలబెట్టిన దెవరు? బ్రాహ్మ ణుఁడు. అప్పుడు గాదు. తరువాత మాత్రము. దానిని బ్రాహ్మణులే నిలబెట్టుచు వచ్చిరి ? ఆ బ్రాహ్మణులు బౌద్ధ

మతమునకు వ్యతిరేకులని మీరు వారిని సంహారింపఁబోయె దరు. ఈ దేశములో నేక్రొత్త మతము వచ్చినను బ్రాహ్మణుఁడై పుట్టినవాఁడే దానికిఁ బ్రాణము పోయును. కొందఱు బ్రాహ్మణులు ప్రాణము పోయుదురు. తక్కిన వర్ణములవారు మిగిలిన బ్రాహ్మణుల ప్రాణములు తీయుదురు. కనుక నేఁడు దేశములో క్షత్రియ రాజ్యములు లేకుండ పోయినవి. ఆఱు నెలలలో నింత పని జరిగినది. ఎవఁ డీపని చేసెనని ప్రశ్న పుట్టెఁగా - నీకును నీ యుత్తుంగ భుజునకును నీ ప్రశ్న పుట్టినదో లేదో నాకుఁ దెలియదు. నాకుఁ బుట్టినది - నందుఁ డీ పని చేసినాఁడని నే ననుకొనుచున్నాను. అతఁడే కోసల రాజునుఁ దీసికొనివచ్చి మన గమిడి ముందుంచిన వాఁడని నే ననుకొను చున్నాను. ఆ నందుఁ డెచ్చట నున్నాఁడో వెదకింపుము. వానితో సంధి చేసికొనుము. వానిని సేనాధిపతినిఁ జేసికొనుము. వాఁడు నీకు తమ్ముఁడు. ఉత్తుంగభుజుని వదలిపెట్టుము. ఇప్పు డుత్తుంగభుజుని సాయముతోఁ గోసలుని మీఁదికి యుద్ధమునకుఁ బోవుదువు. అతఁడు నీ మీఁదికి యుద్ధమునకు వచ్చినాఁడు. వచ్చితి నన లేకున్నాఁడు. నే నూరకే వచ్చితిని; మీ మీఁదికి రా లేదనుటకు వీలైన స్థితిలోఁ గూర్చున్నాఁడు. నీవు సైన్యముఁ దీసికొని యచ్చటికిఁబొమ్ము. నీవు యుద్ధమునకు వెళ్ళినట్లే కదా! అతఁడు మిమ్మెదిరించినచో నతనిని మన మేమియు ననుటకు వీలు లేదుగదా! ఇది స్థితి. ఆలోచించు కొనుము. అందుచేత నామాటలు విని యెవ్వరినైన వాని వద్దకు రాయబారులనుఁ బంపుము. అతనితో నీతివాక్యములఁ జెప్పఁగల వారిని వెదకి పంపుము. నందుని

స్నేహితుఁ డొకఁడున్నాఁడు. అతఁడు బ్రాహ్మణుఁడు. అతఁ
డును యువకుఁడే. అతనిపేరు నాకు జ్ఞాపకము లేదు. విచిత్ర
మైన పేరు. దైత్యుఁడా? కాదు. పూర్వ సుపర్వుఁడా కాదు.
కాదు. రాక్షసుఁడు. అతఁడు మహా వివేకి. అతఁడు పట్టణ
ములో నుండెనేమో కనుగొనుము. అతనినిఁ బిలిచి యీ
రాయబారమతని చేతఁ బంపింపుము. వాఁడేమి చెప్పునో వానికే
తెలియును. కాని సైన్యములనుఁ దీసికొనిపోయి దూరముగా
నుంచుము. రాయబారము వ్యర్థమైనచో యుద్ధము తప్పదు
గదా! దానికి సిద్ధపడి రాయబారము నెఱపుము. ఇది రాజ
నీతి. నీ కిష్టమైనచో నేను చెప్పినట్లు చేయుము. ఈమాట
లుత్తుంగభుజునితోఁ జెప్పనేవద్దు. చెప్పినచో నతఁ డింకొక
మాట యాడినచో దానినిఁ బాటింపవద్దు. నన్నడిగితివి
గనుకఁ జెప్పితిని. కోసలులు మనమీఁద గెలిచినచో ముసలి
వాఁడనని నన్ను మిగుల్చఁడు. నాకు తెలియును. నాకా
భయమును లేదు. ఈ రాజ్యమునందు శిశునాగ వంశమునకు
చివరిరోజులు వచ్చినవని కార్తాంతికులు చెప్పిరి. మహా
పండితుఁడైన యశీనరుఁడే నాతోఁ జెప్పెను. అట్లు వ్రాసి
యున్నచో మనము తప్పింపఁ గలమా యన్న మొండి వేదాం
తము పనికిరాదు. ఇట్టి వ్యర్థవాదములు మూర్ఖులు చేయుదు
రన్న మూర్ఖవాదనయు పనికిరాదు. ఒక కార్యమునందుఁ
బౌరుషము తొంబదిపాళ్లు, దైవము పదిపాళ్ళు నుండునందురు.
నీవు పౌరుషము వెలయింపుము. ఈరాయబారమును పంపుము.
రాక్షసుని కొఱకు వార్తఁ బెట్టుము. అతఁడు మహానగరమున
నున్నాఁడో, నందునితో కలిసి వెడలిపోయినాఁడో తెలియదు.

హైహయ, పాంచాల, కౌరవ, శౌరసేనాది రాజ్యములు చిత్రముగా నిట్లు తాఱుమాఱైన వనఁగా నది రాక్షసుని యొక్క నీతియని నేను భావింతును. రాక్షసుఁడు స్వయముగా వెళ్ళినాఁడో, ఇంటివద్దనుండి నందునకు సందేశములు వేసి పంపి యాచరింపఁ జేసినాఁడో? హైహయుని నొక బ్రాహ్మణుఁడు గండ్రగొడ్డలితో నఱకెనని విన్నాను. అతఁడు రాక్షసుఁడని నా యనుమానము. ఆ రాక్షసుఁడు వట్టి బ్రాహ్మణుఁడు కాఁడు. యుద్ధవిద్యా విశారదుఁడు. నందునితోపాటు దిన దిన వ్యాయామము చేసెడివాఁడు. వాఁ డెంతకైనఁ దగును. అతఁడు నగరమున నున్నాఁడేమో పోయి కనుగొను' మనెను.

కాలశోకుఁడు కొంత భయస్థుఁడు. అతనిని బెదరించినచో బెదరెడు లక్షణ మతనియందున్నది. అతనికి దృఢాభిప్రాయములు లేవు. ఉత్తుంగభుజుఁడు దానిని గట్టిగాఁ గాదన్నచో నతఁడు చెప్పినట్లే వినును. తండ్రి యిప్పుడు చెప్పిన మాటలు సమంజసములుగాఁ గనిపించినవి. తానుపోయి యుత్తుంగభుజునితో నివి జెప్పినచో నతఁడు ఖడ్గవాది, యుద్ధమే చేసినచో తన దేశమునందు తండ్రి చూపించిన దోషము లున్నవి. ప్రజలు తన కనభిముఖులగుట తెలిసిన విషయమే. ప్రజలు యుద్ధము చేయువారా? పెట్టువారా? సైన్యములు మనవే. యుద్ధములు చేయునవి సైన్యములుకాని ప్రజలు కారుగదా! అన్న మూర్ఖత యుత్తుంగ భుజునకుఁ గలదు. ఉత్తుంగభుజుఁడు సైన్య సమీక్షణమునకు వెళ్ళెను. తానొక సేవకునిఁ బిలిచి నందుని స్నేహితుఁడైన రాక్షసునిఁ బిలిచికొని రమ్మనెను. వాఁడు పోయెను. రాక్షసుఁ డెచ్చట నుండియో

యగ్రహారమునకే తనయింటికి వచ్చెనట. కాలాశోకుఁడు రమ్మను
చున్నాఁడని సేవకుఁడు చెప్పఁగా రాక్షసుఁడు నివ్వెఱపోయెను.
తనకుఁ గాలాశోకుఁడు వార్త నంపుటయేమి? ఇది యేమైన
ద్రోహమా? తన రహస్యములు కాలాశోకునకుఁ దెలిసెనా?
ఎట్లు తెలిసెను? కాలాశోకునకుఁ దెలిసినచో నతనికిఁ దెలిసి
నన్న విషయము తనకు ముందే తెలియవలయును. ఆ వచ్చిన
సేవకునితో రాక్షసుఁడు కాలాశోకుఁ డొక్కఁడే యుండెనా?
ఉగ్రభుజునితోఁ గలసి యుండెనా? యని యడిగెను. ఆ సేవ
కుఁడు 'స్వామీ! సేనాపతి మహానగరములో లేఁడు. కోసల
రాజు విదేహము నాక్రమించి మన దేశము మీఁదికి దండెత్తి
వచ్చుటకు సిద్ధముగా నున్నాఁడుగదా! అందుచేత సైన్యము
లను సమాయత్త పఱచు ప్రయత్నము మీఁద నాయన
వెళ్ళినాఁ' డనెను. రాక్షసుఁడు మఱల నడిగెను. "కాలా
శోకుఁడు ప్రొద్దుటినుండియు తా నొక్కఁడే యుండెనా? ఎవ
రితోనైన నింతవఱకు మాటాడు చుండెనా?" యని యడు
గఁగా సేవకుఁడు "ప్రొద్దుటి నుండియు యువరాజుగారు మహా
రాజుగారితో మాటాడుచుఁ గూర్చున్నారు. బయటకువచ్చి
యెంతోసేపు కాలేదు. తమరినిఁ దీసికొని రమ్మని నన్నుఁ
బంపినార' నెను. ఐనచో వచ్చుచున్నానని రాక్షసుఁడు బయలు
దేరెను. కాలాశోకుఁడు రాక్షసునితో మున్నెన్నఁడు మాటా
డిన వాఁడు కాఁడు. రాక్షసుఁ డచ్చోట నున్నాఁడనఁగా
మొగముగూడ నటు ద్రిప్పినవాఁడు కాఁడు. నందుఁడు
శూద్రుఁడు. పట్టి శూద్రుఁడు కాఁడు. తన తండ్రికి శూద్రా
పత్యమునందు జన్మించినవాఁడు. ఇది కాలాశోకునకు మహా

కోపకారణము. ఆ నందుఁడు నీచాతి నీచుఁడని వాఁడు మనిసి యే కాఁడని కాలాశోకుని భావము. ఆ నందునకు స్నేహితుఁడై నవాఁడు మఱియు నీచుఁడు. వాఁడు బ్రాహ్మణుఁడైనచో వాని నీచత కవధియే లేదు. కాలాశోకునియొక్క భావ మిట్టిది. తన్నుఁ గుఱించి యాతఁ డట్లు భావించునని రాక్షసునకుఁ దెలియును. అయినను రాజుకోడుకు. ఱేపతఁడే రాజగునేమో తెలియదు. పిలిపించినప్పుడు పోక తప్పదు. ప్రొద్దుటనుండియు తండ్రితో మాటాడుచున్నాఁడు గావున మహారాజు తన్నుఁ గూర్చి యేదో మంచిగాఁ జెప్పియుండును. అందుకోసమే పిలిపించి యుండును. అందుచేత వెళ్లెను.

కాలాశోకుఁడు రాక్షసుని చూచి స్వాగతము చెప్ప లేదు. గౌరవను నెఱపలేదు. మందహాసము చేయలేదు. కూర్చుండు మనలేదు. కాలాశోకునకు బ్రాహ్మణులన్నచో నరకాలి మంట నెత్తికెక్కును. ఈ బ్రాహ్మణు లీదేశము నం దెందు కున్నారు? వీరివలననే దేశము చెడిపోయినది. బౌద్ధ మతము పుచ్చుకొన్న బ్రాహ్మణుఁడైనచోఁ గొంత మన్నించ వచ్చును. వీఁడింకను విభూతి పిండికట్లవాఁడు. రుద్రాక్షహార ములవాఁడు. కాని యీస్థితిలోఁ దనతండ్రి చెప్పిన నీతి పాలించుటకు వీఁడుతప్ప మఱియొకఁడు యోగ్యుఁడు కనిపించుట లేదు. కాలాశోకుఁడు రెండు మూఁడు మాటలలో తన తండ్రి చెప్పిన కార్యమును రాక్షసునితో నివేదించెను. "నీకుఁ దెలియునో లేదో కడచిన రెండు మూఁడు నెలలలో నార్యా వర్తములోని గొప్ప రాజవంశము లన్నియు గారడీ చేసినట్లు మటుమాయమై పోయినవి. కోసలరాజు సుమిత్రుఁడు భల్లట

విదేహాము లాక్రమించి మగధరాజ్యపు పొలిమేరలలోఁ గూర్చున్నాఁడు. ఆర్యావర్తమునందలి సర్వ ధరాపాలకులు సమావేశమై యిప్పుడు. కోసల రాజు "నీవు చేసిన పని మంచిది కాదు. వెంటనే తొలఁగిపొమ్మని మందలించవలసిన స్థితి. తక్కిన రాజులెవ్వరును లేరు. అందఱున్నట్లు నటించి సుమిత్రునితో సర్వ రాజసక్షమున నీ మాటలు చెప్పవలసిన బాధ్యత యున్నది. ఆపని నీవు చేసిపెట్టఁగలవా? మహారాజు నీవు చేయఁగలవన్నారు. అందుచేత నీకు వార్త పెట్టితి" ననెను. రాక్షసుఁడు తనలో తాను నవ్వుకొని. "మహారాజుల యాజ్ఞయైనచో వెళ్లెదను. నేనొక్కఁడను వెళ్ళినచో సుమిత్రుఁడు నన్ను బంధించునేమో! వధించునేమో! కనుక నాకు తగినంత సిబ్బంది నిచ్చినచోఁ బోవుదు" ననెను. కాలాశోకునకు నతనిమాట పచ్చి వెలగకాయ యయ్యెను సిబ్బందిని పంపుట యనఁగా సుత్తుంగభుజుని యంగీకారము కావలయును. అతఁ డంగీకరించఁడు. ఏమి చేయవలయును? కాలాశోకుఁ డిట్లనెను. "సుమిత్రుఁ డెంతటి దుశ్శీలుఁడైనను దూతను వధించునా? వధింపఁడ" నెను. రాక్షసుఁడు "అది క్షత్రియ ధర్మము. ఆయన క్షత్రియుఁడు కాఁడ" నెను. కాలాశోకునకు నిలువెల్ల నొడలలో మంటలు లేచెను. తానుఁ గూడ క్షత్రియుఁడు కాఁడన్న మాటయేకదా? ఏమి చేయవలయును? రాక్షసుని దండించవలయునా? కార్యము కొనసాగుట యెట్లు? కాలాశోకుఁ డిట్లనెను. "క్షత్రియుఁడన్నది భగవంతుఁడు చేసినది కాదు. వృత్తిచేత వచ్చినది. రాజ్యము పాలించుచున్నాఁడు కనుక క్షత్రియుఁడే" రాక్షసుఁడు "నేను

మంత్రిని కాను. ఒక సేనాపతిని కాను. ఒక యధికారిని గాను. నేను రాయబారమునకు వెళ్ళితిననఁగా నతఁడు దాఁదరించవలసిన యవసరమే మున్నది? నేను రాజపక్షమున వచ్చితినని నేను చూఁపగల నిదర్శనమేమి?" యని యడిగెను. కాలాశోకునకు నీ సమాధానము మింగుడు పడలేదు. అతని కేమి చెప్పవలయును? రాజముద్రిక యిచ్చుటకుగాని రాజఖడ్గమిచ్చుటకుగాని అటులఁ దండ్రి యంగీకరింపవలయును. ఇటుల నుత్తుంగభుజుఁ డంగీకరింసవలయును. చివరకు కాలాశోకుఁ డిట్లనెను. "నీవు మాగధుఁడవు. బ్రాహ్మణుఁడవు. రాజవంశమును రక్షించవలసిన బాధ్యత నీయందున్నది. నీవు రాయబారమునకు వెళ్ళవలయును. నన్నడిగినచో సుమిత్రుఁడు నిన్ను గుర్తు చూపింపుమని యడుగఁడు. నీవు వెళ్ళి రాజ్యవిషయములు మాటాడుచుందువు. ఆ ప్రసక్తి లేనివాఁడు వచ్చి యా మాటలెందుకు మాటాడును? నీవు వెళ్ళఁదలచికొన్నచో పొమ్ము. లేనిచో నే నేమియు చేయలేను." రాక్షసుఁడు "నేను బ్రాహ్మణుఁడను, నా రాజవంశమును రక్షించుట నా కర్తవ్యము. రాజు నన్ను వధించినను నేను బ్రాహ్మణుఁడను గాన నా ధర్మమును నేను న్యాయముగానే నిర్వర్తింతు"ననెను.

రాక్షసుఁడు వెడలిపోయెను. కాలాశోకుఁడు కుప్పకూలిపోయెను. బ్రాహ్మణులు, బ్రాహ్మణులలో సత్పురుషులైనవారు, వారి ధర్మమును వారు పరిత్యజించరు. చావనైన చత్తురు. వారినిఁ జంపుటకేకదా సర్వ క్షత్రియకులము సమావేశమైనది. నా తండ్రియు, సుశీనరుఁడును క్షేమకుఁడును,

వృద్ధులైయుండి సర్వబ్రాహ్మణ తత్క్షణ వినాశనము తత్సభలో తీర్మానింపఁ బడకుండ నడ్డుపడిగిగాని లేనిచో నీనాఁడీ రాక్షసుఁ డుండెడివాఁడు కాఁడు. ఇతఁడు కోసలునితో రాయబారము నెఱపును. నెఱపఁడు. రాయబారిని నొకనినిఁ బంపించుటకైన నితఁడీనాఁడు మిగిలియున్నాఁడు. కనుక పంపించుటకు వీలైనది. రాయబారితనము సులభమైనది కాదు. దానికిఁ బాండిత్యము కావలయును. ధైర్యము కావలయును. రాజనీతి నెఱుంగవలయును. లోకజ్ఞత కావలయును. ఇతర రాజ్యములయందు జరుగు సర్వ వార్తా పరిజ్ఞానము కావలయును. ఇవియన్నియు నితనియందు కలవా? ఇతఁ డెంత సేపటికిఁ దానధికారిని కాననును. తాను రాజదూతయగుటకు చూపింపవలసినచిహ్నములు తనయందు భాసింపవలయునను. అంతేకాని నేనా రాయబారమును నెఱపలేనని యనఁడే. మూఢుఁడనై బ్రాహ్మణులను సంహరింతునని యనుకొంటివి. బ్రాహ్మణుఁ డేమి? బ్రాహ్మణేతరుఁ డేమి? పరమేశ్వరుఁ డెవనియం దేవివేకమును సమకూర్చునో, దుష్టులైన రాజనీతివేత్తలు తీవ్రసిద్ధాంతములను నిర్మించికొని యొక శాఖవారిని హింసించి మానవలోకమునకు జరగడు కళ్యాణమును నశింపచేయుచుందురు.

## ౮

సుమిత్రునితో సేవకుఁడు 'మహారాజా! కాలాశోకుని వద్దనుండి రాయబారి వచ్చినాఁడు. తమ దర్శనము వాంఛించుచున్నాఁ'డనెను. సుమిత్రుఁడు కాలాశోకుఁడు మనకు రాయబారమంపుట యెందుల కనెను. ఐనను పోయి రాయబార మెందుకో నతఁడెవరో తెలిసికొని రమ్మనెను. అతఁడు పోయి మఱలఁ దిరిగి వచ్చి 'స్వామీ! నాతో నేమియుఁ జెప్పఁడఁట. ప్రభువులతోడనే మాటాడునట' యనఁగా రాజు నతఁడెవరో కనుగొని రమ్ము. నాఁగా సేవకుఁడు పోయి మఱల వచ్చి యాయన బ్రాహ్మణుఁడట. పేరు రాక్షసుఁడట యని చెప్పఁగా రాజు నవ్వి బ్రాహ్మణుఁడా! నావద్దకెందుకు వచ్చుచున్నాఁడురా! మృత్యువునుఁ గోరి వచ్చుచున్నాఁడా! పేరు రాక్షసుఁడా! రాక్షసులని పురాణములలోఁ జదువుటయేగాని యెప్పుడును చూడలేదు. కోఱలున్నవిరా! ఎంత యెత్తున్నాఁడు. జుట్టు చీకిరి బాకిరిగానున్నదా? మొదలైన ప్రశ్నలు వేసి నవ్వెను. చివఱకు సరే నేనే చూచెద నెట్లుండునో తీసికొని రమ్మనెను. 'యథా రాజా తథా ప్రజా' యని రాజునకు బ్రాహ్మణు లన్నచో నిరాదరణము గనుక సేవకునకుఁగూడ నిరాదరణమే. అందుచేత వాఁడు రాక్షసునివద్దకుఁబోయి "యేమయ్యా బ్రాహ్మణుఁడా! నీవు రాక్షసుఁడవేమి? నీకు కోఱలు లేవే? చింపిరిజుట్టు లేదే?

నీవు రాక్షసుఁడ వేమిటి? మారాజు నిన్నుఁ జూచుటకు
తహతహ లాడుచున్నాఁడు. ఆయన పూర్వ మెప్పుడును
రాక్షసులనుఁ జూడలేదట. రాక్షసులు పురాణములందే
యుందురుగాని మానవ లోకములో నున్నట్లు చూడలేదు.
అయినను నీ యదృష్టము పుచ్చినది. రాజుగారు నిన్నుఁ
జూచుట కంగీకరించినారు. కాని యొక్క యనుమాన
మున్నది. నీవు బ్రతికి బయటఁ బడుదువా యని. నీవు బ్రాహ్మ
ణుఁడ వగుటచేత రాజుగారికిఁ గోపముగా నున్నది. బ్రాహ్మణు
లన్నచో రాజుగారు మండిపడును. కనుక రాజుగారివద్దనుండి
సుఖముగా బయటికి వచ్చినచో నీ వదృష్టవంతుఁడవే. నన్నడిగి
నచో మాటాడకుండ నింటికి తిరిగి పొమ్మని చెప్పుదును.
కాదు, నాకు చచ్చిపోవుటయే యిష్టమని నీ వనుకొన్నచో
రాజుగారివద్దకుఁ బొమ్ము. నీ యిష్ట మనెను. రాక్షసుఁడు
నన్ను రాజుగారివద్దకుఁ దీసికొని పొమ్మనెను. రాక్షసుఁడు
రాజువద్దకుఁ బోయెను. రాజు తా నొక యాసనమునఁ
గూర్చుండెను. అచట మఱియొక యాసనము లేదు. ఇంకొక
యాసనముండఁగా సుమిత్రుఁడు దానినిని తీసివేయించెను.
రాక్షసుఁడు నిలుచుండియే మాటాడవలయును. రాక్షసుఁడు
పోయి రాజుగారి నమస్కారము చేయలేదు. ఆశీర్వదింపలేదు.
ఎదురుగా నిలుచుండెను. రాజు రాక్షసునివంకఁ జూడనైన
లేదు. రాక్షసుఁడు మాటాడవలయును. ఆ మాటాడు
చుండఁగా రాజొకసారి వానివంకఁ జూచినచోఁ జూడవచ్చును.
లేనిచో లేదు. రాక్షసుఁ డట్లే, నిమేషకాలము నిలుచుండి
యిట్లనెను. "రాజా! నేను కాలాశోకుని రాయబారిని.

రాయబారులను సుక్షత్రియులు గౌరవింతురు. నేను కాలా
శోకునితోఁ జెప్పితిని. ఆయన క్షత్రియుఁడు కాఁడు, గావున
నన్ను గౌరవించకపోవచ్చును. నన్ను వధింపవచ్చు నని.
కాలాశోకుఁడు దూతను వధించుట సుక్షత్రియులు చేయరని
చెప్పెను. నేను కాలాశోకునితో మీ రందఱు క్షత్రియులు
కారుగదా! మీరు బౌద్ధులాయెను. బౌద్ధులలో వర్ణభేదములు
లేవు. సుక్షత్రియుఁడైనవాఁడు రాయబారిని వధించక పోవ
చ్చును గాని క్షత్రియుఁడు కానివానికి నియమ మేమున్నది"
అంటిని. ఆయన మీరు సుక్షత్రియు లనియే చెప్పెను. మీది
యిక్ష్వాకు వంశమనియు, భగవంతుఁడైన శ్రీరామచంద్రుఁడు
మీ వంశములో పుట్టెననియు సృష్ట్యాది రాజవంశము మీరే
యనియు మిమ్ము గుఱించి యెంతయో ప్రశంస చేసెను. నేను
కాలాశోకునితో నెంతయో చెప్పితిని. ఈ మాటలు కోసల
రాజుతోఁ జెప్పినచో నాయనకుఁ గోపము వచ్చును. రామ
చంద్రుఁడు భగవంతుఁడేమి? భగవంతుఁ డొక్క బుద్ధుఁడే.
వేఱే భగవంతుఁడు లేఁ డంటిని. పురాణములలో నితిహాస
ములలో వ్రాసిన కథలన్నియు నబద్ధములు. బ్రాహ్మణులు
వ్రాసిన వంటిని. కాలాశోకుఁడు వినలేదు. వినలేదు సరికదా,
ఓయీ! నీవు బ్రాహ్మణుఁడవై యిట్లు మాటాడుదువా
యనెను. నే నంటినిగదా! అయ్యా తమరికిఁ గోపమెందులకు?
బౌద్ధమతమును నేఁడు సముద్ధరించుచున్నవా రెవరు? కాశ్యపుఁ
డెవరు? మఱియొక ప్రసిద్ధుఁడైన బౌద్ధభిక్షువు బ్రాహ్మణుఁడు.
కాని వాఁ డెవఁడు? బ్రాహ్మణులే బౌద్ధమతమును పైకి తీసి
కొని వచ్చుచున్నారు." అంటిని. కాలాశోకుఁడు మీ

బ్రాహ్మణులకున్న యహంకారము పోనిచ్చితివి కాదు. క్రింద
పడికూడ గెలుపు మాదే యందురు. తీతువుపిట్ట కాళ్ళెగఁబట్టి
యాకాశము తానే మోయుచున్నా ననును. మా బ్రాహ్మణ
జాతి యట్టిది. ఈ మాటలు నాదగ్గఱకాదు. పోయి కోసల
రాజైన సుమిత్రునివద్ద మాటాడుము. నీ పస దెలియును.
పొమ్మనెను. నేనీ సంగతి తేల్చికొనుటకు కోసలరాజువద్దకుఁ
బోవలయునా? నేను చేయవలసిన రాయబారమేదైననున్నదా?
యని యడిగితిని. ఈ సంగతియే తేల్చికొనుటకుఁ బ్రత్యేక
ముగా నేను సుమిత్ర మహారాజుదగ్గఱకుఁ బోనక్కఱలేదు.
బ్రాహ్మణులను సంహరింపవలసినచో నన్ను వెదకికొనుచు
నాయనయే వచ్చును. మీ రేదైన రాయబారమును తీసికొని
వెళ్ళుమన్నచో వెళ్ళెద నంటిని. ఆయన తమరికొక రాయ
బారమును చెప్పుమని నన్ను పంపించెను. ఆ రాయబారము
తమరు చిత్తగించెద రేని వినిపింతు ననెను. సుమిత్రుఁడు కొంత
సేపు మాటాడక చివరి కిట్లనెను. కాలాశోకునకు రాయబారము
పంపించుటకు నీకన్న నింకెవ్వఁడు దొరకలేదాయని. అనఁగా
రాక్షసుఁడు "దొరకలేదు. ఉత్తుంగభుజుఁడు మీతో యుద్ధము
చేయుటకు సైన్యములను సమాయత్తపఱచుటకు వెళ్ళెను.
నన్ను తమవద్దకు రాయబారము పంపవలసినదని మహారాజు
గారు కొడుకుతోఁ జెప్పినారట. అందుచేత వార్త నంపించి
నన్ను మీవద్దకుఁ బంపిరనెను. సుమిత్రుఁడు:—నిన్ను మహారా
జెఱుఁగునా? ఆయనకు నీయందంత యభిమాన మెందులకు?
రాక్ష:— నేను పూర్వము మహారాజదర్శన మెన్నఁడును చేయ
లేదు. తమరు నందు నెఱుఁగుదురా? మహారాజునకు

శూద్రాపత్యమునందు జనించినవాఁడు. మహావీరుఁడు. మహా
బలశాలి. ఆయనకు నాగ్గేనుఁగుల బల మున్నది. మహారాజనీతి
విద్యావిశారదుఁడు. అతఁడీపని చేయఁగలఁ డీపని చేయ లేఁడన్న
సందేహము లేదు. అతఁడు జలపాతములమీఁదినుండి దూకును.
క్రోసెడు మేర నదిపైకిఁ దేలకుండ నదీవేణిక ననుసరించి యీదఁ
గలఁడు. గొడ్డలితో యుద్ధము చేయఁగలఁడు. గదాయుద్ధము
చేయఁగలఁడు. ఆయన శక్తులు చెప్పుటకు నేను కాదుగదా
వేయి జిహ్వలుగల యాదిశేషువు చాలఁడు. ఆయనకును
నాకు స్నేహము. నందుఁడన్నచో కాలశోకున కెంతవిరోధమో
మహానంది కంత ప్రేమ. కాలాశోకునకుఁ గోపముండుటయు
న్యాయమే. పురుషుఁడు తనకున్న దుష్టకామమునుఁ గూర్చి
విచారించుకొనఁడు. ఇతరులయొక్క కామప్రవృత్తిని విమర్శిం
చును. అందులో ధనవంతులబిడ్డ తన తండ్రియొక్క కామ
ప్రవృత్తినిఁ జూచి యసహ్యించుకొనును. వాని కెప్పుడు మన
స్సులో నొక భయము. ఆ తండ్రియొక్క యితర స్త్రీల
యందుఁ గలిగిన సంతానమువలన తన యాస్తి నష్టమగు నని.
మహానందికి నందునిమీఁద మిక్కిలి ప్రేమ కలదు. అతఁడును
కొడుకే కాని క్షత్రియాపత్యమునందు కలుగ లేదుగనుక వానికి
రాజ్యార్హత లేదు. రాజ్యార్హత లేకపోనిమ్ము. క్షత్రియుఁడైన
కాదాయెను. క్షత్రియులైన తక్కిన సంతానమునకున్న గౌరవము
కూడ వానికుండదు. తానేమో వృద్ధుఁడైనాఁడు. వృద్ధుఁడు
కానన్ని దినములు నందుని క్షత్రియ సంతానమువలెనే ముద్దు
మురిపెములు జరుపుకొన్నాఁడు. ఇప్పుడు కాలాశోకుఁడు
సర్వాధికారమునుఁ జూచికొనుచుండెను. ఇతఁడు నందునిఁ

బలుమార్లు పరాభవించెను. అందుచేత రాజునకు నందుని మీఁద నెక్కువ ప్రేమ కలిగినది. నేను నందుని స్నేహితుఁడ నగుటచేత రాజునకు నాయందుఁగూడ దయ కలదు. తమ వద్దకు రాయబారము పంపుటకు మఱి యెవ్వరు లేకపోవుట వలన కాలాశోకుఁడు నన్ను పంపెను. తమరు రాయబారమును మనవిచేయుమన్నచో మనవిచేయుదు ననెను. సుమిత్రుఁడు:- నందుఁడంతటి గొప్పవాఁడా? మేము రాజులము. మావద్ద పరులను పొగడరాదు. పొగడినచో మేము సహింపము. రాక్షసుఁడు:- "నిజమే. కాని నాకు పొగడకతప్పదు. నాకోసము నేను పొగడలేదు. తమరికోసమే పొగడితిని. తమరు మగధరాజ్యముమీఁదికి దండెత్తి వచ్చిరో లేదో తెలియదు. భల్లట విదేహ రాజ్యములను మీ రాక్రమించిరి. అది సర్వార్యావర్త ధరాపాలుర దృష్టిలో చేయరానిపని. అందఱు ధరాపాలురు తమరు చేసిన యీ పనికి సంగీకరించుట లేదు. ఇది న్యాయముకాదు. ఆర్యావర్తమునందలి సర్వక్షత్రియానుకూల రాజనీతికాదు. కావున తమరు విదేహభల్లట దేశములనుఁ బరిత్యజించి వెంటనే తమ యయోధ్యకుఁ బోవలయుననియు, భల్లట విదేహరాజ్యములు తమరిచేత సంహరింపఁబడిన రాజవంశములో నెవ్వరినో యొకరినిచూచి వారికి రాజ్య మప్పగించి మీరు మీ రాజ్యమునకు వెడలిపోవుట న్యాయమనియు యభిప్రాయపడుచున్నారు. ఈ సంగతి తమరితో మనవిచేయుటకు కాలాశోకుఁడు నన్నుఁ బంపించెనని యనెను. అంత సుమిత్రుఁడు కొంతసే పూరకుండి మఱల నిట్లనెను. "ఏమయ్యా! ఇంతసేపు మాటాడితివి. ఎంతసేపటికిని

కాలాశోకుఁడని యందువుగాని మహారాజుగా ననవు. ప్రభు
వనవు. నీకంత గర్వమేమి?" రాక్షసుఁడు:- నాకు గర్వము
కాదు. నాకు ప్రభువు మహానంది. ఆయన తమువాఁడు సంకుఁడు.
కాలాశోకుఁడు నాకు ప్రభువు కాఁడు. ఆయన తప్పుదారినిఁ
బోవుచున్నాఁడు. తాను బౌద్ధుఁడై మఱల క్షత్రియుఁడ ననును.
బౌద్ధుఁ డనినంతనే క్షత్రియుఁడు కాఁడు. బౌద్ధుఁడైన క్షత్రి
యునకు తాను క్షత్రియుఁడనన్న దురభిమానము పనికిరాదు.
ఎప్పుడు బౌద్ధుఁడైనాఁడో యప్పుడే క్షత్రియుఁడుగా నగుట
మానివేసెను. అతనికి సర్వజనులు సమానమే. ఇందులో
కొందఱు బ్రాహ్మణు లెట్లగుదురు? వారిమీఁదఁ గోపమెందు
లకు? వారిని సంహరించవలయునన్న యావేశ మెందులకు?
బౌద్ధుఁడైనవానికి కోపము తగునా? హింస చేయ వచ్చునా?
బుద్ధుఁడు హింసచేయరాదని చెప్పెనుగదా! ఒకవంక బౌద్ధుఁడా?
మఱియొకవంక క్షత్రియుఁడా? మఱియొకవంక బౌద్ధేతరమైన
హింసాబుద్ధియా? నాకివి నచ్చవు. అందుచేత నేను 'గాలాశో
కుని రాజుగా నంగీకరింపను. సుమిత్రుఁడు:-ఈమాటలు కాలా
శోకునిముం దనఁగలవా? రాక్ష:- ఆయనముందనుటకు నిన్నా
ళ్ళకు నాల్గునాళ్ళక్రింద నాయనముందు నిలుచుంటిని. నేను కన
బడిననే యాయన పూర్వము మొగమటు త్రిప్పుకొనెడువాఁడు.
నేనాయనముందు నిలుచుటకే వీలు లేనప్పు డాయనముం దీ
మాట లెట్లనఁగలను? సుమిత్రుడు:- నాల్గునాళ్ళక్రింద నిలు
చుంటివిగదా! అప్పుడనకపోయితివా? రాక్ష:- అచ్చముగా
నూరకుండలేదు. కొన్ని యన్నాను. కాని నన్నేమైన చేసినచో
రాయబారము తీసుకవెళ్లెడివాఁ డుండఁడని నేనన్న మాటలను

మనసులోననే యుంచికొని నన్నిచ్చటికిఁ బంచినాఁడు. సుమి:-
అనఁగా నీవు నాయెదుట నీమాటల లన్నియు నన్నుచో నే
నేమియు చేయ లేననియా నీయుద్దేశ్యము రాక్ష:-మీరు ప్రభు
వులు, మేము సామాన్యులము. మీరు మమ్మేదైన చేయుట
చాల సులభమైనపని. కాని యెవరితో ప్రయోజన ముండునో
వానియందు విరోధమున్నను రాజనీతివేత్తలు తమ ప్రయో
జనము తీఱువఱకు వానిని వధింపరు. అందుచేత నాతో తమ
కును ప్రయోజనము కలదు. ఆ ప్రయోజనము తీఱువఱకు
నన్ను వధించుట మీకును శ్రేయముకాదు. ఆ ధైర్యము
తోడనే యిచ్చటికి వచ్చితిని. సుమి:- నీతో నా కేమి
ప్రయోజనమున్నది? ఉన్నదనుకో. నీవంటివానిని, ప్రయో
జనము దారిని ప్రయోజనమును బోనిమ్ము, నేనట్టి రాజనీతి
వేత్తను కాను, నీవు నాయెదుట ధూర్తముగా మాటాడు
చున్నావు. నిన్ను వధించియే తీరుదును. రాక్ష:- ప్రయోజన
మేమియోయని యాప్రయోజనపు దృష్టితో నన్ను వధింపవలసి
నదో, వధించరానిదో విచారింపవలయును. ప్రయోజనముకే
తెలిసికొనకుండ వధింతుననుట రాజనీతిమాట యట్లుంచి
సామాన్య మానవుని వివేకమునకుఁగూడ మితిమీఱిన
వ్యవహార మగును.

సుమిత్రునకు మిక్కిలిఁ గోపమువచ్చెను. ఇంతవఱ
కాతఁడు తలయెత్తి రాక్షసునివంకఁ జూడలేదు. రాక్షసుని
కంఠధ్వని మేఘగంభీర నిస్వానముగా నున్నది. అతనిస్వరము
విస్పష్టముగా నున్నది. మాటాడెడు నైఖరి మహా పరాక్రమ
శాలియు, మహాధైర్యవంతుఁడును, మహావేత్తయు నన్నట్లుగా

నున్నవి. మాటాడుచున్నప్పుడు సర్వము వాక్యములందును శబ్దగతాక్షరముల మీఁదను సువిభక్తమై హెచ్చుస్థాయియు, తగ్గుస్థాయియు, కాకువును, పరామృష్టములై భాసించు చుండెను. అతనివంకఁ జూడకపోయినను వాని నిలుచున్న వైఖరి లీలగాఁ గనిపించుచుండెను. ఆ వైఖరిలో వినయము లేదు. ధూర్తతయు లేదు. స్వాభిమాన మున్నది. ఆత్మగౌరవ మున్నది. చేతులు కట్టికొని నిలుచుండలేదు. కాని హస్తములు మాటిమాటికి విదలించుచు నౌద్ధత్యమును వెలార్చుట లేదు. రాక్షసుఁడన్న మాటలలోని యర్థము తాను సుక్షత్రియుఁడు కాకపోవుటయు, రాజనీతివేత్త కాకపోవుటయునేగాక తాను సామాన్య మానవునికి నుండవలసిన సామాన్యబుద్ధికూడ లేనివాఁ డన్నట్లు తోఁచెను. మఱియు సుమిత్రుఁ డిట్లను కొనెను. తాను రాక్షసుని ప్రయోజనముకూడ నెఱుఁగకుండ వధించినచో నట్టివాఁ డగును గాని లేనిచో నెట్లగును? ఆ యాశతోఁ ఒంటరితఁ డట్లనుచున్నాఁడు. అన్న యూహ వచ్చెను. కాని సుమిత్రునియందున్న సహజమైన దురహంకారము వానిచేత మఱియొకమాట మాటాడింపించినది. "నేను సామాన్య మానవునకున్న బుద్ధిలేనివాఁడ నైనను సరియే. నిన్నిప్పుడు వధింతును." రాక్ష:- నన్నిప్పుడు వధించినచో సామాన్య మానవునికంటె మీరు మతిహీను లగుమాట యట్లుంచి మఱియొక యాపద యున్నది. నన్ను వధించుట తేలిక కాదు. నేనును ఖడ్గవిద్యా నిపుణుఁడనే. నా కున్నంత ఖడ్గవిద్యా నైపుణ్యము సర్వార్యావర్త దేశము నందుఁ గలవాఁడు మఱి యొక్కఁడే యున్నాఁడు. ఆయన పేరు

నంచుఁడు. మఱియొకఁడు నాముందు నిలువలేఁడు. మీ భటులు వందమంది కత్తులు పుచ్చుకొని నామీఁదికి వచ్చినను నేను సులభముగా వెడలిపోఁ గలుగుదును. అది యట్లుండి నన్నువధించుట మీకు క్షేమంకరమైనపనిగాదు. ఏలయనఁగా ప్రస్తుతము మీ సైన్యముల చుట్టును విరోధి సైన్యము లనంత ములుగా నున్నవి. నే నిచ్చటనుండి సుఖముగా వెళ్ళినచో నా సైన్యముల వలన మీ కాపద లేదు. నేను వెళ్ళనిచో మీ సైన్యములకు భద్రతలేదు. మీ రాజ్యమునకు క్షేమము లేదు. సుమి:- మేము రాజుల మేమి? మాది రాజనీతి వేత్తృత్వ మేమి? సర్వమును నీకే యున్నట్లు మాటాడు చున్నావే? నీవంతటి ఖడ్గవిద్యా విశారదుఁడ వైనచో నాతో కత్తి యుద్ధము చేయుము. నీ మాటలకు నే నప్పుడు కొంత గౌరవ మిత్తును. ఆ కవాటమును బిగింపుము. రాక్ష:- అయ్యా! కవాటమును బిగింతును. కాని లోపల మన మిద్ద ఱము కత్తి యుద్ధము చేయుచున్నట్లు బయటివారికిఁ దెలి యును. వారు తలుపులు త్రోసికొని లోనికి వత్తురు. దాని మాటయేమి? తమరే సేవకునిఁ బిలిచి వానితో నొక రెండు గడియలసేపు తలుపులు తీసికొని యెవ్వరు రాకూడదని యాజ్ఞాపింపుడు.

సుమిత్రుఁ డాలోచించెను. రాక్షసుఁడు తలుపు వేయు టకుఁ బోఁగా వానిని వెనుకనుండి సంహరింపవలయునని సుమి త్రుఁడు తలచెను. ఇప్పుడు తాను సేవకునిఁ బిలుచుటకు పోఁగా వెనుకనుండి రాక్షసుఁడే తన్ను సంహరింపవచ్చును. వీఁడు గడుసువాఁడు. రాక్షసుఁడు తన్ను సంహరించినచో వానినిఁ

దన పరిచారకులు రాజభటులు వెడలిపోనీయరు. అయినను ముందు తాను వచ్చెనుగదా! అందుచేత నిట్లనెను. 'ఓయీ! నేను తలుపువేయుమని పరిచారకునితోఁ జెప్పుటకు తలుపు దాఁక పోనక్కఱలేదు. పిలిచినచో వాఁడే వచ్చును. రాక్ష- నన్ను పిలువుమన్నచో పిలుతును. నేను తలుపువంకకు పోవుటయే గదా మీకుఁ గావలసినది. నేనింతకు ముందే మనవి సేసితినిగదా నేనెంతవాఁడనో? తలుపువద్దకు పోవులోపుగా నన్ను వధించుట సాధ్యముకాదు. నేనొక్కొక్క నిముసమున నుభయముఖుఁడనుగా నుందును. సహస్రముఖుఁడుగా నుందును. — అని రాక్షసుఁడు కవాటమువద్దకు పోయి పరిచారకునిఁ బిలిచెను. రాక్షసుఁడు నడచిన నడక చాల విలక్షణముగా నుండెను. అతఁడు సుమిత్రునివంకఁ జూచుట లేదన్న లిప్తకాలము లేదు. మఱియు నతఁడు కవాటమునద్దకు పోవుటకు లిప్తకాలము పట్టలేదు. అతఁడు నడువలేదు. అతనియందు తొందఱ కనిపించలేదు. అతఁడు లంఘించను లేదు. అతఁడెట్లు కవాటమువద్దకు పోయెనో సుమిత్రున కవగతము కాలేదు. పరిచారకుఁడు వచ్చి సుమిత్రునితో నేమి యాజ్ఞ యని యడిగెను. సుమిత్రుఁడు "ఏమియును లేదు. ఊరకయే పిలిపించితిని. నీవు వెడలిపో"మ్మనెను. మఱల వెనుకకుఁ బిలిచి యాయన గూర్చుండుటకుఁ బీఠమునొక దానిని వేయుమని చెప్పెను. వాఁడు తెచ్చి యొక పీఠమును వేసెను. రాక్షసుఁడు తాను కూర్చుండలేదు. సుమిత్రుఁడు కూర్చుండుమనలేదు. ఆయన కోసము తెప్పించినదేగదా! వేఱ కూర్చుండుమని యనవలయునా! యని సుమిత్రుని యూహ. మఱియు

మహారాజైన వాఁడు వేఱొకనినిఁ గూర్చుండుమని గౌరవించు టకు వాఁడెంతవాఁడో కావలయును. ఇతఁడు వయస్సుచేతఁ జిన్నవాఁడు. ఖడ్గవిద్యా నిపుణుఁడన్నది యితఁడు చెప్పు చుండెను. అతఁడు కవాటము వద్దకుఁ బోయినప్పటి పదవిన్యాస లక్షణముచేత నతఁ డట్టివాఁడు కావచ్చును. సామాన్య సైనికులలో నీవిద్య తెలిసినవారు పెక్కుమంది యుండ వచ్చును కాని తాను గౌరవింపఁ దగినంతవాఁడు వీఁడని నిశ్చయమేమి? అతఁడు కూర్చుండుటకుఁ బీఠమును తెమ్మను టయే యితనికి మించిన గౌరవము చేసినట్లు.

తరువాత నిద్దఱును గొంతసేవు మాటాడలేదు. సుమి త్రుఁడు తానే మాటాడక తప్పదని తెలిసికొనెను. ఇట్లనెను. "నిన్నిప్పుడు వధించినచో నా సైన్యమున కేదో యాపద యున్న దంటివికదా! అది యెట్టిదో చెప్పవేమి? రాక్ష:- సైన్యము మాట తరువాత చూచికొందము. తొలుతఁ దమకే యాపదగదా! నాచేతిలో మీరు బ్రతుకుట కష్టమైన పని. నన్ను మీ సైనికులేమియుఁ జేయలేరు. సుమి:- ఓయి బ్రాహ్మ ణుఁడా! నాకుఁ జాలఁ గోపము తెప్పించుచుంటివి. నీయందు నేను చూపించుచున్నంత యోరిమి పూర్వమెవ్వరి యందును చూపించలేదు. రాక్ష:- మీ మాట నిజమనియే నేను నమ్మె దను. ఎందుకనఁగా మిమ్మునుఁ గూర్చి లోకమట్లే చెప్పికొనుచున్నది, మీ కోపము ప్రళయాంతకమైనదనియు మీ యెదుటఁబడి మాటాడుటయే దుర్ఘటమనియు మీ రనేక ములైన హేతువులను కల్పించికొని గర్వపడుచుందురనియు లోకమునందు మేము విన్నమాటలే. ఓయయ్యా! తానొకఁడు

మహారాజై నంతమాత్రమున వానినిఁ గూర్చి లోకము చెప్పి
కొనకమానదు. అతఁడు మంచివాఁడైనచో మంచివాఁడని
చెప్పికొనును. దుర్జనుఁడైనచో దుర్జనుఁడని చెప్పికొనును.
కోపియైనచో కోపియనియు, పాపియైనచో పాపియనియుఁ, దాపి
యైనచోఁ దాపియనియు చెప్పికొనును. అందుచేత నేను
తమరిసంగతి వినియేయున్నాను. లోకమిట్లు చెప్పికొందురని
కోపపడవలసిన యవసరము లేదు. మన మొక వర్ణము మీఁద
కోపముఁ గలిగియుందుము. ఆ వర్ణములో జన్మించిన వారి
నందఱినే సంపూర్ణముగా వధించుట సాధ్యము కాదు. పరశు
రాముఁ డిరువదియొక్క సార్లు క్షత్రియులను వధించెను. అట్టి
యిరువదియొక్కసార్లు తిరిగి తిరిగి చేసినను భారత దేశమున
నున్న సర్వ క్షత్రియులను వధించుట నాయనకు సాధ్యము
కాకపోయినది. అట్టి సందర్భములో మనలనుఁ గూర్చి చెప్పి
కొనుచున్నారని లోకుల నెక్కడ వధింతుము? అంగఱను
వధించినచో మహాశ్మశానమగును. ప్రజలున్నఁగదా రాజైన
వాఁడు రాజ్యము చేయుట. మీరు నాయందు చాల యోరి
మితో నున్నారని నాకుఁ దెలియును. ఇంత యోరిమితో
యెందుకుంటిరాయని నేను నాశ్చర్యపోవుచునే యున్నాను.
ఇంతకును నాకును మీకును మంచి దినములు. మీరు నన్నుఁ
జంపింప నెంచినచో మనమిద్దఱము మిగులకపోయి యుండ
వచ్చును. అట్లు జరుగలేదు. మన యిద్దఱికిని మఱి యింకఁ
గొన్నాళ్ళు బ్రతికియుండుట బ్రహ్మదేవుఁడు, వ్రాసియుండె
ననుకొందును. మీరు బౌద్ధులు. బ్రహ్మదేవుఁ డున్నాఁ
డనియు, నతఁడు సృష్టికర్తయనియు మీరంగీకరింపరేమో!

నాకుఁ దెలియదు. మీబుద్ధుఁడు సృష్టి యిట్లు జరుగునని చెప్పి
నట్లు లేదే. నామరూపములు పంచస్కంధములు, కామక్రోధాది
గుణములు లేకుండ ప్రవర్తించుట, మొదలైనవే చెప్పి
నాఁడుగాని సృష్టి యెట్లుజరిగినది. సృష్టికర్త యున్నాఁడా
లేఁడా యన్న ప్రశ్నగాని చెప్పినట్లు లేదు. నేను వినలేదు.
తమరి గురువులు చెప్పిరేమో నాకు తెలియదు. సన్న్యాసము
మాట సరియే. అంతయును సన్న్యాసులైనచో భిక్ష పెట్టెడి
వాఁ డెవఁడు ? భిక్ష పెట్టుటకుఁ గొందఱుండవలయును. భిక్ష
పెట్టెడివారి సంఖ్య యెక్కువ యుండవలయును. స్వీకరించెడి
వారిసంఖ్య తక్కువ యుండవలయును. భిక్ష పెట్టెడివారు ధన
వంతులు కావలయును. అన్నోదకములు గలవారు కావల
యును. నేలదున్ని పండించెడివారు కావలయును. వస్తువులు
విక్రయించెడివారు కావలయును. ఇందులో నొకరి నొక అన్యా
యము చేసికొనకుండ రక్షించెడువారు కావలయును ఇట్లింత
మంతెయో కావలయును. అంతయును సన్న్యాసులైన వారికే
యెట్లు బ్రదుకవలయునో బుద్ధుఁడు బోధించెనుగాని తక్కిన
వారి విషయము చెప్పినట్లులేదు. తక్కిన వారందఱు నీ దేశ
మున ననాదినుండియు వచ్చుచున్న యొక జీవన విధానము
ననుసరించుచున్నారు. ఆ విధానము వైదికమైనది. బుద్ధుఁడు
తద్విధానమునుగూర్చి యేమియుఁ జెప్పలేదు గనుక నొక్క
సన్న్యాసులను భిక్షుకులను వదలి తక్కిన దేశమంతయు,
తక్కిన ప్రజలందఱు వైదిక విధానమున చనవలయు ననియే
బుద్ధుని యభిప్రాయమై యుండును. కనుక నెవ్వరును దక్కిన
వర్ణములవారిని హింసింపరాదు. వట్టి బ్రతుకులు బ్రతుకుటకు

ప్రాచ్యవిధానమే శరణ్యముగాఁ గనిపించు చున్నది. మన
పూర్వులు సర్వమునుఁ గలిపి యొక్కటిగా చూచి దేని
కేదియో యెక్కడ నెట్లో యట్లు బోధించిరి. బుద్ధుఁడు మొద
లైన నూతనులు అందులో నొకభాగమును తీసికొని యిది
యిట్లు కాదని మార్చినచో నది తక్కిన సర్వమూర్తికి గను
చితమైనచో నయోగ్యమైనచో తన్మహామూర్తికి సంఘాత
ముగా నుండఁదగినది యంగిని గ్రుంగునంత పరిణామము కల
దిగాఁ జేయఁబడినచో నామతమునకు కవి కావ్యమువలె
నుండును. సరే! బ్రహ్మదేవుఁడు మనయిద్దఱకుఁ గొన్నాళ్ళ
మఱియు నాయుర్దాయము వ్రాసినాఁడన్నమాట. సామాన్యుఁ
డను బ్రాహ్మణుఁడను. నా విషయములో నా బ్రహ్మదేవుఁడు
తన యిష్టము వచ్చినట్లు వ్రాయవచ్చును. మీరు క్షత్రియులు.
బ్రహ్మాండమైన కోసలరాజ్యాధిపతులు. తమ విషయములో
కూడ నట్లు వ్రాయుట బ్రహ్మదేవుని సాహసమే యనవల
యును. ఆ బ్రహ్మ యట్లు వ్రాసినచో బుద్ధుఁడు దానికి గట్టు
వడి యుండునో లేక బుద్ధునియొక్క యనుమతితో బ్రహ్మ
యట్లు వ్రాసెనో తెలియదు. అదియుఁగాక నీ విషయము
లన్నియు మన మెట్లనుకొనినచో నట్లే యున్నట్లు మన కనిపించు
నేమో! అది యట్లుండి నన్ను మీరు వధించినచో మీ సైన్య
మునకు నాపద గలుగునని నే నన్నాను. దాని స్వరూపమును
చెప్పుమని మీరు నన్నడిగితిరి. ఆ సంగతి చెప్పెదను వినుడు.
అంతకు పూర్వము నందుఁ డనెడివాఁ డొకఁ డున్నాఁడని
మీరు గ్రహింప వలయును. ఆ నందుఁ డెంతవాఁడో మీకుఁ
దెలియదు. అతఁడు సర్వక్షత్రియ సంహారము కొఱకవత

రించినమూర్తి. అపర భార్గవ రాముఁడు. హైహాయులు, పాంచాలురు, కౌరవులు, శూరసేనులు, ఏకలింగులు, కాలకులు మొదలైన సర్వ క్షత్రియవంశములు నిర్మూలింపఁ బడినవి. క్షత్రియులైన యీ సర్వరాజ్యాధిపతులు నాశనముచేయఁబడిరి. మిగిలినవి రెండే వంశములు, కోసలవంశమును, మాగధ వంశమును. వీరిద్దఱు మహా ప్రబలురు. మన నందుఁడేమి చేయఁగలఁడని మీరనుకొనవచ్చును. ఆ నందుఁడిది చేయఁగలఁడు. ఇది చేయలేఁడని యెవ్వరును చెప్పలేరు. అతఁడు మహా రాజనీతివేత్త. ఇంకొక్కమాట చెప్పెదను. భల్లాట గ్రామపు పొలిమేర మీఁదనున్న గ్రామములో నే బ్రాహ్మణుఁడు యజ్ఞము చేయుటకుఁ బ్రారంభించెనో యా బ్రాహ్మణునిచేత యజ్ఞమారంభింపఁ జేసినది నందుఁడు. అప్పటి కులీనుని పంపించినది నందుఁడు. ఆ పని బహుప్రయోజనములు సాధించుట కొఱకు నందుఁడు చేసెను. అందులో నొక ప్రయోజనము. మీ చేతనే రెండు రాజ్యములు నాక్రమింపఁ జేసి మాగధులకు మీకు యుద్ధము తెచ్చి యీ యుద్ధములో మిమ్మిద్దఱను మడియించుట. ఆ నందున కెంత తెలియదనఁగా మీ మనస్సులోనున్న యనేకములైన యూహ లతనికిఁ దెలియును. శ్రావస్తిలోని బౌద్ధభిక్షువులు వజ్జిశాఖవారు వగన యిరువది యేండ్లక్రింద మీ ముత్తాతగారి తమ్ముఁడు విధుధవుఁడు కపిలవస్తు నగర రాజకుమారులనుఁ జంపుటచేత నేఁటి రాజైన మీ మనస్సులో సర్వక్షత్రియులు నారీతిగా నూచకోఁత కోయఁబడవలయునన్న కోపము మీ కున్నదని యాయనకుఁ దెలియును. మఱియును శ్రావస్తి పరిసరముల యందున్న బౌద్ధులు

వజ్జిశాఖవారు. మీ దేశమునందున్న బౌద్ధులు స్థవిరవాదులు. మీ బౌద్ధులు వజ్జిశాఖవారికంటె నధికుల మనుకొనుచుందురు. మీరు నట్లే యనుకొందురు. గిరివ్రజపురము నందలి బౌద్ధులు వజ్జిశాఖవారికంటె నధిక దురాచారములు కలవారు. వజ్జిశాఖ వారిది పైచేయి యైనచో గిరివ్రజపుర బౌద్ధులకుఁ గొంత మేలు కలుగును. ఓయి రాజా! మీ రాజ్యములు నీతియందు సగము మించి మతప్రస్తావన యుండును. నేఁటి మీ రాజ్యములు క్షత్రియులైన మీచేతఁ బాలింపబడుటలేదు. బౌద్ధ భిక్షువులైన మీ గురువులచేతఁ బాలింపఁబడు చున్నవి. మీ రనుకొను చున్నట్లు పూర్వపు రాజులు క్షత్రియులు. వారందఱు బ్రాహ్మణులు చెప్పినట్లు వినిరి. వారు బ్రాహ్మణ దాసులని మీ యభిప్రాయము కదా! నేఁడు మీరు బౌద్ధసన్యాసుల దాసులు. బ్రాహ్మణుఁడు చెప్పినట్లు వినినచోఁ దప్పు. బౌద్ధ సన్యాసి చెప్పినట్లు వినినచో నొప్పు. ఎప్పటికైన క్రొత్త మతములయందిదే ముప్పు. ఇప్పుడు మీ రెండు రాజ్యములు కలవు. మీ రిద్దఱు యుద్ధము చేయుదురు. ఎవరో యొకరు గెలుతురు. నీవు గెలుచుట కష్టము. నీవు దండెత్తి వెళ్ళినవాఁడవు. అందులో నీవుచేసిన దోష మొకటి యున్నది. ఉశీనరుని మీఁదికి వచ్చినపుడు కొద్ది సైన్యముతో వచ్చితివి. వెనుకనుండి మఱి కొన్ని సైన్యములనుఁ బిలిపించితివి. అవసరమైనచో మఱల సైన్యములు క్రొత్తవి వచ్చుట కేర్పాటుఁ జేసితివి. ఇట్లు చేయకూడదు. నీకు భల్లట విదేహులను గెలుచుట గోటిమీఁది పని. సైన్యము నంతయు నొక్కసారి తరలించికొని వచ్చి యొక్కసారి గిరివ్రజపురమును ముట్టడించ

వలసి యుండెను మాగధు లజాగ్రత్తలో నుండెడివారు. గెలుపు సులభమయ్యెడిది. అప్పుడైనను గిరివ్రజ దుర్గ మభేద్య మైనది. కలియుగము ప్రవేశించి పదునేను వందల సంవత్సరములైనవి. అన్ని రాజ్యములలో మగధరాజ్య మిన్నాళ్ళు నిలువఁ ద్రొక్కుకొని యుండుటకు కారణమేమి? ఆ కారణము గిరివ్రజ పురముయొక్క యభేద్యలక్షణము. ఆ పట్టణ ముట్టిపడుట నేఁటి మాట కాదు. వేల సంవత్సరముల మాట. ఆ పట్టణమును ముట్టడించి గెలుచుట యసంభవమనియే కృష్ణ భీమార్జునులు బ్రాహ్మణ వేషములతోఁ బోయి జరాసంధుని యుద్ధభిక్ష యడిగిరి. కనుక నోయి రాజా! నీవు మాగధులను గెలువలేవు. చిన్న చిన్న యుద్ధములలో నొకవేళ నల్పసైన్యము గెలిచినను దుర్గమును ముట్టడించువేళకు నీవేమియుఁ జేయలేవు. నీ నీతిలోని దోషము నేను చెప్పునది యిదియే. గిరివ్రజపురము యథాలాపముగా నున్నప్పుడు నీ సైన్యములు పోయి ముట్టడించినచో నీ సైనికులలోఁ గొందఱికి లోపలఁ బ్రవేశము గలిగినచో నుభయదిశా యుద్ధము జరిగినచో గిరివ్రజపురము నీకు సాధ్యమై యుండెడిది. ఇప్పుడు నీ కాయాశ పెట్టుకొన నక్కఱలేదు. ఉత్తుంగభుజుఁడు పెద్ద సైన్యమునుఁ దీసికొని వచ్చి విదేహారాజ్యపు పొలిమేరలయం దున్నాఁడు. ఇది ఇట్లుండఁగా నీకింకొక రహస్యమును చెప్పెదను. నీతో నిన్ని మాట లెందుకు చెప్పుచున్నానో నాకే తెలియదు. ఓయి రాజా! నీమీఁద నాకొక జాలి కలిగినది. నీవన్నచో నొక ప్రేమ పుట్టినది. ఈప్రేమకుఁ గారణమేమో తెలియునా? నీ విక్ష్వాకు వంశ సంజాతుఁడ వగుట. ఇక్ష్వాకులు సూర్యుని

నుండి సముద్భవించిన వంశము. సగరుఁడు, మాంధాత, దిలీపుఁ, డజుఁడు, దశరథుఁడు మొదలైన మహాప్రభువులు పుట్టిన వంశము. శ్రీరామచంద్రుఁడు జన్మించిన వంశము. నాపేరు రాక్షసుఁడు. రాముఁడు రాక్షస సంహారి. అయినను నాకు రామునిమీఁద ననురాగము. ఆయనమీఁద భక్తి. నీ విక్ష్వాకువంశ సంజాతుఁడవని నాకు నీమీఁద జాలి కలిగినది. నీమీఁద నాకుఁ గలిగిన యీ కృపాగుణమును నందుఁ డెంత వఱకుఁ బాలించునో నాకుఁ దెలియదు. నీవు నామాట విన్నచోఁ గొంత ప్రయత్నము చేసెదను. ఇప్పుడు చూడుము. నందుఁడు తన యుద్ధనీతి నైశారద్యమును వెలయించి నిన్నిచ్చటికిఁ దరిమినాఁడు. నీ యెదురుగా నుత్తుంగభుజుఁ డున్నాఁడు. నీవిప్పుడు వెనుదిరిగి పోవచ్చును. పోవుటకు వీలు లేకుండఁ జేసినాఁడు. ఓయి రాజా! విదేహముల నాక్రమింపఁ దలచిన వాఁడు దుర్బలమైన విదేహరాజ్యము మీఁదికా ముందఱ వచ్చునది? పైన కిరాత శక బర్బర రాజ్యములు కలవు. వారు మ్లేచ్ఛులు - ఆటవికులు. పర్వత ప్రదేశములవారు. ఆ ప్రక్క మల్లదేశ మున్నది. నేఁ డేరాజు సైన్యములోనైనను బలిష్ఠమైన చమువు మల్లదేశీయులు. శక కిరాత బర్బరులో ఆటవికులు. ఆలోచన లేనివారు. గొడ్లు. కన్నులు మూసికొని మీఁదికి దూకుటయే కాని చచ్చిపోవుదుమన్న మాటకూడ లేనివారు. అట్టి నాలుగు రాజ్యములు చిన్నవైనను వారి నాక్రమింపకుండ విదేహరాజ్య మాక్రమింతురా? ఇప్పుడు నందుఁడా నాల్గు రాజ్యములను నొక్కరాజ్యముగాఁ జేసినాఁడు. నీ వుత్తుంగ భుజునిమీఁదికి బయలుదేఱిన మఱునిముస

మందు శక మల్ల కిరాత బర్బర సేనలు మీ మీఁదికి నుత్త
రపు దెసనుండి వత్తురు. రెండు దెసల నీవు యుద్ధము చేయ
వలయును. ఇంకొక సంగతి యున్నది. మీ రాజ్యములోఁ
గాని మీ సేనలలోఁగాని మగధరాజ్యపు సేనలలోఁగాని కల
మల్లదేశీయులతో నిండియున్న చముపులు యుద్ధమే చేయవు.
మల్లదేశాధిపతి రహస్యముగా వారి వారికి వర్తమానములు
పంపెను. నీ వుత్తుంగభుజుని తాఁకుదువు. నీ మల్ల చమువు
యుద్ధము చేయదు. ఉత్తుంగ భుజుని మల్లచముపు యుద్ధము
చేయదు. అట్లైనచో నష్టములేదు. మా మా సేనలే యుద్ధము
చేయుదురందువా? మీలో నెవరు గెలుతురో వారిమీఁద నీ
శకమల్ల కిరాత బర్బర సేనలు యుద్ధముచేయును. మీ యిరు
వురిలో నెవరు గెలిచినను మీరు శ్రమపడి యుందురు. మీ
సేనలసంఖ్య తగ్గును. అప్పుడు పరమ కిరాతులైన యీ యటవీ
పర్వత సేనలు మీ మీఁదఁ బడినచో మీరేమి చేయఁగల్గు
దురు? మీ రెండు రాజ్యములును వైదిక క్షత్రియుల రాజ్య
ములు కాకపోయి నేఁడు బౌద్ధరాజ్యములై యెల్లుండి మ్లేచ్ఛ
రాజ్యము లగును. అంతకుముం దింకొక సంగతి యున్నది.
కోసలము లందున్న మీ సైన్యములు నిన్ను వచ్చి చేరనే
చేరవు. వానిని మార్గమునందే యెదిరించి నిన్నుఁ గలిసికొన
కుండఁ జేయుటకు మల్లచము వొకటి సిద్ధముగా నున్నది.
కోసలములో నీ సేన బయలుదేఱినదని తెలియఁగనే వీరు
బయలుదేఱి నీ సేనల నడ్డగింతురు. నీ సేనలోనున్న మల్లదేశీ
యులు పోయి వారినిఁ గలిసికొందురు. అప్పుడు నీపని యే
మగును? వేఱొక సంగతియున్నదిఁ గలదు. పాంచాల కౌరవ

హైహయ శూరసేనాది రాజ్యములు, నీతోఁ జెప్పితిని కదా! అప్పటి క్షత్రియ వంశములు నిర్మూలింపఁ బడినవని. ఇప్పు డా రాజ్యము లెవరిచేతిలో నున్నవని. అక్కడ రాజులుగా నున్న వారెవరు? వారందఱు నందుని బంట్లు. నీవు మగధరాజ్యముతో యుద్ధ మారంభించినంతనే కోసలములోని నీ సేనలు నిన్నుఁ గలిసికొనుటకు బయలుదేఱినంతనే యా దేశములందలి రాజులు, అనఁగా నందుని బంట్లు తమ సైన్యములతో బయలుదేఱి వచ్చి నీ కోసలము లాక్రమింతురు. నీ పని యేమి కావలయును? నీ వొకవేళ మగధరాజ్యమును గెలిచి యాక్రమింపఁ గలిగినచో మగధరాజ్యము నీదగును. కోసలములు మాత్రము నీవి కావు. మాగధులతో యుద్ధము చేసినపుడు నీవే గెలుతువని నమ్మకము లేదు కదా! గెలిచినచో సరే గెలువనిచో నీవు త్రిశంకు స్వర్గమున నుందువు. అందుచేత నేను చెప్పెడి దేమనఁగా నీవు మగధముల మీఁదికి దండెత్తి వచ్చినట్లే చెప్పకుము. కారణాంతరములచేత సుశీసరుఁడు చంపఁబడెను. నీవు చంపలేదు. ఆయనను చంపినది బౌద్ధ భిక్షుకులు – ఆదోషమంతయు బౌద్ధ భిక్షుకులమీఁదఁ బెట్టుము. కావలసినచో వారెవరో తెలిసికొని వారిని సంహరింపుము. విదేహ భల్లాట రాజ్యములకు సర్వార్యావర్త దేశములందలి రాజసభ నిర్ణయించినట్లు రాజులను నిర్ణయింతుమని చెప్పుము. అప్పు డెవ్వరును మాటాడుటకు వీలులేదు. నేను నీపక్షము నందుందును. నీ కెవ్వఁడవురా నాపక్షము నందుండుట కని యనకుము. నందుఁడు నేనుగీసిన గీటు దాటి పోఁడు. నేను చెప్పెడిమాటల యందు నీకు విశ్వాసము లేనిచో నీవు మఱొక పది దినము

లాగుము. ఏదియు చెప్పకుము. ఇప్పుడు యుద్ధమారంభించి తివా నేను చెప్పినంతయు జరుగును. నామాటల యందలి యాథార్థ్యము నిరూపించికొనదలచినచో నీ చారులను బంపించి నా మాటలను ఋజువు పరచుకొనుము." సుమిత్రుఁడు తల యెత్తలేదు. రాక్షసుఁడు వెడలి పోయెను.

—

తరువాతి నాల్గుదినములకుఁ గాలాశోకుఁడు రాక్షసునకు వార్తఁ బంపించెను. అతఁడు తిరిగి యింటికి వచ్చెనో లేదో కనుగొమ్మని రెండు మూన్నాళ్ళు రాజసేవకులు తిరిగిన తరువాత నొకనాఁటి ప్రొద్దున రాజసేవకుఁడు కనిపించిన రాక్షసునితో బాబూ! తమకొఱకు మూన్నాళ్ళనుండి తిరుగుచున్నాను. మహారాజుగారు ప్రతిపూటయు మీకొఱకు నన్నరికించు చున్నారు. దయచేయు డని మనవి చేయఁగా రాక్షసుఁడు "నే నిప్పుడే వచ్చితిని స్నానాదులుచేసి వత్తునని చెప్పు మనెను. రాక్షసుఁడు వెళ్ళువఱకుఁ గాలాశోకుఁడు ప్రతీక్షించుచుండెను. వచ్చిన రాక్షసునితోఁ గాలాశోకుఁడు "రాక్షసా! పది దినము లైనది. ఇంతవఱకును సుమిత్రుఁడు మనగ్రామముల మీఁదికి వచ్చుటగాని మన సైన్యములతో యుద్ధము చేయుటగాని యేదియును జరుగలేదని విన్నాను. దిన దినము వార్తలువచ్చు చున్నవి. నీవు సుమిత్రునితో మాటాడితి వనియు వార్త వచ్చెను. నీవు మాటాడినపుడు సుమిత్రుఁ డొక్కఁడే యున్నాఁ

పాట గదా! రాయబారము కదా యని మంత్రులతోఁగూడ నీమాటలు వినలేదట. మీ రిద్దఱే మాటాడితిరని, మీ రేమి మాటాడితిరో తెలియదనియు నాకు వార్త వచ్చెను. నీవు మాటాడి వచ్చిన తరువాత సుమిత్రుఁడు చాలసేపేకాకియై యాలోచనా పరుఁడై యుండెనని తెలిసినది. ఏమి మాటాడి తివి? నా కేమియుఁ దెలియదాయెను. ఆర్యావర్తము నందలి సర్వరాజ పక్షమున మాటాడుటకు మన కధికారము లేదు. అందఱి పక్షమున మాటాడినట్లు నటించినచో నతఁడు మాత్రము రాజు కాఁడా? అతనికి మాత్రము చారులు లేరా? అతఁడెందుకు విశ్వసించును! మహారాజుగారు చెప్పినమాట నిజమే. మన మహానగరములో నిట్టి రాయబారమునకుఁ బోఁదగినవాఁడొక్కఁడే యున్నాఁడు. అతనిపేరు రాక్షసుఁడని చెప్పినారు మహారాజు గారు. నీవు నందుని స్నేహితుఁడవు కదా యని నే నిన్నాళ్ళు నీతో మాటాడలేదు. ఇప్పుడైనను వచ్చితివి. అచ్చటి వార్త యేదియో చెప్పు మనెను. రాక్షసుఁడు మనసులో నిశ్చేష్టుఁడై పోయెను. మొదటఁ గాలాశోకునకు తన మీఁద నింత యభిమానము కల్గుటకును, రెండవది యతనికి నిశితమైన చారదృష్టి కలుగుటకును. కాలాశోకున కింతటి చారదృష్టి కలదని రాక్షసుఁడనుకొనలేదు. నందుఁడు కాలాశోకుని వ్యర్థుఁడుగాఁ జెప్పెను; అతఁడు వ్యర్థుఁడగుటకు ననేక కారణములు గలవు గాని రాజునకు ప్రధానమైన చారదృష్టి యింతయున్నదని నందుఁడు చెప్ప లేదు. తా ననుకొనలేదు. ఒక కార్యమునందు నియమితుఁడైన సేవకుని యందింత యభిమానము చూపుటయు గొప్ప రాజలక్షణము. ఈ రెండులక్షణములు కాలాశోకునియందు

రాక్షసునకుఁ గనిపించెను. రాక్షసుని మనస్సులో నొక గన్న
యభిమానము కాలాశోకునియందుఁ గలిగెను. కాని యితని
యందు విరోధభావము పూనుటకు రాక్షసునకు పెక్కు కార
ణములు కలవు. ఒక ప్రబలమైన కారణముకలదు. కాని
రాక్షసుని మనస్సులో రాజనీతియందుఁగల యభిమానమే
తా నభిమానమేమియు పొందనక్కఱలేని కాలాశోకునియం
దభిమానము కలిగించినది. ఒకానొక విద్యయందు నిష్ణాతుఁ
డైనవానికి తద్విద్యయందు నొక మేలిమి చూపఁగలవాని
శత్రువైనను తన శత్రుత్వ భావముదాఁచి వాని యాత్మలో
నొక ప్రశంసాభావ ముదయించును. రాక్షసునకుఁ గాలా
శోకునియందుఁగలిగిన భావ మట్టిది. రాక్షసుఁ డిట్లనెను. "నేను
సుమిత్రునితో నున్న సంగతి యున్నట్లు మనవిచేసితిని. నీవు
గిరివ్రజపురమును పట్టుకొనలేవు. గిరివ్రజ దుర్గ మభేద్యమైనది.
నీవు వృథాగా తిరిగి పోవలసి వచ్చును. ఒకవేళ దుర్గమువఱకు
నీ సేనలు వచ్చినను దుర్గము భేదించుట నీ తరముకాదు.
రెండువేల యైదువందల యేండ్లనుండి ఈ దుర్గమును భేదింపగల
వారెవ్వరును లేరు. భేదింపలేకనే కదా కృష్ణ భీమార్జునులు
బ్రాహ్మణవేషములతో వచ్చిరి. నీకును మాగధులకును
స్నేహ మున్నది. ఆ స్నేహమును చెడఁగొట్టుకొనుట యెందు
లకు? వారు నీమీఁద సులభముగా దాడిచేయఁగలిగియుందురు.
గిరివ్రజపుర దుర్గ మెట్టివంటిదో యయోధ్యా దుర్గమట్టిది
గాదు. అని యాయనకు నచ్చఁజెప్పితిని. మఱియును మాగధ
సేనానాయకుఁడైన యుత్తుంగభుజుఁడు సేనలతో వచ్చి ఇక్కడి
కొక రెండు యోజనముల నేరనున్నాఁడు గదా! మః●

దాయన నే వచ్చి నిన్ను తాఁకనిమ్ము. అప్పుడు, నీవు నీ దోషము లేనట్లు చెప్పవచ్చును. నాకు విదేహము లెందుకు ? భల్లట దేశము లెందులకు ? ఆ యిద్దఱు రాజులు చనిపోయినారు. నేను వారిని చంపలేదు. ఆ రెండు రాజ్యములు నరాజకముగా నుండిపోవు స్థితిలో నుండఁగా నేనువచ్చి సరాజకములను చేసితిని. మాగధులుగాని మఱియొకరుగాని యెప్పుడువచ్చి యా రాజ్యములు వారికిమ్మన్నచో నప్పుడే యిత్తును. అని నీవు చెప్పుటకు వీలుగానుండునని నేనంటిని. ఆయన యంగీకరించినట్లు కనిపించెను. నేను వచ్చివేసితిని. తమరు ప్రభువులు గనుక చారచక్షువులు గనుకఁ దమకు దిన దినము వార్తలు వచ్చుచున్నవి. తమరు చెప్పెడి దనుక యింతవఱకు సుమిత్రుని సేన మగధ సేనలనుఁ దాఁకలేదన్న వార్త నాకు తెలియదు. తమ రాజ్ఞాపించితిరి. నా ధర్మము నేను చేసితిని."

అంతటఁ గాలాశోకుఁడు నీతో సుమిత్రుఁడేమియు మాటాడలేదా ? సుమిత్రుఁడు చాల ధూర్తుఁడు. నిన్ను వధించుననుకొన్నాను. నీవు తిరిగి వత్తువని నాకు నమ్మకమే లేదు. నీమాట లతఁడెట్లు వినెను? నాకది యాశ్చర్యముగానున్నది. అనఁగా రాక్షసుఁడు "నన్నాతఁడు వధించుటకు నే నేమి దోషము చేసితిని? వెళ్లుచునే నేను దూతను. వధ్యుఁడను కాదని మనవి చేసితిని. ఆయననుఁ బొగడితిని. నీవు రామచంద్రుని వంశమునందుఁ బుట్టినవాఁడవు. నీయంతటి మహానుభావుఁడెవఁడు ? నీవంటివారే ధర్మము నతిక్రమించినచో నీ భారతదేశ మేమికావలయునని యుబ్బవేసితిని. ఆయన నన్నేమియుఁ జేయలేదు. పైఁగా నింకొక మాటఁ జెప్పితిని. నీవును

కాలాశోకుఁడును స్నేహితులు గదా! ఆర్యావర్తమున మీ రిద్దఱే పెద్దరాజులు. మీ రిద్దఱు తలఁచుకొన్నచోఁ జేయ రాని దేమున్నది? మీ రిక్కడ నుండఁగా పాంచాల కౌరవ హైహయ శౌరసేనాది రాజ్యములలో చిత్ర చిత్రములైన మార్పులు జరిగెను. మీ రిద్దఱు మాటాడకుండ నూరకుండిరి. మీరు బౌద్ధులై బ్రాహ్మణులను హింసించుట యెట్లాయన్న విచారములో నుండితిరి గాని తక్కిన రాజ్యము లెట్లున్నవి? వానిలో నేమి మార్పులు జరుగుచున్నవి? వీనినిఁగూర్చి విచారించుటయే లేదాయెను. ఇతర రాజ్యముల కథ లొక్కొక్కటి విన్నచో నా కాశ్చర్యముగా నున్నది. అన్నిటికంటె నాశ్చర్యము కాలకై కలింగ శౌరసేన రాజ్యముల కథ. మూఁడు రాజవంశములలోని సర్వక్షత్రియ కుమారులు నా యమునా పాతమునఁబడి మరణించుటయేమి? అది యెట్లు జరిగినది? మీరు నిజముగా నార్యావర్తమున కధిపతులైనచో వెంటనే మీ సేనలనుఁబంపి యా దేశముల నదుపులోఁ బెట్టి యట్లు జరుగుటకుఁ గారణములు విచారింపవలదా? మీ రిద్ద ఱొకరితో నొకరు విరోధముగా నున్నచో నొకరి నొకరు సాధింపదలచుచు కూర్చున్నచో నే ప్రబలుఁడు తక్కిన రాజవంశముల నట్లు చేసెనో యతఁడు సులభముగా మిమ్ముఁగూడ నాక్రమింపఁగలఁడు. మీరిద్దఱు స్నేహముగా నున్నచో మీ యిద్దఱిని సాధించుట యతనికిఁ గష్టమగును. విడి విడిగా నున్నచో నదియు నొకవిధముగాఁ గష్టమే. అట్లుగాక మీ రొకరితో నొకరు యుద్ధముచేసి మీలో నొకఁడు చనిపోయినచో నా యుద్ధములో రెండవవాని బలము తగ్గినచో మిమ్మా

తెఁడు నిర్జించుట మిక్కిలి సుకరముగా నుండును. కనుక నీవు మగధములమీఁద దండెత్తరాదు. మా కాలాశోకుఁడు నీ యందు మైత్రినిఁ బాటించుచున్నాఁడు. నీవు మిత్రద్రోహము చేయవల దంటిని." అంతఁ గాలాశోకుఁ డిట్లనెను. "ఆ ప్రబలమైన శత్రు వెవ్వరని సుమిత్రుఁ డడుగలేదా ?" రాక్షసుఁ డిట్లనెను. "ఎందు కడుగలేదు. అడిగినాఁడు. ఆ శత్రు వెవ్వరో నేను చెప్పితిని. ఆయన విశ్వసింపలేదు." కాలాశోకుఁడు:- "ఎవ్వరని చెప్పితివి ?" రాక్ష:- నేను చెప్పినచో మీరును నమ్మరు. కాలా:- ఎందుకు నమ్మనయ్యా ? నీ వింతటి రాజనీతి వేత్తవు. ఈ వ్యవహారము నింత చక్కఁగా పొసఁగించుకొని వచ్చితివి. లోకవార్త నీకింత తెలియునని నాకుఁ దెలియదు. నీవు చెప్పినచో నేను నమ్ముదును. రాక్ష:-అయ్యా ! తమరు నమ్మరని నాకుఁ దెలియును. కొంతకాక పోయినఁ గొంత సుమిత్రుఁడైన నమ్మునుగాని మీరు నమ్మనే నమ్మరు. నమ్మరు సరిగదా ! నామీఁద నీ నాఁటికి సుంత యభిమానము కలిగినది. నే నాయభిమానమునుఁగూడఁ జెడఁగొట్టుకొన్నవాఁడ నగుదును. ఉపకారము చేయఁబోయి యపకారము చేయించికొన్నవాఁడ నగుదును. అని రాక్షసుఁ డనఁగాఁ గాలాశోకునకు వాఁ డెవ్వఁడో తెలిసికొనవలయు నన్న తీవ్ర వాంఛ బయలుదేఱి పదే పదే యడిగెను. రాక్షసుఁడు బతిమాలించికొని నాల్గు దినములైన తరువాత చెప్పుదు ననెను. ఈ నాల్గుదినములలోఁ దాను చెప్పకుండఁగనే యా విషయము కాలాశోకునకుఁ దెలియు ననియు నప్పటికిఁగూడఁ దెలియనిచో చెప్పుదుననియు నని యిట్లనెను. అయ్యా! నేను పట్టి దూత

కార్యమునుఁ జేసితిని. నా ధర్మమును నేను నిర్వర్తించితిని. మీరు సుమిత్రునితో యుద్ధము చేయుటకు నిశ్చయించితిరా? ఆయన మీ సైన్యము నెదుర్కొనఁడు. మగధసైన్యమే పోయి కోసల సైన్యమును దాఁకినచో యుద్ధము జరుగునుగదా! నిస్సంశయముగా నీ ప్రథమయుద్ధములో మాగధులే గెలుతురు. ఎందు కనఁగాఁ గోసలుఁడు తన సర్వసైన్యమును విదేహములకుఁ దీసికొని రాలేదు. దండయాత్ర వెడలుదమన్న యుద్దేశ్యముతో రాలేదు, ఉత్తుంగ భుజుఁడు మహాసైన్యముతోఁ దరలి పోయెను. విదేహములలోనున్న కోసలుని సైన్యమును సులభముగా గెలువ వచ్చును. ఒకవేళ నాయుద్ధములో సుమిత్రుఁడు వధింపఁబడునేమో! లేదా పట్టు వడునేమో! అప్పుడు మగధ సేన సూటిగా నయోధ్య మీఁదికే పోవును. మీరు వలదన్నను మీ సేనాపతి వెనుకకు తిరిగి వచ్చుటకు నంగీకరింపఁడు. అంత దాఁక నెందులకు? మీ యుత్తుంగ భుజునకు వార్తనంపుడు. కోసలులతో మనకు యుద్ధము వలదు. వారి సైన్యమువచ్చి మనల నెదిరించినచో మీరు యుద్ధము చేయవలయునేగాని యంతవఱకు మీరాయంతట మీరై కోసలసేనమీఁదికి బోవలదని వార్తనంపుడు. ఆవార్త నుత్తుంగభుజుఁడు పాలించినచో నతఁడు విదేహములలో నున్న కోసలసేనను నిర్జించిన తరువాత నయోధ్యమీఁదికి పోఁడని యంగీకరింతును. తమరు నేఁడే వార్తనంపుడు. నాల్గు దినములలో మీయాజ్ఞ నుత్తుంగభుజుఁ డెంతవఱకు పాలించునో తెలియునుగదా!" అనఁగాఁ గాలాశోకునకు మనసులో రాక్షసుఁడన్నమాట నిజమే యనిపించెను. ఉత్తుంగభుజుఁడు తనమాట నెప్పుడును పాలించఁడు.

అతఁడు చెప్పినట్లే తాను చేయవలయును. రాక్షసునితో నీ రాయబారము పంపుటకు నతఁ డంగీకరింపఁ డనియేగదా! తాను స్వంతముగా రాక్షసునకు వార్తనంపెను. ఈ యుత్తర రాజ్యములయందున్న క్షత్రియవంశములను నిర్మూలముచేసిన వాఁ డుత్తుంగభుజుఁడా? అతఁ డిచ్చటనే యుండెనుగదా? ఇచ్చట నుండఁగూడదా? తన భృత్యులచేతఁ దన ప్రతినిధుల చేత నచట నాపనులు చేయించరాదా? ఈ యుత్తుంగభుజుడే సర్వార్యావర్తమును పాలించవలయు ననుకొనుచున్నాఁడా? ఇన్నాళ్ళుత్తుంగ భుజుని మాటకులోఁగి తాను ప్రవర్తించెను. తాను రాజు. ఉత్తుంగభుజుఁడు సేనాపతి. తాను తనతండ్రి చాటుననుండి రాజ్యము చేయుటవలనను తనకు నిత్యము ధనము కావలసి యుండుట వలనను బొక్కసములోనున్న ధనము తండ్రియాజ్ఞ లేకుండ తీసికొనలేకపోవుట వలనను తా నుత్తుంగభుజునకు లొంగవలసి వచ్చెను. అతని మాటలు వినవలసి వచ్చెను. ఇన్నాళ్ళుగా నతఁడు తనమీఁద నధి కారమే చేయుచుండెను. ఇప్పు డాయధికారము వానినుండి మఱల తీసికొనుట యెట్లు? అతఁడన్నమాట నేఁడు కాద న్నచో నతనికిఁ గోపమువచ్చును. ఎదురు తిరుగును సైన్యము లన్నియు నతని చేతిలోనున్నవి. ఏరాజు సైన్యములతోఁ బ్రత్యక్షమైన పరిచయము పెట్టుకొనఁడో, సర్వమునకు సేనాధి పతిమీఁద నాధారపడి యుండునో, యారాజుయొక్క స్థితి భద్రమైనది కాదు. ఎన్నికథలు విన్నను సేనాపతులు సులభ ముగా రాజులను వధించి రాజ్యము లాక్రమించుటయే వినఁ బడుచున్నది. ఇది యల్పరాజ్యములం దధికముగా నున్నది.

ఈ యుత్తుంగభుజుఁడు మనకు విరోధికాని స్నేహితుఁడుకాఁడు.
తనకు ధనము కావలసి వచ్చెను. సేనాధిపతి యైనవాఁడు
తా నూళ్ళమీఁదఁబడి దోచికొన వచ్చునా? దోచికో వచ్చు
నని రాజునకు హితము చెప్పునా? ఈ క్రూరకార్యములలో
రాజును భాగస్వామినిఁ జేయునా? అట్టివాఁడు సేనా
పతియా? వాఁడొక దోపిడి దొంగ — ఉత్తుంగభుజుఁ డట్టి
వాఁడు. వాఁడు తనకు సేనాపతి. వాని చేతులలోఁ దా నిరికి
కొనెను. రాక్షసుఁడు చెప్పినట్లు వానికి నేఁడు వార్త బంపిం
తును. ఆ వార్తనుత్తుంగభుజుఁడు పాలించునో, పాలింపఁడో
తెలిసికొన వలయును. పాలించినచోఁ దనకు భయము
లేదు. పాలింపనిచో నేమిచేయ వలయును? కాలా
శోకుఁడు రాక్షసునితో నిట్లనెను. ఏమయ్యా! రాక్షసుఁడా!
నే నుత్తుంగ భుజునకుఁ గోసల సైన్యముమీఁద యుద్ధమునకుఁ
బోవద్దని వార్త నంపెదను. నా మాట నతఁడు పాటింపనిచో
నేమి చేయవలయును? రాక్ష:- తమరిమాట యెందుకుఁ
బాటింపఁడు? మీరు ప్రభువులు. అతఁడు సేవకుఁడు. పాటిం
చనిచో నతనిని శిక్షింతురు. కాలా:- నేనతని నెట్లు శిక్షింపఁ
గలను? నే నెవరినైన శిక్షింప నెంచినచో శిక్షించుమని
వానితోఁ జెప్పవలయును. ఎవనితోఁ జెప్పుదుమో వాని
నెట్లు శిక్షింతుము? రాక్ష:- రాజు తన సేవకుఁడైనవానికి
లోఁగి ప్రవర్తించినచో, క్షుద్రములైన కార్యములు వానిచేతఁ
జేయించుకొనుచున్నచో, ప్రభువు వానికి లోకువగును.
ప్రభువు తన ప్రభుత్వమును గోలుపోవును. నిజానికి వాఁడు
ప్రభువగును. రాజు సేవకుఁడగును. వాఁడు రాజును లెక్క-

చేయక తన యిష్టము వచ్చిన ట్లాడును. వాని కంటికి రాజు రాజుగాఁ గనపడఁడు. తనచేతిలోని కీలుబొమ్మగాఁ గనిపించును.

అనఁగాఁ గాలాశోకుఁడు కనులువిచ్చికొని రాక్షసుని వంకఁ జూచెను. ఈమాటలన్నపుడు రాక్షసుని మొగము విలక్షణముగా నుండెను. అంతవఱకు రాక్షసుఁడొక సామాన్య బ్రాహ్మణుఁడు. ఒక రాయబారి. ఈ మాటలలో రాక్షసుఁడు మహాక్రోధిగాఁ గనిపించినాఁడు. అతనికోప మెవ్వనిమీఁద? తనమీఁదనా? ఉత్తుంగ భుజునిమీఁదనా? తా నితనిని నిరాదరించనేకాని మఱేమియు చేయలేదు. ఉత్తుంగ భుజుఁడితని కేమైన నపకారముఁ జేసెనా? వాఁడుచేసియుండవచ్చును. అట్టిపని చేయును. ఇట్టిపని చేయఁడని లేదుకదా! కాలాశోకుఁడు మఱల నాలోచించుకొని రాక్షసునితో నిట్లనెను.

అవునయ్యా! ఉత్తుంగభుజుఁడు నామాట వినఁడు. నీవు మహారాజ నీతివేత్తవువలెఁ గనిపించుచున్నావు. నేను రాజను. నీవు నా పాల్యములోనివాఁడవు. నా యాజ్ఞను పాలించవలసిన వాఁడవు. మాకు హితము చెప్పవలసినవాఁడవు. నేనేమి చేయవలయునో చెప్పుట నీ ధర్మము. అనఁగా రాక్షసుఁడు కాలాశోకుని యందలి ప్రభుత్వ లక్షణమునకు మఱల నివ్వెఱఁ బోయెను. అతనిమీఁద మఱల జాలిపొందెను. పొంది యిట్లనెను. "రాజునకు సేనాపతి యొక్కఁడే సేవకుఁడు కాఁడు. అతఁడు మహా సేనాధిపతి కావచ్చును. తక్కిన సేనాపతులు చాలమంది కలరు. ఇదికాక, రాజైనవాఁడు తనకు విశ్వాస పాత్రులైన ధర్మాచరణ శీలురైన మహా బలశాలులను నాలోచనా దక్షులైన మంత్రులనుఁ గొందఱిని విశ్వసించ

వలయును. వారినిఁ దనవద్ద నుంచికొనవలయును. వారికిఁ జన వీయరాదు. వారి నెంత విశ్వసించినను వారిమీఁదఁ దానెంత యాధారపడి యున్నను వారే తనమీఁద యాధారపడి యున్నట్లు నటింపవలయును. అట్టి రాజునకు సేఁగి లేదు. ఉత్తుంగభుజుఁడు తమరిమాట విననిచో నితర సేనానాయకులను వానిని శిక్షించుటకుఁ బంపవలయును. కాలా:- అతని క్రింద నున్న సర్వసేనాపతులును వాఁడెట్లు చెప్పునో యట్లు చేయుదురు. వారతని కెదురు తిరుగరు. రాక్ష:- ఎందుకు తిరుగరు? తిరుగకుండ రాజే చేయును. రాజు సేనలకు జీతము లిచ్చును. వా రాజీతముమీఁద బ్రదుకుదురు. బ్రతుకుట సర్వజనులకు ముఖ్యమైనది గనుక నెవనివలన బ్రతుకుదురో వానియందు భయ భక్తులతో నుందురు. వాఁడు జీతమీయక పోయినను సరే, మనము బ్రదుకఁ గలుగుదుమన్న ధైర్యమున్నవాఁడు జీతమిచ్చెడి వానినిఁ బని గణింపఁడు. ఇందులో నింకొకఁ డున్నది. రాజు కొలువులో నొకఁడున్నాఁడు. రాజు భరణమిచ్చుచుండును. ఆ భరణము నిస్సంశయముగా మాసికముగా సాంవత్సరికముగా వచ్చుచుండును. దానినిఁ గూర్చి భృత్యునకు భయము లేదు. ఇంకొక దెసనుండి మఱియెవఁడో వానికిధనమిచ్చుచుండును. వాఁడిచ్చు ధనము తనకు వచ్చు భరణముకన్న తక్కువది కావచ్చును. అది పైన వచ్చు ధనముకదా! ఆ ధనమిచ్చు వానియందు భృత్యునకు రాజునందుకంటె నెక్కువ యభిమాన ముండును. అన్యాయముగా వచ్చిన ధనము ననుభవించుటలోనున్న మాధుర్యము న్యాయముగా వచ్చినదాని యనుభూతిలో లేదు.

ధనముగాని స్త్రీగాని రెండు నొక్కటియే. అందుచేత వాని క్రిందనున్న సేనాపతులు రాజునందు కంటె వానియందు దధి కానురాగవంతులు. అంతేకాదు. ఒక రాజకుమారుఁ డున్నాఁడు. తండ్రిచాటువాఁడు. తండ్రి వయసుమీఱినవాఁడు. వృద్ధుఁడు. లోకానుభవము కలవాఁడు. రాజధర్మము లెఱిఁగినవాఁడు. కొడుకు చిన్నవాఁడు. ఇతనికి ధనము గావలయును. తండ్రి యీయవలయును. ఇతనికి రావలయును. ఇతఁడు దుష్ట వ్యయము చేయుచున్నాఁడని తండ్రి యితని చేతికి డబ్బుంద నీయఁడు. ఇతఁడు బొక్కసదారునో, ఒక నీతిరహితుఁడైన మంత్రినో, దుష్టుఁడైన సేనాపతినో పట్టుకొని వారిద్వారా ధనము సంపాదించును. బొక్కసదారైనచో తనకే నష్టము. మంత్రియైనచో రాజ్యమునకు నష్టము. సేనాపతియైనచోఁ బ్రజలకు కడగండ్లు. ఏది యెట్లున్నను రాజు మాటయందు కంటె మహాసేనాధిపతి మాటయందుఁ దక్కిన సేనానుల కధిక గౌరవమన్నచో నేను జెప్పినవి కావలయును. సేనాపతి యూళ్ళ మీఁదపడి దోచికొనును. పదిలక్షలు దోచికొనును. రాజు కొడుకు లక్ష కావలయునని యడిగెను. ఆ పదిలక్షలలో నొక లక్ష రాజు కొడుకున కిచ్చెను. రాజు కొడుకు సంతోషించెను. ఆ సేనాపతి తనకుఁ బరమాప్తుఁడనుకొనెను. తక్కిన తొమ్మిది లక్షలేమయ్యెను? ఐదులక్షలో యాఱులక్షలో తాను వెనుకవేసికొనెను. తక్కిన లక్షలు క్రింది సేనాపతులకుఁ బంచిపెట్టెను. వారెన్నాళ్లుద్యోగము చేసినచో లక్ష వెనుకవేయఁ గల్గుదురు. కాలా:- అట్లు జరిగినదందువా? రాక్ష:- నాకేమి తెలియును? లోకమును, రాజ్యమును,

కొంతటి ప్రకృతియు నిట్టుండునని చెప్పితిని. అట్టు జరిగినదో లేదో తమకు దెలియగలయును.

కాలాశోకుడు కొంచెసేపు మౌనముగా నుండెను. రాక్షసుడు లేచి నిలుచుండి నేను పోదునా యనెను. కాలాశోకుడు రాక్షసునిం గూర్చుండుమని సైగచేసి మరల నిట్లనెను. "తక్కినవన్నియు నట్లుంచుము. ఉత్తుంగభుజుడు నామాట వినని యెడల నేమి చేయవలయును?" రాక్ష:- ఇప్పుడు నే నేమియుం జెప్పలేను. అతడు మీమాటను నిరాకరించినప్పుడు నాకు వార్త పెట్టుడు. నేను వత్తును. అప్పటి పరిస్థితులనుం బట్టి అప్పుడేమి చేయవలయునో నిర్ణయింపవలయును గాని యిప్పుడు నేనేమి చెప్పగలుగుదును? కాలా:- అప్పుడే కబురు పంపించెదను. కాని నాకొక్క సాహాయ్యమును చేసిపెట్టుము. రాక్ష:- ఏదియొక్క సాహాయ్యమును నిస్సంశయముగా జేయుదును. కాలా:- అనగా తక్కినవేవియు గాదన్న మాట. నామీద నీకిదివఱకే కోపమున్నట్లున్నది? నేను నిన్ను పూర్వము నిరాకరించినమాట నిజమే. అందుచేతనే నాకు కోపము. ఎందుకు కోపమో నాకు దెలియదు. అందుకు నా తండ్రికి శూద్రాపత్యమునందు జన్మించినాడు. చూచితివా! రాక్షసా! నేను సింహాసనయోగ్యుడను కాను. నా తండ్రియొక్క చిన్ననాటి కామము నాకిప్పుడు హత్యముగా నున్నది. నా కామప్రవృత్తిని గుఱించి నేను విచారించుకొనుటలేదు — అని కాలాశోకుడు తలవంచికొని మఱియు నిట్లు చెప్ప నారంభించెను. నా కెందువలననో దినములు మంచివి కానవిపించుచున్నది. నేనుత్తుంగభుజునికి లోకు

వశమై పోయితిని. దానికిఁ గారణములు నీవే చెప్పితివి. నేనిప్పుడు మరల స్వాతంత్ర్య మవలంబించుటకుఁ జాల ప్రయత్నము చేయవలయును. మరల నుత్తుంగభుజుని మీఁద నధికారము సంపాదించుటకు నాకుఁ గొంతకాలము పట్టును. నా ప్రవృత్తిని నేను మార్చికొనవలయును, మార్చికొందును. ప్రయత్నము చేయుదును. కాని రాజకీయ పరిస్థితులు నా కంతరి యెడ మిచ్చునట్లు లేవు. నేను నిద్రఁబోవుచు కూర్చుంటిని. ఎవఁడో యొక మహానీతివేత్త పాంచాలదేశములు, కౌరవదేశములు, హైహయదేశము, శూరసేనాది దేశములు సులభముగాఁ గైవసము చేసికొన్నాఁడు. ఉత్తుంగభుజుఁడు సన్యాసి మైకములోఁ బెట్టినాఁడు. మిత్రుఁడనుకొన్న కోసల రాజు సేనలతో వచ్చి వీధివాకిట నున్నాఁడు. నా సేనాపతి యున్న వానిని నేను నమ్ముటకు వీలులేదు. నీవింత బుద్ధిమంతుఁడవు. నా రాజ్యములో నున్నావు. నీ విట్టివాఁడవని మహారాజు నాకుఁ జెప్పెడివఱకు నాకుఁ దెలియదు - అని కాలాశోకుఁడు తలయెత్తి చూడఁగా నెదుట రాక్షసుఁడు లేఁడు. ఆతఁడెప్పుడు వెడలిపోయెను ? తనవద్ద సెలవు తీసికొనకుండఁగనే వెడలిపోయెనే! తాననుజ్ఞ యీయలేదే. తన యనుజ్ఞ లేకుండ తాను వెడలిపోయిన యవినయమును రాక్షసుఁడు చూపించెనే. వెంటనే కాలాశోకునకు రాక్షసుని మీఁదఁ గోపము వచ్చెను. ఆ రాక్షసునిఁ బట్టుకొని రమ్మని రాజభటున కాజ్ఞ యిచ్చుటకు లేచి కవాటము వద్దకుఁ బోయెను. ఇంతలోఁ గాలాశోకునకు స్మృతి కలిగెను. ఒకవేళ నుత్తుంగభుజుఁడు తన మాటను నిరాదరించినచోఁ దా నేమిచేయవల

యునో చెప్పెడివాఁడు రాక్షసుఁ డొక్కఁడే. అతనిని బంధించినచో నెట్లు? ఉత్తుంగభుజుఁడు తన మాటను పాలించినచో నప్పుడు రాక్షసుని నియమింపవచ్చును. లేనిచో రాక్షసుఁడే యా యుపాయముఁ జెప్పవలయును. ఆ యుపాయము వానినుండి దెలిసికొని తరువాత వానిని బంధింపవచ్చును. కాలాశోకునకు మఱునాటినుండి తీరిక యున్నట్లు కనిపించలేదు. లంఘనములో మనుగుడుపు లన్నట్లు రాజ్యము మంగిట కోసల సేనలు వచ్చి కూర్చున్నవి. ఆర్యావర్తమంతయు రాజ విప్లవముగా నున్నది. ఇందులో నీ బౌద్ధభిక్షువులు, అర్హాతులు, స్థవిరవాదులు, వజ్జిభిక్షుకులు. వీరిలో వీరికిఁ గలఁతలు. అవి యన్నియుఁ దాను తీర్చిపెట్టవలయును. ఇప్పటికి కొన్ని వందలమంది భిక్షుకులు గిరివ్రజపురమునకుఁ జేరుదురు. వారికోస మిచ్చట నెన్నియో యేర్పాట్లు జరుగుచున్నవి. ఆ యేర్పాట్లు చేయువా రెవరో? తనకుఁ దెలియదు. ధనము మాత్రము తనవద్ద తీసికొన్నారు. అక్కడికిఁ దా నదృష్టవంతుఁడే. ఆ ధనమంతయు రాజ్యముయొక్క ధనాగారమునుండియే యీయఁబడినది. తన తండ్రి దాని కంగీకరించినాఁడు. ఆ ధనముకూడ నుత్తుంగభుజునిద్వారా తెప్పించినది కాదు. గురువులైన బౌద్ధసన్యాసులు తనతోఁ దన తండ్రితో న్యాయమైన ధనమైననే యీ బౌద్ధభిక్షుక మహాసంఘ సమావేశము గిరివ్రజపురములో జరుపుదు మన్నారు. నిజమునకు నాఁడు మగధదేశమునకు వచ్చిన యాపదయేమి? కోసలపతి మగధములమీఁదికి రాలేదు. విదేహము లాక్రమించెను. అదికూడ బుద్ధిపూర్వకముగాఁ

వయ్యై పోయితిని. దానికిఁ గారణములు నీవే చెప్పితివి. నేనిప్పుడు మరల స్వాతంత్ర్య మవలంబించుటకుఁ జాల ప్రయత్నము చేయవలయును. మరల నుత్తుంగభుజుని మీఁద నధికారము సంపాదించుటకు నాకుఁ గొంతకాలము పట్టును. నా ప్రవృత్తిని నేను మార్చికొనవలయును, మార్చికొందును. ప్రయత్నము చేయుదును. కాని రాజకీయ పరిస్థితులు నాకంతటి యెడ మిచ్చునట్లు లేవు. నేను నిద్రఁబోవుచు గూర్చుంటిని. ఎవఁడో యొక మహానీతివేత్త పాంచాలదేశములు, కౌరవదేశములు, హైహయదేశము, శూరసేనాది దేశములు సులభముగాఁ గైవసము చేసికొన్నాఁడు. ఉత్తుంగభుజుఁడు సన్నాహక మైకములోఁ బెట్టినాఁడు. మిత్రుఁడనుకొన్న కోసల రాజు సేనలతో వచ్చి వీధివాకిట నున్నాఁడు. నా సేనాపతి యన్న వానిని నేను నమ్ముటకు వీలులేదు. నీవింత బుద్ధిమంతుఁడవు. నా రాజ్యములో నున్నావు. నీ విట్టివాఁడవని మహారాజు నాకుఁ జెప్పెడివఱకు నాకుఁ దెలియదు – అని కాలాశోకుఁడు తలయెత్తి చూడఁగా నెదుట రాక్షసుఁడు లేఁడు. ఆతఁడెప్పుడు వెడలిపోయెను? తనవద్ద సెలవు తీసికొనకుండఁగనే వెడలిపోయెనే! తా ననుజ్ఞ యీయలేదే. తన యనుజ్ఞ లేకుండ తాను వెడలిపోయిన యవినయమును రాక్షసుఁడు చూపించెనే. వెంటనే కాలాశోకునకు రాక్షసుని మీఁదఁ గోపము వచ్చెను. ఆ రాక్షసునిఁ బట్టుకొని రమ్మని రాజభటున కాజ్ఞ యిచ్చుటకు లేచి కవాటము వద్దకుఁ బోయెను. ఇంతలోఁ గాలాశోకునకు స్మృతి కలిగెను. ఒకవేళ నుత్తుంగభుజుఁడు తన మాటను నిరాదరించినచోఁ దా నేమిచేయవల

యునో చెప్పెడివాఁడు రాక్షసుఁ డొక్కఁడే. అతనిని బంధించినచో నెట్లు? ఉత్తుంగభుజుఁడు తన మాటను పాలించినచో నప్పుడు రాక్షసుని నియమింపవచ్చును. లేనిచో రాక్షసుఁడే యా యుపాయముఁ జెప్పవలయును. ఆ యుపాయము వానినుండి దెలిసికొని తరువాత వానిని బంధింపవచ్చును. కాలాశోకునకు మఱునాటినుండి తీరిక యున్నట్లు కనిపించలేదు. లంఘనములో మనుగుడుపు లన్నట్లు రాజ్యము మఱంగిట కోసల సేనలు వచ్చి కూర్చున్నవి. ఆర్యావర్తమంతయు రాజ విప్లవముగా నున్నది. ఇందులో నీ బౌద్ధభిక్షువులు, అర్హతులు, స్థవిరవాదులు, వజ్జిభిక్షుకులు. వీరిలో వీరికిఁ గలఁతలు. అవి యన్నియుఁ దాను తీర్చిపెట్టవలయును. త్రేపటికి కొన్నివందలమంది భిక్షుకులు గిరివ్రజపురమునకుఁ జేరుదురు. వారికోస మిచ్చుట నెన్నియో యేర్పాట్లు జరుగుచున్నవి. ఆ యేర్పాట్లు చేయువా రెవరో? తనకుఁ దెలియదు. ధనము మాత్రము తనవద్ది తీసికొన్నారు. అక్కడికిఁ దా నదృష్టవంతుఁడే. ఆ ధనమంతయు రాజ్యముదొక్క ధనాగారమునుండియే యీయఁబడినది. తన తండ్రి దాని కంగీకరించినాఁడు. ఆ ధనముకూడ నుత్తుంగభుజునిద్వారా తెప్పించినదికాదు. గురువులైన బౌద్ధసన్యాసులు తనతోఁ దన తండ్రితో న్యాయమైన ధనమైననే యీ బౌద్ధభిక్షుక మహాసంఘ సమావేశము గిరివ్రజపురములో జరుపుదు మన్నారు. నిజమునకు నాఁడు మగధదేశమునకు వచ్చిన యాపదయేమి? కోసలపతి మగధముఁలమీఁదికి రాలేదు. విదేహము లాక్రమించెను. అదికూడ బుద్ధిపూర్వకముగాఁ

జేయు లేదు. వృద్ధుఁడైన యుశీనరుఁడు బుద్ధిమానాలి యుద్ధము
జరుగుచున్న గ్రామమువద్దకుఁ బోయెను. ఎవరో బౌద్ధభిక్షుకు
లా ముసలివానినిఁ గ్రిందికి త్రోసిరి. ఆ త్రొక్కిడిలో నాతఁడు
మరణించెను. రాజు పోయినంతనే విదేహము లేమికావలయును?
సుమిత్రుఁడు మిథిలానగరమునకు వచ్చెను. సేనలు మిథిలా
నగరమును దోచుకొనిరి. రాజవంశ నిర్మూలనము చేసిరి.
నిజముగాఁ గోసలపతియందు దోషము లేదు. నిజానకు మిథిలా
నగరమునకును మగధరాజ్యపు టెల్లలకునుఁ జాల దవ్వున్నది.
అతఁడు మిథిలనుండి కదలనే లేదు. మిథిలకును మగధరాజ్యపు
టెల్లలకునుఁ దేలికగా నిరువది యామడల దూరముండ
వచ్చును. అతఁడు మగధములమీఁదికి రానే లేదు, ఇది నాకు
నుత్తుంగభుజుఁడు పెట్టిన భయము. అతఁడే సైన్యమును
దరలించుకొని పోయెను. ఈ మహాబౌద్ధసంఘము నాల్గైదు
దినములు జరుగవచ్చును. నేఁడే యుత్తుంగభుజునకు తాను
వార్త పంపును. అతఁడు తన మాట చెల్లించుననియు
చెల్లింపననియు నాలుగైదు దినములలో దేలిపోవును.
ఈ నాలుగైదు దినములలో బౌద్ధసంఘ మహాసమావేశ
మునుఁ బూర్తియగును. అప్పటికన్నియుఁ జూచికొనవచ్చును.
ఉత్తుంగభుజుఁడు తాను మిథిలానగరమునకుఁ బోయికదా
కోసలసేన నెదిరించవలయును. కోసలుఁడు తనంత దాను
మాగధములమీఁదికి రాఁడు, అని రాక్షసుఁడు చెప్పెను.
రాక్షసుఁడు మహావివేకి. అంతయు నుత్తుంగభుజునిమీఁద
నాధారపడి యున్నది. అతఁడు తన వార్తను మన్నించి

మిథిలానగరమునకుఁ బోకుండ కాపువలకొఱకు సైన్య మచ్చ
టనే యుంచి యూరకుండెనా యీ బౌద్ధమహాభిక్షు సంఘ
సమావేశముయొక్క యనంతరమునఁ దాను తన జీవితా
ధ్యాయము నంతనుఁ దిరుగవేయును. ఉత్తుంగ భుజుని చేతఁ
బ్రజల నట్లు ద్రోయించరాదు. తండ్రికిఁ జెప్పకుండ నొక్క
గవ్వయైనను తాను వ్యయపెట్టరాదు. తన దురభ్యాసము
లన్నియు మానివేయవలయును. పాంచాలాది దేశములందు
క్షత్రియ వంశములను సంహరించినవాఁడెవఁడో కనుఁగొన
వలయును. ఉత్తుంగభుజు, యుద్యోగము తీసివేయవలయును.
క్రింది సేనాపతులను విచారించి వారిని శిక్షింపవలయును.
వా రన్యాయముగాఁ సంపాదించిన యాస్తులను తాను వశముఁ
జేసికొనవలయును, దేశములో నెన్ని కుటుంబములకో
యుత్తుంగభుజుఁ డపకారముఁ జేసెను. వారిని వారినిఁ
గనుగొని వీరివద్దనుండి లాగికొనిన ద్రవ్యము వారికిఁ బంచి
పెట్టవలయును. తన కిప్పు డెట్లున్నదనఁగాఁ దానే తనంతట
నుత్తుంగభుజునివద్దకు పోయి యతనినిఁ దన వెంటఁ దీసికొనివచ్చి
తాను నిశ్చయించుకొన్న మహాకార్యమును వెంటనే ప్రారం
భించవలయునన్నంత్వరగా నున్నది. కాని వజ్రశాఖాచార్యులు
తనమీఁద నాశయంతయుఁ బెట్టుకొనియున్నారు. రేపు ప్రొద్దు
టికి నేఁడెన్మిదివందల బౌద్ధశ్రమణులు గిరివ్రజపురమునకు
వత్తురు. తాను రాజధానిలో లేనిచో వారు దన్ను వెలి
వేయుదురు. తన రాజ్యముమీఁద నాంక్ష పెట్టుదురు.
దుష్టులైన బౌద్ధభిక్షువులు రాజులనుఁ దమ చేతులలోఁ బెట్టు
కొని యాడించుచున్నారు. వారేమో సన్న్యాసులు. ప్రపం

చకముతోఁ దమ కేంపులకు ? ఈ మతమునకుఁ బ్రచార
మెందుకు ? అసలు మతమునకుఁ బ్రచారమెందుకు ? ఈ
వజ్జిభిక్షువులవలన నేను చాల బాధపడుచున్నాను. వీరి కింకొక
వేళ పనికిరానట్లు సరిగా నాకు యుద్ధము సిద్ధమై కూర్చున్న
వేళనే యీ మహాసంఘ సమావేశము వచ్చి కూర్చున్నది.
నా కాలోచించఁగా నాలోచించఁగా ఇది యేదో యొక
వ్యూహమువలెఁ గనిపించుచున్నది. ఎవఁడు పాంచాలాది
రాజవంశములను సంహరించెనో, వాఁడే కోసలాధిపతిని నా
రాజ్యమువైపు మఱలించెననియు వాఁడే యీ మహా బౌద్ధ
భిక్షుక సంఘ సమావేశమును తేపటికే నిర్ణయించెననియు
ననిపించుచున్నది. ఇదివఱకెప్పుడు నాకింతటి యూహ లేదు.
నాకింతటి యూహ యెక్కడినుండి వచ్చినది ? నా కిట్లెందు
కనిపించుచున్నది ? ఈ రాక్షసుఁడు వట్టి రాజనీతివేత్త కాడు.
వీఁడొక యైంద్రజాలికుఁడు. వీఁడొక మాంత్రికుఁడు. నాతో
నాల్గైదు గడియలు మాటాడి నాలోనున్న యాలోచనాశక్తిని
వీఁడు రెచ్చఁగొట్టినాఁడు. నాయందు పది సందేహ వృక్ష
ములను నాటిపోయినాఁడు. వానికి నేనన్నచో గౌరవము లేదు.
నాయందతఁడు వినయమునుఁ బ్రదర్శించలేదు. నేనన్నచో
నతనికి భయము లేదు. నే నతనిని శిక్షించలేనని యతనికొక
స్థైర్యము. అతని కాధైర్య మెందులకో నాకు తెలియలేదు.
నాపై రెత్తకుండ నా దోషములన్నియు నా మొగము నెదుట
చదివినాఁడు. ఎంతటి నిర్భీకుఁడు. ఈ యుత్తుంగభుజునిబదులు
పూర్వము వీనినైన సమాశ్రయించితిని గాదనిపించుచున్నది.

వానికి నామీఁదఁ గోపము. అంత కోపమెందులకో దానికిఁ గారణమేమైయుండునో? ఒకవేళ నుత్తుంగభుజుఁడు పూర్వము పలుగ్రామములమీఁద, పలుపల్లెలమీఁద దాడిచేసి దాడిచేసి, జనులనుహింసించి, వారిధనములను దోఁచికొనెను. అట్లు దోఁచి కొనఁబడినవారిలో నితని సమీపబంధువు లెవరైనఁగలరేమో! అయ్యో! ఆ యుత్తుంగభుజుఁ డిట్లు చేసిన ఘోర సమయముల యందు నందందు మహాసౌందర్యవతులు గనిపింపఁగా వానినిఁ దెచ్చి గిరివ్రజపురమునునుంచి నాకుఁ గానుకలుగా నిచ్చెను. నేను వారిని మహాంధుఁడనై స్వీకరించితిని. ఆ స్త్రీ లేమైపో వలయును? నాదియా యేకరాత్ర సుఖము. వారి కాజీవి తాంత దుఃఖము. నిస్సందేహముగా నట్టిది జరుగవల యును. అంత ఘోరమే జరిగినచో రాక్షసుఁడు నాతో నీమాత్రమైనను మాటాడియుండఁడు. అతని సమీప బంధు వులైన స్త్రీలకట్టి యవమానము నావలన జరిగినచో నా యెదుటికి వచ్చి యిట్లు మాటాడఁడు. ఒకవేళ నారాక్షసుఁడు నిజముగా రాక్షసుఁడేమో! వాఁడంత కోపమును తన మన సులో దాఁచికొని పైకి నిట్లు మాటాడఁగల నిగ్రహముగల ప్రకృతి కలవాఁడేమో! ఇది యెట్లు తెలియును? ఎప్పుడెప్పు డే యే పురము మీఁద నే యే జనపదము మీఁద నుత్తుంగ భుజుఁడును వాని సైనికులును పడి కొల్లగొట్టిరో వాని పట్టిక యున్నచో తెలిసికొనవచ్చును. దొంగలు తాము దోఁచి కొనిన యూళ్ళపట్టికలు వ్రాయుదురా? పాలించెడు ప్రభువు తన యేలుబడిలోని యూళ్ళపట్టికలు వ్రాసికొనును. ఈ యూరిమీఁద నింత పన్ను రావలయును. ఆ యూరిమీఁద

సించ రావలయును. అన్ని లెక్కలకొఱకు పట్టికలు కావల
యునుగాని వంపి నమ్మకు బొక్కినదే లాభమన్నట్లు ఎదో
యూహకు దోచినప్పు డెంతవచ్చునో యంతియే వచ్చును.
దానికి పట్టికలెందుకు? ఇచ్చట నుత్తుంగభుజుం డున్నచో
రాక్షసునిం జూపించి యితని బంధువుల కెప్పుడైన మనవలన
ద్రోహము జరిగినదాయని కనుగొనవచ్చును. ఇచ్చట నతండు
లేండాయెను. అతండున్నచో నితనిని పిలిపించుటయే జరిగి
యుండెడిది కాదాయెను. ఈ సమస్య యెంత విషమముగా
నున్నది. ఈ సృష్టి యెంత చమత్కారముగా నున్నది. నేను
వందమంది భిక్షుకుల నెఱుంగుదును. వారి యుపదేశములను
విన్నాను. వారూరకే నీతులను వల్లెవేయుదురు. నీతులను
వల్లెవేసినందువలనం బ్రయోజనమేమి? మానిసికి తన జీవిత
ములో ననుభవము కావలయును. ఆ యనుభవమునుం బర్యా
లోచించి చూచికొనుటకుం గ్లిష్టపరిస్థితు లేర్పడవలయును.
ఆ పరిస్థితులనుండి యాలోచన పుట్టును. తన కనుకటి పరిస్థితు
లను సింహావలోకనముం జేసికొనును. మానవునకు జ్ఞానము
కలుగుటకు వినయములు, పిటకములు. నక్కఱలేదు. క్లిష్ట
పరిస్థితులు కావలయును. రాక్షసునివంటి తీవ్రబుద్ధి, తనతో
మాటాడెడువాండు కావలయును. అప్పుడు జ్ఞాన ముదయిం
చును. వేయి దేవాలయములకుం బోయినను, పదివేల విహా
రములకుం బోయినను, మాండూక్యము చదివినను, ఛాందో
గ్యము చదివినను, వినయసూక్తము జదివినను, ధమ్మపదము
చదివినను జ్ఞానోదయము కాదు. అది పట్టి విషయములను
తెలిసికొనుట. రసాలవృక్షమున్నది. అది యీ జాతి చెట్టు.

దాని పుష్పములు గోరంతలు. దానికాయ లిట్లుండును. సంవత్సరమున కొక్కొక్క వృక్షమిన్ని కాయలు కాయవచ్చును. ఈ మొదలైనవన్నియు జ్ఞానమని మూర్ఖులనుకొందురు. పండు భుజించినవాఁ డొక్కఁడే సుఖి.

త్రిశరణారావ కోలాహలములతో బౌద్ధసన్యాసులు పురప్రదేశము చేయుచుండిరి:

## ౧౦

బౌద్ధమతచరిత్రలో నాల్గు మహాసంఘములు జరిగినట్లును, నా సంఘములయందు నప్పటప్పటికి నా మతము నందలి విప్లవకారుల చర్యలకు వ్యతిరేకముగా సూత్రములు నియమింపఁ బడినట్లునుఁ గలదు. మొట్టమొదట సంఘము బుద్ధుఁడు చనిపోయిన తత్క్షణమే జరిగెను. అప్పటికే బుద్ధుని యందు గౌరవము లేనివారు కలరు. ఈ సంగతి పూర్వము చెప్పఁబడినది. బుద్ధుఁడు చనిపోయినంతనే సుభద్రుఁడన్న వాఁడు పీడ వదలిపోయిన దనెను. ఇందులో నొక చమత్కారమున్నది. బుద్ధుని మార్గమునుఁ గొంద ఱవలంబించిరి. ఆ మార్గము వారి కిష్టముగా నుండెను పూర్వ సంప్రదాయములు కొంతమంది కనిష్టముగా నుండెను. బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, శూద్రులు, ఏ వర్ణము వా రావర్ణ ధర్మములు చేయుచున్నచో, శాంతిక్షమాదులు కలిగి యున్నచో, సచ్ఛీలమును సత్యవాక్పాలనమునుఁ జేయు

చున్నచో, సనాతన వైదికమతమునకు భంగ ముండెడిదికాదు. ఆ లెక్కను వైదికమతమేమి ? ఏ మతమునకును భంగము లేదు. రాజుగాని, రాజ్యమును పాలించు నధికారులుగాని, నిజముగాఁ బ్రజాహితులైనచో, రాజ్యములందు విప్లవములు రావు. అట్లే మానవులు సచ్ఛీలురై పేరాసలేనివారై స్వార్థ నిష్ఠులు కానిచో, నన్ని రాజ్యములు, నన్ని సంఘములు, నన్ని మతములు తొలినాఁటి స్వచ్ఛత తోడనే సాగును. బ్రాహ్మణులు, క్షత్రియులు, దా మధికులమని యనుకొని స్వవర్ణ యోగ్యమైనశాంతి క్షమా తితిక్షాది గుణములను పరిత్యజించి, తమకున్న యధికారమును తమ శత్రువులమీఁద పగతీర్చు కొనుటకుఁ, దమకిష్టమైన వారికిఁ దోఁచిపెట్టుటకును, ధనము కూడఁబెట్టుటకును, వినియోగించుచు, నికృష్టకామ వృత్తులైనచో జన మెదురుతిరుగుదురు. జన మెదురుతిరిగి విప్లవములు వచ్చుట తత్పూర్వ సిద్ధాంతములయందలి దుష్టతకాని అపరి పుష్టతగాని కాదు. అనుయాయులయొక్క లౌకికమైన దురాశా దుశ్శీలముల చేతఁ దాడితమై కలుషితమై ప్రధాన సూత్రములు దుష్టము లనిపించును. అంత విజృంభించిన బౌద్ధమతమే భారతదేశమునుండి నిష్క్రమించిపోయెను. ఎంత నిష్క్రమించినదనఁగా బౌద్ధసాహిత్యమునందు కొన్నివేల గ్రంథములు కలవు. ఒక్క గ్రంథము కూడఁ జివరకు భారతదేశము నందుఁ గనిపించలేదు. ఆధునికులైన పరిమిత సంఖ్యాకులైన బౌద్ధులు మూలగ్రంథములకొఱకు పరదేశములకుఁ బోవలసి వచ్చెను. బౌద్ధమతము కూఁకటివ్రేళ్ళతో భారతదేశమునఁ బెల్లగింపఁబడిన దనఁగా బౌద్ధమతము దుష్టమైనదని చెప్పవల

యునా? తదనుయాయులు దుష్టులని చెప్పవలయునా? కొన్ని వేలయేండ్ల క్రిందట తదావ్యాప్తమైయున్న వైదికమతము మంచిది కాదని లక్షలాది జనులు బౌద్ధమతమును స్వీకరింపఁగా నేండ్లు గడచిన తరువాత బౌద్ధమతము మంచిది కాదని మఱల వైదికమతమే యెందుకు స్వీకరించిరి? ఆధునిక చరిత్రకారులు వైదిక మతానుయాయులైన బ్రాహ్మణులును, తదనుయాయులును, బౌద్ధమతమును నిర్మూలింపఁ జేసిరని చెప్పుదురు. అది యేమి యొక చెట్టా పెల్లగించుటకు? ఒక గోడయా పడఁద్రోయుటకు? బౌద్ధశ్రమణులు దుశ్శీలురై పోయిరి. తమకుఁగల పలుకుబడిని దుర్వినియోగము చేయ నారంభించిరి. విహారములలో బౌద్ధ సన్న్యాసులును సన్న్యాసినులును యథేచ్ఛముగా విహరింపఁ జొచ్చిరి. తెలుగుదేశమున నిట్లు పాడ్పడిన బహు బౌద్ధ విహార స్థలములకు 'లంజెదిబ్బ' లని పేరు. దీనినిఁబట్టి బౌద్ధవిహారములు చివరి రోజులలో నెట్లు మాఱినవో తెలియనగును. విహారములలోనున్న సన్న్యాసులకు సన్న్యాసినులకే గాక పల్లెలకుఁ బట్టణములకుఁగూడ నీ బౌద్ధ విహారముల యందలి సన్న్యాసినులు జారప్రవృత్తికి హేతువులై సంఘమునందు సర్వజనులకు ద్వేషస్థానములైరని యర్థము. లోకము చెడిపోవుటకు మానవ ప్రవృత్తి హేతువుగాని సిద్ధాంతములు హేతువులుకావు. ఏమతమైనను ఏరాజ్య సిద్ధాంతములైనను దేశమునందునుఁ బ్రజలయందును సుస్థితియు సువ్యవస్థయు సమకూర్చుటకే యేర్పడును. తత్సూత్రములను పాలించెడి వారి స్వార్థముచేత దుశ్శీలముచేత నధికారాశచేత నెప్పటికప్పటికి సంఘములు రాజ్యములు కలుషితములై విప్లవములు

పుట్టును. ఒక మహాపురుషుఁడెవఁడో యుద్భవించి మఱల నతఁడు సంఘ దేశములను సుస్థితికిఁ దెచ్చును. వాని బ్రతికి యున్నన్నినాళ్ళు తత్ప్రభాముద్రిత జీవనులై తదీయమైన సచ్ఛీల ప్రతిబింబిత వృత్తులై జనులు సువ్యవస్థితు లగుదురు. ఆ మహాపురుషుఁడుగూడ మనుష్యుఁడే. అతఁడు నాహార మును భుజించియే బ్రదుకవలయును. ఎంతకాదన్న నతనికిఁ గూడ నల్పాల్పములైన దురభిమానము లుండును. ప్రత్యక్ష ముగా నది స్వార్థగుణమని చెప్పుటకు వీలులేకపోయిననుఁ దద్భ్రాంతి కలిగించు గుణము లతనియం దుండును.

బుద్ధునియం దట్లే యుండెను. అతఁడు తొలుత తాను కనుగొన్న నిర్వాణమును లోకమున కుపదేశించినపుడు తత్పూర్వమందున్న సాంఖ్యమతము నుపనిషన్మతము మొద లైన వానినుండి శబ్దములన్నియు గ్రహించెను. ఆ సిద్ధాంత ములనే తీసికొనెను. వానిని మార్చి చెప్పెను. ఈరహస్యము లన్నియు నప్పుడు పండితులైన వారికిఁ దెలియును. సామాన్య ప్రజలకు బుద్ధుఁడు క్రొత్తగాఁ జెప్పుచున్నట్లుండెను. తెలియని వారతఁడు క్రొత్తగాఁ జెప్పినట్లు భావించిరి. ఆ తెలిసినవారి వద్ద విన్నవారు బుద్ధునియందు నిరాదరము కలిగియుండిరి. తాత్పర్యతః బుద్ధునికాలమునందే బుద్ధునకు వ్యతిరేకు లుండిరి. అతఁడు క్రొత్తగా తెచ్చిన దేమియు లేదని యున్నవానినే మార్చెననియుఁ గొంత యపప్రథ యానాఁడే కలదు. మఱియు నతని నిర్వాణ మన్నమాటకాని, పంచస్కంధములుగాని, భిక్షుశబ్దముగాని వాని బాహిర స్వరూపములుగాని, క్రొత్తలు కావు. వానికి వేఱే యర్థము చెప్పుట సంభవించినది.

బుద్ధుఁడు తాను నిర్వాణము పొందిన తర్వాత చేసిన మొదటి దోష మేమనఁగా తిరిగి శ్రావస్తికిఁ బోవుట. అచ్చటినుండి తండ్రి రమ్మని కబురంపెను. కపిలవస్తు పురమునకు బోయెను. తన మతము నచ్చట స్థాపించెను. అతఁడు రాజు కొడుకు కపిలవస్తుపురమున నతని కదివఱకే గొప్పపలుకుబడి కలదు. తన మతస్థాపన నచ్చటఁ జేయుటకు వానికి వీలుకుదిరెను. అతఁడు బ్రదికియుండఁగనే కపిలవస్తు నగరమున మొదటి బౌద్ధ సంఘారామములు వెలసెను. బుద్ధుఁడే వారియందమితమైన యభిమానము నెఱపుచుండెను. క్రమముగా ననేకులు బౌద్ధమతమునందు చేరిరి. కాని బుద్ధుఁడు శ్రావస్తిపురము కపిలవస్తుపురము నందుఁగల బౌద్ధ భిక్షుకుల కాధిక్యమిచ్చుచుండెను. వారి నెక్కువ ప్రేమించుచుండెను. వారికి వజ్జి భిక్షువు లనిపేరు. వారినే లిచ్ఛవులనికూడ పిలుచు చుండిరి. అతఁడు తన నిర్వాణమార్గముయొక్క సార్వజనీనతయు సర్వాశ్రేయత్వమును బోధించుటకు సర్వవర్ణములవారిని తన మతములోఁ గలుపుకొనెను. బ్రాహ్మణుఁడైన కాశ్యపుఁడును బౌద్ధమతమును స్వీకరించెను. ఉపాలి యన్న మంగలినిఁ దాను శిష్యుఁడుగాఁ దీసికొనెను. తీసికొన్నపుడు కాశ్యపునియొక్కయు నుపాలునియొక్కయు పాండిత్యములుగాని జ్ఞానములుకాని యాత్మానుభూతి లక్షణములుగాని యెంత భేదించును? సాంఘికముగా సిద్ధము నొక్కటియే. పండితుఁడై చదివికొనిన వాఁడును, తత్పూర్వమునందు మర్యాదగల వంశమునందు పుట్టినవాఁడును, వినయాదులు తన వెంపకములోఁ గలఁ వాఁడును, నానా సంపత్తిగలవాఁడు నైన గాశ్యపుఁ డుపాలు

నితోఁ గలసి యాహార విహారములు చేయుటకు క్రొత్తమతము యొక్క యొత్తిడియేకాని యీ విభేదభావము వాని మనసులో నంతరించుట గలదా ?

బుద్ధుఁడు తన మతమును మఱియు వ్యాపింపఁ జేయుటకు గిరివ్రజపురమునకుఁ బోయెను. రాజైన బింబిసారుఁడును, శుద్ధోదనుఁడును బంధువులు. బింబిసారుఁడు బుద్ధుని స్వీకరించెను. బౌద్ధమత మవలంబించెను. గిరివ్రజపుర ప్రజలందఱు బౌద్ధమతమునం దభిమానము వహించిరి. అందఱు నొక్కటియే యనియు వర్ణభేదములు లేవనియు నన్నమాట సహజముగా సామాన్యులకు రుచికరమన్నమాట. లోకము మనస్సులో, విద్యలో, విజ్ఞానములో, సచ్ఛీలములో, ప్రతిభలో, పాండిత్యములో, శక్తులలో ననంత వైవిధ్యము కలదు. కాని యీ మూఢలోకమునకు బయటి కందఱు నొక్కటే యనుకొనుట మిక్కిలి యిష్టమైన వ్యవహారము. కొన్ని సిద్ధాంతము లీ బహిరైక్య సూత్రము నాశ్రయించి లోకమునుఁ బ్రచారించును. మూఢులు పరితృప్తు లగుదురు. దీనివలన మూలసిద్ధాంతమే కలుషితమై జనసంఘముయొక్క యోగ్యత్వము తగ్గిపోవును. బింబిసారుఁడు బౌద్ధుఁ డగుట నతని కొడుకైన యజాతశత్రునకు నిష్టములేదు. ఇష్టము లేదనఁగా నానాఁటికే బుద్ధునియందు కొందఱికి నిండుగౌరవము లేదని యర్థము. బుద్ధుఁడు మాంసమునుఁ దినుచుండెను. చాలమందికది యిష్టములేదు. బుద్ధుఁడు మాంసమును తినుటను తెలు వారివారు – చాలమంది యానాఁడు ప్రధానముగా మాంసము తినెడివారు. ఎవరింటికిఁ బోయినను మాంసమే భిక్షపెట్టుదు

రాయెను. తినక యేమిచేయును ? అని సమర్థించుచుండిరి. కాని దానిని కొందఱంగీకరించలేదు. అరే ! లోకమునందందఱు నచ్చముగా మాంసమే తినుచుండిరా ! వారేమి యాటవికులా ? వన్యమృగములా ? ఏ దేశములో నైనను మాంసమును నుపాహారముగాఁ దీసికొందురుగాని ప్రధానాహారముగాఁ దీసికొనరు. మాంసమును వ్యంజనముగా నుపయోగించుకొందురు. కాదా, యితరాహారములతోఁ గలిపి భుజింతురు. మాంసము కలుపని యాహారము లెన్ని యోయుండును. వానినే మేము భుజింతుమని బుద్ధుఁడుగాని భిక్షుకులుగాని యన్నచో వారియం దంత భక్తిగల ప్రజలు వారికి మాంసేతరమైన భిక్ష పెట్టరా ? బుద్ధునకు శారీరకములైన వ్యాధులు కలవు. అభిమానములు కలవు. నందుఁడన్న తన పినతండ్రి కొడుకును బలవంతముగాఁ దన మతములోఁ జేర్చికొనెను. ఎందుకుఁ జేర్చికొనెను. తనయింటి రాచవాండ్రు తన మతములోఁ జేరినచో వారిని తన మతములో నాయకులుగాఁ జేర్చికొనుటకు చేసికొనెను. ఏతాదృగేతాదృగనేక విమర్శలు బుద్ధునినాఁడే కలవు. ఆ బుద్ధుని శిష్యులలో దేవదత్తుఁడను వాఁడు కలఁడు. అతనికి కపిలవస్తు శ్రావస్తి నగరముల యందున్న యీ బౌద్ధులయందు ద్వేషము కలిగి బుద్ధుఁడు చెప్పిన యచ్చమైన సూత్రములే బౌద్ధమతముగాని తక్కినది కాదని శ్రావస్తి నగరమును వదలిపోయెను. వదలిపోయి గిరివ్రజపురమున స్థానమేర్పఱచుకొనెను. బింబిసారుని కుమారుఁ డజాతశత్రువు వానికి శిష్యుఁడయ్యెను. అజాతశత్రుని సిద్ధాంతములు వేఱు. బింబిసారుని సిద్ధాంతములు వేఱు. బింబిసారుఁడు

బుద్ధుని శిష్యుఁడు. అతఁడు బుద్ధుఁడు తనయింటికి వచ్చినప్పుడు నడపిన దినచర్య నవలంబించెను. దేవదత్తునకు బుద్ధుఁడు చెప్పిన మహావిషయములు ప్రధానములుకాని బుద్ధుని దినచర్య ప్రధానముకాదు. అష్టవిధ మార్గము చతుర్థమైన పరమార్థము దేవదత్తునకు బోధించెను. అదియే మాధ్యమిక మార్గమనెను. సత్యదృష్టి కావలయును. యథార్థమైన మనోనిశ్చయము కావలెను. అబద్ధమాడరాదు. తాముచేసిన కార్యము సత్కార్యమే కావలయును. జంతుహింస చేయరాదు. ద్రోంగతనము చేయరాదు. కామమార్గమునఁ బోరాదు. సురాపానాదులు చేయరాదు. భిక్షుకులకు దానము చేయవలయును. సంఘము నకు సేవ చేయవలయును. దయకలిగి యుండవలయును. ఇది లౌకికమైన ప్రవర్తనకు మార్గము. దీనివలన పంచశీలము లేర్పడును. జన్మతో నెవ్వఁడును బ్రాహ్మణుఁడుకాఁడు. అట్లే జన్మతో నెవ్వఁడును చండాలుఁడుకాఁడు. తన ప్రవర్తనను బట్టి బ్రాహ్మణుఁడగును. చండాలుఁ డగును. కర్మనుండి విముక్తిపొందినవాఁడు నైష్కర్మ్యమైన స్థితినిపొంది యర్హంతుఁ డగును. ఇట్టి యిట్టి సిద్ధాంతములు బౌద్ధులు బోధించినవి దేవదత్తుఁడు స్వీకరించి తాను గిరివ్రజపురమునకు వచ్చెను. అజాతశత్రుఁడు దేవదత్తునకు శిష్యుఁడై తండ్రి యవలంబించు చున్న బౌద్ధమార్గము లిష్టములేక తండ్రిని సంహరించెను. అప్పటికి బుద్ధునకు డెబ్బదిరెండేండ్లు. బింబిసారుఁడు బుద్ధుని కంటె నైదేండ్లు చిన్నవాఁడో, పెద్దవాఁడో ఈ యజాతశత్రునకు మంత్రికలఁడు. ఆతనిపేరు వర్షకారుఁడు. ఈ వర్షకారుఁడు లిచ్ఛవులైన జ్ఞాతులను దేవదత్తుని మార్గమునందు నడిపించెను.

సప్తధర్మములను గాఢముగా నవలంబింపఁ జేసినవాఁడు సర్వ
కారుఁడు. బౌద్ధులు నిత్యమును సమావేశము కావలయును.
ఏపని చేసిన నేకాభిప్రాయముతోఁ జేయవలయును. దేవ
దత్తుఁడు చెప్పిన నియమములను పాలించవలయును. పెద్దలను
గౌరవించవలయును. స్త్రీలయందు మర్యాద నెఱపవలయును.
ఎచ్చట నున్నను పుణ్యక్షేత్రములను పోయి దర్శించుచుండ
వలయును. రాష్ట్రములోనున్న యర్హతులకు భిక్షపెట్టుచుండ
వలయును. ఈ సప్తధర్మపాలనము చేసినన్నాళ్ళు బౌద్ధమత
మున కేమియు భంగము లేదని వస్సకారుఁడు చెప్పెను. ఈ
సప్త ధర్మము లెచ్చటివి? పూర్వ వైదిక మతమునందుఁ
గలవే. వీనికి వైదిక ధర్మ మెందులకు? నాగరకమైన ఏచిన్న
సంఘమునందైనను, ఏచిన్న దేశమునందైననుఁ గలవే. వీనిని
వదలిపెట్టి జంతువులు మాత్రమే బ్రదుకును. ఇది మతమూ
యన్నఁగా మతముకాదు. మతమును రక్షించుట కేర్పఱచిన
సంఘనియమములు. ఈ సంఘ నియమములనే మతముగా
బోధించినచో సామాన్యులు వచ్చినక్రొత్తమతము తమ
కందుబాటులో నున్నదని తలంతురు. గిరివ్రజపుర ప్రజలు
దేవదత్తుని సిద్ధాంతముల ననుసరించుచు నిజానకు శ్రావస్తి
కపిలవస్తు నగరమునందలి బౌద్ధభిక్షువులకంటె స్వేచ్ఛమైన
మార్గమున నజాతశత్రుని నాఁడు బ్రతుకుచు వచ్చిరి. ఆనాఁడే
ప్రథమసంఘ మహా సమావేశములు జరిగెను. మూఁడు పిట
కములును ప్రథమసంఘ సమావేశమునాఁడే యేర్పడెను వినయ
పిటకము, సుత్తపిటకము, అభిదమ్మ పిటకము మూఁడును
నాఁడే యేర్పడెను. మొట్ట మొదటిది సుత్తపిటకము. అందులో

బుద్ధుఁడు చెప్పిన వాక్యములు శిష్యులకు జ్ఞాపకమున్నవన్నియు క్రోడీకరింపఁ బడెను. బుద్ధుఁడే గ్రంథమును వ్రాయలేదు. అతఁడు చనిపోయిన తరువాత నతని శిష్యులు నతఁడిట్లుచెప్పె నిట్లు చెప్పెనని తమకు జ్ఞాపకమున్న వన్నియు వ్రాసిరి. అవియే పిటక గ్రంథములు.

ఇట్లుండఁగాఁ గొందఱు శిష్యులు తద్గ్రంథములలోనున్న కొన్ని విషయములు బుద్ధుఁడెన్నఁడును చెప్ప లేదనిరి. దానితో వారిలో వారికి భేదాభిప్రాయములు కలిగెను. కొందఱు వానిలోనుండి చీలివచ్చిరి. పిటకములు మూఁడును యథా తథముగా గ్రహించినవారు స్థవిరవాదు లని పిలువఁబడిరి. స్థవిర మన్న సంస్కృత శబ్దమునుండి థేరమన్న పాళీశబ్ద మేర్పడెను. వారిని థేరవాదు లందురు. ఈ రెండవవారు వజ్జిశాఖీయులని గాని లిచ్ఛవులనిగాని పిలువఁబడుచు వచ్చిరి. బుద్ధుని మరణా నంతరమున నూట యిరువది యేండ్లు జరిగెను. వజ్జిశాఖీయ బౌద్ధభిక్షుకులలోఁ బండితులైనవారు, యోగ్యులైన వారు, మర్యాద గలవారు, స్నాతులు, శ్రమణులు, భిక్షుకులు, పలు మంది గిరివ్రజపురమునందు నివసించుచు వచ్చిరి. శ్రావస్తినగ రముయొక్క ప్రాముఖ్యము పోక పోయినను లిచ్ఛవులయొక్క సంప్రదాయములోని రహస్యధర్మము తెఱుఁగుటకు పలుమంది భిక్షుకులు గిరివ్రజపురమునకువచ్చి కనుఁగొని పోవుచుండిరి. గిరివ్రజపుర గత వజ్జిశాఖా మర్యాద నూటయిరువదియేండ్లిట్లు సాగినది. కాని మహానందియు, నతని తండ్రియు రాజ్యము చేయుచున్నపుడు క్రమ క్రమముగా వజ్జిశాఖా బౌద్ధుల యా చారములు సడలెను. తొలినాఁటి దేవదత్తునియు వశ్యకారు

నియు తీవ్ర నియమములు పాటింపఁబడుటలేదు. వజ్జిశాఖీయులలో వారిలో వారికే కొన్ని భేదాభిప్రాయములు గలిగెను. శ్రావస్తి నగరమునందు కాకందకుఁడను నొక బౌద్ధుఁడు కలఁడు. అతని కుమారుఁడు యశుఁడనువాఁడు లిచ్ఛవుల యందలి పది దురాచారములను లెక్కపెట్టి యీ నియమములను మీఱ నుల్లంఘించితిరి. అవి న్యాయములైనవి కావు. మిక్కిలి నవీతికరములైనవని లిచ్ఛవులను నిందించెను. వట్టి నిందించుటతో నూరకుండక యర్హాత సంఘము నియమింపఁబడి, యేర్పాటుచేయఁబడి, వారిచేత లిచ్ఛవుల ప్రవర్తన ఖండింపించుటకు పెద్ద ప్రయత్నము చేయ నారంభించెను. దానిపైన లిచ్ఛవుల కందఱకుఁ గోపము వచ్చెను. అతనిని దేశమునుండి నడలఁగొట్ట వలయు ననియో, నతనికి ప్రాయశ్చిత్తకర్మ చేయవలయు ననియో, వీరును తీర్మానించి కొనిరి. అతనిమీఁదఁ దొలుత ప్రాయశ్చిత్త కర్మ లిచ్ఛవులు విధించిరి. దానిని "పరిసారణీయకమ్మ"మని బౌద్ధు లందురు. ఇట్లు చేసినంత యశునకుఁ గోపము వచ్చెను. యోగ్యులైన వారితో నిర్మింపఁబడిన ధర్మసంఘము శ్రావస్తియందు కలదు. ప్రతి పట్టణమునందు ప్రతి గ్రామము నందుండును. యశుఁడు తన యభియోగమును వారిముందు నివేదించి వారిచేత వజ్జిభిక్షుకుల యీ యాచారములు నిందనీయములని సిద్ధాంతపఱచెను. యశుఁడు గొప్ప వక్త. వాగ్వైపుణ్యము కలవాఁడు. తన వావదూకతా నైపుణ్యముచేత తాను చేసిన నింద నధికారులచేత నతఁడొప్పించెనని వజ్జి శాఖీయులకుఁ గోపమువచ్చి యతనిమీఁద "నుత్క్షేపణీయకమ్మ"ను ప్రయో

గించిరి. అతఁడు బౌద్ధ భిక్షుకులలోనుండి బహిష్కరింపఁబడె
నని యర్థము. అతనికిని బౌద్ధమతమునకు సంబంధము లేదు.
అతఁడు బుద్ధుఁడేకాఁడు. అప్పు డతఁడేమి చేయఁగలఁడు?
కౌశాంబిలో నవంతిలో పాంచాలములలోఁ బ్రసిద్ధులైన గొప్ప
యర్హాతులు కలరు. పండితులైన శ్రమణులు కలరు. తాను
చేసిన నిందలు సరియైనవని నిరూపించికొనుటకు తాను కౌశాం
బికిఁ బోయెను. తన శిష్యులను కొందఱి నవంతికిఁ బంపిం
చెను. కొందఱినిఁ బాంచాలములకుఁ బంపించెను. అచ్చట
నున్న పండితులైన యర్హాతులను శ్రమణుల నీ మహాధర్మ
సందేహముఁ దీర్చుటకు రమ్మని వారందఱినిఁ బిలిచెను.
బౌద్ధమతముయొక్క మూలభూతమైన స్వేచ్ఛత చెడిపోవు
చున్నది. దానిని సమర్థించుటకు రమ్మని పిలిపించెను. సుత్తపిట
కము, బుద్ధుని సిద్ధాంతములయొక్క క్రోడీకరణము. వినయ
పిటకము బౌద్ధులయొక్క దినచర్యయు శీలమును నిరూపించు
గ్రంథము. ఈ వజ్జిభిక్షుకులచేత వినయపిటకము యొక్క స్థితి
సందేహ భాజనమైనదని వారిందఱనుఁ బిలిచెను తాను
కౌశాంబినుండి యహో గంగాపర్వతమునకుఁ బోయెను. ఆ
పర్వతము మీఁదఁ సంభూత శాణవాసి' యను గొప్ప బౌద్ధ
యోగి నివసించుచుండెను. యశుఁడు పోయి శాణవాసికి
నమస్కారము చేసి యశనితో వజ్జిభిక్షుకుల యీ దోషమునుఁ
జెప్పి "అయ్యా! తమ రీవిషయమున శ్రద్ధ వహింపక పోయి
నచో బౌద్ధమతమునకు మహాపదకలుగును. వినయము నిర్మూ
లముగునని చెప్పెను. శాణవాసి, యశునియొక్క గంభీరమైన
యాకార విశేషమునకు, నతని వాగ్వైశద్యమునకు సంతసించి

యంగీకరించెను. ఇంతలో నలుబదిమంది యర్హంతులు పాం
చాలదేశ ప్రాంతములనుండి యహోగంగకు వచ్చిరి. అవంతి
నుండి యెనుఁబది యెనమండుగురు వచ్చిరి. కౌశాంబి
నుండియు దక్షిణదేశమునుండియు మఱికొంతమంది వచ్చిరి.
అందఱును తాము సమావేశమై యశుఁడు చేసిన యీ
దోషములనుఁ గూర్చి గాఢముగాఁ బర్యాలోచనము చేసిరి.
వాని యందలి యాగాముల నిర్ణయించుట కష్టమనియు
నెవఁడో మహామేధాశాలిగాని వానిని నిర్ణయించలేఁడనియు
వారందఱేకగ్రీవముగా ననుకొనిరి. ఆ మహాపండితు డెవరు ?
సోరెయ్య యన్న గ్రామములో రేవతుఁడను నొక గొప్ప
బౌద్ధపండితుఁడు గలఁడు. అతని పాండిత్య మనంతమైనది.
అతని శీలము నిర్దుష్టమైనది. ఇది యాయన నిర్ణయింపఁగలఁడునే
గాని మఱొకరు నిర్ణయించలేరని యీ రెండువందల యేఁబది
మంది బౌద్ధభిక్షుకులు చాల దినములు ప్రయాణముచేసి రేవత
సహజాతివద్దకు నేఁగిరి. శాణవాసి యశునితో నీ సంగతి రేవ
తుని ముందు పెట్టుమని చెప్పెను. వినయముతో యశుఁడు
రేవతుని సమీపించి నమస్కారములు చేసి తన యభ్యర్థన
విన్నవించుకొనెను. రేవతుఁడు వజ్జిభిక్షుకుల దోషముల నొక
దాని తరువాత నొకటి చెప్పుమనెను. యశుఁ డొకదాని
తరువాత నొకటి చెప్పెను. అవి యెట్లు దోషములో తాను
నిరూపించుచుండెను.

ఇట్లుండగా వజ్జీయులు నిదురపోలేదు. వారును సోరె
య్యకు వచ్చిరి. సహజాతి వద్దకుఁ బోయిరి. రేవత సహజాతి
వారి యభ్యర్థనల నంగీకరించలేదు. వారు పట్టుపుట్టములను

ధనమునుఁ దీసికొని వచ్చి సహజాతికి బహుమతుల నీయ నెం
చిరి. కాలాశోకుఁడు వారికి ధనమును వెలగల దుస్తుల నిచ్చెను.
వానినిచ్చి రేవతునిఁ దమ వైపునకు మరలించుమని చెప్పెను.
రేవతుఁడు వీరిచ్చిన కానుకల నంగీకరింపలేదు. ఉత్తరుఁ
డన్నవాఁడు రేవతుని ప్రథమ శిష్యుఁడు. ఈ లిచ్ఛవులు
తాము తెచ్చిన కానుక లన్నిఁటి నుత్తరునకు సమర్పించి
యెట్లైనను సహజాతిని తమవైపు మరలించుమని చెప్పిరి.
ఉత్తరుఁ డా కానుక లన్నింటిని తీసికొనెను. గురువుతో
నెంతయో చెప్పెను సోరెయ్య చిన్న గ్రామము. అచట
సహజాతియొక్క యాధిపత్యమున పెద్ద విహారము కలదు.
భిక్షుకులకు భిక్షయే దొరకుట కష్టముగా నుండెను. వారు
కట్టుకొనుటకుఁ గావిగుడ్డలే లేవు. ఈ దుస్థితిలో వజ్జియులు
తెచ్చిన రత్నములతో విహారము సమృద్ధిగా నడువవచ్చును.
తమకు ధరించుటకే కావిగుడ్డలు లేకున్నవి. వారు పట్టుబట్టలు
తెచ్చిరి. పాతికమంది భిక్షుకులకు వారు తెచ్చిన వస్త్రములు
రెండుమూఁడేండ్లు సరిపోవును. పైగా లిచ్ఛవుల కనుకఁ గాలా
శోక చక్రవర్తి యున్నాఁడు. దేశమున నెన్నిచోట్ల బౌద్ధు
లున్నను రాజాశ్రయముగల బౌద్ధులు రెండు స్థలములయందే
కలరు. గిరివ్రజపురమునందునను వారికి రాజాశ్రయము కలదు.
అచ్చటి విహారములు సమృద్ధిగా, సంపత్సంపన్నములుగా సాగు
చున్నవి. అక్కడచోటి బౌద్ధులు తల దాచుకొనుటకు లేక,
ధరించుటకు కావిగుడ్డలు లేక నిబ్బంది పడుచున్నారు. ఇప్పుడు
లిచ్ఛవుల కనుకూలముగా తీర్పుఁ జెప్పినచోఁ గాలాశోకుఁడు
సోరెయ్య విహారమునకుఁ దగినంత ధన మిచ్చునని యుత్తరుఁ

డెంతయో చెప్పెను. కాని రేవతుఁ డంగీకరింప లేదు. దోష
ములు దోషములే యనెను. అప్పుడు లిచ్ఛవులు తాము
రేవతుని తీర్మానము నంగీకరింపమనియు నీ విషయము
సర్వావర్తమునందలి మహాశ్రమణు లందఱును సమా
వేశమై తీర్పు కావలయు ననిరి. వైశాలీ నగరమున నీ మహా
సమావేశము జరిగెను. సర్వదేశములనుండి యేడువందలమంది
సుశిక్షితులైన యుపాసకులును భిక్షుకులును వచ్చిరి. నాల్గు
దినములు సమావేశములు జరిగెను. ఒకఁ డొకటి యనుచో
మఱియొకఁ డింకొకటి యనెను. సమావేశము లన్నియు
పెద్ద పెద్ద యఱపులతోఁ బోరాటములతోఁ వివాదములతోఁ
గొనసాగెను, గాని శాంతముగా సాగలేదు. దానిలో నేమి
యును తీర్మానము గాక చివర కందఱు నొక నిశ్చయమునకు
వచ్చిరి. నలువురు ప్రాగ్దేశమునుండి, నలువురు పశ్చిమ
దేశమునుండి మహాస్నాతులను వారెన్నుకొని యొకసంఘ
ముగా నిర్ణయించి యా సంఘమే యీ విషయములను నిర్ణ
యింప వలయు ననిరి. ఆ సంఘమునకు మహాభిక్షువైన
యజితుఁడు కార్యదర్శిగా గౌరవనీయుఁడైన సబ్బకామి
యధ్యక్షుఁడుగా నిర్ణయింపఁబడెను. వారొక దాని వెను
వెంట నొకదానిని తీసికొని యశుఁడు నిరూపించిన పది దోష
ములే యని నిర్ణయించిరి. దానితో లిచ్ఛవులం దఱికిని
కోపము కలిగెను. వారీసంగతి కాలాశోకునియందు నిర్ణ
యింపఁబడవలయునేగాని వైశాలియందు నిర్ణయింపఁబడ
రా దనిరి. ఈలోపుగా మఱి మూఁడు వందలమంది భిక్షుకులు
వివిధ ప్రాంతములనుండి వచ్చిరి. ఈ వేయిమందియు వైశాలి

నుండి, గిరివ్రజపురమునకు ప్రయాణము చేసిరి. వారిలో వారికి దారిలోననే కలహములు జరుగుచుండెను. యశుఁడు కాలాశోకుని ముందు దీని నిర్ణయము జరుగుట కంగీకరించ లేదు. అజితుఁడు, సబ్బకామి, శాణవాసి, రేవతుఁడు మొదలైన వారివలెఁ గాలాశోకుఁడు రాజుగాని యష్ణాతుఁడా? పండితుఁడా? అతని నిర్ణయ మేమని యశుఁడు వాదించెను. కాని లిచ్ఛవులు ధనవంతులును బలవంతులును. వారిలోఁ బలుమంది ధూర్తులు కలరు. మనుష్యులను చంపుటకుఁ గూడ వెనుదీయరు. ఈసంప్రదాయము వజ్జీయులకు తొలినాఁ డజాతశత్రుని చేత తండ్రియైన బింబిసారుని దేవదత్తుఁడు చంపించిన నాఁటినుండియు కలదు. యశునిఁ జంపినచో మొదటనే జంపియుండవలయును. ఇంత యల్లరి జరిగిన తరువాత వానిని జంపించినచో తమ కొమ్ము పడిపోవును. అందుచేత వానినిఁ సంహరింపలేదు. ఇపుడు యశుఁడు తాను కూడ గిరివ్రజపురమునకుఁ బోవలయునా? వలదా? తనతో నజిత సబ్బకామి రేవత శాణవాసులు వత్తురా? రారా? వారు రానిచో తనకు గిరివ్రజపురములో బలములేదు. అది యట్లుండఁగాఁ దాను బౌద్ధుఁడే కాకపోవును. వానిమీఁద నిదివఱకే నుత్క్షేపణీయకర్మ ప్రయోగింపఁబడినది. ఆనాఁడు బౌద్ధుఁడు కాకపోవుట వేఱు. అయిన తరువాత నుత్క్షేపణీయకర్మచేత బహిష్కరింపఁబడుట వేఱు. బౌద్ధులు కాని వారిని బౌద్ధులొక విధముగాఁ జూతురు. వారితో సర్వసంఘ కార్యములు చేయుదురు. వారి యిండ్లకు భిక్షలకుఁ గూడ బోదురు. ఒక రాష్ట్రముయొక్క రాజు బౌద్ధమతమునందు తీవ్రుఁడైనచో

బౌద్ధులు కానివారిని శంకించుటయు వారికి నిర్బంధములు కలిగించుటయు. వారిని హింసించుటయు జరుగును. ఒక బౌద్ధభిక్షువు మీఁద నుత్క్షేపణకర్మ జరిగినచో వానిని బౌద్ధభిక్షువులు విస్త్రితముగా హింసింతురు. వాని బ్రతుకు దుర్ఘటమైపోవును. అందుచేత యశుఁడు సంగీతులైన వారిచ్చిన తీర్పు మీఁద నాధారపడి యుండుటకు వీలులేదు. తాను లిచ్ఛవుల ప్రవర్తనయందు దోషములు చూపించెను. ఆ లిచ్ఛవులకు బలమైన స్థానములు రెండు. ఒకటి వైశాలి. రెండు గిరివ్రజము. వారి సంగతి గిరివ్రజములో తేలవలయును. తాను బ్రదుకవలయును. అందుచేత సజితాములను బలిమాలి వారిని గూడ గిరివ్రజపురమునకుఁ దీసికొనిపోయెను. అజితుఁడు, సర్వకామి, రేవతుఁడు, శాణవాసియు మహాపండితులు. వారి ప్రతిష్ఠ సర్వ భారతదేశమున నున్నది. అంతటివారు వచ్చినచోఁ గాలాశోకుఁడు వారిమాట కాదనలేఁడు. తన విషయములో నెట్లైనను గాలాశోకుని విషయములో వారధికారులై యుందురు. వజ్జీయులందఱిని యీ నలుగురు పండితులేమి చేయఁగలరు? కాలాశోకునైనచోఁ జేయవచ్చును. ఈ నలుగురు పండితులను వారేర్పాటుచేసిన యెనమండుగురితోడి యధికార సంఘమునుఁ గాలాశోకుని మీఁద నుత్క్షేపణకర్మ ప్రయోగించినచో నది శక్తిమంతముగా నుండును కాలాశోకుఁడే బౌద్ధుఁడు కాకపోవును. రాజు బహిష్కరింపఁ బడిన వాఁడు కాఁగా నా రాజుయొక్క బలము లిచ్ఛవుల కుండదు. లిచ్ఛవులు లొంగి వత్తురు. తాను నిరూపించిన దోషములు నిలుచును. బౌద్ధసంఘము బాగుపడును. యశుఁ డిట్లూహించి

యీ సంగతి యంతయు నా సంఘమునందలి యొవనుంకు గుఱించిఁ జెప్పెను. లిచ్ఛవులు బలవంతులు. వారు క్షత్రులు. పెద్ద యాస్తిపరులు - వైశాలియందు కపిలవస్తువునందుఁ గల పెద్ద పెద్ద తోఁటలు తోఁట్లు, విహారములు వారివే. రాజకుమారుఁడైన జేతునివద్దనుండి యనాథపిండికుఁడన్న వర్తకుఁడు బంగారపు నాణెములు పఱచికొన్న స్థలమునందుఁ జేతవన విహారము కలదు. అది శ్రావస్తిలోనున్న విహారములన్నింటిలో మహాసంపత్తికము. దేశపు ప్రసేనజిత్తు కోసలరాజు. ఆతఁడెంతయో యాస్తి యిచ్చెను. విశాఖాదేవి తోఁటలు దొడ్లు నిచ్చెను. ఇంక నెన్నియో పెద్ద పెద్ద గృహస్థులు కలవు. అవన్నియు వజ్జియ బౌద్ధుల క్రింద నున్నవి. వీనికి తోడుఁ గాలాశోకుఁడు సంవత్సరము సంవత్సరము బౌద్ధ భిక్షుకులకు మహాధన మిచ్చుచుండెను. అందుచేత వారు ప్రాచ్యవాక సంఘముయొక్క తీర్పు నంగీకరించరు. కాలాశోకుఁ డంగీకరింపనిచో సరి మీఁద నుత్క్షేపణకర్మ ప్రయోగింతుమని మీరు చెప్పుచో నతఁడు లొంగి వచ్చును. లిచ్ఛవులు కూడ భయపడుదురు. మీ రిట్లు చేయనిచో భగవంతుఁడైన బుద్ధునకే ద్రోహము చేసినట్లగును. వినయపిటకము నాశనమైపోవును. వట్టి సుత్తపిటకముతో బౌద్ధమతము నిలువదు. బౌద్ధుఁడనఁగా వినయసూత్రముల నవలంబించిన వాఁడుగాని సుత్తపిటకమును చదివినవాఁడు గాఁడు. బౌద్ధుఁడు కానివారు కూడ సుత్తపిటకమును చదువవచ్చును. నిజమైన బౌద్ధుఁడు వినయపిటకము ప్రకారము నడువవలయును. అది బౌద్ధమతమునకు జీవగఱ్ఱ” అని బహువిధముల నభిశాదులతో యశుఁడు చెప్పఁగా వారు

సంతతియు వివాహాంశము చేయుటచేత యశుని మాటాడనీయక పోవుటచేత యశునకు గిరివ్రజపురమున బలము లేకపోవుటచేత యశుఁడు నాలైదు సార్లు మాటాడఁదలఁచుకొన్నను గాలాశోకుఁ డతనికి వ్యవధినీయక పోవుటచేత నా దినమంతయు వ్యర్థమయ్యెను. ఆ రాత్రిపూట యశుఁడు సర్వమును సంఘాధ్యక్షుఁడైన సబ్బకామిచేత కాలాశోకునకుఁ జెప్పించవలయునే కాని మఱియొక మార్గము లేదని తెలిసిపోయెను. ఆ సంఘ మహాసమావేశము పూర్తియగు వేళకు రాత్రి ప్రొద్దుపోయినది. గాలాశోకుఁడు తన మేడమీఁదికిఁ బోయెను. అచ్చట నతని కొఱకొక వార్తావాహుఁడు ప్రతీక్షించుచుండెను. కాలాశోకుఁ డేమని యడుగఁగా నతఁడది రహస్యమనియు యువరాజుగారు దుఃఖపడరాదనియు వెంటనే యీ వార్త సర్వజనులకును తెలియనీయరాదనియు తెలిసినచో మహానంది తల్లడిల్లిపోవుననియు నెంతమంది బౌద్ధార్హతులును శ్రమణులును మహానగరమున సమావేశమైయున్న సమయమున నీ వార్తకుఁ బ్రాకట్యము సంభవించినచో బౌద్ధ భిక్షువులు చెల్లాచెదరై పోవుదురు. మహాసంఘముయొక్క పనియాగిపోవును. ఈ వేలమంది భిక్షుకులు రాజధానిలో నెలనాళ్లుండవలసి వచ్చును. వ్యయమట్లుండఁగా నవసరమైన రాజకార్యము లాగిపోవును, మొదలైన మాటలు వార్తావాహుఁడు చెప్పెను. ప్రధానమైన వార్త యేదియో చెప్పకుండ వార్తావాహుఁడీ మాటలను చెప్పఁగా నదివఱకే పగలెల్ల విసిగియున్న కాలాశోకునకుఁ గోపము వచ్చెను. ఆ వార్త నీవు చెప్పనక్కఱయే

లేదు పొమ్మనెను. కాని వార్తాహరుఁడు 'ఇది తమ పెద్ద
తమ్ముని గూర్చిన వార్త' యనెను. కాలాశోకుఁడు "వాఁడు
ఎట్టి దుర్మార్గుఁడు. వాఁడు చచ్చినచో చావనిమ్ము. వాని
కెప్పుడో యేదో జరుగునని యనుకొనుచునే యుంటిని. వానికి
నేను జెప్పిన మాటయు లెక్కలేదు. తండ్రిగారి యాజ్ఞ
యందునుఁ బరిగణింపు లేదు. ఏమైనాఁడు? మఱల నొక లక్ష
నాణెములకు నెత్తిమీఁదికిఁ దెచ్చినాఁడా? ఎవరిచేతనైన
బంధింపఁబడినాఁడా? ఈసారి బంధింపఁబడినచో నిప్పు
డుత్తుంగభుజుఁడు రాజధానియందు లేఁడు. వానిని వదలించెడి
వారు లేరు. ఉత్తుంగభుజుఁడు యుద్ధమునుండి తిరిగి వచ్చెడు
దాఁక బంధనములోననే యుండవలయును. వాని కర్మము
వానిది." అనఁగా వార్తాహరుఁడు. "ప్రభూ! బంధనము
కాదు. అంతకంటె నధికమైనదే జరిగెను. ఇంతకంటె నధిక
మైనది జరుగుటకు వీలులేదన్నది జరిగినది." అనఁగాఁ గాలా
శోకుఁడు 'వానినెవరైన వధించిరా? వానికథయేమో
చెప్పు' మనెను. వార్తాహరుఁడు "మన రాజధానికి పది
యామడల దూరములో నీలగిరి యన్న నగరమున్నది. ఆ
నగరమునకు రిపుంజయుఁడు నాల్గు దినములక్రింద వెళ్ళెను.
నిన్నటికిఁ దిరిగి వత్తుననెను. నిన్నటికి రాలేదు. వారి వద్ద
నుండి వార్త వచ్చునని మే మనుకొనుచుండఁగా నేఁడొక
పిడుగువంటి వార్త వచ్చెను. ఆ నగరములో రిపుంజయుఁడు
వధింపఁబడినాఁడన్న వార్త. అనఁగాఁ గాలాశోకునకున్న
శాంతమును విసుగును తమ్మునిమీఁది కోపమును సర్వమును
లోపించి యొక్కసారిగా వానిని వధించిన వారిమీఁద కోపము

వచ్చెను. ఎవ్వఁడు వధించెను? నా తమ్ముని వధించుటకు సాహసించినవాఁ డెవ్వఁడు? ఆ నీలగిరి పట్టణమును నిర్ధూమ ధామము చేసెదను. ఆ యూరిలో మానిసిని బ్రతుకనీయను. ప్రతివానిని ముక్కలు ముక్కలుగా నరికించెదను. ఏమి జరిగినదో చెప్పుమనెను. ఆ వార్తాహరుఁడు రిపుంజయుని భవన కార్యములమీఁది యధికారి. అతఁడిట్లు చెప్పెను. "అయ్యా! ఈ వ్యవహారము నాల్గేండ్లనుండి జరుగుచున్నది. నేను కుమార ప్రభువుతో నిట్టి వ్యవహారములో జోక్యము కలిగించుకొనవలదని, వారు సామాన్యులు కారని, వారు సాహసులని, మర్యాదకలవారని, కామభావము కలిగినచో సాధ్యమైనచోటఁ జేయవలయునుగాని యసాధ్యమైనచోటఁ జేసినచోఁ జివరకు నెత్తిమీఁదికి వచ్చుననియు, నేడాదిగా వాదించుచున్నాను. ఏడాది క్రింద నతనికి కోరిక సమకూడెను. తరువాత నా యూరికిఁ బోవుట యిది రెండవసారి. నేను పోవలదని చెప్పితిని. మొదటిసారియే చావుతప్పి యింటికి చేరెను. ఈ సారి యెంత వలదన్నను మఱల నేగెను. ఇందులో నేదో మోస మున్నది. ఇట్టివార్త నిజముగా నామె పంపించుటకు సమర్థురాలు కాదు. ఆమె పంజరములోనున్న చిలుక. బోనులో నున్న యాఁడు సింగము. ఆమె కొఱకు కటమటించుట తల తీసికొనిపోయి సింగము నోటిలో దూర్చినట్లు. ఇది యన్నగారికి తెలిసినను, తండ్రికిఁ దెలిసినను వారికిఁ గోపహేతు వగునని చెప్పితిని. ఆయన వినలేదు. ఆ స్త్రీ తనయందెంతో బద్ధానురాగయని యతఁడు చెప్పెను. ఈ వ్యవహారములో ప్రాణములు పోయినను సరే యనియు మూర్ఖించి కూర్చుం

డెను. ఇంతకు నొక విచిత్రమైన రిపుంజయుని మనోవృత్తి దీనికి బలమైన కారణ మయ్యెను. ఆ నీలగిరియందు నొక బ్రాహ్మణ కుటుంబ మున్నది. వారు బౌద్ధ మతమును స్వీకరించలేదు. స్వీకరింపరు. బౌద్ధభిక్షుకులు వారి యింటికిఁ బోరు. వారితో వాగ్వాదము నెఱపుదురు. పరాభూతులై తిరిగివత్తురు. ఆ యింటిమీఁద బౌద్ధ భిక్షుకులకు మాత్సర్యము కలదు. ఆ బ్రాహ్మణ గృహము సంపన్న గృహము. వేయి యేండ్లుగా వారు మర్యాద కలవారు. మహా ధనవంతులు. చుట్టుపట్లనున్న పాతిక గ్రామములు వారి యధికారములోనివి. వారికొక చిన్న కోట కలదు. కొంత సైన్యము కలదు. అనాదినుండియు వారు మన రాజ్యమునకు మూల స్తంభము లలో నొకరు. ఆ ప్రాంతములయందు మగధరాజ్యాధికారము వారివలననే చెల్లుబడి యగుచున్నది. వారు సంవత్సరమునకు రాజ్యమునకు నాల్గువేల నిష్కములు చెల్లింతురు. మగధ రాజ్యములో నంతటి సామంతుఁడు లేఁడని చెప్పవచ్చును. ఎక్కువ నిష్కము లిచ్చెడివారు కలరు కాని, వారివలె గాఢ మైన రాజభక్తి కలవారుకాని యుద్ధములందు నిశ్చలులై సైన్యమునకు తోడుపడువారుగాని మఱియొక్కరు లేరు. ఆ బ్రాహ్మణుని పేరు పరంతపభట్టు. ఆయన కార్గురు కుమా రులు. వారిది పెద్ద వంశము. అందఱును యుద్ధవీరులు. అందఱు నగ్నిహోత్రులు. అందఱు వేదవేదాంగములు చదివిన వారు. ఆ వంశమంతయు నెప్పుడును వందమందికి తక్కువగా ఖడ్గధారులు కానివా రుండరు. ఆ ప్రాంతమునందు పరంతప భట్టును జనకమహారాజువంటి వాఁడందురు. ఆ వందమందిలో

సౌభాగ్యము వాడిపోవుటయన్నది యుండదు. ఎప్పటికప్పుడు పెద్దవాఁడు దుర్గాధిపతి యగుచుండును. తక్కిన వారందఱు వానికండగా నిలుచుందురు. పినతండ్రులు కూడ దుర్గాధిపతి చిన్నవాఁడైనను న్యాయ్యము ననుసరించి యతనినే పెద్దగాఁ జూతురు. ఆకోట చిన్నదియే. అదియొక పర్వతము. పర్వత మంతయుఁ గలిపి మన రిపుంజయుని భవనమంత మేర యుండదు. వారి గృహములన్నియు నా గ్రామములో నుండును. గ్రామము చుట్టును ప్రాకారము కలదు. అగడ్త కలదు. దుర్గాధిపతియొక్కఁడే కొండపైనున్న భవనము మీఁద నివసించుచుండును. పరంతపభట్టు తండ్రి. కొడుకు నేఁడు దుర్గాధిపతి. కొడుకుపేరు రిపుంజయుఁడు. ఆ కొడుకు నకు నలుఁబదియేండ్లున్నవి. అతని కైదుగురు తమ్ములు. వా రాజానుబాహులు. వృషస్కంధులు. వ్యూఢోరస్కులు. నిత్య వ్యాయామ కఠినీకృత దేహయష్టులు. అందఱు ముప్పొద్దుల సంధ్యావందనము చేయుదురు. అగ్నిహోత్రములు చేయుదురు. వేద ధర్మములను పాలింతురు. బౌద్ధు లాపొంత పోవుటకు వీలులేదు. అది బౌద్ధ భిక్షువులకు భయస్థానము. యజ్ఞములందు మేకను చంపుట హింసయని వారితో నన్నచో మేము యుద్ధవీరులము. మేము శత్రువులనే సంహరింతుము. మాకొక మేకను చంపుట హింస యనిపించదని వెక్కిరింతురు. హాస్యమాడుదురు. ఆయ నెడి తీ రెట్లుండుననఁగా మఱియు మాటాడినచో మనలనే సంహరింతురన్నట్లుండును. మహా సముద్రములో నొక లంకవలె మగధరాజ్యములో నీలగిరి సీమ యున్నది. ఆ సీమను మీ తండ్రిగారుగాని తాతగారుగాని

ముత్తాతగాని యెవ్వరు నేమి చేయలేదు. అజాతశత్రుఁడే వారి నధికముగా గౌరవించెడివాడు. ఆయనమంత్రి వస్సకారి. మిక్కిలి తీవ్రమైన బౌద్ధుఁడు. వస్సకారి యీ బ్రాహ్మణ వంశమును బౌద్ధమతములోనికి మఱల్చుటకు ప్రయత్నము చేసెను. వారు లొంగలేదు. ఒకప్పుడు వస్సకారి సైన్యమును వారి మీఁదికిఁ బంపెనట. వారు పది దినములు కోట ముట్టడిని సహించిరి. ఆ సైన్యముతో నజాతశత్రునియొక్క కుమారుఁడైన దర్భకుఁడు వెళ్లెను. దర్భకుఁ డప్పటికి చిన్నవాఁడు, గొప్ప వీరుఁడనని యాయనకు గర్వముగా నుండెడిది. ఒక నాఁటి రాత్రి యీ బ్రాహ్మణ ప్రభువులు దర్భకు నెట్లు తమ దుర్గములోనికిఁ దీసికొనిపోయిరో తీసికొనిపోయిరి. అజాతశత్రు నకు వారు వార్త నంపిరట. మేము బౌద్ధులలో చేరము. మా కామతమునందు విశ్వాసములేదు. మీ పండితులువచ్చి మాతో వాదించవచ్చును. మమ్ము గెలిచినచో మేము బౌద్ధమతమునందు చేరుదుము. పట్టి కత్తి చూపించి యధికారమును నెఱపి మమ్ము చేరుమన్నచో మేము చేరము. జరాసంధుని నాఁటినుండి మేము మగధ రాజులను భక్తి విశ్వాసములతో కొలుచు చున్నవారము. ఒక రాజవంశము పోయి మఱియొక రాజవంశము వచ్చి నప్పుడు కూడ మేము సంచలించలేదు. ఇప్పుడు మా మీఁదికి మీరు సైన్యమునుఁ బంపితిరి. ఇది న్యాయ్యముగా లేదు. ఎవఁడో తనచేతిని తాను ఖండించుకొన్నట్లున్నది. మేము యువరాజును బందిపెట్టితిమి. మీరు మాకోటను సర్వనాశ నము చేసినచోఁ జేయుఁడు. మీ కుమారుఁడు కూడ మాతో

నశించిపోవును. మేము మీ బిడ్డలము. దర్భకుఁడు మీ బిడ్డ. దూరపు బిడ్డలు నశించి దగ్గఱబిడ్డ నిలువవలయునా? తండ్రికి తన బిడ్డలలో దూరగులైన బిడ్డలమీఁద ప్రేమ లేనిచో నా బిడ్డలు తండ్రికి మిక్కిలి ప్రేమాస్పదులైన బిడ్డలయందు మాత్సర్యము నెఱపుట సహజమేకదా! మీరు మా దుర్గమును నాశనము చేసినచో మాతోపాటు దర్భకుఁడు కూడ నాశన మగును. మీరు మమ్ము వంచింప నెంచినచో మేము ముందు దర్భకుని చంపి తరువాత మా దుర్గములోనున్న సర్వజనులను మా యంతట మేమే సంహరించికొని చత్తుము. మీరు మా శవములకు బౌద్ధమత ప్రకార మంత్యక్రియలు చేయుదురేమో కాని మా శరీరము లుండఁగా మీ బౌద్ధమతము మాచేత నంగీకరింప చేయఁజాలరు.” అని వారు చెప్పఁగా నజాతశత్రుఁడు వస్సకారుని గోపించి వారితో సంధి చేసికొని వారికిఁ గ్రొత్త కానుకలిచ్చి కొడుకును వదలించికొనెను. దర్భకుఁడు తరువాత నెలనాళ్ళు నీలగిరియందే యుండెను. ఆ బ్రాహ్మణుని కొడుకులలో నొకఁడుగా నడచెను. నాఁటినుండి మగధ రాజవంశమునకు వారికిని అన్నదమ్ముల వరుసగా నడచుచున్నది. దర్భక మహారాజు తరువాత నుదయన మహారాజు, వారి తరువాత నందివర్ధన మహారాజు, వారి తరువాత మీ తండ్రి మహానంది మహారాజుగారును రాజ్యము పాలించిరి. మీ తాతగారైన నందివర్ధన మహారాజువఱకు నీలగిరి దుర్గాధిపతులతో మీరు చక్రవర్తులైనను వారు సామాన్య దుర్గాధిపతులైనను సోదరభావమే చెన్నారుచుండెను. మీ నాయనగారు కూడ వారి బాల్యమున నీలగిరి

దుర్గమునకుఁ బోవుటయు, నచ్చటఁ గొన్నాళ్లు నివసించుటయు, వారితో నన్నాదమ్ముల తనము నెఱపుటయు జరిగెను. వీరచ్చటికిఁ బోవుటయు వారిచ్చటికి వచ్చుటయు నేఁబదియేండ్ల క్రిందటివఱకు జరుగుచునే యుండెను. వారు చిన్ని దుర్గాధిపతులైనను గిరివ్రజపురమునకు వచ్చినపుడు రాజకుటుంబములోని వారివలెనే మెలగుచుండిరి. అట్టి మర్యాదలే పొందుచుండిరి. ఈ యేఁబది యేండ్లనుండి మాత్రమే యీ యుల వాటు లేదు. మహానంది మహారాజుగారికి రాజకార్యములు బరువయ్యెను. సర్వక్షత్రియ సమావేశములు మోసయ్యెను. మీరు వెళ్ళలేదు. వారు రాలేదు. వారిని రమ్మని మహారాజుగారు వార్తనుఁ బంపలేదు. ఇట్లుండఁగా పరంతప భట్టు కుమారుఁడైన రిపుంజయునకు దుర్గాధిపత్యమిచ్చి యాయన వానప్రస్థమును స్వీకరించి దుర్గము సమీప ధాత్రి నున్న యొక చిన్న యడవిలో భార్యతోఁ దపోవ్రతము నూని యున్నాఁడు. ఆ తండ్రివద్దకు రిపుంజయుఁడు వారమున కొకసారి సకుటుంబముగా పాదచారియైపోయి తలిదండ్రుల దర్శించి తిరిగి వచ్చుచుండును. వారు బ్రాహ్మణులయ్యు నేయి యేండ్లుగానో దుర్గాధిపత్య మర్యాదచేత వారి యాచారములు సర్వమును రాజవంశీయములుగా నుండును. ఈ మూఁడు నాల్గుతరములు గిరివ్రజపుర రాజవంశముతో సౌదర్యము నెఱపుటచేత గిరివ్రజపుర రాజకుటుంబములోని మర్యాదలు వారి దుర్గములో నెన్నియో యుండెను. మన రాజకుమారుఁ డొకఁడు వారి దుర్గమునకుఁ బోయి పది దినములున్నచోఁ గ్రొత్తచోటికి వెళ్ళినట్లే యుండదు. ఈ నాల్గు

తరములనుండి మీరు బౌద్ధులైనను వారు బ్రాహ్మణులైనను యీ రెండు వంశముల సౌదర్యము మీ భిన్న మతముల ప్రసక్తి లేకుండ నడచుచువచ్చెను.

ఇట్లుండఁగా తమ తమ్ముఁడైన రిపుంజయుఁడు — నేను చెప్పుచున్న మాటలను క్షమించవలయును — దేశమునం దెచ్చటెచ్చట సౌందర్యవతులైన స్త్రీలున్నారో వారినిఁగూర్చి తనకుఁ దెలియఁజేయుటకు నందందు మనుజుల నుంచెను. వారు సౌందర్యవతి యిచ్చట నున్నదని వార్తలు తెత్తురు. ఆ సౌందర్యవతులు బహు స్థలముల యందుందురు. బహు కుటుంబములయం దుందురు. కొందఱు సులభముగా సాధ్యలగుదురు. వారికిఁ గొంత ధన మీయవచ్చును. ఏదో మిష పెట్టి యామె పుట్టినింటికి పోయినట్లో బంధువుల యింటికిఁ బెండ్లికి పోయినట్లో యత్తవారింటఁ జెప్పించి యామెను గిరివ్రజపురమునకు రప్పింతురు. వారము పది దినములలోఁగాని యొక నెలనాళ్ళలోఁగాని యామె యత్తింటికిఁ బోవును. ఈ సంగతి యీ గ్రామములోఁ గొందఱ కెట్లు తెలియునో తెలియును. అయినను రహస్యము రహస్యమే. మఱికొందఱు స్త్రీలంత సులభసాధ్యలు కారు. వారి భర్తలు తేజోవంతులు. పరాక్రమవంతులు. వారి కుటుంబములు గౌరవము కలవి. అట్టి స్త్రీలను తీసికొనివచ్చుట కష్టముగా నుండెను. అయినను రిపుంజయునకు నుత్తుంగభుజుని సాహాయ్యమున్నది. ఉత్తుంగభుజుఁడు కొన్ని కృత్రిమోపాయములు పన్ని వారిని సాధించుట కలదు. ఇట్టి ప్రయత్నములలో నా సౌందర్యవతుల భర్తలు సంహరింపఁబడుటయుఁ గలదు. ఒకనాఁడు

తద్దుర్గాధిపతియైన రిపుంజయుఁడు తన భార్యతో తన కూతుతో
తన తండ్రిని దర్శించుటకుఁ బోవుచుండెను. పాదచారులై
పోవుచుండిరి. రిపుంజయుని కూతురు పదునాఱేండ్ల పిల్ల. ఆమె
లోకోత్తర సౌందర్యవతి. ఆమె పేరు మణిమంజూష. మీ
తమ్మునియొక్క చారులలో నొకఁడు మణిమంజూషనుఁ
జూచెను. చూచుట తటస్థించెను. రిపుంజయుఁడు తన కుటుం
బముతోఁ దండ్రిని దర్శించుటకుఁ బోవునపుడు మార్గమంతయు
నిర్జనముగా నుంచఁబడును. గ్రామములో నానాఁడు పండుగ
జరుగుచుండెను. ఏదో దేవోత్సవము. ఆ దేవోత్సవమునాఁడు
రిపుంజయుఁడు తన తండ్రిని దర్శించెడు దినము తప్పించుట
యెందులకని తలఁచుచుండెనట. ఎప్పటివలె త్రోవ యంతయు
నిర్జనముగాఁ జేయఁబడ లేదు. దేవోత్సవ నిమగ్నులైన జనము
లను బాధపెట్టుట యెందులకని పరంతపుఁడు జనములను
సామాన్యముగాఁ దొలఁగించి పితృదర్శనార్థము వెళ్ళు
చుండెను. తొలఁగింపఁబడని జనములో మీ తమ్ముని చారుఁ
డున్నాఁడు. అతఁడా మణిమంజూషనుఁ జూచెను. ఆపిల్లనుఁ
జూచిన వాని ప్రాణములు పైనఁ బోవలయునట! ఆమె
యొక్క సౌందర్య మిట్టిదని చెప్పుటకు వీలు లేదట. ఆ చారుని
పేరు దీర్ఘముఖుఁడు. వాఁడు మణిమంజూషనుఁ జూచి
మూర్ఛపోయెను. పది దినములలో నామెయొక్క సౌంద
ర్యము మీ తమ్ముఁడైన రిపుంజయునకు రామాయణమంత
వినిపించెను. అతఁడామెనుఁ జూడవలయునని తహతహ
పడెను. తాను రాజకుమారుఁడు. తా నచటి కెట్లుపోఁ
గలఁడు? ఆమె దుర్గాధిపతి కూతురు. ఆ దుర్గాధిపతులు

చండశాసనులు. ఆమెను లోకమునందలి యితరస్త్రీలవలె సాధించుట సాధ్యమైన పనికాదు. ఇట్లుండఁగా నీయనతో నాల్గు తరములనుండి మీరాజవంశమునకు వారితోఁగల సంబంధము నెవ్వరో వృద్ధపరిచారికులు చెప్పిరి. ఆయన మీ నాయనమ్మగారి వద్దకుపోయి యీసంగతి కనుఁగొనెను. ఆవృద్ధరాణి "నిజమేనోయి నాయనా! వారును మీరు నన్నదమ్ములవంటివారు. కాని వారు చండపరాక్రములు. మహామర్యాదావంతులు. వారి బ్రాహ్మణ మతమునుఁగూర్చి మీరేమియు మాటాడనంతసేపు వారు మీతో భ్రాతృభావమునుసమృద్ధిగా నెఱపుదురు. చిన్నవ్వాడు మీ నాయన యొకటి రెండుసారులు నీలగిరి దుర్గమునకు పోయెను. వారును మనకోటకు వచ్చిరి. మఱల నిచ్చటి వీరెవ్వరు వెళ్ళలేదు. వారు రాలేదు. వారు గొప్ప యభిమానవంతులు. కోటలోనుండి రాజవంశీయులు వెళ్ళినచో వారు మర్యాద చెల్లించుటకు తిరిగివత్తురు. వారియంతట వారెప్పుడును రారు. ఏఁబదియేండ్లనుండి మీ తండ్రి వెళ్ళలేదు. మీ యన్న వెళ్ళలేదు. వారు రాలేదు. వా పెట్టివారనఁగా మీకు వారికిఁగల సౌదర్యభావమును వారి దుర్గాధిపత్య భావముతో కలిపి ముడిపెట్టరు. దానికదే దీనికిదే. సామంతులై చక్రవర్తి కెంత వినయమును ప్రదర్శించవలయునో, ఎంత రాజభక్తిని చూపవలయునో యంతయు చూపుదురు. సౌదర్యము నెఱపువేళ మీరు చక్రవర్తులని జెసకు పడరు. ప్రేమను తక్కువ వెలయించరు." అనియామె చెప్పెను. తమకుఁ దెలియునుగదా! ఆమెకు మీ ముప్వరి మనుమలలో రిపుంజయునిమీఁద నధికానురాగము కలదని.

తనపేరనున్న యాస్తియంతయు తనకున్న నగకట్లంతయు నామె రిపుంజయునికే యిచ్చెను. తొలుత మీా తమ్మునికి నా మణిమంజూషను చూడవలయునన్న కోరిక వృద్ధిపొందెను. తమకుం దెలియకుండ మహారాజుగారితో తాను నీలగిరిపోయి పూర్వపుం జెలిమిని సౌదర్యమునుం బాటింతుననివి మనవి చేసెను. మహారాజుగారు నా ననలేదు కాదనలేదు. వారు బ్రాహ్మణులు. మనము బౌద్ధులము. వారికిని మనకు సంబంధములేదు. వారు రాజభక్తిగల సామంతులు. నేను నా చిన్నప్పుడు రెండు మూడుసార్లు వెళ్ళితిని వారు మన యందు మర్యాద నెఱపుటలో నేమియు లోప ముండదు. కాని వారగ్నిహోత్రములు చేసికొందురు. బోలెడంత వైదికకర్మ నెఱపుచుందురు. నా తండ్రియు నా తాతయు నా ముత్తాతయు బౌద్ధులైయుండి వారితోడి యీ రాకపోక లెట్లు నెఱపికొనిరో నాకు తెలియదుగాని నాకుం గష్టమయ్యెను. మనము వెళ్ళి వారినిం జూచినచో వారు మర్యాదకొఱకుం దప్పకుండ మన రాజగృహములకు వత్తురు. వారు వచ్చిరనంగా వారికి వేఱే భవనమీాయవలయును. వారాభవనమునందు పుణ్యాహ వాచనము చేయుదురు. పరిపూతము చేయుదురు. మంత్రజలములను చల్లుదురు. ఒకచోట నగ్నిహోత్రగుండమును త్రవ్వుదురు. ఆ చుట్టుపట్ల కెవ్వరునుం బోవుటకు వీలులేదు. వారు మంత్రములనుం జదువుచుండంగా నెవ్వరును వినరాదు. వారి భోజనగృహము దెసకు నెవ్వరునుం బోరాదు. ఇట్టిబాధలున్నవి. వారొకటి రెండుసార్లు వచ్చిన తరువాత నాకిది బరువనిపించెను. వారి యాచారములను నేనును నాతండ్రియుం

పాలించఁగా నప్పటి బౌద్ధభిక్షుకులకు కోపము వచ్చెను. మేము బ్రాహ్మణాభిమానుల మనిరి. అప్పటినుండియు నే నచ్చటికి పోవుట మాని వేసితిని. వారును వచ్చుట లేదు. వారు మన రాజ్యమునకు మూలస్తంభము వంటివారు. వారి కప్పము వారు గడువు దాటకుండ చెల్లింతురు. ఇతర ప్రాంతముల లోని దుర్గాధిపతులు జాగుచేసినచో వారి ప్రాభవముల చేతఁ జెల్లించనిచో పరంతప భట్టునకుఁ దెలియఁజేసినఁ జాలును. వారి కప్పము మఱునాఁడు వచ్చును. వా రనినచో నా ప్రాంత ములయందు మహా గౌరవము. వారి పరాక్రమాదులనుచూచి మహాభయము." అని మహారాజు చెప్పఁగాఁ బరంతపుఁడు తన కాచుట్టఱికము మఱల నిలువఁబెట్టవలెనని యున్నదనియు, బ్రాహ్మణు లెట్లుందురో చూడవలయునని యున్నదనియు, వారి యాచారములనుఁ దెలిసికొందమని యున్న దనియుఁ జెప్పఁగా మహారాజుగారు నెమ్మదిగా నంగీకరించిరి. ఈ సంగతి తమకుఁ దెలియదు. రిపుంజయుఁడు నీలగిరి దుర్గమునకు సౌద ర్యము నెఱపుటకు వచ్చుచున్నాడని వారికి వార్తఁబంపెను. వారు తమ్మని సమాధానము పంపలేదు. మూఁడేండ్లు రిపుం జయుఁడు పదే పదే యీవార్తలనుఁ బంపెను. వారు తిరిగి వార్త యెందుకుఁ బంపలేదనఁగా మహారాజు వెడలి యేఁబది యేండ్లైనది. మహారాజు రాలేదు. యువరాజును రాలేదు. ఈరాజకుమారుఁడు వచ్చుట యెందులకు ? మహారాజుగాని యువరాజుగాని వచ్చుచుఁ బోవుచు నుండినచో నీయనవార్తకు వారు వెంటనే యంగీకరించెడువారు. వారు చిన్నదుర్గమున కధికారులైనను చక్రవర్తులకున్నంత చారత్యచస్త్యము కలి

వారు. వారు రిపుంజయునిఁగూర్చి తెలిసికొనిరి. రిపుంజయుఁడు స్త్రీ వ్యసనియనియు నతనికి దేశముమీఁద కామచారుఁడు కలఁడనియు దేశములోఁ బలుచోట్ల సౌందర్యవతులైన స్త్రీల నితఁడు బలాత్కారముఁ జేసెననియు కొందఱిని సంహరింపించెననియు వార్తలు వారికి చేరెను. అట్టివానిని కోటలోనికి రానిచ్చుట యుభయక్షేమంకరము కాదని వారు తలంచి సమాధానము పంపలేదు. ఏడాదిక్రింద రిపుంజయుఁడు వారినద్దనుండి సమాధానము లేకపోయినను పోవుటకు బయలు దేఱెను. ఈసంగతులు నాకుఁ దెలిసినంత మఱి యెవ్వరికినిఁ దెలియదు. నేను మిక్కిలి వారించితిని. పోవద్దంటిని. ఈలోపుగా మఱియొక వార్త తెలిసినది. ఆ మణిమంజూషకు వివాహమయ్యెను. వారి బంధువులలోననే యొక బ్రాహ్మణవీరున కామె నిచ్చిరట. ఆమెభర్త సూర్యంభట్లు. అతఁడు మాగధసేనలో నొక సేనాపతి. అతఁడు సామాన్యముగా నీలగిరిలో నుండఁడు. వచ్చుచు పోవుచుండును. అందుచేత నామె భర్త నిత్య మింటనుండఁడు గనుక నామె సుసాధ్యురాలని కామవృత్తాంత పండితుల యభిప్రాయముల ననుసరించి మన రిపుంజయుఁడుగారు నీలగిరికిఁ బ్రయాణమైరి. ఆ వెళ్ళుటలోకూడ రాచఠీవి లేదు. రాజమర్యాద లేదు. మహారాజుగారితోఁ జెప్పి రెండేనుఁగులు, పది గుఱ్ఱములు, వందమంది పరిచారకులతో నీలగిరికి వెళ్ళినచో నది రాచఠాయామీఁద సౌదర్యము నెఱపుట యగును. ఎచటికో యెచటికో పోయి యొకనాఁడు నీలగిరికి వెళ్లెను. వెళ్ళి తానువచ్చితినని దుర్గాధిపతియైన రిపుంజయునకుఁ దెలియఁజేసెను. ఏకాకిగా వచ్చిన

యీ రాజసోదరుని రిపుంజయుఁడు ప్రత్యేక భవనమునసుంచి మర్యాదలన్నియుఁ జేయుచుండెను. ఈయన పది దినము లుండెను. ఏదినమున రిపుంజయుఁడు పితృదర్శనార్థముపోవునో యీ దినమున మణిమంజూష కనిపించును కదా యని యీ యన ప్రతీక్షించుచుండెను. పితృదర్శన దినము వచ్చినది. దుర్గాధిపతియు నాయన భార్యయుఁ దక్కిన సంతానమును వెళ్ళిరిగాని మణిమంజూష వారివెంట వెళ్ళలేదు. ఆమెకు వివాహమైనప్పటినుండి రిపుంజయుఁడు మణిమంజూషను తన వెంటఁ దీసికొని పోవుటలేదట. ఆమెనుఁ గొనిపోవలయు ననఁగా నామె భర్తయైన సూర్యంభట్టుయొక్క యనుజ్ఞ కావ లయునట. ఆ సూర్యంభట్టు గిరివ్రజపురమున నొకనాఁ డుండును. ఆయన చమువెచ్చుట నే దుర్గమునందు తన ధర్మ మునుఁ బాలించవలసి యుండునో యాదుర్గమునం దాతఁ డుండును తమ తమ్మునకు మణిమంజూషా దర్శనమే దుర్లభ మయ్యెను. ఒక్కనాఁడును దుర్గాధిపతి రాజకుమారుని తమదుర్గ మును చూచుటకు రమ్మని పిలువలేదు. చూపింతునని తీసికొని పోలేదు. పూర్వము మీ రాజకుటుంబమువా రచ్చటికిపోఁగా నొకనాఁడు తమకుటుంబము నందఱిని పిలిచి యొక పెద్దసమా వేశముఁజేసి యా సమావేశములో నీ సౌదర్యభావమునకుఁ బ్రాకట్య మిచ్చెడివారట. ఈయన మీ సోదరుఁడు. ఈయన మన బావమఱఁది. ఈమె మీ వదినగారు. ఈమె మీయన్న గారి కుమార్తె. ఇట్లుగా జరిగెడిదట. వారు మన కోటకు వచ్చినపుడుఁగూడ నదియే మర్యాద జరిగెడిది. ఇట్టి సమావేశ మును దుర్గాధిపతి యెప్పుడో జరుపుననియు నా సమయమున

మణిమంజూషా దర్శనము కలుగుననియు నీతఁ డూహించెను. కాని నెల దినములున్నను జరుగలేదు. జరుగలేదు సరిగదా దైనందినములైన మర్యాదలలో సంభారములను సమకూర్చు టలో నేలోపమునులేదుగాని దుర్గాధిపతిగాని వాని తమ్ములు గాని వచ్చి వీరిని చూచుటయే మానివేసిరి. ఒకనాఁడు రిపుం జయుఁడే తాను తనంతట దుర్గారోహణమును చేసెను. ఎవ్వ రును వారించలేదు. అందఱు నివ్వెఱపోయి చూడ నారం భించిరి. దుర్గాధిపతి తెలిసి యెదురువచ్చెను. నాకు మీదుర్గ మును చూడవలయునని యున్నది. మీరు పిలువలేదు. నేనే వచ్చితిని" అని మీతమ్ముఁ డనఁగా దుర్గాధిపతి "నేనే మిమ్ము పిలిచి దుర్గమునంతయు చూపింప నెంచితిని. కార్యాంతర నిమగ్నుఁడ నగుటచేత నాలస్యమైనది." అని దుర్గమునంతయుఁ జూపించెను. ఈయన ఆభవనము వేరిది. ఈభవనము వేరిది మొదలైన ప్రశ్నలువేసి మణిమంజూషా భవనమునుఁ దెలిసి కొనెను. తిరిగి క్రిందికి వచ్చెను. మఱునాఁడే గిరివ్రజపుర మునకు వచ్చెను. ఉత్తుంగభుజుఁడు నితఁడు నాల్గైదు దినము లొకటే యాలోచన. చివరికేమి ఫలితము తేల్చికొనిరో తెలి యదు. కొన్నాళ్ళకు రిపుంజయుఁడు తాను వచ్చుచున్నానని నీలగిరికి వార్తఁ బంపెను. ఈసారి కొంత సైన్యముతో మూఁ డేన్గులతో వంద గుఱ్ఱాలతోఁ బోయెను; తమకుఁగాని మహా రాజుగారికిఁగాని యీ సంగతి యేమియుఁ దెలియకుండ నుత్తుంగభుజుఁడు పరమ రహస్యముగా దీనిని నడపెను. మీ తమ్ముఁ డచ్చటికిపోయి నెలనాళ్ళుండెను. మణిమంజూషా

సౌధము దుర్గముమీఁద కొండయంచున నుండెనట. బలిష్ఠమైన దీర్ఘమైన రజ్జువు తద్భవన గవాక్షమునకు బంధించినచో చీఁకటిరాత్రి నారజ్జువునుఁబూని పైకిఁబోవచ్చునట. అట్లేర్పాటు చేసికొని మన సైనికులు రక్షగా నుండిరి. ఒకయేన్గు నాకొండ క్రింద నిలఁబెట్టి దానిపైనుండి యారజ్జువువెంట నా భవనములోనికిఁ బోవలయును. దుర్గాధిపతిగాని వారితమ్ములు గాని యితరులుగాని రాజకుమారుఁ డిట్లు చేయునని యెట్లను కొనఁగలరు ? ఎవఁడైన శత్రువైనచో నట్టిపని చేయును ? ఒక నాఁటి నిశీథమున మబ్బులు క్రమ్మినవేళ జేపో మెల్లుంగరయో యమావాస్య యనఁగా కోట కావలివారికి ధనాశఁగొలిపి యీయన యాత్రాడువెంట మణిమంజూషా భవనమునుఁజేరెను. ఆభవన గవాక్షమునకు నారజ్జువు నెవరు బిగించిరో యాసంగతి యనిర్భేద్యముగా నుండెను. ఆమెకుఁ దెలియకుండ నట్టిపని జరుగదని కొందఱు వాదింతురు. ఈయన తద్భవనములోఁ బ్రవేశించెనట. ఆమె నిద్రపోవుచున్నదట. ఉలికిపడి లేచినదట. ఎవరు నీవన్నదట. ఇతఁడు తన పేరునుచెప్పెనట. నిన్ను చూచి పోదమని వచ్చితిని. నీవు మహాసౌందర్యవతివని వింటిని. నిన్నుఁ జూచుటకు నాల్గేండ్ల నుండి ప్రయత్నము చేసితిని, నాకు సాధ్యముకాలేదు. అని తన కథ నంతయుఁ జెప్పెనట. ఆమె యేమన్నదో తెలియదు. ఇంతలో బయట నలికిడి కగిలి యెవరో మేల్కొనినట్లు వచ్చుచున్నట్లు భయపడి మీఁ తచ్చుఁడు త్రాడునంట క్రిందికి దిగివచ్చెను. ఆ మఱునాఁ డేమిజరిగినదో దుర్గముపైని వర్తమాన మెవ్వరికినిఁ దెలియదు. ఆ దిశనున్న రక్షకభటులు

నల్గురు సంహరింపఁబడిరి. దుర్గోపరి సర్వ వ్యవహార పరిశీలకుఁ
డైన యొక యధికారి రిపుంజయునితో "తమరు వెంటనే
వెళ్ళిపోవలయును. మా దుర్గ వ్యవహారములు కొన్ని క్లిష్ట
పరిస్థితుల యందున్నవి. మీరు వెళ్ళనిచో మేము మిమ్ము
బలవంతముగాఁ బంపింపవలసి వచ్చును." అని తీవ్రముగాఁ
జెప్పెను. రిపుంజయుఁ డంగీకరించ లేదుగాని తోడి సైనికులు
"బాబూ! ఈ దుర్గాధిపతుల తోడిది చాల ప్రాణాంతకమైన
వ్యవహారము. తిరువాత మన సైన్యములువచ్చి దుర్గమును
నాశనము చేయవచ్చును. కాని మనమందఱ మిచ్చట సంహ
రింపఁ బడుదుము. మర్యాదగా పోవుట మంచిది" యని
చెప్పఁగా నీయన "ఓయీ! ఆమెతో నేనూరకే మాటా
డితిని. ఆమెయందు నాకుఁగల యభిలాషనే వ్యక్తపఱుపలేదు.
ఆమె లక్షణము చూచినచో నాయందు ప్రేమదృష్టులనుఁ
బరఁగించినది. ఎందుకు పరఁగించదు? నిండువయసులోనున్న
యువతి. భర్తయెచ్చటనో పరదేశములయం దుద్యోగములో
నున్నాఁడు" అని వాదించెనట. కాని వారందఱు పట్టి బల
వంతమునన నతనిని గిరివ్రజపురమునకు నెట్టుకొని వచ్చిరి.
ఇట్లుండఁగా నాల్గునాళ్ళక్రింద నెవఁడో యొక వార్తాహరుఁడు
వచ్చి మీ తమ్మునితో మణిమంజూష యితనిని ప్రేమించు
చున్నదనియు, మొన్నటి రాత్రికి నితఁడు పూర్వము వలెనె
గవాక్షము వద్దకు వచ్చినచో తానొక రజ్జువు నచ్చట బిగించి
యుంతుననియు, నా రజ్జువు వెంట పైకి రావచ్చుననియు, నితఁడు
తన రాకను మిక్కిలి రహస్యముగా నుంచవలయుననియు,
నితఁడు గిరివ్రజమునుండి బయలు దేఱినట్లు యెవ్వరికిఁ దెలియ

రావనియు, వెలుతురుండగా నీలగిరి చేరవద్దనియు, రాత్రిపూట సందడులు నిద్రించిన సమయమునందు దుర్గద్వార రక్షకునకొక సంజ్ఞ చేసినచో నతఁడీయనను లోనికిఁ బ్రవేశించనిచ్చుననియు, నొక వార్త తెచ్చెను. అది ముద్రితమైయున్న యొక లేఖ. రాజకుమారుఁడు తానెట్టి రహస్యములైనను నాతోఁ జెప్పును. ఆయన నాల్గునాళ్ళనుండి మహానగరమున లేఁడని యెవ్వరికినిఁ దెలియదు. నాయొక్కనికే తెలియును. నేను చెప్పితిని. "బాబూ ఇది నాకు నమ్మకముగా లేదు. ఆమె యొక్క రాత్రి చీకటివేళ సన్నని దీపపు వెలుఁగున నిన్నుఁ జూచినంతమాత్రాన నీయం దింత మరులుకొన్న దనుటకు వీలు లేదు." అని యెన్నో చెప్పితిని. ఆయన వినలేదు. తా నచట వ్యతిరేకపరిస్థితులలో నున్నచో వెంటనే వార్త పంపుదు ననెను. ఈనాఁడా వార్త యిట్లు వచ్చెను.

## ౧౨

కాలాశోకునకు నిద్దురపట్టలేదు. ఈ వార్త యెంతవఱకు నిజము? అయ్యో! కామ వృత్తి యెంత చెడ్డది? ఇప్పుడు నీలగిరికిఁ బంపించినను వారు మేమెఱుఁగనే యెఱుఁగ మందురు. వారితనినిఁ జంపించిరని చెప్పి చూపుటకు నిదర్శనములు లేవు. ఉత్కళకే కసికొలంది వారిమీదికి దండెత్తి వచ్చును. వారి దుర్గమును నాశనము చేయవచ్చును. వారి నందఱను వధియింపవచ్చును. రిపుంజయుని మూర్ఖత్వమునకు వారు ప్రతిక్రియఁ జేసిరి.

అది న్యాయము కాదనుట యొప్పున్నది? ఇదివఱ కతఁడెన్ని చేసెను? నేను నిట్టివి చేసితిని. ప్రతిదానికి శిక్ష వచ్చునా? అన్నింటికిఁ గలిపి యొక్కసారియే శిక్ష వచ్చును. భగవంతుఁడు లేఁడనుటకు వీలున్నదా? మా బౌద్ధమతములో భగవంతుఁడు లేఁడు. చేసిన కర్మయున్నది. ప్రతిఫలమున్నది. ఆ కర్మకును ప్రతిఫలమునకును సంబంధమున్నదా? లేదా? ఆ యుత్తరము నెవరు వ్రాసిరో తెలిసికొనవలయును - అని కాలాశోకుఁడు మఱల నా వార్తాహరుని కొఱకు నంపించి, వాఁడు వచ్చిన తరువాత "తమ్ముఁడుగారికి వచ్చిన యుత్తరము తన వెంటఁదీసికొని వెళ్ళెనా, ఇచ్చటనుంచి పోయెనా? యని యడుగఁగా నతఁడు బాబూ! యుత్తరము నా చేతి కిచ్చి పొమ్మంటిని. ఆయన దానినొక పెన్నిధానమువలె చూచుకొనుచుండెను. ఆయన యీయనే శే దనెను. కాలా:— ఆ యుత్తరమును నీవు చూచితివా? వార్తా:- చూచితిని. కాలా:- దేనిమీఁద వ్రాయఁబడి యున్నది. వలిపపు వస్త్రము మీఁదనా? భూర్జపత్రము మీఁదనా? మఱి యేదైన చిక్కని యెండుటాకుమీఁదనా? వార్తా:-సన్నని వలిపపు బట్టమీఁద వ్రాసియున్నది. దానికి సుగంధ ద్రవ్యములు పులుమఁ బడియున్నవి. దానియంచులయందు పసుపును కుంకుమను నంటింపఁ బడియున్నవి. కాలా:- ఓయీ! ఉత్తరమని నంతనే యెవఁడో వ్రాయసకాఁడు వ్రాసియుండవలయును. అందఱును వ్రాయలేరు. కాక నీలగిరి దుర్గమునందు సర్వజనులును వ్రాయసగాండ్రేమో! స్త్రీలకుఁ గూడ వ్రాఁత నేర్పియుందురు. వారివంశము విషయములో నీయను

మాన మక్కఱలేదు. అయినను యక్షరముల పొంకము స్త్రీలు వ్రాసినట్లున్నదా? పురుషులు వ్రాసినట్లున్నదా? వార్త:- నా కాపవక్ష తెలియలేదు. కాని యక్షరములు ముత్యముల వలె నున్నవి. స్త్రీలు వ్రాసినట్లే యున్నది. ఎందుకని యడుగఁగా నేను చెప్పలేనుగాని యెవ్వతెయో గొప్ప యింటి స్త్రీ వ్రాసినట్లే నాకు తోచుచున్నది.

అంత నతఁడు వెడలిపోయెను. సూర్యోదయ మయ్యెను. కాలాశోకుఁడు కాల్యకృత్యముల నిర్వర్తించి రాక్షసునకు వార్త నంపెను. రాక్షసుఁడు వచ్చెను. కాలాశోకుఁడు రాక్షసునితో నీసంగతి యంతయు చెప్పెను. "నీవు నీలగిరికి పోయి వర్తమానమును కనుఁగొని వత్తువా? ఇది చాల రహస్యముగాఁ జేయవలసిన పని. నీవంటివాఁడు తక్క మఱియొకఁడిది చేయలేఁడు. రాక్షసుఁడు. "అయ్యా! నాకు దీనితో నేమి పని? నేనీ రాజకుమారులయొక్క కామ వృత్తముల యందు నేర్పులేనివాఁడను. నాకు తెలిసినది రాజనీతి. అందులోఁ దమ కేమైనను సాహాయ్యము కావలసినచో నిస్సంశయముగాఁ జేయఁగలను. రే పుత్తుంగభుజుఁడు తమ యాజ్ఞా నిర్వాహణము చేయనిచోఁ బోయి యతనిని దండించి తీసికొని రమ్మన్నచోఁ దీసికొని రాఁగలను. కోసలరాజువద్దకు రాయబారము పొమ్మన్నచో పోఁగలను. మఱియొక రాజ్యముతో నేదైన వ్యవహారము నడుపుమన్నచో నడుపఁగలను. కాని యిట్టి వ్యవహారములు చేయలేను. నేనీ పనిమీఁద నీలగిరికి పోయినచో వారు నన్నుఁ గూడ సంహరించినచో నేనేమి చేయఁగలను? నందుఁడు. నామీఁద నెంతయో యాశపెట్టుకొని

కూర్చున్నాఁడు. అతనికి నేను ద్రోహము చేసినట్లగును" అనెను. కాలాశోకుఁడు:- "ఏమి యాశపెట్టుకొని కూర్చు న్నాఁడు? రాక్ష:- తమకు తప్పు రాజగుదురు. అతనియందు మీరు ప్రేమలేనివారు. అతఁడా క్షత్రియుఁడు కాఁడు. ఒక్క క్షత్రియుఁడు కాకపోవుటయేకాక మహారాజుగారి కుమారుఁ డైనవాఁడు. అతఁడు మీ రాజ్యమునకు కంటకముగా మీ రనుకొనవచ్చును. అతనిని నాశనము చేయుటకు మీరు ప్రయత్నించవచ్చును. రాజ్యము నధికారము, వయస్సు కలిగిన వారు న్యాయముగా ప్రవర్తింతురని నమ్మకమే మున్నది? మీ తమ్ముఁడుగారు నిజముగా నెంతమంది స్త్రీలనో పాడు చేసెను. కొన్ని వంశములను నాశనముచేసెను. రాజులు తలఁ చినచో వారు చేయలేని పనియేముండును? చేతిలో సైన్యము లున్నవి. ఈ పనిచేసి రమ్మురా యనఁగా చేసెడివారు వంద మంది యుందురు. కనుక మీరు నందునేమి చేయుదురో తెలియదు. కాలా:- నేను నందున కేమైన చేసినచో నీ వడ్డమా? నీవతని నెట్లు రక్షించఁ గల్గుదువు? రాక్ష:- అందుకనియే మొన్న తమకు వార్త నంపఁగా వచ్చితిని. మొన్న తమరికొక మహాకార్యము సాధించిపెట్టితిని. ఇట్లే నా చేతనైనవి చేయు చుందును. తమరికి నాయం దనుగ్రహము కల్గును. తమకు నందునిమీఁద నాగ్రహము కల్గినప్పుడు తమరు రాజులైనప్పుడు 'మహారాజా! నేను తమకు పూర్వ మీ యీ పనులు చేసి పెట్టితిని. నాయందు తమకుఁ గొంత యనుగ్రహ మున్నది. ఈ నందుఁడు నాకు స్నేహితుఁడు. నన్నుఁ జూచి మీ రతనిని క్షమించవలయు'నని మిమ్ము ప్రార్థింతును. కాలా:— నీవు

ప్రార్థించినను నేను నందుని క్షమించుననుకొనుము. రాక్ష:- నే నట్లనుకొనను. తమరు చాల మంచివారు. రాజు మంచివాఁడుగాఁ బ్రక్కనుండి చెప్పెడివాని తీరులో నున్నది. తమకిది తెలియదు దుష్టులైనవారు బోధ్ధలుగా నుండిరి. కాలా:- నేను రాజునైన తరువాత కూడ వారే యుందురు. రాక్ష:-ఇప్పుడు నీలగిరికి వెళ్ళవలసిన యవసరము లేదు. అసలు మీ తమ్ముఁడు గారు నీలగిరికి వెళ్ళనే లేదేమో! ఆయన యెచ్చటికిఁ బోయెనో! ఆయన నెవ్వరును చంపనే లేదేమో! ఇట్టి వారి ప్రకృతి మనము చెప్పలేము. ఏ యొయ్యారపు పడుచు పయ్యెద ముసుఁగులో దాఁగియుండి కొన్నాళ్ళచ్చటనే యుండఁ దలఁచి వీని కీమిథ్యా వార్త పంపించెనేమో! అతనికి నీలగిరి రాజులమీఁద కోపమేమో! ఈ యపప్రథ కల్పించి తమ చేత నీలగిరి దుర్గమును ధ్వంసము చేయించి తరువాత తిరిగి వచ్చునేమో! అప్పుడయ్యో యిట్టి పని వృథాగాఁ జేసితిమని మీ రనుకోవలసి వచ్చును. కాలా:- రాక్షసుఁడా! ఇట్టి వాదన నే నెప్పుడు వినలేదు. ఇది యేమయ్యా! నాలు గేండ్లనుండి జరిగిన వర్తమాన ముండెను. వచ్చిన లేఖ యుండెను. మూన్నాళ్ళలో తిరిగి రానిచో వెంటనే వార్త పుట్టునని యతఁడు చెప్పిపోయెను. వెంటనే వార్త వచ్చెను. ఇక్కడ నింకొక వికల్పమునకు స్థానమేమి కలదు? రాక్ష:- తొట్టతొలుత నా వార్తాహారుఁడు దండ్యుఁడు. వాఁడు చెప్పిన మాట లెంతవఱకు నిజమో కనుగొనవలయును. వాఁడిన్నాళ్లు మీ రిపుంజయుని ప్రవర్తనఁ దమకు తెలియకుండ మహా రాజుగారికిఁ దెలియకుండ యెందుల కూరకుండెను? ఇట్టి

దేదైన వచ్చినచో బాధ్యత యెవరిది? ఆయన చేసిన దుర్మార్గపుఁ బనులన్నియు వీనికిఁ దెలిసినచో వీఁడు నందులో భాగస్వామియే. ముందు వానిని దండించవలయును. రాజులు ప్రజలను పాలించవలయును. ధర్మమును రక్షించవలయును. అధర్మ మార్గమునందు పోయినవారిని శిక్షించవలయును. కంచెయే చేను మేసిన కలదె దిక్కు? కాలా:- రాక్షసా! నీవు ధర్మములు చెప్పుచున్నావు. ఆ లెక్కలో నిజముగా రాజన్న వాఁడే యుండఁడు. రాక్ష:- అట్లనవద్దు. పూర్వ రాజులు మాంధాత, దిలీపుఁడు, రాముఁడు, భరతుఁడు, దుష్యంతుఁడు, ధర్మరాజు మొదలైనవా రున్నారు. వారు పరుల భార్యలను దొంగిలించిరా! ఎవని భార్యనో యపహరించుటకు వానిని సంహరించిరా? తన సామంతుని కూతు రొకతె మహా సౌందర్యవతి యున్నదనఁగా వారి కోటకు లగ్గలు పట్టిరా? అట్లనరాదు. కాలా:- ఇంతకును నీవు నీలగిరి పోనందువు. రాక్ష:- తమరియాజ్ఞ యైనచో నేను సేవకుఁడను. నాకు పోక తప్పదు. కాని నా కావిద్యయందు పాండిత్యము లేదని చెప్పు చున్నాను. మఱియు నాలుగైదు దినములు నాకీ మహా నగ రమునందు చాల పనియున్నది. అవని యచ్చముగా నాపని కాదు. అది రాజకార్యమే. నే నీనాల్గుదినము లీ మహా నగరమున నుండనిచో మీా రాజవంశమున కే మహాపద వచ్చునో నాకు తెలియదు. అట్టి మహాపద మీా రాజ్యమునకు రాకుండ నే నిచ్చట నుండవలయును. కాలా:- ఓయి రాక్ష సుఁడా! నీ వుండియుండి మాటిమాటికిఁ గ్రొత్త క్రొత్త విష యములు చెప్పెదువు. మా రాజ్యమున కేమి యాపదకలదు?

నీవింత తెగించి మాటాడెద వేల? నిన్నింత నిర్భయునిగాఁ జేసిన దెవరు? నీ కీధైర్య మెచ్చటినుండి వచ్చినది? రాక్ష:- అయ్యా! నాకీ ధైర్య మెచ్చటినుండివచ్చినదా? నే నిట్లు మాటాడుచుండఁగా మీరు నన్ను వెంటనే బంధింపించి చెఱ సాలలో వేసి నన్ను శిక్షించవలయును. అట్లు చేయకుండ మీరు నాయందు దయవహించుచున్నారు ఆ దయలో నుండియే నాకు ధైర్యము వచ్చుచున్నది. కాలా:-నా రాజ్యమునకు వచ్చెడు నాపదయొక్క స్వరూప మెట్టిది? రాక్ష:- నిజముగాఁ జెప్పుమన్నచోఁ జెప్పెదను. నేనిప్పుడు చెప్పరాదు. రెన్నాళ్ళాగిన తరువాత చెప్పుద మనుకొన్నాను. మీరిప్పుడే యడుగుచున్నారు గాన చెప్పుచున్నాను. ఇప్పు డీబౌద్ధమహా సమావేశము జరుగుచున్నది. లిచ్ఛవులయొక్క పది దోషములను యశుఁడు లెక్కించెను. అవి నిశ్చయముగా దోషములే యని అవంతీకౌశాంబీ పాంచాలాది ప్రదేశములయందు నివసించుచున్న మహాబౌద్ధులందఱు నిర్ణయించిరి. వజ్జీయ శాఖీయులు, మిమ్మాశ్రయించినవారు. వారివి దోషములు కావని తమరు చెప్పినచో నజితాదులు తమరిని వెలివేయుదురు. మీమీఁద నుత్క్షేపణకర్మ ప్రయోగింతురు. మీరు వజ్జీయులకు వ్యతిరేకముగా చెప్పినచో వారికి మీమీఁదఁ గోపమువచ్చును. ఈ మహా నగరమునందలి బౌద్ధు లెట్టివారు? ఉత్తుంగభుజుని యండగలవారు. ఉత్తుంగభుజుఁ డెట్టివాఁడు? తమరొక స్త్రీని వాంఛింతురు. ఆస్త్రీని సంపాదించుట కష్టము. వాఁడామె తలిదండ్రులను వధించును. భర్తను సంహరించును. బంధువుల నందఱిని పుడుగేఱిన క్లేఱును. తమరి కాస్త్రీని

తీసికొనివచ్చి సంధాన పెట్టును. తమను రాజులు. ఆమెతో నేకనిశా భోగముతో తమకు సరిపోవును. ఆ స్త్రీయొక్క స్థితియేమి? ఆమె బిచ్చమెత్తుకొనునా? కులటావృత్తికి దిగునా? ఉన్మత్తురాలై గ్రామములవెంట సంచరించునా? ఆ యుత్తుంగభుజుఁ డట్టివాఁడు. వానికిఁ బ్రాణముఁ దీయుట యన్నచో ఖడ్గములను భక్షించుటవంటిది. వాఁడు తన దౌష్ట్యమునుఁ దనసంపదనుకూడ నెఱపునా యన్నది ప్రశ్న. ఆపని యతఁడు చేయఁడు. బౌద్ధభిక్షుకులు చేయుదురు. ఆ భిక్షుకులను శిక్షించుటకు రాజున కధికారము లేదు. బౌద్ధసంఘమే వానిని శిక్షింపఁగలదు. బౌద్ధసంఘములో నొక న్యాయము జరుగ వలయు నన్నచోఁ – దమకుఁ దెలియుచునే యున్నదిగదా! ఎంత తతంగము జరుగవలయును. ఒక సంఘము వానిని దోషిగా నిరూపించును. మఱియొక సంఘము వాఁడు కాఁడ నును. మఱల నింకొక సంఘము వాఁడు చేసినది తప్పే యనును. ఒక సమావేశము వైశాలిలో జరుగును. మఱియొకటి శ్రావస్తిలో జరుగును. ఇంకొక్కఁడు గిరివ్రజపురమున జరుగును. అప్పటికి రాజు దానిని దోషము కాదనుటకు నిర్ణయించునేమో! అసలు బౌద్ధ సూత్రములలో నొకఁ డున్నది. అందు పంచ సూత్రములు కలవు. అర్హంతుఁ డైనవాఁడు తనకుఁ దెలియ కుండ నొక పాపమును చేయవచ్చును. దానికి శిక్షయే లేదు. ఆరీతిగా నొక రాజును చంపిన యర్హంతుఁడు బౌద్ధమతమును సంరక్షించుటకొఱకు నాపని చేసెను. అతఁడు దండ్యుఁడు కాఁడని నిర్ణయింపఁబడ వచ్చును. ఓయి! కాలాశోకా! ఇప్పుడు రాజ్యము చేయుచున్నది బౌద్ధులా? క్షత్రియులా?

రాజులు బౌద్ధ సన్యాసుల చేతులలోని పనిముట్లు. కాలా:- అట్టి ఘోరము మన రాజ్యములో జరుగునందువా? రాక్ష:- నేనేమి చెప్పఁగలను? యశుఁడు వజ్జీయుల యందలి పది దోషములను నిరూపించినాఁడు. ఆదోషములు తమరికిఁ దెలియునా? కాలా:- నాకుఁ దెలియవు. ఈనాఁటి సభలో నవియన్నియు విచారణకు వచ్చుననుకొనుచున్నాను. రాక్ష:- అందులో నొకటి రెండు న్యాయముగానే యున్నవి. జాతరూపరజితమని యొక దోష మున్నది. ఎవ్వరైనను భక్తులు బంగారమును నెండియు బౌద్ధభిక్షుకుల కిచ్చినచో భిక్షులు గ్రహింపరాదు. నిస్సగ్గియ, పాచిత్తియ, యను గ్రంథములోని పదునెన్మిదవ సూత్రముచేత నిది పరిహరింపఁబడినది. దానికి నే నొప్పుకొన్నాను. జాలోగింపాతమని మఱియొక దోష మున్నది. దానివలన బౌద్ధభిక్షులు సారాయి త్రాగరాదు. మన వజ్జీయులీ రెండుపనులనుఁ జేయుదురు. అవి దోషములనుట న్యాయమే. తక్కిన యెనిమిదియు నున్నవి. అవి దోషము లనుటలో నర్థము లేదు. సింగిలోణ కప్పము అని మఱియొక దోషమును యశుఁడు నిరూపించినాఁడు. శృంగలవణ గ్రహణమున కిది పాళీభాష. అనఁగా నేబౌద్ధుఁడును లవణమును కొమ్ములోఁ బెట్టి మోసికొని పోరాదు. ఎప్పుడైనను దొరకిన భిక్షలో నుప్పు తక్కువైనచోఁ గలిపికొని తినుటకు వీలుగా నుండునని వజ్జీయులీపని చేయుదురు. ఇది దోషముగా యశుఁడు నిరూపించెను. ఆ యుప్పును మోసికొని పోవుట వస్తువును నిలువచేయుట వంటిదియని యతఁడు చెప్పెను. రుచికి దాసుఁడగుట యను నర్థము చెప్పినను

బాగుగా నుండెడిది. ద్వ్యంగుల కప్పయని మఱియొక దోషము. సూర్యుని నీడ రెండంగుళముల వెడల్పుగా నుండఁగా భోజనము చేయరాదని దీనియర్థము. రెండుజాములు దాటిన తరువాత భోజనముచేయరాదని. ఇట్లే తక్కినవియును. భోజనము చేసిన తరువాత మజ్జిగ త్రాగరాదట. తాను పరుండెడి బొంతకు నంచుండరాదట. కమ్మియున్నచో కంబళి చెడిపోవునా? ఈ దోషముల కర్థమేమి? ఇట్టి దోషములు యశుఁ డెందుకు నిరూపించెను? అతనికి వజ్జీయులతో విరోధమా? ఎందుకు నిరూపించునో చెప్పెదను వినుడు. వజ్జీయుల నెనుకఁ దమరున్నారు. తమరివలన వజ్జీయులపని మూఁడు పూవు లాఱు కాయలుగా నున్నది. ఇది యితరులకు కన్నెఱ్ఱగా నున్నది. మీ యండ వజ్జీయుల కున్నది. వజ్జీయుల యండ మీ కున్నది. ఈ స్నేహమును చెడఁగొట్టవలయునని యశుఁడు తక్కిన బౌద్ధులచేత ప్రోత్సాహము చేయఁబడి యింత యల్లరిచేయుచున్నాఁడు. అహోగంగా పర్వతము మీఁదనున్న శాణవాసి వద్దకుఁ బోయెను. రేవత సహజాతి వచ్చినాఁడు. అజితుఁడు వచ్చినాఁడు. సబ్బకామి వచ్చినాఁడు. అర్హతులలో వీరికున్న మర్యాద యెట్టిది? వారందఱిచ్చటికి రాకముందే యివియన్నియు దోషములని నిరూపించినారు. మీరు కాదందురు. అనవలయుననియే వజ్జీయులయొక్క యూహ. అందురనియే వారియాశ. అనినచో వజ్జీయులు కాని సర్వ బౌద్ధులకు మీరు విరోధులు. మీ మీఁద నుత్క్షేపణకర్మఁ బ్రయోగింతురు. అపుడు మీరు బౌద్ధులే కాదు. వజ్జీయుల కాశ్రయమేలేదు. ఉత్క్షేపణకర్మ పొందిన రాజుయొక్క భిక్షను

స్వీకరించిన వర్ణీయులు మఱియును బహితు లగుదురు.
ఇందులో నింత యర్థ మిమిడియున్నది. మహా రాజవంశము
నేఁడు, భద్రముగా నున్నదని మీ రనుకొనుచున్నారేమో!
నేననుకొనుటలేదు. కాలా:- ఏమయ్యా! నీవు వంపియ్యే ఘ్లుఁ
ప్రతికిఁ రాజనీతివేత్తవలె మాటాడుచున్నావు? మహామంత్రి
వలె మాటాడుచున్నావు? రాక్ష:- నా జాతకము ప్రకారము
నేను నూటపదునదియేండ్లు బ్రదుకుదును. నా వయస్సిప్పుడు
పాతికయేండ్లు. నేనింక నూటపదునేను సంవత్సరములు బ్రదు
కుదును నా జాతకము ప్రకారము నేనొక మహారాజ్యము
నకుఁ బ్రధానమంత్రిని కావలయును. నేను బ్రతికియుండఁగా
నా రాజనీతి ముందు నిలచెడి వాఁడనుచు నుండఁడు. నా చివరి
దినములలో నమఁగా నింక నెనుఁబది యెనిమిది సంవత్సరములు
దాఁటిన తరువాత నాకొక ప్రత్యర్థి బయలుదేఱును. అతఁడును
బ్రాహ్మణుఁడే. అతఁడు నాకంటె నీతిమంతుఁడై యుండునఁట.
అతనికి నాకును పంద్రెండేండ్లు నీతియుద్ధము జరుగునఁట. చివరి
కతఁడే గెలుచునఁట. అతఁడు గెలిచినను నేనోడిపోయి నట్లుం
డనఁట. ఇది నా జాతకము. కాలా:- నీవు నాకే మంత్రివగు
దువు. నా రాజ్యమునే నిలబెట్టుదువు. రాక్ష:-మీ రాజ్యము
కాదు. నేను సేవించెడు రాజు నా జాతకము ప్రకారము
క్షత్రియుఁడు కాకూడదు. కాలా:- నేను బౌద్ధుఁడను. అందు
చేత క్షత్రియుఁడనుకాను. రాక్ష:- అయ్యా! క్షత్రియుఁడు
గాని బ్రాహ్మణుఁడుగాని శూద్రుఁడుగాని జన్మతో నగుదురు.
కాదని మీ బౌద్ధసిద్ధాంతము. వృత్తిచేత నగుదురని మీ
సిద్ధాంతము - మీరు క్షత్రియులు కానిచో సర్వ క్షత్రియ

సమావేశ మెందుకు జరిపితిరి? బ్రాహ్మణులను సంహరించ వలయునని తీర్మాన మెందుకుఁ జేసికొంటిరి? ఓయి! యువ రాజా! ఇంతమంది బౌద్ధ భిక్షువులు వచ్చిరి. వీరిలో నంబ ష్ఠులు కలరు. రజకులు కలరు. క్షత్రియులు కలరు. బ్రాహ్మ ణులు కలరు. ఉత్తమ కులములనుండి బౌద్ధులైన వారికి మీ బౌద్ధ భిక్షుకులలోనసనే యధికమైన మర్యాద యున్నదా? లేదా! వారు "మేము బ్రాహ్మణులము. నా తండ్రి బ్రాహ్మ ణుఁడు. నా తాత బ్రాహ్మణుఁడు." అన్న యహంకారము పొందుచుండిరా? లేదా! ఒక పుల్కసుఁడు బౌద్ధుఁడైనాఁడు. వాని ప్రక్కఁ గూర్చుండి భోజనము చేయుటకు పూర్వము బ్రాహ్మణుఁడైయుండి బౌద్ధమతములోఁ జేరినవాఁడు కంట గించుకొనుచున్నాఁడు. పైకిఁ జెప్పఁడు. భోజనవేళ వీలైనంత వఱకు తాను వాని ప్రక్కన కూర్చుండకుండఁ గొంతదూర మెడముగా నుండుటకు ప్రయత్నించుచున్నాఁడు. అర్హతుఁడై వారు చెప్పినట్లు సర్వ సమత్వము నింద్రియ జేతృత్వము సర్వ మనోభావ విరతియుఁ గలిగిన వానికి భేదము లుండవు. వాఁడు సిద్ధునివంటివాఁడు. అట్టి యర్హతులెంతమంది యుందురు? ఈ వచ్చిన సహజాతి, యజితుఁడు, సబ్బకామి, వీరు కూడ నట్టి వారగుదురో కారో చెప్పలేము. ఆరీతి జీవపరిపాకము లేకుండ, అట్టి జీవపరిపాకము కలిగినవారెట్లు ప్రవర్తించవలయునో సర్వ జను లట్లు ప్రవర్తించవలయునని నిర్దేశించెడి మత మేమి మతము? అది బాహిరమతమా? అంతరమతమా? బాహి రములై లౌకికములైన ప్రయోజనములు సాధించుటకు కొంద ఱట్టి మతములను వ్యాపింపఁజేయుదురు. ఇట్టి సిద్ధాంతములను

గల్పింతురు. కేవల సహజాతియును, సబ్బకామియును, తా
దృశులే యందము. వారికిని దక్షిణ భిక్షుకులకును భేద
మున్నదికదా! గిరివ్రజపురమున నేడు వేయిమంది బౌద్ధ
భిక్షుకులు క్రొత్తవారు సమావేశమైనారు. వారిలో నొక యిరు
పదిమంది మఱియు నధికులని వారికిఁ బ్రత్యేక భవనము
లేర్పాటుఁ జేసితిరికదా! వారి యాజ్ఞలు రాజాజ్ఞలవలె
మన్నింపవలయునని యాజ్ఞాపించితిరికదా! భేదములు చూప
రాని బౌద్ధ సంఘములో మీరే భేదములు చూపుచున్నారు.
మానవసృష్టియందు భేదము సహజము, దానిని పాటించుట
నిత్యము. ఆ పాటించుటలో మానవుఁడు దయాదాక్షిణ్యము
లతోఁ బ్రవర్తింపవలయును. అందఱును జీవులేయన్న భావ
ములతోఁ బ్రవర్తింపవలయును. ప్రక్కఁ గూర్చుండి భోజ
నము చేయువానిని కంటగించుకొనుచున్నావు. వానితోఁ గలిసి
భోజనము చేయకుము. వానిని హింసించుచున్నావు. హింస
చేయకుము. వానితోఁ గలిసి భోజనము చేయకుండ వానిని
హింసింపకుండ నుండుము. వానిని హింసింతువు వానితోఁ
గలిసి భోజనము చేయుదువు మన బిడ్డయందు మనకున్నంత
ప్రేమ పొరుగువారి బిడ్డయం దుండదు. మనబిడ్డకు మన
మంగీలు కుట్టించుకొందుము. నగలు చేయించుకొందుము. తిను
బండారములు కొనిపెట్టుదుము. మనము కొనిపెట్టిన తిను
బండారములు మనబిడ్డ తినుచుండగాఁ బొరుగుబిడ్డ కన్నులు
పెట్టికొని చూచుచుండును. అందులో నా పిల్లకు సగ మిత్తువా?
నీ కూతురునకుఁ గ్రొత్త యంగీ కుట్టించి పొరుగు పిల్లకుఁ గూడ
కుట్టింతువా? అది యెప్పుడును చేయవు. ఆ పొరుగుపిల్ల

కన్నులు పెట్టికొని నీకూతురు తినుచున్న తినుబండారముల వంక నదేపనిగా చూచుచుండఁగా నీవాపిల్లను కసరి పంపించకుము. ఏబ్రాసిది, దేవురుగొట్టు, మొదలైన మాటలనకుండ దానిని కొట్టకుండ కసరకుండ దాని నేవగించికొనకుండ దానికిఁ గూడఁ గొంచెముఁ బెట్టుము. అమ్మా! దానికిఁ గొంచెము పెట్టుమని నీకూతుతోఁ జెప్పుము. నీకూతురు శతవిధాల నంగీకరించదు. అయినను తన తినెడి దానిలో పెసరగింజంత తీసి యాపిల్లకుఁ బెట్టవచ్చును. ఇది స్వ పరభేదము. తక్కిన కులముల వారిని హింసించకుము. వానిని ద్వేషములతోఁ జూడకుము. ఏ పెసరగింజంతయో వారికిఁ జేయి విదల్పుము. అంతేగాని నీకూతునకుఁ దెచ్చి యిచ్చిన మిఠాయి పొట్లము వంటిది, పొరుగు పిల్లలందఱికిఁ దెచ్చి యెక్కడఁ బెట్టఁగలవు? నీకున్న సంపద దానికి చాలదు. అట్లే నీ జీవలక్షణము సర్వ జనులయందున్న భేదభావమును లేకుండఁ జేసికొనుటకు చాలదు. చాలని జీవలక్షణమునందు బాహిరముగాఁ జాలినతనము నభినయించుట యాత్మవంచనము. పరవంచనము. కొందఱట్టి వంచనమును రాజనీతి దృష్టితో నెఱపుదురు. అట్టి రాజనీతి నెఱపుటకు నీకవసరముఁ గన్పించదు. ఇది యెవఁడో రాజనీతి కూడఁ దెలియనివాఁడు త్ప్రయోజనము లేనివాఁడు సంఘము మీఁదఁ బగతీర్చికొనవలయునన్నవాఁడు సరిఁగా సృష్టినర్థము చేసికొనలేనివాఁడు, చేసిన పన్నుగడగాఁ గనిపించుచున్నది. ఒప్పికొందము. బౌద్ధులున్నారు. బౌద్ధులందఱు నొకటియే. వారిలో నేను చెప్పిన భేదములు లేవు. ఉన్నను లేవనియే యనుకొందము. బౌద్ధులు, బౌద్ధులు

కానివారు రెండు తెగలున్నారు కదా! కాని వారియందు
బౌద్ధులకు ద్వేషమున్నదికదా! ద్వేషము కాకపోయినను
తిరస్కార భావమున్నదికదా! అది కాకపోయినను వారు
తమకంటె తక్కువ వారని యనుకొనుచున్నారుకదా! వాఁ
డర్హతుఁడు కాకమున్న తన బౌద్ధమతము గొప్పది. బౌద్ధే
తరులు తక్కువ వారు. బౌద్ధుఁడైన వాని జన్మకే చారితా
ర్థ్యము. తక్కిన వారందఱు నరకమునకుఁ బోవుదురు, మొద
లైన భావము లుండునా? యుండవా? ఆ భావములుండుట
వ్యక్తిగతమైన యహంకారము కాకపోవచ్చును. ఆ మనిసి
యందు తాను చెందిన యొక మతమువలననో యొక సంఘము
వలననో ముద్రితమైన యహంకారము. ఆ యర్హతుఁడైన
వానికి నీ యహంకారము కూడ పోవలయునా? వలదా?
సర్వాహంకారములు నిర్మూలమైనప్పుడు కదా యర్హతుఁ
డైనవాఁడు, ఎవఁడో యొకఁ డర్హతుఁడగునుగాని సర్వజను
లర్హతులుగారుగదా! కానపుడు ద్వేషాదు లున్నవిగదా!
అట్టి ద్వేషములు గలవారిలో విభేదమెందుకు లేదు? చివరికి
తాత్పర్య మున్నవిభేదములు వెలికి ప్రకటించరాదని. వెలికి
ప్రకటించరాదనుట బాగుగనే యున్నదిగాని లేనట్లు నటించు
మనుటలో నర్థమేమి? లేనట్లు నటించి భేదములకు దుష్ఫలిత
ములనుఁ దెచ్చికొనుటయుఁ జేయుటయు నెంత కుత్సిత
మనఁగా భేదములు భేదములుగా నుండి వానివలన వచ్చెడి
దుష్ఫలితములు కుత్సితమైన సంఘనిర్మాణమువలన వచ్చిన
ఫలితములని చెప్పఁబడెడి సంఘమెంత కుత్సితమో యంత
కంటె కుత్సితము.

కాలాశోకుఁడు పది నిముసములు మాటాడలేదు. నడుమ నడుమ మొన్నటివలె తాను తలవంచికొని కూర్చుండి యుండఁగా రాక్షసుఁడు లేచిపోవునేమో యనిమాత్ర మతఁడు కూర్చున్న చోటునందుఁ జూచుచుండెను. రాక్షసుఁడు తాను లేచిపోలేదు. కాలాశోకుఁ డిట్లనెను. "రాక్షసుఁడా! నీవు బుద్ధునికంటె గొప్పవాఁడవు." రాక్షసుఁడు:- రాక్షసు లందఱి కంటె గొప్పవారు. ఎందుకనఁగా వారందఱిని నమలి మ్రింగఁ గలవారు కాలా:- ఓనయ్యా నీ వందఱను నమలి మ్రింగఁ గలవాఁడవే. నీ వయస్సెంత? నీ వివేక మెంత? నాకాశ్చర్యముగా నున్నది. నీవు నందునికి స్నేహితుఁడవగుట నందుని యదృష్టము సుమా? నేను రాజైనతరువాత నందు నేమో చేయుదునని యతనికి భయమా? అతఁడు నాకు సోదరుఁడు కాకపోయినను భ్రాతయగును కదా? నే నతని నేమియుఁ జేయను. నే నవివేకివలె మాటాడుచున్నాను. నీ వుండఁగా నతని నెవ రేమి చేయఁ గల్గుదురు? ఓయి రాక్షసుఁడా! నీవు బ్రాహ్మణుఁడవు. నీకు బౌద్ధమత మింత యెట్లు తెలియును? యశుఁడు నిరూపించిన దోషములు నీ కెట్లు తెలియును? రాక్ష:- యశుఁడు నాయింటికి వచ్చి వజ్జీయుల యందలి దోషములనుఁ దనకుఁ వ్రాసిపెట్టుమనెను. నే నెందుకని యడిగితిని. ఇంతకుమును బౌద్ధులవలన మీకుఁ గలుగఁబోయెడి యాపద్వృత్తాంత మంతయు నతఁడు నాకుఁ జెప్పి యీ ప్రయోజనముకొఱకుఁ దనకు వ్రాసిపెట్టుమనెను. నీవు మా రాజవంశమునకు ద్రోహము తలఁచుచున్నావు. నేను వ్రాసిపెట్ట నన్నాను. అతఁడు "మీ రాజవంశమునకు నేను ద్రోహము తలఁచుట

లేదు. గిరివ్రజపురముయొక్క యాశ్రయము చేత వజ్జీయులు
దుష్ట బౌద్ధులైపోవుచున్నారు. వారిని మంచిమార్గమునకు
త్రిప్పుటయే నా యభిప్రాయము. ఇట్టి దుష్ట బౌద్ధులకు
నాశ్రయమిచ్చుట మనము చేయవలసిన పనిగాదని మీ రా
జనుకొనవలయునని నే నిందుఁ బ్రవేశించినా ననెను. కాలా:-
ఓయి రాక్షసుఁడా! నీవు చెప్పినట్లు నేనిప్పుడు సందిగ్ధావస్థలో
నున్నాను. ఆ ప్రాడ్వివాక బౌద్ధసంఘము నన్ను వజ్జీయుల
దోషములు దోషములుగా నంగీకరింపుమని బలవంతపెట్టుచున్న.
లేనిచో నామీఁద నుత్క్షేపణకర్మఁ బ్రయోగింతురు. అప్పుడు
నేను రాజ్యము చేయుటకే యర్హుఁడనుకాను. బౌద్ధుఁడు కాని
వానికి మగధరాజ్యార్హత లేదని పూర్వము వస్సకారుఁడు
నిర్ణయించిపోయెను. నే నిప్పుడు వజ్జీయులకు వ్యతిరేకముగా
సజితాదుల తీర్పు నంగీకరించినచో వజ్జీయులు నన్నేమి చేయు
చేయుదురో? రాక్ష:- నా కదియే యనుమానముగా
నున్నది. ఉత్తుంగభుజుఁడు కొందఱు ధూర్తులను బౌద్ధమత
ములోఁ జేర్చెను. వారి కేమతము నక్కఱలేదు. అట్టివారిని
బౌద్ధమతములోఁ జేర్చెను. వారెందుకు పనికివత్తురనఁగా
ఓహో! మనము బౌద్ధులము. వాఁడు బౌద్ధుఁడుకాఁడు. వానిని
సంహరించి రమ్మనఁగా సంహరించివచ్చుటకుఁ బనికివచ్చెను.
నేఁ డుత్తుంగభుజుఁ డధికారములో నున్నాఁడు కావున వానిని
నీవు బౌద్ధుఁడవు కమ్మనఁగా వాఁడు బౌద్ధుఁ డయ్యెను. రేపు
బౌద్ధుఁడు కానివాఁడు సేనాపతియో రాజో అయి వీనిని నీవు
బౌద్ధుఁడవు కావురా. నా మతస్థుఁడ వన్నచో వాఁడు వెంటనే
కావిగుడ్డలను వదలి భిక్షాపాత్రను పరిత్యజించి యిన్నాళ్ళు

కావిగుడ్డలకు లోపల ధరించిన ఖడ్గమును బయట ధరించును.
కాలా:- మఱి నన్నేమి చేయుమందువు? రాక్ష:- అయ్యా!
నే నేమి చెప్పుదును? ప్రస్తుతము తమకున్న బాధ యెక్క
టియా? ఇటు వజ్జీయ భిక్షుకులు తమ ప్రాణముమీఁదఁ
గూర్చున్నారు. అటు నీలగిరి దుర్గమునకుఁబోయి యా సంగతి
కనుగొని రావలయును. మఱియు సుత్తుంగభుజుఁడు మీ
యాజ్ఞను నిర్వర్తించునో నిర్వర్తింపఁడో తెలియదు. భగ
వంతుని యనుగ్రహము లేనప్పు డన్నియు నిట్లు ముసరికొని
వచ్చును. క్షమింపవలయును. మీరు బౌద్ధులు మీ ముందు
నేను భగవంతుఁ డనుచున్నాను. నా కింకొక యనుమాన
మున్నది. మీ రెండవతమ్ముఁ డెక్కడున్నాఁడు? ఆయనయుఁ
దక్కువవాఁడు కాఁడుకదా! మా బంధు నెవఁడోయున్నాఁడు.
వాని పొలము మీ రెండవతమ్ముని సొంతయాస్తి నంటుకొని
యున్నది. ఆయన యతని పొలమునుఁగూడ తన పొలములో
కలిపికొన్నాఁడు. అధికారులకుఁ జెప్పుట యైనది. మీతమ్ముఁడు
గాదు. "అది మా పొలము నంటుకొనియున్నది. అది లేనిచో
మా కిబ్బందిగా నున్నది. నీకు మఱింకొకచోట నంత పొలము
నిప్పింతు"మన్నారు. ఇది జరిగి రెండేండ్లైనది. అతని కాచెక్క
తప్ప బ్రతుకుటకు వేఱ యాధారము లేదు. ఈ రెండేండ్లు
నుండి వారి కుటుంబము మన్ను తినుచున్నది. నన్ను పోయి
మీ తమ్ముఁడుగారి దర్శనము చేసి యెట్లో యొకట్లు వారు
బ్రతుకుటకు వీలు చూపింపుడని మనవిచేసి రమ్మనిరి. నేను
మీ తమ్ముఁడుగారి కొఱకై మూనాళ్ళనుండి తిరుగుచుంటిని.
వారు కనుపించలేదు. మహానగరమునందు లేరని చెప్పు

చున్నారు. నేఁటి ప్రొద్దున మీరు నాకు పిలుపువెట్టి మీ పెద్ద తమ్ముఁడుగారి మాట చెప్పఁగా - క్షమింపవలయును - నాకు వారు కూడ నిట్టివారేమో యని భయము వేసినది. ఆయనకూడ నిట్టివాఁడే. ఏ మా బంధువుల పొలము నీయన కలిపికొనెనో ఆయన కొక కూతు రున్నది. ఆమె యేమి పెద్ద సౌందర్యవతియుఁ గాదు. పైగా నిద్దఱుబిడ్డలతల్లి. ఆమెను తమవద్దకుఁ బంపినచోఁ బొలమును వ్రాసియిత్తు నన్నాఁడట. ఇప్పుడెచ్చటి కేగెనో? అన్నగారినిచూచి నేర్చికొన్న విద్యయేగాని నేనుఁ దెలిసికొన్నంతవఱకు వారి కీవ్యసనము తక్కున. వారి కున్నది మఱియొక వ్యసనము. తమకు తెలియునే యనుకొందును. ఆయన ద్యూతవ్యసని. కాలా:- అవునయ్యా! నాకుఁ దెలియును. నా తమ్ము లిద్దఱిట్టివారో నాకు తెలియును. నేను వారివలె తీవ్ర వ్యసనిని కానుగాని నే నచ్చముగా కాననుటకు వీలులేదు. ఇదివఱకే నేను వారితోఁ జెప్పించితిని. అన్నగారు నిషధయోగ్యుఁడా? వారిట్టి పనులెన్నిఁ జేసిరి? అని వారు నాకు సమాధాన మంపిరి. నేనేమి చేయుదును? రా.క్ష:- ఎవ్వరు నేమియుఁ జేయలేరు. ఎట్లు వ్రాసియున్నదో యట్లు జరుగును. ఇది కర్మసిద్ధాంతము. లోకానుసారముగా మీవద్ద నేదిమాటాడినను నాకు భయముగానే యుండును. మీ మతము ప్రకారము మన భాషలోనున్న సర్వవాక్యములు సర్వోక్తులు దుష్టోక్తులుగా భాసించుచున్నవి. వానికర్మ మనుటయుఁదప్పే. ఎట్లు వ్రాసియున్నదో యట్లు జరుగుననుటయు తప్పే. భగవంతుఁడన్నను తప్పే. వాని పూర్వజన్మ సంస్కారమట్టిది యన్నను తప్పే. వాఁడు నరకలోకమునకుఁ బోవునన్నను తప్పే.

ఈ యే మహార్థముల నంటకుండ మీ మతము 'నన్ను ముట్టు కోకు నామాలకాకి' యన్నట్లు గిరిగీసికొని కూర్చున్నది.
కాలా:— ఓయి రాక్షసుఁడా! నీవు నాతో మాటాడుటకిది మూఁడవసారి. నా మతమును నన్ను నిందించకుండ నొక్క మాట నీవు మాటాడినది లేదు. నీ వదృష్టవంతుఁడవు. ఉత్తుంగ భుజుఁ డిచ్చట లేఁడు. అతఁ డున్నచో నిన్నిప్పుడో తన ఖడ్గ ములో నరికియుండెడివాఁడు. రాక్ష:— అయ్యో! నన్ను ఖడ్గ ముతో నరకియుండెడివాఁడా? అతఁడున్నచో మీరు నా కొఱకు వార్తయే పంపెడివారు కారు. అది యెట్లు జరుగును! ఉత్తుంగభుజుఁడు నన్నెఱుఁగును. నన్నుఁ గత్తితో నరుకవచ్చెడి వాఁడు కాఁడు. నన్ను నరుకరా వానిది గుండెయా? చెఱువా? కాలాశోకుఁడు రాక్షసునివంక నివ్వెఱపోయి చూచెను. రాక్ష సుఁడిట్లనెను. "అత్తఁడు నాతో నొకసారి కత్తియుద్ధమాడెను. నేను వానిని మూఁడు చెఱువుల నీళ్ళు త్రావించితిని. ఒక్క మాటఁ జెప్పుచున్నాను. నేను రాయబారమునకు వెళ్ళి నపుడు కోసలుఁడైన సుమిత్రుఁడు నిన్నిచట వధించినచో నీవేమి చేయఁగలవని యన్నాఁడు. నే నేమిచెప్పితి ననఁగా "నోయి రాజా! నన్ను వధించుట నీ తరముకాదు. నీ నంద మంది సైనికులను నేను సంహరించి, లంఘించి తప్పించుకొనఁ గలను. నేను వాకిఁటిలో నొక రహస్య ప్రదేశమున నాయుశ్వ మునుంచి వచ్చితిని. నా గుఱ్ఱమును నే నెక్కిన తరువాత నీ యెన్నగలు నన్ను పట్టుకొనలే"వంటిని. ఆయన నాతోఁ గత్తి యుద్ధ మాడెద ననెను. ఎందుకో మానివేసెను. ఉత్తుంగ భుజుఁడు నాజోలికి రాఁడు. తేపు వాఁడు మీ యాజ్ఞకు

నిరాకరించఁగా వానిని జయించి వానిని బంధించి మీ పాద
ముల వద్దకుఁ దీసికొనివచ్చి పడవేయఁగల వారీ రాష్ట్రమున
నిద్దఱే యున్నారు. ఒకఁడు నందుఁడు. ఆయన నాల్గైదు నెలల
నుండి యీ మహానగరమునఁ గన్పించుట లేదు. రెండవాఁడను
నేను. కాలా:- ఇప్పుడుకూడ బయట గుఱ్ఱమునుంచి వచ్చి
తివా? రాక్ష:- ఇది నాయూరు. నా యిల్లిచ్చట నున్నది.
గుఱ్ఱమెక్కి యెచ్చటకుఁ బోవుదును?

## ౧3

ఆనాఁడు రేవత సహజాతికి సబ్బకామికిని వేఱే యేదో
నియమపాలన దినమగుటచేత మహాసంఘమే కలిసికొనలేదు.
మఱునాఁడు సమావేశ మయ్యెను. ఆనాఁడు కూడ పత్పూర్వ
దినమువలెనే వృథావాదము కాఁబోవుచుండఁగాఁ గాలా
శోకుఁడు భిక్షుకులను మందలించి దోషముల నొకదాని వెంట
నొకటిఁ దీసికొని చర్చ చేయవలయు ననెను. ఒక్కొక్క విష
యమునుఁ గూర్చి గంటలకొలఁది చర్చ సాగుచుండెను. ఒకఁ
డొకటి యనఁగా మఱియొకఁ డింకొకటి యనుచుండెను.
యశుఁడును తక్కిన పండితులును వానినిఁ గుఱించి చర్చింప
వలసిన పని లేదు. వినయసుత్తములో నట్లున్నది. పాచిత్తియ
ములో నట్లున్నది. ఆ సూత్రములకిది భిన్నమైన ప్రవర్తన
గనుక దోషముగా పరిగణింపవలసినదే. అని చెప్పఁగాఁ గొం

పఱు బౌద్ధులు వినయసుత్తములో నట్లున్నను, సామాన్యమైన మానవునియొక్క యూహ కలదుకదా. ద్వ్యంగుల కల్పము దోషముగా చెప్పఁబడినది. అనఁగా పగలు రెండు జాములు దాటిన తరువాత రెండంగుళముల నీడ పడువేళఁ గూడ భోజనము చేయరాదని యర్థము. రెండుజాములు దాటిన తరువాత నొక్కగడియ గడచును. ఈలోపుగా నొక్కనికి భిక్ష దొరుకదు. సరిగా రెండుజాములవేళ నెవ్వరో భిక్ష పెట్టుదురు. ఆ భిక్షుకుఁడు దానిని తనయున్నచోటికిఁ దెచ్చికొనువఱకుఁ గొంతవేళ పట్టును. అప్పటికి రెండుజాములు దాటియుండును. ఇంక నతఁడా నాఁటికి భోజనము చేయకూడదనియేకదా! అన్నము తిననిచో మానవులు బ్రదుకరు. బ్రతికినఁగాని ధర్మము చేయలేరు. అందుకనియేఁ 'శరీర మాద్యంఖలు ధర్మసాధన'మని వైదికులు చెప్పుదురనెను. ఈ మాట యన్నవానిని బౌద్ధభిక్షుకులందఱు దూయఁబట్టిరి. అదుగో అదుగో! నీవు బౌద్ధుఁడవు కావు. నీవు బ్రాహ్మణుల మాట మాటాడుచున్నావు. నిన్ను బౌద్ధులలో నుండి వెడల నడువవలయునని చెప్పిరి. అతని పక్షీయులు కొందఱు బౌద్ధమతమునందలి సర్వశబ్దములు వైదికులు వాడెడు శబ్దములే. అన్నియు సంస్కృత శబ్దములే. పాళీశబ్దములన్నియు సంస్కృతము నుండి పుట్టినవే. సూక్తమన్న శబ్దమునుండియే సుత్తము పుట్టినది. ధర్మమన్న శబ్దమునుండి దమ్మము పుట్టినది. వినయము సంస్కృతశబ్దమే. శరీరమాద్యంఖలు ధర్మసాధనం అన్నమాటలోఁ దప్పులేదు. బ్రతికియుండినఁగదా బౌద్ధధర్మమును పాలింపవలయును. అతఁడన్నమాటలో తప్పులేదనెను. అందఱును నిజమే నిజమే

యనిరి. ఈ రీతిగా మాటిమాటికి నేదో యొక యడ్డంకి మాట
వచ్చుటయు, దానినిఁ గుఱించి తర్జన భర్జనములు జరుగుటయు,
వేళ వృథాయగుటయు, విషయము తేలకపోవుటయు, నిట్లే
జరుగ నారంభించెను. ఏ దోషముయొక్క చర్చ పూర్తి
యగునో యా దోషమునుఁ గూర్చి కాలాశోకుని యభి
ప్రాయమును చెప్పుమని యడిగిరి. ఆయన యన్నియునైన
తరువాత యొక్కసారియే చెప్పుదు ననెను. ఎప్పటికప్పుడే
చెప్పవలయునని కొందఱనిరి. దీనినిఁ గూర్చి కొంతసేపు చర్చ
సాగెను. వజ్జీయులందఱు తమకనుకూలముగాఁ జెప్పునుగదా
యని చివరకు చెప్పుటకే యంగీకరించిరి. యశుఁడును వాని
పక్షీయులును కొంతసేపు వాదించి చివరకు వారు నంగీకరిం
చిరి. రెండు దినములు మహాసంఘమునందు చర్చలు సాగెను.
కాలాశోకుఁడు తన యభిప్రాయము మఱునాఁటి ప్రొద్దున
చెప్పును ననెను. మఱునాఁటి ప్రొద్దున పండితులైన యజి
తాదులు పదిమందియు మఱి పదిమంది వజ్జీయులును కాలా
శోకుని మేడలోనికి పోవునట్లును, అచ్చట కాలాశోకుఁడు తన
యభిప్రాయమునుఁ జెప్పునట్లును, నిశ్చయింపఁబడినది. ఇంటికి
వచ్చిన తరువాతఁ గాలాశోకుఁడు రాక్షసుని మాటలను మన
సులో విచారించికొని తన యభిప్రాయమును చెప్పుటకు
బౌద్ధులను తన యింటికే రమ్మనుటనుఁ గూర్చి పశ్చాత్తాప
పడెను. తాను వజ్జీయుల కనుకూలముగాఁ జెప్పినచో రేవత
సహజాతి మొదలైనవారు తనమీఁద నుత్క్షేపనీయకర్మ
ప్రయోగింతురు. తాను వజ్జీయులకు వ్యతిరేకముగాఁ జెప్ప
వలయును. అప్పుడు వజ్జీయులు తన్ను వధింపవచ్చును. కాని

రేవతాదులు పదిమందియు నుందురుగదా! వజ్జీయులట్టి సాహసమునుఁ జేయలేరు. అందఱును వెళ్ళిన తరువాత వజ్జీయులలో నొక్కఁడు మిగిలి తనతో మాటాడుచున్నట్లు నటించి వధించునేమో! పదిమంది సైనికులను తన తనవద్ద నుంచి కొనినచో వజ్జీయులట్లు చేయలేరు.

రాత్రి ప్రొద్దుపోయినది. యుద్ధభూమినుండి యొక వార్తాహరుఁడు వచ్చెను. వానికిఁ గాలాశోకుఁడు దర్శనమిచ్చెను. ఉత్తుంగభుజుఁడు కాలాశోకుని మాట కెదిరించి మిథిలానగరమునకు తన సైన్యములనుఁ దరలించుకొనిపోయెను. నేఁడో రేపో యచట యుద్ధము జరుగును. రాజుమాట కెదురు తిరుగుదువా యనఁగా నుత్తుంగభుజుఁడు రాజు కాలాశోకుఁడు కాఁడు. మహానంది యనెనట. ఈ వార్తను వచ్చి కాలాశోకునకుఁ జెప్పెను. కాలాశోకుఁ డనుకొనుచున్నదే. అట్లే జరిగెను. తనమాట నుత్తుంగభుజుఁడు పాటించునని తాననుకొనుటయే తప్పు. కాలాశోకుఁడు చిన్నవాఁడనియు నతనికి రాజనీతి తెలియదనియు నే నిశ్చయమును తనంతట తాను జేయలేఁడనియు సర్వనిశ్చయము లుత్తుంగభుజుఁడే చేయవలయుననియు పేరునకు రాజు కాలాశోకుఁడుగాని వాని నడిపించునది తానే యనియు నుత్తుంగభుజుని యభిప్రాయము. కాలాశోకునకు వందనిష్కములు కావలసినచో సంపాదించి పెట్టఁగలవాఁడు తాను. ఒక్క యోజనము మేర పోవలసినచో నడిపించి పెట్టునది తాను. తొట్టతొలుతఁ గాలాశోకునకు యువరాజ పట్టాభిషేకముకూడ కాలేదు. అతఁడు వట్టి రాజకుమారుఁడు. అతని మాట పాటింపవలసిన యవసరములేదు

ఇది యుత్తుంగభుజుని యభిప్రాయమని కాలాశోకునకుఁ దెలి యును. నీవు యుద్ధమాపుమని తాను గాలాశోకున కెందుకు వ్రాసి పంపించెను. రాక్షసుఁడు పంపించుమన్నాఁడు గనుకఁ బంపించెను. ఇప్పు డుత్తుంగభుజుఁడు కోసల సైన్యమునోడించి యయోధ్యమీఁదికి పోయి యయోధ్యనుకూడ జయించి తిరిగి వచ్చినచో గెలుపు తనదిగాని యుత్తుంగభుజునిది కాదుగదా ! మగధ విదేహ భల్లాట కోసలదేశముల కన్నింటికి తానే రా జగునుకదా. వాఁడు గెలిచిన తరువాత వాఁడు తిరిగి వచ్చిన తరువాత నెమ్మదిగా వానినిఁ దొలఁగించి తాను రాజ్యాధి కారమును వహించి పట్టాభిషేకముఁ జేసికొని మఱియొకని సేనాధిపతిగా నియమించి దేశమును పాలించును. ఒకవేళ నుత్తుంగభుజుఁడు యుద్ధములో నోడిపోయినచో వానిని శిక్షిం చుట మిక్కిలి సులభము. మఱి యుత్తుంగభుజుఁడు యుద్ధ ములో నోడినచో కోసలరాజు మగధముల మీఁదికి దండెత్తి నచో నప్పుడేమి కావలయును ? ఇదియిట్లు జరుగునని చెప్పు టకు వీలులేకున్నది. ఇట్టి క్లిష్టసమస్యలు రాక్షసునివంటివాఁడు దేల్చవలయునుగాని సామాన్యుఁడు తేల్చలేఁడు. ఇప్పుడు ప్రొద్దుపోయినది. రేపు ప్రొద్దున రాక్షసునిఁ బిలిచి యతనితో నిది చెప్పవలయును. మఱియును బౌద్ధభిక్షుకుల వ్యవహారము రెండు దినములు దాటిన తరువాతఁ జూతునని చెప్పవల యును. నగరములోఁ బడి తినుచుందురు. తిననిమ్ము. ఒక ఒకవేళ వజ్జీయులకుఁ దనమీఁద కోపము వచ్చినచో నా వచ్చెడు కోపమును మఱి రెండుదినములు గడచిన తరువాత రానిమ్ము. అదియు మంచిదే కదా. రేపు ప్రొద్దున రాక్షసు

నితో మాటాడవలయును. ఉత్తుంగభుజుని శిక్షించుటయో? శిక్షింపక పోవుటయో? విచారింపవలయును. నీలగిరిదుర్గ విషయములు విచారింపవలయును. ఇవి కాకుండ బౌద్ధభిక్షుకుల వ్యవహారమునుఁగూర్చి యాలోచింప వలసిన తొందర యేమున్నది? ఒక కొమ్ములో నింతలవణమును వేసికొని యొక భిక్షుకుఁడు తనవద్ద నిలువయుంచుకొనినచో రాజ్యములు మాఱిపోవుచున్నవా? సూర్యుఁడు గతి తప్పి చరించుచున్నాఁడా? అని కాలాశోకుఁ డూహించుచు మఱలఁ బండుకొనెను. అప్పటికి రాత్రి రెండుజాములు దాటినది. కాలాశోకునకు కడచిన రెండు రాత్రులు నిదురపట్టలేదు గాని యీ రాత్రి నిదుర పట్టెడునట్లే యున్నది. నిదుర పట్టుటయు పట్టక పోవుటయు మన యాలోచనమీఁద నాధారపడి యున్నది. మన యాలోచన పరిస్థితులకు మనము చేసెడి వ్యాఖ్యానము ననుసరించి మన మనస్సునకు శాంతి సమకూర్చును. లేనిచో నశాంతి సమకూర్చును. కాలాశోకుఁ డాలోచింపఁగా నున్న పరిస్థితులు తన తలకు మించినట్లు కనిపించలేదు. తాను తొందర పడవలసిన యవసరమును కనిపింపలేదు. మఱియు నూహింపఁగా తన మనస్సులోఁ గలిగిన యీ యాందోళన యంతయు రాక్షసుఁడు తన మాటలతో నుద్రేక పఱచె నది గాని సహజముగా నిందేదియు లేదు. ఉత్తుంగభుజుఁడు నిజము గానే మహావీరుఁడు. అతనిపేరు విన్నచో క్షత్రియులు గడ గడలాడి పోవుదురు. అతనిముందు కోసలపతి యెంత? మఱి నీలగిరి దుర్గము పెద్ద ప్రశ్న యేమి? ఉత్తుంగభుజుఁడు వచ్చిన మఱునాఁడు దుర్గమును దుర్గమును నేలమట్టము చేయవచ్చును.

ఇంతటి బౌద్ధరాజ్యములో బ్రాహ్మణుల కొక దుర్గముమీఁద
నాధిపత్యమేమి? కాలాశోకుఁ డిట్లూహించి నిదురపోవుద మను
కొనెను. నిదుర పట్టఁబోవుచున్నది. అప్పుడొక పెద్ద సవ్వడి
వినిపించెను. మేల్కనెను. ఆ సవ్వడి తన నిద్రాభవనమునకు
ముందున్న యొక కంచుపాత్రను మ్రోగించుట. రాజును నిద్ర
మేల్కొలుపరాదు. మేల్కొలుప వలసిన యవసరము వచ్చి
నచో నా కంచుపాత్రను మ్రోగింతురు. వేఱేగంటను మ్రోగిం
చినచో నది యవినయ మగును. కంచుపాత్రను మ్రోగిం
చినచో నేదో వస్తువు నటు నిటు తరలించుటలోఁ గలిగిన
ధ్వనిగాఁ గనిపించును. అది యవినయము కాదు. రాజు
నమర్యాద చేసినట్లు కాదు. రాజుకూడ మేల్కనును. ఇది
యొక యాచారము. ఆ కంచుపాత్ర మ్రోగించినవాఁడు
తానచట నుండఁడు. రాజు మేల్కని తన సేవకుని పిలిచి
యేమైన విపరీతమైన వర్తమానము వచ్చినదా యని యడు
గును. అతఁడు "మహారాజులకు మెలకువ వచ్చెనా?
క్షమింపవలయును. అది యేదో తీయఁబోఁగా నక్కడ
కాంస్యపాత్ర మ్రోగినది కాబోలును. ఈ సేవకుని యజా
గ్రత్తను మన్నించవలయును. ఒక యవసరమైన వార్త వచ్చిన
మాట నిజమే" యని వాఁడు దానిని మనవిచేయును. అప్పుడు
రాజుగారిని నిద్ర మేల్కొల్పినట్లు కాదు. రాజునం దగౌర
వము నెఱపినట్లు కాదు. ఇట్టి యాచారములమీఁద రాజులు
తాము మహారాజులమన్న యభిప్రాయమును గర్వమును
పాలించుకొనుచుందురు. కాలాశోకునకు సేవకుఁడు తానీ
సమాచారమును నడపి "అయ్యా! యొక వార్తాహరుఁడు

ఆ యంగీయు ఖడ్గమును తలపాగయు నెత్తురుతో మునిఁగియుం
డెను. అన్నివస్తువులను రక్తసిక్తములైయే యుండెను. నెత్తురు
మాత్రము చాల భాగము గడ్డకట్టియుండెను. అవియన్నియు
విధుసారుని వస్తువులని కాలాశోకుఁడు చూచుటతోడనే గుర్తిం
చెను. అతని నోటివెంట మాట రాలేదు. నాల్గు దినములక్రింద
రిపుంజయుని వార్త వచ్చినపుడు తన హృదయము పొందిన
యావేగము నేఁడు పొందుటలేదు. ఎందుచేతనని విచా
రించఁగా వీఁడు కూడ నిట్లగునని తన మనసున కిదివఱకే
తోఁచెను. తన మనసునకుఁ దోఁచిన దనుటకంటె రాక్షసుఁడు
తన కీభావమును కల్గించి తానంతటి యావేగమును పొంద
కుండఁ జేసెనని చెప్పవచ్చును. కాలాశోకున కొక యూహ
వచ్చెను. రిపుంజయుఁడును విధుసారుఁడును చనిపోఁగా
వార్తాహరు లీవార్తలనుఁ గొనిపోయి మహారాజునకుఁ జెప్ప
వలయును. తనవద్దకు వచ్చి చెప్పుదురేమి? తానే మహా
రాజువలె నటించుచున్నాఁడు. తనకు యువరాజ పట్టాభి
షేకముకూడ కాకపోయిననుఁ దన తండ్రి రాజ్యమును
పరిత్యజింపక పోయినను తానే సర్వథా రాజువలె నటించు
చున్నాఁడు. ఏ రాజకార్యమును తన తండ్రి దాఁకఁబోవు
టయే లేదు. అందుచేత తనవద్దఁ దెచ్చుచున్నారా? లేదా
తన తమ్ముని యీస్థితి ముందు తనకుఁ దెలియవలయునా?
రిపుంజయుఁడు చనిపోయినాఁడన్న వార్త తానెవ్వరికిని తెలియ
నీయలేదు. తండ్రితోఁ జెప్పలేదు. తల్లితోఁ జెప్పలేదు.
తన ముత్తవతల్లితోఁ జెప్పలేదు. ఆ వార్త రాజవంశములో
తెలియనే తెలియదు. ఇదికూడ నట్లు నిగూఢముగా నుంచ

వలసిన వార్తయూ యేమి? వీరి యిద్దఱి మరణములును తన
మరణమునకు సూచనలా యేమి? అట్లు కావు. మొదట విధు
నాథుఁడు మరణించి తరువాత రిపుంజయుఁడు చనిపోయినచో
మూఁడవవాఁడు దాను కావచ్చును. ఇప్పుడు వరుస చెడిపో
యినది. కాలాశోకుఁడు వానివంకఁ జూచి "ఇవి యేమిరా?
ఈ ఖడ్గ మెవనిది? ఈ దుస్తు లెవరివి? ఇందులోనున్న
జుట్టెవరిది? స్త్రీభూషణము లిందెందు కున్నవి? ఇంత యర్ధ
రాత్రమున నీ వెందుకు వచ్చితివి?" అని యడుగఁగా
వాఁడిట్లు చెప్పెను. అయ్యా! నేను తమ సోదరుఁడైన విధు
నాథుని బంటును. వారు సోనపల్లికి వెళ్ళుచు నన్ను తోడు
తీసికొనిపోయిరి. కడచినరాత్రి నేను బయటనుంటిని. విధు
నాథుఁడు లోనికిఁ బోయెను. తెల్లవారువేళ నేకరక్తసిక్తాంగుఁడు
నాచేతి కీమూటయిచ్చిపోయి కాలాశోకునకు వీనిని చూపించు
మని చెప్పెను. నా కర్థముకాలేదు. మా రాజకుమారుఁ
డెక్కడ నున్నాఁడని యడిగితిని. అతఁడా మూటలో నున్నాఁ
డని చెప్పెను. నా కంతయు నర్థమయ్యెను. నేనేమి చేయ
వలయును? ఏమి మాటాడిన నేమి మునుఁగునోయని యీ పవ
లెల్ల ప్రయాణముచేసి యింత ప్రొద్దుపోయి మహానగరముఁజేరి
సూటిగా నిచ్చటికే వచ్చితిని. ఇవిగో తమరి సన్నిధానమునం
దుంచితిని" అనఁగాఁ గాలాశోకుఁడు ఆ పురుషుఁ డెవ్వఁడో
వాని పేరేమిరో కనుఁగొనకుండ నేల వచ్చితివి?" అనెను.
వార్తా:-ఆపురుషుని నే నెఱుఁగుదును. అందుచేత నేనతని నడుగ
లేదు. కాలా:- ఎవరతఁడు? వార్తా:- ఆయన పేరు దేవ
భయంకరుఁడు. అతఁడు కౌరవవంశ రాజకుమారుఁడు. వారిది

హాస్తినాపురమువద్ద నొక నగరము. అతఁడు పెద్ద జూద గాఁడు. సోనాపురము జూదమునకుఁ బ్రసిద్ధమైన మహానగర మని తమకుఁ దెలియునుగదా! ఆర్యావర్తమునందలి సర్వ దేశములవారు జూదమాడుటకు సోనాపురము వత్తురు. మహా ధనవంతులందఱును సోనాపురమునకే వత్తురు. ఏనుఁగుల మీఁద వత్తురు. గుఱ్ఱాలనుఁ దీసికొని వత్తురు. మహానర్ఘ మణులతో వత్తురు. సోనాపురమునందలి ద్యూతభవనము జగత్ప్రసిద్ధమైనదే కదా! అచ్చటికి మన విధుసారుఁడుగారు పోవుచుండుటయు తమకు విశదమైన విషయమే. అతనిపేరు దేవభయంకరుఁడు. కాలా:- అతనికి నితనికి మిక్కిలి చెలిమి కదరా? అతఁడు తీసికొనివచ్చి యివి నీచేతికిచ్చుటయేమి? ఎవఁడో వీనినిఁ జంపినచో పగతీర్చవలసినవాఁడు దేవభయంక రుఁడు. అట్లుండఁగా నతఁడే తీసికొనివచ్చి దీనిని నీకిచ్చుట యేమి? వార్తా - అయ్యా! దేవభయంకరుఁడును మన రాజ కుమారుఁడును పూర్వము స్నేహితులు. కొన్ని నెలలనుండి యా స్నేహము చెడిపోయినది. కాలా:- ఎందుచేత? వార్తా:- ఎందుచేతననఁగా నాలునెలలక్రింద కౌరవరాజ్యము క్షత్రి యుల చేతిలోనుండి పోయినది. ఆ రాజకుమారుఁడు లంబినీ వసమునందు నెవరితోడనో గదాయుద్ధముచేసి చనిపోయెనట. వృద్ధుఁడైన యతని తండ్రిపోయి భృగుపాతమును చేసెను. నాఁటినుండి కౌశాంబీరాజ్యము మఱియెవరి చేతిలోననో పడి నది. ఆ రాజుపేరు శత్రుహంత. ఆయన క్షత్రియుఁడు కాఁడని చెప్పుచుందురు. ఆ రాజ్యములో క్షత్రియుల గొదుకు బయట పడినది. ఈ దేవభయంకరుఁడు తన కుటుంబముతో మన

రాజ్యమునకు వచ్చి చేసెను. అతనికి తెలిసి పూర్వులిచ్చిన యాస్తి యెంతయో యున్నది. అతనివద్ద పది పెట్టెలనిండ రత్నములున్నవని చెప్పుదురు. తత్పూర్వ మాయన సంవత్సరమునకొకసారియో రెండుసార్లో సోనాపురము వచ్చి నెలయో రెండు నెలలో యుండి జూదమాడి కొంతవ్యయముచేసి మరలి పోవుచుండెను. కౌశాంబిలో రాజుమారిన తరువాత హాస్తినలోని వ్యవహారములు తలక్రిందులైన తరువాత క్రమముగా నీ క్షత్రియ వినాశనక్రియ పల్లెటూళ్ళకుఁ గూడఁ బ్రాకినను యీ దేవభయంకరుఁడు తన యాస్తి నమ్మి దానిఁ గూడ సొమ్ము చేసికొని సకుటుంబముగా సోనాపురము వచ్చెను. అతనితల్లి దిక్కులేని పెదతల్లి. అతఁడు అతని భార్య; అవివాహితులైన యిద్దఱు చెల్లెండ్రు, పన్నెండేండ్ల వయస్సుగల తమ్ముఁ డొకఁడు, యిద్దఱు పరిచారికలు, వీరందఱు రెండు నెలలు ప్రయాణముచేసి సోనాపురము చేరిరి. అచట నొక తోఁటయు దొడ్డియుఁగల పెద్ద భవనమును, రెండు లక్షల నాణెములకుఁ గొనెను. నాణెముల బదులు రెండు వజ్రములను తద్భూస్వామి కిచ్చెను. సోనాపురమునను కనేకులైన ధనవంతులును రాజకుమారులును వచ్చుచుందురు. పత్తురు. విడుదులలో నుందురు. ఆడినన్నాళ్ళు జూద మాడుదురు. ఎవఁడే దేశమువాఁడో యెంత ధనము కలవాఁడో యెవ్వరికిని తెలియదు. ఇట్లు వచ్చిన దేవభయంకరుని వర్తమానము సర్వమును సోనాపురములోఁ బెరసి పోయెను. అదివఱకతఁడొక క్షత్రియవంశ సంజాతుఁడనియు, ధనముకలవాఁడనియు, మన విధుసారునకు స్థూలముగాఁ

తెలియునుగాని సవిమర్శముగాఁ దెలియదు. దేవభయంకరుఁడు సోనాపురము వచ్చినప్పటినుండియు విధుసారుని సతఁడు తన యింటికి నతిథిగా నాల్గైదుసార్లు తీసికొనివెళ్ళెను. దేవభయం కరున కవివాహితలైన చెల్లెండ్రిద్దఱు కలరు. విధుసారుఁడు వివాహితుఁడు. దేవభయంకరుఁడు చాల సత్యపురుషుఁడు. విశ్వాసి. విధుసారునియందు మిక్కిలి మైత్రికలవాఁడు. మహారాజ కుమారుఁడన్న గౌరవము కలవాఁడు. విధుసారుని యందు మఱొక విధమైన మార్దవము దేవభయంకరునకుఁ గలదు. వారిద్దఱుకలిసి పాచిక లాడినపుడు సర్వథా విధు సారుఁడే యోడిపోవు చుండెడివాఁడు. అయ్యో విధుసారుని ధనము మనము చాల తింటిమని యతని కీయనయందు నొక విధమైన పక్షపాతము. విధుసారునిచేతిలో డబ్బు లేనప్పుడు దేవభయంకరుఁడే యిచ్చి యాడించుచుండెడివాఁడు. విధు సారునికి తన యూ స్త్రిమిూఁదనుండి వచ్చెడి ధనము చాలక మహారాణిగారివద్ద నాయన ధనము తీసికొని పోవుచుండెడి వాఁడు. ఆయన కడగొట్టుబిడ్డ కనుక మహారాణి యతని యందు మిక్కిలి ప్రేమగా నుండును. దేవభయంకరుఁడిచ్చిన ధనమును విధుసారుఁ డెప్పుడో తిరిగి యిచ్చుచుండెడివాఁడు. జూదమాడుచున్నను వాని కితఁడును, ఇతనికి వాఁడును నోడు చున్నారు. వారిద్దఱిమధ్య ధనము ప్రధానముకాక మైత్రియే ప్రధానముగా నడచుచుండెను. ఇంత స్నేహముగా దేవ భయంకరుఁడున్నను విధుసారుఁడు వాని నొక్క పర్యాయమైనఁ దన యింటికిఁ బిలువలేదు. అతఁడు సామాన్య క్షత్రియుఁడు.

తాను మహారాజకుమారుఁడనన్న భావము విధురాయన కున్నది. ఉన్నదని దేవభయంకరునకుఁ దెలియును. తెలిసియు నతఁడు దీనిని మన్నించెను. ఒక్కొక్కని మన స్వొక్క విధముగా నుండును. కౌశాంబిలోనున్న క్షత్రియులందఱు తాము పాండవుల సంతతియని యనుకొందురు. హస్తినాపుర సమీపమునందున్న క్షత్రియులు తాము దుర్యోధనుని సంతతి యనుకొందురు. ఆ పరంపర యట్లు వచ్చుచున్నది. కౌశాంబీ క్షత్రియులకు మగధరాజ వంశముమీఁద నభిమాన మెప్పుడును లేదు. హస్తిపురప్రాంత క్షత్రియులకు మగధ రాజులమీఁద నభిమానము. దానికిఁ గారణము తొలినాఁటి జరాసంధుఁడు దుర్యోధనుని పక్షమువాఁడు. భీమునకు విరోధి. ఇప్పటి క్షత్రియవంశము బార్హద్రథవంశముకాదు. నాల్గైదు వందల యేండ్లక్రింద బార్హద్రథవంశముపోయి ప్రద్యోత వంశము వచ్చినది. మూఁడువందల యిరువదియేండ్ల క్రింద ప్రద్యోతవంశము పోయినది. శిశునాగవంశము వచ్చినది. వారు ప్రద్యోతులైనను, వీరు శిశునాగులైనను, హస్తిపుర ప్రాంత కౌరవవంశ క్షత్రియులకు వీరు బార్హద్రథులక్రిందనే లెక్క. ఈ గౌరవము దేవభయంకరునకు మిక్కిలిగానున్నది. అందుచేత విధురాయని పోకిళ్ళన్నియు నతఁడు మన్నించును. ఔనతఁడు మహారాజ కుమారుఁడు. అతని యింటికి మనము వెళ్ళినచో నచట మనలను తమతో సరిసమానముగాఁ జూచుట సంభవించదు. స్నేహితుల నగౌరవపఱచుట యెందులకని విధురాయఁడు తన్ను పిలుచుటలేదని తానే

యొకటి రెండుసార్లు నాతో ననినాఁడు. పూనాపురములో విధుసాహుని కనేకఋణములు లున్నవి. మహారాజకుమారుఁడని యుంగవలు నూరకుందురు. ఎప్పుడో మన డబ్బు మనకు రాదా యనుకొందురు. విధుసాహుఁడు ద్యూతభవనమునకే చాల ధనమీయవలయును. ద్యూతభవనాధికారులు సంవత్సరమునకు పది లక్షల హూను నిష్కములను రాజ్యమునకుఁ జెల్లింపవలయును. మహారాజుగారితో మనవిచేసి విధుసాహుఁ డీవలసిన ధనమును సుంకముక్రింద సరిపెట్టుకొనవలయునని మనవిచేసినను చేయవచ్చునని యతనధికారు లూరకున్నారు. తక్కిన ద్యూతకారులు మఱియొకవిధముగా నూరకుందురు. అప్పు పెట్టినను విధుసాహుఁడు మఱల నచటికి వెళ్ళినపుడు కొంత ధనమును తీసికొనిపోయి వారి ఋణములను చెల్లించుచుండును. విధుసాహుఁడు గెలిచిన డెప్పమును తీను. ఇట్లుండఁగా నీ నాల్గు నెలలనుండి చాలసార్లు విధుసాహుఁడు దేవభయంకరుని యింటి కతిథిగా నుండుచు వచ్చెను. దేవభయంకరుని యింటిలో నంతఃపుర మర్యాద లెక్కువగా లేవు. వారిస్త్రీ లసూర్యంపశ్యలుకారు. అని వీథుల వెంట తిరుగరు. కాని యొక గొప్ప యతిథి మర్యాద కుటుంబములోనివాఁడు తన యింటికి వచ్చినచో నన్నపానములవేళ స్త్రీ లతనికిఁ గనిపింతురు. వారే వడ్డింతురు. ఇతని కేదైన కావలసినచో నప్పుడప్పుడు దేవభయంకరుని చెల్లెండ్రు తెచ్చి యిచ్చుటయుఁ గలదు. దేవభయంకరుని యింటిలో పది పెట్టెలనిండ రత్నములు గలవన్న ప్రతీతి గలదు. భూగృహము త్రవ్వి దానిలో నతఁడా రత్నములను దాచి యుంచునని కావలసినప్పుడు తీసికొనుననియు

చెప్పెదను. దేవభయంకరుఁడు వచ్చినప్పుడు కొందఱు సేవకులనుఁ దనవెంటఁ దెచ్చెను. వారిలో నిద్దఱు పురుషులు. వారిద్దఱు నిత్యమును వ్యాయామము చేయుచుందురు. ఇంతింత ఱొమ్ము, లింతింత భుజములు కోఱమీసములు, తాళ ప్రమాణ దేహములు, కత్తిసాముసందు కఱ్ఱసామునందునిపుణులు. వారాయింటికి రక్ష. వారుండఁగా నాయిల్లు చోరగ్రస్తము కాదు వందమంది దోపిడీకాండ్రో వందమంది రాజసైనికులో వారియింటిమీఁద పడి మున్ను వారిని సంహరించి తరు వాత నిల్లు దోచికొనవలయును. ఆయిల్లు దేవభయంక రుఁడు కొన్న తరువాత నెలదినములలో చుట్టునున్న ప్రాకా రము దృఢపఱచెను. ప్రాకారమును రెండు నిలువుల యెత్తు పెంచెను. గోడపైన శూలముల నాటించెను. పెద్ద కవాట మును నిర్మించెను. దానినొక కోటవలెఁ జేసెను. అట్లు తన భవనమును కోటవలెఁ జేయుటకు నధికారుల యనుమతి కావ లయును. ఆ యనుమతిని విధుసారుఁడు తెప్పించెను. దానితో నిద్దఱియొక్క స్నేహానుబంధము మిక్కిలి బలిసెను. దేవ భయంకరుని భార్యగాని చెల్లెండ్రుకాని విధుసారుని వద్దకు పరమాప్తుఁడైన బంధువువద్దకు వచ్చినట్లు వత్తురు. నేనే వారి యింటిలో నొక బంధువనైతిని. ఆ కుటుంబమెంత మంచి వారనఁగా నేను సేవకుఁడను. నన్ను సేవకునివలెఁ జూడరు. నేను కూడ వారికొక బంధువను. కాలారి యీపూట భోజ నము చేసెనా ? యింటిలో చేసిన యీ వస్తువతనికి వడ్డించి తిరా? అతఁడు నిద్రపోవుచున్నాఁడు. పాపము లేపుట యెందు లకు ? విధుసారునికిఁ గావలసిన యీవస్తువు నీవే తీసికొని

యిచ్చి రమ్ము. మొదలుగాఁ బరామర్శింతును. నాకేదైన కొంచెము సుస్తీగా నున్నచో మందులుఁ బ్రమాఁకులు వారే చూతురు. ఇట్లు విధుసారునకు దేవభయంకరుని గృహము స్వగృహముగా నుండెను. ఒకనాఁడు విధుసారుఁడు తాను పండుకొని నిదురించు గదినుండి దేవభయంకరుని పెద్ద చెల్లెలు, శకుంతలాదేవి మొగమును గంటు పెట్టుకొని చాల కోపముతో వెలికి వచ్చెను. నేను చూచితిని. నాకర్థము గాలేదు. ఆమెను నేనేమని యడుగుదును? మఱునాఁడు సాయంకాలమున వాహ్యాళికిఁ బోయినప్పుడు విధుసారు నడిగితిని విధుసారుఁడు నాతో నన్నమాటలు నాకే విడ్డూరముఁ గొలిపినవి. "ఆమెను నేను ప్రేమించుచున్నాను. నన్ను వివాహము చేసికొమ్మని యడిగినాను. ఆమె నీకిదివఱకే వివాహమైనదిగదా యన్నది. నేను రాజులు బహు భార్యాకులుగదా యన్నాను. ఆమె నీకును నాకును వరుసకాదు. నీవును నన్నయు నన్నదమ్ములుకదా! నేను నీకు చెల్లెల నగుదు నన్నది. నేను ఇది వట్టి వరుస. నేను నిన్ను ప్రేమించుచున్నాను. మీరు దూరదేశము వచ్చినారు. నీకు వివాహమగుటయుఁ గష్టమే. నన్నుఁ బెండ్లిచేసికొన్నచో మీ యన్నగారికి కొంత బరువుతీరును. అంటిని. ఆమె నవ్వి పిచ్చిమాటలు మాటాడకు మనెను. నేనామెను బలవంతముగాఁ బట్టుకొంటిని. ఆమె విదలించికొని వెడలిపోయెను." నేనీమాటలు విని యయ్యో! ఇది మిత్రద్రోహము. ఇది చాల తప్పు. ఆమె పోయి దేవభయంకరునితోఁ జెప్పినచో నింక నేమైన నున్నదా? ఆయన మీ యందెంత గౌరవము నెఱపుచున్నాఁడు? మీ కెంతధనము నిచ్చుచున్నాఁడు? అట్టి

వానియందు కృతఘ్నత నెఱపుట తగ దంటిని. ఆయన నీకేమి
తెలియును పోరా యనెను. స్త్రీలు మొట్టమొదట నిరాకరిం
తురు. ఆమె తన యన్నగారితో చెప్పనే చెప్పదు. చెప్పి
నచో నతఁడు నన్నేమిచేయఁ గలఁడు? ఇతని యిల్లు నేను
లేనిచోఁ గోటఁగాఁ గట్టుకలవాఁడేనా? నేను సాహాయ్యము
చేసితిని గనుక కట్టినాఁడు. లేనిచోఁ గట్టఁగలఁడా? ఇది యెట్లు
కట్టించితినో అట్లు నిర్మూలనమును చేయఁగలను. నా కన్న
వీరు మంచి సంబంధమును తెత్తురా? ఆమె పోయి యన్న
గారితోఁ జెప్పినచో నతఁడేమనును? 'అంతవాఁ డడుగఁగా
నిరాకరించివా? నీకు వివాహ మెట్లగును? మగధరాజవంశ
మునకుఁ గోడలవగుటకన్న గొప్పయున్నదా?' అనును
నేనేమనఁగలను? ఊరకుంటిని. ఆ మఱునాఁడే వారిని రమ్మని
తమరు వార్త నంపిరి. మేము వచ్చివేసితిమి. మఱల పదునేను
దినములకు పోయితిమి. ఒకనాఁడు రాత్రిపూట నీయన శకుం
తలాదేవి పరున్న గదిలోనికి గవాక్షముగుండఁ జొచ్చుకొని
పోయెనట. ఆమె లేచి యల్లరిచేసెను. తల్లియు పెదతల్లియు
దేవభయంకరుఁడును నతని భార్యయు వచ్చి చూచిరి. ఇతని
నేమియు ననలేదు. నీవు మాయింటి కింక రావద్దనిరి. నీ కతిథి
మర్యాద తెలియ దనిరి. మేము స్వదేశమును వదలివచ్చి
నంతమాత్రమునఁ గులమునకు తక్కువ కాలేదు. నీకధికముగా
మర్యాద చూపించుటచేత మా మర్యాద మేము పోగొట్టు
కొనలే దనిరి. మఱియొకఁ డెవ్వఁడైన నైనచో తలవాంచికొని
తిరిగి వచ్చును. ఈయన దేవభయంకరునితో నప్పుడన్న
మాటలు ప్రక్కన వినుచు నిలుచున్న నాకే కష్ట మనిపించెను.

అప్పుడేమి చేయఁగలడు ? ఇతఁడన్న మాటలకుఁగూడ వారు సహించిరి. దేవభయంకరుఁ డప్పుడూ యున్న చాలును. వాని యిద్దతి మల్లురు విధుసారుని విఱిచి గ్రోవులు పెట్టి యుందురు. వారిని చూచి విధుసారుఁ డూరకుండెను. కాని లేనిచో నితఁడు కత్తిదూసి దేవభయంకరుని మీఁదికిఁ బోయెడు వారే. మహారాజా! నిజము చెప్పుచున్నాను. ఆనాఁటినుండి నాకు విధుసారునిమీఁద భక్తి పోయినది. ఆయనయందు మర్యాద తగ్గినది. నేను బంటును కనుక నెలజీతము పుచ్చుకొనుచున్నాను గనుక నాకు పెండ్లాము బిడ్డలున్నారు గనుక నే నాయన వెంట బంటువలె పోవుచున్నాను. మఱల నే మొగము పెట్టుకొని పోయెనో వారి యింటికే పోయెను. వారును మ్లేచ్ఛుల కన్నము పెట్టినట్లు విధుసారుని భోజనాదులు విధుసారునిగదికే పంపించుచుండిరి. సేవకులు తెచ్చి యిచ్చుచుండిరి. మొన్నటిరాత్రి యీయూరిలో కంసవధ నాటక మాడఁబడెను. ఊరఁగందఱును వచ్చిరి. ఈయన శకుంతల కోసము కాఁపువేసెను. ఆమె తన తల్లితో వదినగారితోఁ జెల్లెలితో నాటకమునకుఁ బోవుచుండఁగా నా మెను ప్రక్కకు రమ్మని పిలిచెనట. ఇంతలో వెనుకనుండి దేవభయంకరుఁడు వచ్చుచుండెను. ఆయన యీయనను నిందించెను. ఈయన కత్తి యుద్ధమునకుఁ దలపడెను. దేవభయంకరుఁడు మన యుద్ధ మిచ్చట కాదు. ద్యూతభవనములందు చేయుదము రమ్మనెను. నేను వాకిటిలోనుంటిని. వారు లోనికిఁ బోయిరి. ఈ నగలు శకుంతలవి. విధుసారుఁడు దొంగిలించెను. శత్రువు యొక్క ఆట్లు కత్తిరించుట వారి సంప్రదాయము. ఈ

యాచారము రుక్మినాఁటనుండి యాదవులలో నున్నది. ఈ కౌరవుల కెట్లు వచ్చెనో తెలియదు.

## ౧౪

కాలాశోకునకుఁ జిత్రముగాఁ గోపము వచ్చెను. అత
నికిఁ దెల్లవారలును నిద్రలేదు. తొలుత నీలగిరి దుర్గాధి
పతులే న్యాయ్యమనియు, రిపుంజయుని ప్రవర్తన బాగుగా
లేదనియు, ననుకొన్నవాఁడిప్పుడు నీలగిరి దుర్గాధిపతులదే
దోషమని యనుకొన నారంభించెను. మఱియుఁ వీఁడెవఁడో
దేవభయంకరుఁడు గణిమాలి తన దేశమునకు వచ్చి తల
దాఁచుకొన్నవాఁడు మహారాజకుమారుఁడు తన చెల్లెలిని పెండ్లి
యాడుదునన్నఁగా వానిని ఘోరముగా సంహరించునా? వాని
కెంత ధైర్యము? తనకంత యిష్టము లేనిచో మహారాజునకుఁ
దెలియఁజేయవచ్చును. లేదా తనకు వార్తఁ బెట్టవచ్చును.
అంత యిష్టము లేనివాఁడు మఱల నాతమ్ముఁడు వెళ్ళినపుడు
తన యింటిలో నతిథిగా నెందుకుంచుకొనవలయును? పూర్వ
మునకువలెనే మఱల నతనినిఁ జూడఁగల్గినచో నతిథిగా రానీ
యవలెను. పదిపెట్టెల రత్నముల వాఁ డేమిచేయును? వాని
పూర్వులింత ధనము నెట్లు సంపాదించిరి? దేశమును దోఁచి
యుందురు? వారు పూర్వము చోరులైయుందురు. వాఁడిద్దఱు
మల్లులను తన యింటిలోఁ గాపలా యుంచుటచేత రాజ్య
మంతయు గెలిచితిననుకొన్నాఁడు కాఁబోలు – అని కాలా

శోకుఁడు భటుని పిలిచెను. వాఁడు వచ్చెను. ఓరీ! మన రాజ్యములో యుద్ధమునకుఁ బోని సేనాపతులెవ రున్నారు? అని యడుగఁగా నతఁడు గొందఱిపేర్లు చెప్పెను. కాలాశోకుఁడు వారిలో నొకని రమ్మని వార్తఁ బెట్టెను. అతఁడు వచ్చెను. కాలాశోకుఁడు "నీవు రెండువందల సైన్యమునుఁ దీసికొని వెంటనే సోనాపురము పోయి యాయూరిలో దేవభయంకరుఁడున్న జూదగాఁడు కలఁడు. వాని కుటుంబము నాశనము చేసి వానియిల్లును తగులఁబెట్టి వానియాస్తి నంతయును తీసికొని రావలయును. వాఁడు రాజద్రోహము చేసినాఁడు. వాఁడు నాతమ్ముని సంహరించినాఁడు. వాని యింటిలో భూగృహమునందు పదిపెట్టెలనిండ రత్నములు వజ్రములు కలవట. వానిలో నొక్కటియు బీకుపోకుండ రాజధానికి తీసికొనిరావలయును. నీవు వెంటనే బయలుదేఱినచో రాత్రి కాయూరుఁ జేరఁగలవు. ఉత్తుంగభుజుని వద్దనుండి యేమైన వార్త వచ్చినదా?" అని యడుగఁగా నా సేనాని ప్రభూ! ఆ వార్తసంగతి నాకుఁ దెలియదు. యుద్ధమంత్రి యున్నాఁడు. వారికిఁ దెలియును. అనఁగాఁ గాలాశోకుఁడు నీవు పోయి యుద్ధమంత్రిని నేను బిలుచుచున్నానని చెప్పుము. నీవు రెండువందల సైన్యమునుఁ దీసికొని వెంటనే సోనాపురమునకుఁ బోవలయును. ఆజ్ఞాపత్రమును, యుద్ధమంత్రి వచ్చినవెంటనే పంపుదు ననెను. యుద్ధమంత్రి వచ్చెను. అదివఱకు యుద్ధమంత్రి కాలాశోకుని దర్శనమే చేసియెఱుఁగఁడు. కాలాశోకుఁడు తనకు వార్త నంపెననఁగా నతఁ డాశ్చర్యపడెను. ఇంతవఱకు, సర్వకార్యములు తనతోఁ బ్రసక్తిలేకుండ మంత్రి

యున్నాఁడని యంతని వ్యవహారసభ యున్నదని యుద్ధ వ్యవహారములన్నియుఁ దత్సభాముఖమున జరుగవలయునని యే నియమములేకుండ నుత్తుంగభుజుని యాధ్యక్ష్యముతో సాగుచుండెను. రా జుత్తుంగభుజుఁడు. మంత్రి యుత్తుంగభుజుఁడు. సేనాధిపతి యుత్తుంగభుజుఁడు. సైన్య ముత్తుంగభుజుఁడు. ఇట్టి స్థితిలోఁ గాలాశోకుఁడు తనకు వార్త నంపుట యాశ్చర్య మని పించెను. అయినను వచ్చెను. కాలాశోకుఁడు:- నీవు యుద్ధ మంత్రివా? మంత్రి:-ఆతేంష్ట్రక్రింద నేను మంత్రిని. కాలా:- ఇప్పుడు కావా? మంత్రి:-ప్రభూ! పేరున కగుదును. వేతనము తీసికొనుట కగుదును. వ్యవహారమునకుఁగాను. కాలా:- ఉత్తుంగభుజునివద్దనుండి యేమైన వార్తలు వచ్చెనా? మంత్రి:- నాకేమియుఁ దెలియదు. కాని రాజధానిలో పలు వార్తలుగా నున్నవి. ఉత్తుంగభుజుఁడు పోయి మిథిలా నగరమున నిక్ష్వాకుసేనలను కలఁబడె ననియు, ఈలోపుగా మన సేనలో మల్లచముచ్చు యుద్ధము చేయుటకు నిరాకరించెననియు, నుత్తుంగభుజుఁడు మిగిలిన సేనలతోడనే మిథిలా దుర్గమును ముట్టడించెననియు, వీరికి మిథిలాదుర్గము స్వాధీనము కాలేదనియు, నక్లో యిక్ష్వాకుపతియొక్క మల్లచమువు కూడ యుద్ధము జేయుటకు నిరాకరించి వారి మల్లచమువును, మన మల్లచమువును రెండు సేనలను చుట్టు ముట్టెననియు నింతలో కిరాత బర్బర శక దేశపు సేనలు వారికి వచ్చి సాయపడెననియు, నీ స్థితిలో సుమిత్రుఁడు నుత్తుంగభుజుఁడు నిద్దఱును కలిసి మన సేనలుకూడ మిథిలా దుర్గాంతర్భాగమునకుఁ బోయి వీరితో యుద్ధమాడుచున్నారనియు వార్తలు వచ్చెను. కాలా:- ఆ

యాటవిక సేనలకు సేనానాయకుఁడెవఁడు? వానిని నడిపెడివాఁడెవఁడు? ఎవఁడు వానికి తోడ్పాటు? ఇంత విఘ్నము తెచ్చినవాఁడెవఁడు? మంత్రి:- ఎవఁడు కౌరవ, హైహయ, పాంచాల, శూరసేనాది రాజ్యములయందు క్షత్రియుఁడనకుండఁ జేసెనో, ఎవఁడు సర్వక్షత్రియ నిర్మూలనమునకు కంకణము కట్టుకొనెనో, ఎవఁడు కలి ప్రవేశించిన తరువాత పదునేనువందల సంవత్సరములకు క్షత్రియరాజ్యమని యుండదని కాలజ్ఞులు చెప్పిన మహావాక్యమును నేటికి నూటికి తొంబదిపాళ్ళు యథార్థము చేసెనో, ఎవని బుద్ధివైభవమువలన, బాహు పరాక్రమమువలన మున్ను పరశురాముఁడు చేసిన క్షత్రియ సంహారముకంటె నధికమైన సంహారము జరుగుచున్నదో, వాఁడు. పూర్వము భార్గవరాముఁడు క్షత్రియులను సంహారించినను రాజ్యములు క్షత్రియుల చేతులలోనుండి పోలేదు. ఇప్పు డీమహాఘోరుని వలన రాజ్యములే క్షత్రియేతర హస్తగతములైనవి. ఇంక ధాత్రిలో క్షత్రియుఁ డైనవాఁడు రాజుగా నుండఁడు. ఇట్టిదంత తీవ్రకర్మ సమారంభించెను. కాలా:- అతఁ డెవడు? వాని పేరేమి? వానిని నాశనము చేసెదను. మంత్రి:- అయ్యా! మన సైన్యములోనున్న మేలిభాగము నుత్తుంగభుజుఁడు కోసల దేశములకుఁ గదలించుకొనిపోయెను. అవి యచట చిక్కువడెను. అతఁడు కోసల మగధ సైన్యములను మిథిలా నగరమున నిర్మూలించి మనమీఁదికి వచ్చెను. అపుడు మనమేమి చేయవలయును? కాలా:-అతఁ డంతగా వచ్చినచో కోటతలుపులు మూయించి యుద్ధము చేయుదము. గిరివ్రజ దుర్గము దుశ్ఛేద్యమైనది. దీని దుశ్ఛేద్యత వేల యేండ్లనాఁటిది. నేఁటిది

కాదు. ఆమూర్ఖున కీసంగతి తెలియదేమో! మంత్రి:- ఆయనకుఁ దెలియును. అతఁడు గిరివ్రజపురమునకు వచ్చినచోఁ గోట తలుపులు మూసెడివాఁడే యుండఁడు. తెఱచియే యుందురు. అతనికి సులభప్రవేశము జరుగును. కాలా:- ఎవఁడోయి వాఁడు? వాని పేరేమి? వానికంత సామర్థ్య మెచ్చటి నుంచి వచ్చినది? మంత్రి:- అతనికి సహజముగాఁ గొంత సామర్థ్యమున్నది గాని యీ సామర్థ్య ముత్తుంగభుజుని దుర్నీతిచేత దుశ్శీలతచేతఁ బదిరెట్లయినది. ఆ పది రెట్లు మఱల రెట్టింపైనది. దానికిఁ గారణము. తమరు క్షమించినచో మనవి చేయుదును. కాలా:- చెప్పుము. మంత్రి:- తమకు యువరాజ పట్టాభిషేకము లేకుండ యౌవరాజ్యమునే కాక మహారాజ్యమునే పాలించుటయు, నుత్తుంగభుజుని చేతిలో కీలుబొమ్మలగుటయు, మీరును మీ తమ్ములును దుష్టమైన కామ ప్రవృత్తితో సంచరించుటయు, మీ కామ తృప్తికొఱకు పలుమంది మహాయోధుల సంసారములలో మీయెడల విరక్తి కలుగుటయు, మిమ్ము సాధించుటకైనను వారు మీకుఁ బ్రతిపక్షియైన వానిదెస ననాదినుండి వచ్చు రాజభక్తి పరిత్యజించి యొగ్గుటయు, నిట్టి వన్నియో కలవు. ఈ రాజ్యమున నొక్క మంత్రికి మర్యాద లేదు. అతని నడిగెడివాఁడు లేఁడు. రాజ్యాంగ వ్యవహారము స్మృతిబద్ధముగా నడచుట లేదు. అన్నిఁటి కుత్తుంగభుజుఁడే. ఏడాది కాదు. రెండేండ్లు కాదు. ఆఱేండ్లనుండి యిట్లు జరుగుచున్నది. కొందఱుమంత్రులయొక్క వేతనములే సరిగా ముట్టుటలేదు. ఉత్తుంగభుజుని యనుగ్రహమున్నచోఁ గొలువు

కాం(డకు వేతనములు లభించుచున్నవి. లేనిచో లేదు. ఓయి! యువరాజా! "యథారాజా తథా ప్రజాః" మీ యువ్వురన్న దమ్ములు కామ ప్రవృత్తులై యుండఁగా నెన్ని మర్యాదగల కుటుంబములు తమ యభిమానమును కోల్పోయినవి? మీ మీ కొఱకని యొక స్త్రీ యపహరింపఁ బడుట, ఆ స్త్రీ యొక్క మీ చేతనే కాదే, నల్పాధికారులైన యుత్తుంగభుజుని పరివార మంతయు వారియందు భోగము ననుభవించ వలయునా? అయ్యో! ఇది దేశమా! రాజ్యమా! అందుచేత నా ప్రతి పక్షికిఁ జెప్పరానంత బలము వచ్చినది. మంత్రులందఱు నతని పక్షమునం దున్నారు. పెక్కుఱు సైన్యాధిపతు లుత్తుంగ భుజునివలన ధనము సంపాదించినవారు మీవైపున నున్నారు గాని న్యాయమార్గగాములైన కొందఱు సేనాపతులు వారి సైన్యముతో మీ ప్రతిపక్షి కనుకూలముగా నున్నారు. జేపతేఁడు మిథిలానగరమున సుమిత్రోత్తుంగభుజులను జయించి శకాదిసేనలతో గిరివ్రజపురము మీఁదికి వచ్చును. ఆ వచ్చు టలోఁ బరిశిష్టమైన మగధసేనకూడ నతని వెంటనే వచ్చును. అందఱును గిరివ్రజపురము మీఁదికి రాఁగా మీరు గవను మూయు మందురు. కొందఱు మూయుటకుఁ బ్రయత్నింతురు. మఱి కొందఱు కవాటములను బంధింపనీయరు. ఒకవేళ బంధించినను దుర్గములోననే యుద్ధము జరుగుచుండును. బయట సేనలకు యుద్ధమిచ్చెడివా రెవరు? ఇంతకు నుత్తుంగ భుజుని బలము నిత్యము వానితోడనే యుండును వాని బల మిప్పుడు కోటలో లేదు. మీ ప్రతిపక్షి వచ్చుటయు, కోట నాక్రమించుటయు. వేఱొక సంగతియే లేదు. మీరు చేతు

లార నిట్లు చేసికొంటిరి. నేఁడైనను నాకు వార్తఁ బంపితిరి. నేనైనను గుండెవిప్పి మీతో యథార్థమును చెప్పితిని. లేనిచో మీరింకను మహాంధకారములో నుండియుందురు. మీరు వార్త యెవనిచేతఁ బంపించితిరో యాసేనాని వానికిఁ దమ రిచ్చిన యాజ్ఞను నాతోఁ జెప్పెను. సేనాపురము మీఁదికిఁ బోయి యాదేవభయంకరుని కుటుంబ నాశనము చేయుటకు సిద్ధముగా నిచ్చట నొక్క సైనికుఁడు లేఁడు. ఉత్తుంగభుజుఁడు కోటనువదలి వెళ్ళిన మఱునాఁడే ఇచ్చటి సేనాపతు లందఱును రహస్యసభచేసి యొక తీర్మానమును చేసికొన్నారు. ఉత్తుంగ భుజుఁడు తిరిగి రానేరాఁడు. వచ్చినచో కోటతలుపులు వేసి వానిని లోనికి రానీయకూడదు. వాఁడు కోటను ముట్టడించి యుద్ధమును బ్రారంభించినచో వాని కుటుంబమును బంధువులు నందఱును కోటలో నున్నారు. వారిని చిత్రవధ చేయవల యును అని. ఉత్తుంగభుజుఁడు ముట్టడి వదలి వెళ్ళెదనన్నచో, వెళ్ళినచో వాని కుటుంబము భద్రముగా వాఁడున్నచోటికిఁ బంపెదరు. ఇది వారు చేసికొన్న నిర్ణయము. అందుచేత నొకవేళ నుత్తుంగభుజుఁడు కోసలాధిపతి సైన్యమును గెలిచినను వాఁ డిచటికి వచ్చుట లేదు. మిథిలాదుర్గమునం దేమి జరిగినదో యిదివఱకే మనవి చేసితినికదా! కాలా:- ఓయి మంత్రీ! నీ పేరేమి? మంత్రి:- నా పేరుతో నేమిప్రయోజ నము? నే నుత్తుంగభుజునికి వ్యతిరేకినేగాని మీ కనుకూలుఁ డనే. మీ రాజవంశమే చిరస్థాయిగా మాగధముల నేల వలయునని నా కోరిక. కాని మహారాజుగా రెక్కడ? తమ రెక్కడ? మహారా జొక్కనాఁడైనను బరస్త్రీని కన్నెత్తి

చూచితిరా? లోకమునందు రాజులకు సౌందర్యవతులైన స్త్రీలమీఁద వాంఛ కలుగుట యున్నది. ఆమె యవివాహిత యైనచో నామె తండ్రికి ధనమిచ్చి యామెనుఁ దెచ్చి కోటలో భార్యగా నుంచికొనుట యున్నది. తక్కిన దుర్వృత్తి లేదు. ఈ దుర్వృత్తి మీ ముగ్వు రన్నదమ్ములయం దున్నది. నామ యందుకూడ నున్నది. ఉత్తుంగభుజుఁడు బుద్ధిపూర్వకముగా మిమ్ము వృత్తిలోనికి దించినాఁడు. మీరు దిగితిరి. మీరు పూర్తిగా నిస్సహాయులైన తరువాత మిమ్ము వధించి యీ రాజ్యముఁ దా నపహరింపవలయునని వాఁడీ ప్రయత్నమంతయుఁ జేసెను. అతని ప్రయత్నము ఫలోన్ముఖమైనది. ఇంతలోఁ బులిమీఁద పుట్రయన్నట్లు మీ ప్రతిపక్షి బయలుదేఱినాఁడు. ఆయన మూలమున నుత్తుంగభుజుని సర్వ ప్రయత్నములు విఫలములైనవి. కాలా:- ఓయీ! అయినచో నావలన నాజ్ఞ బొందిన సేనాపతి సోనాపురము పోఁడందువా? మంత్రి:-అతఁ డెందుకు పోవును? సోనాపురములోనున్న దేవభయంకరుఁడు విష్ణుసారుని. వధించెడివాఁడే కాఁడు. తన చెల్లెలిని మీతమ్మున కిచ్చి వివాహము చేసెడివాఁడు. సామాన్య పరిస్థితులలో నట్లే జరిగెడిది. ఓయి కాలాశోకా! ఆ నీ ప్రతిపక్షి యెంత వాఁడో నీకు తెలియదు. దేవభయంకరుఁడు హస్తినాపుర ప్రాంతమునందలి యొక జనపదములోని క్షత్రియవంశము వాఁడు. అతఁడు సోనాపుర మెందుకు వచ్చెను? అతని చెల్లెండ్రును భార్యయు వానియింటిలో నీ తమ్మునియెదుట స్వేచ్ఛగా నెందుకు తిరిగిరి? ఎంత యతిథులైనను, ఎంత మహోపకారులైనను క్షత్రియస్త్రీలు వాని యెదుటఁ దిరుగరే,

ఇది చూడుము. విఘునాయకుడు దేవభయంకరుని సోదరి
యందున దనంతరము తాను కామమును పొందలేదు. ఆ
బాలికయే యితనిని దనయందు వాంఛగలవాఁ డగునట్లుగా
నటించినది. ఇది యంతయు నొక వ్యూహము. ఆ ప్రతిపక్షి
యొక్క పన్నుగడ. మఱియు నీవు నీలగిరి దుర్గమును నేల
మట్టము చేయవలయునని యనుకొనుచుండవచ్చును. ఆదుర్గాధి
పతి యైన రిపుంజయుని కూతురు మహా సౌందర్యవతి యని
మీ తమ్ముఁడైన రిపుంజయునకు వార్త తెచ్చిన గూఢచారుఁ
డెవఁడు? అతఁడా ప్రతిపక్షి వేతనములోనివాఁడు. నిజమున
కా దుర్గాధిపతి కూతురు లోకోత్తరమైన సౌందర్యముకలది కాదు,
ఆమె సామాన్యమైన సౌందర్యవతియే. మీ తమ్మునకు
వర్ణించి చెప్పిరి. ఇతఁడామె నివసించు భవన గవాక్షమునకు
రజ్జువును బంధించి యానాఁ డేనుఁగునెక్కి పైకిఁ బ్రాకిపోయె
ననఁగా దుర్గాధిపతి తెలిసి నాగనిచ్చినది. ఆ సన్నని దీపపు
వెలుతురులో నామె యెంతో సౌందర్యవతియని మీ రిపుం
జయున కనిపించెను. మీ తమ్ముల యిద్దఱి మరణమునకు
మీ ప్రతిపక్షి కారణము. నేఁటి వార్తవలన నతఁడు మిగిలిన
యొక్క కోసలరాజ వంశమునుకూడ రాజ్యాధికారమునుండి
తొలఁగించెను. మిగిలినది మీయొక్క వంశము. ఇది తమరితో
నన్ను పిలిపించితిరి కనుక నాకుఁ జెప్పుటకు వీలైనది. కాలా:—
నీపేరు చెప్పితివి కావు? మంత్రి:— రాజా! నా పేరుతో నేమి
ప్రయోజనము? నా పేరు పరంతపుఁడు. కాలా:— నీపేరు
పరంతపుఁడా! నీలగిరి దుర్గాధిపతి పేరుగూడ పరంతపుఁ డను
కొందును. మంత్రి:— అయ్యా! ఆ దుర్గాధిపతినే నేను.

అనఁగనే కాలాశోకునకు పట్టరాని కోపము వచ్చెను. నీవా నా తమ్ముని సంహరించితివి? నీవా నా ప్రతిపక్షి కనుకొలుఁదువు. నీ విచ్చట మంత్రి వెట్లైతివి? మీకును మాకును సోదరభావ మున్నదే. నీవు నా పక్షమున నుండక నా ప్రతిపక్షి యొక్క పక్షమునం దేల చేరితివి? ఈ రాజ్యము నీవు చెప్పిన యీ దుర్మార్గునికి వశముకానిమ్ము. మే మందఱము నశించిపోయినను పోవనిమ్ము. నిన్నిచ్చట సంహరింతును.

మంత్రి:– రాజా! శాంతింపుము. శాంతింపుము. మీ తమ్ముఁడు నిజముగా నీలగిరి దుర్గమున సంహరింపఁబడలేదు. అతఁ డెచ్చటనో సంహరింపఁబడినాఁడు. ఈ కథ కల్పించి నీతోఁ జెప్పఁబడినది. ఆదుర్గాధిపతిని నేనే. మాకును మీకును సౌదర్యము కలదు. అందుకసియే యిప్పుడు నేను వచ్చి యీ రహస్యమంతయు మీతో మనవిఁజేసితిని. నేను నాదుర్గాధిపత్యము నా కొడుకుల కప్పగించి మీ కోటలో యుద్ధ మంత్రిగాఁ జేరితిని. మీ రాజ్యము సుక్షేమముగా నుంచవలయునని నేను జేసిన ప్రయత్నము లన్నియు నుత్తుంగభుజునివలన బూడిదలోపోసిన పన్నీరైనవి. నేను రాజ్యవ్యవహారము బాగుగా లేదని మీ తండ్రిగారితో నొకసారికాదు పదిసార్లు మనవిచేసితిని వారు నా మాట నాదరించలేదు. పోయి కాలాశోకునితోఁ జెప్పుమనుచు వచ్చిరి. నేను మీవద్దకువచ్చి యుత్తుంగభుజుని దుష్ప్రవర్తనముఁ గూర్చి మనవిచేయవలయును. మొదట మీరు నా మాటలను మన్నించరు. రెండవది యుత్తుంగభుజునితో నేను వైరము తెచ్చికొన్నవాఁడ నగుదును. వాఁ డెట్టివాఁడు. నేనింట లేకుండఁ జూచి నాయిల్లు తగులఁ బెట్టిం

చెడివాఁడు. అచటి నా దుర్గమును నేలమట్టముఁ జేయించెడి వాఁడు. తమరు పలుసార్లు లక్షలకొలఁది హేమనిష్కము లనుఁ గావలయునని కూర్చుండెడివారు. బొక్కసములో నున్న హేమనిష్కములు మీరు తీసికొనుటకు వీలులేకపోయెను. ఎందుచేత ? నేను మహారాజుగారితోఁ జెప్పి తక్కిన కైలైనను ధనాగారమును రక్షించవలయుననియు, నాయొక్క వశమును నా కిప్పించవలయుననియు నభ్యర్థించితిని. ఆయన దాని కంగీకరించెను. ఆ ధనాగారము నావశమునం దుంచికొంటిని. మీ రాజ్యపు బొక్కసమును మాత్రము నేను భద్రముగా నుంచ గల్గితిని. నేను మీకుఁ జేయవలయునన్న యుపకారము చిట్ట చివరకు మీ ప్రత్యర్థికే యనుకూలముగాఁ బరిణమించు చున్నది. జేపతఁడు వచ్చి గిరివ్రజపురమునుఁ గైవసము చేసి కొన్నపుడు బొక్కసము తని యధీనమేయగును. కాలా:-ఓయి పరంతపా ! ఈ దినములలో పలుమంది వచ్చి నాతోఁ జెప్పెడి మాటలలో దేనిని విశ్వసించవలయునో దేనిని విశ్వసించ రాదో నాకే తెలియకుండ నున్నది. ఈ మహానగరమున నొక మహామేధావి యున్నాఁడు. అతనినిఁ బిలిపించి యీ సంగతులన్నియుఁ గనుఁగొనినఁగాని నాకు యథార్థస్వరూపము దెలియదు. మంత్రి:- ఎవరాయన ? కాలా:- అతనిపేరు రాక్షసుఁడు. మంత్రి:- రాక్షసుఁడా ? ఆయనయా తమకు హితోపదేశము చేసెడివాఁడు? చాల బాగుగా నున్నది? కాలా:- ఏమి ? రాక్షసుఁడు మహామేధావి కాదందువా ? మంత్రి:- అయ్యా !. నేనేమని చెప్పుదును? ఆ రాక్షసుఁ డొక రాక్షసుఁడు. కాలా:-ఆసంగతి నాకునుఁ దెలియును. మంత్రి:-

అతఁడు మీయందుఁ గూడ రాక్షసుఁడే. అతఁడెవరి స్నేహి-
తుఁడు? నందుని స్నేహితుఁడు. నందుఁ డెవరు? ఎవరా?
ఏమని చెప్పను? ఆ యపరపరశురాముఁ డన్నది నందుఁడే?
అతఁడే సర్వరాజవంశములను నిర్మూలించినవాఁడు. అతఁడే
నేఁడు శకబర్బరకిరాత మల్లదేశముల సేనలను చెచ్చగొట్టి
మిథిలానగరములో కోసల మాగధసేనల నికటమునఁ బెట్టిన
వాఁడు. అతఁడే బ్రాహ్మణవేషమును ధరించి హైహయార్జు-
నుని గండ్రగొడ్డలితో నఱికినవాఁడు. అతఁడే గదాయుద్ధమున
కౌరవరాజును లుంబినీవన ప్రాంతములందు సంహరించిన
వాఁడు. అతఁడే పాంచాలములను నాశనము చేసినవాఁడు.
అతనికిఁ బరమాప్తుఁడు రాక్షసుఁడు. రేపు నందుఁడు రాజు
కాఁగా మంత్రి యెవరు? రాక్షసుఁడు. ఆయన వచ్చి మీకు
హితోపదేశముచేయునా? అతని మాటలా మీరు వినుది?
ఆ రాక్షసుఁ డప్రతర్క్యుఁడు. అతఁడు వీధి వెంట నడచు-
చుండఁగా నాల్గుసైన్యముల నాల్గువందల గజముల మేరలో మహా
కర్కోటకులు ఖడ్గాయుధులై నడచుచుందురు. వారి ఖడ్గ-
ములు వారి యంగీలలో దాచి యుంచఁబడును. ఆ ఖడ్గధారు
లెట్టివారు? ఒకఁడు వాసుకి. ఒకఁడు తక్షకుఁడు. ఆ రాక్ష-
సుఁడు మహాఖడ్గ విద్యావేత్త. సేనాని ముందు నిలువలేను.
ఓయి రాజా! అతఁడు నీదగ్గఱకు వచ్చును. వచ్చెననఁగా
నర్థమేమో తెలియునా? అతఁ డిచ్చట నున్నంతసేపు నీరాజ-
భవనము మహాగ్ని మధ్యమున నున్నదని యర్థము. ఏ నిముస-
మున నీ రాజభటులందఱు వధింపఁబడి నీ రాజసౌధము నేల
మట్టము చేయఁబడునో తెలియదు. వాని కటారికాండ్రు వారు

కటారికాండ్రు కాదు కసాయివాండ్రు. నీ రాజభవనము చుట్టును ముట్టడించియుందురు. అతని తలలోని యొక వెండ్రుక కకు సపాయము కలిగినచో నీ రాజభవనమంతయు నిష్ఠామ ధామ మగును. ఆ రాక్షసుఁడు వేసిన ప్రతిజ్ఞ ఁగు సట్లు చేయును. ఇంతమందిని హింసించి ఇన్ని ఘోరములు చేసిన యుత్తుంగభుజుఁడు నందుని మీఁదికెందుకు పోలేదు? వెనుక రాక్షసుఁ డున్నాఁడు కనుక. ఇన్ని రాజవంశములను నందుఁ డెట్లు నిర్మూలింపఁ గలిగెను? తనకు కుడిబుజమై రాక్షసుఁ డున్నాఁడు గనుక. సందుఁడు హైహాయుని బ్రాహ్మణవేష ధారియై గొడ్డలితో నఱకెను. నఱకినచో నా దేశ సర్వప్రజలు హర్షించి యూరకుండిరి. ఎందుచేత? ఆ రాక్షసుఁడు మన రాజధానిలో నాఱు నెలలనుండి లేఁడు. అతఁడు పది దినముల క్రిందట వచ్చెను. అతఁడు లేనప్పుడు వాని కుటుంబమువంక తిరిగి చూచుటకైన నుత్తుంగభుజునకు సాధ్యముకాకపోయెను. రాక్షసుని కుటుంబ మీయూరిలోనున్నదనియే యుత్తుంగ భుజునకుఁ దెలియదు. అతఁడు తన కుటుంబమును పరదేశము లకుఁ దరలించినట్లు సర్వజనులకుఁ జూపెను. ఎప్పుడింక కోసల పతి మీఁదికి నుత్తుంగభుజుఁడు దండెత్తి పోవునంగా రాక్ష సుని కుటుంబ మీయూరిలోనే యున్నదని యుత్తుంగభుజు నకుఁ దెలిసెను. అది యట్లుంచి రాక్షసుఁడు పాంచాలము లలో హైహాయములలో శూరసేనములలో చేసిన ప్రజా విప్లవ మింతింతయని చెప్పఁగలనా? ఈ నాఁడిచ్చట నుండెను. మఱునాఁ డచ్చట నుండెను. హైహాయదేశములో బ్రాహ్మ ణుల నందఱిని దరిద్రబ్రాహ్మణాభిమానులను సంఘములుగా

నేర్పాటు చేసెను. వారియందు ధైర్యము గల్పించెను. కాలక శూరసేన కలింగదేశములలో నతఁడు చేసినపని నభూతోనభవిష్యతి. జలపాతోత్సవమన్న పేరిట నెంతెంతమంది చేత నెన్నెన్ని వార్తలు పుట్టింపించెను. స్పర్ధలు లేని యీ మూఁడు వంశములలోఁ దనపక్షమునందున్న వందమంది గజయాఁత గాంద్రచేత నెన్ని యెన్ని స్పర్ధలు రేకెత్తించెను? అతని వయస్సు పాతికయేండ్లకు మించియుండదు. అతనికి పదు నెన్మిదియేండ్ల వయస్సు వచ్చిన నాఁటినుండియు వాని మేధా వికసనము పరమ తీక్ష్ణమై యున్నది. అతని కేభాష వచ్చును, ఈ భాష రాదని లేదు. దేశమంతయు పాళీభాష. అందులో నతఁడు మహాపండితుఁడు. నేఁడార్యావర్తమునం దున్న సర్వభాషలును సంస్కృతభాషా వికృతులు. ఎచ్చట నే వికృతి కలదో నచ్చట యీ వికృతి యతనికిఁ గరతలామలకము. రాజా! నేఁడు నీ నగరమున మహా బౌద్ధ భిక్షుక సంఘ సమావేశములు జరుగుచున్నవి. ఈ సమావేశము లెందుకు జరుగుచున్నవి? నీవు నమ్మినను - నమ్మక పోయినను. దీనియంతకుఁ గారణము రాక్షసుఁడు. ఈ సమావేశములు జరుగుటకుఁ బ్రారంభ మెప్పుడో తెలియునా? ఐదు నెలల క్రింద. మీ సర్వక్షత్రియ సమావేశము జరిగిన దెప్పుడు? ఆఱు నెలల క్రింద. తమరును సుమిత్రుఁడును తక్కిన రాజక్షత్రియులును నంద నా సభలోనికి రానీయలేదు. ఆనాఁడు మహాద్వారమువద్ద నుత్తుంగభుజుఁడు పది యేనుఁగు లతో నందుఁడు రాకుండ రక్షగా నిలుచుండెను. నందుఁడు వచ్చెను. నందుఁడు విజృంభించినచో నా పది యేన్గులు నశిం

చెడివి. మీ వందమంది భటులు నశించెడివారు. ఆనాఁడే యుత్తుంగభుజుఁడు సంహరింపఁబడెడివాఁడు. మీ క్షత్రియ సమావేశము చెల్లాచెదరు చేయఁబడి యుండెడిది. అట్లు జరిగినచో నెంత బాగుగా నుండెడిది? మీ రాజ్యమువీఁడిగా నుండెడిది. ఆనాఁడు నందునికి సామంత ప్రాసాదములోనికి రావలయునని మాత్రమే యున్నది గాని యింకొక యూహ లేదు. సర్వక్షత్రియ వంశములు నార్యావర్తమును మఱియు నెన్నియేండ్లో పాలించుచుండి యుండెడివి. నందుఁ డేపనియు రాక్షసునితోఁ జెప్పకుండ చేయఁడు. తన్ను సామంత ప్రాసాదమునకు రానిచ్చుటలేదు. తాను పోయి యుత్తుంగభుజుని నా యేనుగులను వధించి లోనికిఁ బోదునని రాక్షసునితోఁ జెప్పెను. రాక్షసుఁ డట్లు చేయవద్దు. శాంతముగాఁ దిరిగిరవలెనని చెప్పెను. నందుఁడు వచ్చి నన్ను తిరిగి రమ్మంటివికదా! ఏమి చేయుమందు వనెను. రాక్షసుఁడు నందునితో నిన్ను సర్వార్యావర్తమునకుఁ జక్రవర్తినిఁ జేసెదను. నేను చెప్పినట్లు నడువుము. సర్వదేశములయందు నేను రహస్య విప్లవములను లేవదీసెదను. ఆయా దేశముల రాజులయొక్క సర్వ రహస్యములును నాకుఁ దెలియును.” అని చెప్పి ఈ మహా కార్యమునందు వ్యగ్రుఁడయ్యెను. అతఁడు తలఁచుటయు సాధ్యముకాకపోవుట నన్నదియులేదు. ఆనాఁడు మహోద్యానము నుండి నందుఁడు తిరిగిపోఁగా మూర్ఖుఁడైన యుత్తుంగభుజుఁడు సంతోషించెనుగాని తక్కిన సేనలందఱు నిశ్చేష్టులై పోయిరి. నందుఁడేమి? అతని బలమేమి? అతని సాహసమేమి? అతని కోపమేమి? అతఁడు తిరిగిపోవుటయేమి? యని. ఓయి కాలా

శోకా! నీవు నా రాజవైనను నిన్ను నీ పేరుతోఁ బిలుచు
చున్నాను. నిన్ను రక్షించు శక్తి నాకు దాటిపోయినది. నీ
యందు నాకు రాజభక్తి కలదు. వట్టి రాజభక్తియేకాదు.
నాల్గైదు తరములుగా వచ్చుచున్న సౌదర్యభావము కలదు.
కాని నీ యీ వ్యవహారము నా శక్తికి మించిపోయెను. నేను
నీకిన్ని రహస్యములు చెప్పితిని. ఈ రహస్యములు నాకెట్లు
తెలియును? నేను బ్రాహ్మణుఁడను. ఖడ్గధారిని. ఒక
దుర్గాధిపతిని. నాకును శౌర్యముకలదు. నాకు నభి
మానము కలదు. కాని ఆ రాక్షసుఁడు బ్రాహ్మణుఁడు.
కాని బ్రాహ్మణాభిమానము విలక్షణమైనది. దేశమంతయు
బౌద్ధ మతమును స్వీకరించుచున్నారు. అందఱు బౌద్ధులే
యైనారు. రాజులు సులభముగా బౌద్ధమతము స్వీకరించు
చున్నారు. రాక్షసుఁ డొకనాఁడు నవ్వి నాతో నిట్లనెను.
నేను వయస్సుచేతఁ బెద్దవాఁడ నగుటచేత రాక్షసుఁడు
న "న్నార్యా!" యని సంబోధించును. అతని సంబోధనము
లోనిదియు నతఁడు నాయందు నెఱపుచున్నదియునైన యార్య
త్వము నే నతనికి వ్యతిరేకముగా లేనంతవఱకే. మఱునాఁడు
నేను నస్యుఁడను. వధ్యుఁడను. అతఁడు పది దినములక్రింద
నావద్దకువచ్చి తాను చేసిన యీ సర్వరాజ్య విప్లవమును
నాతోఁ జెప్పెను. నాతో నెందుకుఁ జెప్పినాఁడో నాకు
తెలియదు. అతఁడు చాల తక్కువ మాటలు మాటాడును.
కాలాశోకుఁడు:- కాదయ్యా! యెక్కువ మాటలు మాటా
డును. మంత్రి:- ఆమాటయు నిజమే. అతఁ డెక్కువ మాట

ఎప్పుడు మాటాడును ? దానికి వేళ లున్నవి. ఆ రాక్షసుఁడే
నాతోఁ జెప్పెను. ఆర్యా ! పరంతపా ! నేనింత యెక్కువగా
మాటాడుట నాకే యాశ్చర్యముగా నున్నది. ఈ యైదు
నెలలలో కడచిన యిరువది నాలుగేండ్ల వయస్సులో మాటా
డని పలుకులు మాటాడివేసితిని. నేను తక్కువ మాటాడుదు
నని పోయి సుమిత్రునితోఁ జెప్పుము – సుమిత్రుఁడనఁగా కోసల
రాజు. అతఁడు నమ్మఁడు. పోయి మీ కాలాశోకునితోఁ
జెప్పుము. అతఁడు నమ్మఁడు. నీవే యిదివరకు నమ్మిన
వాఁడవు కావు. బౌద్ధులు దేశమంతయు నగుదురుగాక. ఈ
దుష్ట క్షత్రియులు రాజులై బౌద్ధులగుటచేత దేశమునం
దీయనార్య మతము వచ్చినది. ఈ క్షత్రియులను నాశనము
చేసెదను. సర్వక్షత్రియ నాశనముచేసి మగధరాజ్య సింహా
సనమును నే నధిరోహించి ఈ బౌద్ధమతము నరికట్టఁగలుగు
దును. కాని నందుఁడు శూద్రుఁడు. నాకు స్నేహితుఁడు.
అతని నాడులయందు మహానందియొక్క రక్తము ప్రవహించు
చున్నది. అతఁడు రాజగుటకు యోగ్యుఁడు. మొదట నతని
శరీరములో రాజరక్తమున్నది గనుక నతఁ డార్యావర్తమునుఁ
బాలించుటకుఁ దగినవాఁడు. రెండవది క్షత్రియుఁడు కాఁడు
గనుక నేఁటి బౌద్ధమతమునందు బుద్ధుఁడు క్షత్రియుఁడగుట
చేత సర్వరాజులకుఁగల యా దురహంకారము లేనివాఁడు.
నన్ను భగవంతుఁడు మంత్రిగా నుండుటకు సృష్టించెనుగాని
రాజుగా నుండుటకు సృష్టించలేదు. బౌద్ధమతము మితిమీఱి
పోవుచున్నది. దీనికి నే నడ్డుకట్ట కట్టెదను. ఆర్యా ! పరంతపా !
నేను వేసిన పథకమునకు చివర నేమియున్నదో తెలియునా !

సర్వార్యావర్తమునందలి బౌద్ధులైన యర్హతులును, ఉత్తము
లైన బౌద్ధ పండితులు, శ్రమణులును, భిక్షుకులును, గిరివ్రజపుర
మున మహా సమావేశము జరుగుట యున్నది. ఆ బౌద్ధుల
నందఱిని నేను వధింపించఁ గల్గుదును. దానితో నార్యావర్త
మున బౌద్ధమతముయొక్క బొడ్డూడిపోవును. కాని చూచి
తివా! నాఁ డచ్చట సమావేశము కానున్న బౌద్ధులు, వారి
మతమే మైననేమి? వారి విశ్వాస మెట్లున్ననేమి? వారందఱు
తపస్వులు. వారిలో నెక్కువమంది యింద్రియజేత లుందురు.
వారు నిర్వాణమందుదురు. అది మన మోక్షమువంటిదే. అట్టి
వారిని వేయిమందిని సంహరించినచో నాకుఁ బుట్టగతు
లుండవు. ఈ యార్యావర్తములోని వైదికమతమునకుఁగూడ
నది క్షేమకరమైన విషయము కాదు. కాల మిట్లు జరుగుచున్నది.
కాలమునందుఁ గలిగియె పరమేశ్వరుఁడే యిట్టి వికారములఁ
జేయుచున్నాఁడు. ఈ దేశమునందు బౌద్ధమత మెప్పుడు
నిర్మూలింపఁ బడవలయునో యప్పుడే నిర్మూలింపఁబడును.
నిర్మూలింపఁబడక కృతయుగాదివఱకు నిట్లే యుండనిమ్ము.
నాకేమి నష్టము? ఈ మతముపోయి యింతకంటెఁగనా కష్ట
ములైన మతములను రానిమ్ము. నాకు వానితోఁ బ్రసక్తి లేదు.
నేనీ జన్మ మెత్తితిని. నాకు నూటయేఁబదియేండ్ల యాయుర్దాయ
మని కార్తాంతికులు చెప్పినారు. నాకునుఁ దెలియును. నా
కొక శక్తిని పరమేశ్వరుఁ డిచ్చినాఁడు. ఆశక్తి సర్వరాజవంశ
ములను నశింపఁజేయుటకుఁ జాలినది. నేఁడు బౌద్ధమతము
యొక్క యుబ్బు నరికట్టుటకుఁ జాలినది. బౌద్ధమత నిర్మూల
నము జేయుటకుఁ జాలినదికాదు. అట్టిపనిఁ జేయుట కెవఁడో

శకపురుషుఁడు కావలయును. శకపురుషుఁడనఁగా నేమియో తెలియునా, కొన్నికోట్ల కొన్నిలక్షల మ్లేచ్ఛులను వధించి వైదిక మతమును నిలబెట్టెడివాఁడు శకపురుషుఁడు. అట్టి శక పురుషుఁ డింక పదునాల్గవందల యేండ్లుగడచిన తరువాతఁగాని పుట్టఁడు. ఇప్పుడు నేను చేయున దింతే" అనెను.

కాలాశోకుఁడు నివ్వెఱపోయి వినుచుండెను. అతని కిదియేమియు నర్థముకాలేదు. అతఁ డిట్లనెను. "ఓయి పరం తపా! నీవు మమ్ము రక్షింపఁగలవా?" మంత్రి:- అయ్యా! నన్ను నేను రక్షించుకొనఁగలనా? అయిదు నెల లుండి నేను మనసులో ననుకొన్న యూహాయుఁగూడఁ దెలిసి నవడి రాక్షసుని యొక్క గూఢచారులు నా వెంట నున్నారు. నేనిట నుండి బయటకు పోయిన తరువాత నేను బ్రతికియుండుట నా యిచ్చటి ప్రవర్తనమీఁద నాధారపడి యున్నది – పరంతపుఁడు వెడలిపోయెను.

వజ్జీయులైన భిక్షుకులలోఁ గాలాశోకుఁడు తమకు వ్యతి రేకముగా తీర్పిచ్చెనన్న వదంతి పుట్టెను. అది యెట్లు పుట్టి నదో తెలియదు. అజితాదు లుత్క్షేపణకర్మ కాలాశోకుని మీఁదఁ బ్రయోగింతుమని యతనిని భయపెట్టిరట. అతఁడు లిచ్ఛవులమీఁద యశుఁడు నిరూపించిన దోషములన్నియు దోషములే యని యంగీకరించెనట. అంగీకరించిన తరువాత సబ్బకామి మొదలైనవారు కాలాశోకునితో "నీ దోషములను చేసెడి బౌద్ధులను శిక్షింపవలయు"నని చెప్పిరట. అతఁ డంగీక రించెనట. నిత్య మీదోషములుచేయు వజ్జీయులైన భిక్షుకుల పేర్లు వరుసగా వ్రాసియున్నారట. వారందఱిని శిక్షించు

టయో, శ్రాద్ధమంటపమునుండి తొలఁగించుటయో కాలాశోకుఁడు రేపో యెల్లుండియో చేయునట - ఈ మాటలు తొలుత వదంతిగా బయలుదేరి, నిశ్చయోక్తులుగా రూపొంది వజ్జిభిక్షుకులు వేఱే సమావేశములు చేసికొని తామేమి చేయవలయునో తల్లడిల్లుచుండఁగా "మీకేమియు భయము లేదు. నందుఁడు మిమ్ము స్వీకరించును. రేపు నందుఁడే రాజగును. యుత్తుంగభుజుఁ డక్కడే సంహరింపఁబడును. కాలాశోకుని తమ్ము లిదివఱకే సంహరింపఁబడిరి. ఒక్క కాలాశోకుఁడే మిగిలియున్నాఁడు. అతఁడు చనిపోయినచో రాజ్యము నందునకే వచ్చును." అని యెవరో చెప్పిరట. ఈ వార్తకుఁ దీవ్ర ప్రచారము సాగెను. ఈమాట లెవరు మొదలుపెట్టిరో తెలియదు.

## ౧౫

ఆనాఁడు గిరివ్రజపురము మహాకోలాహల భరితముగా నుండెను. మహాప్రాసాదమునఁ గొన్నియేండ్లనుండి లేని మహారాజసభ జరుగుచుండెను. మంత్రులు సామంతులు వచ్చి సభ నలంకరించియుండిరి. మాగధములనుండి చిత్రచిత్రములైన వ్యక్తులు గిరివ్రజపురమునందు సంచరించుచున్నారు. కొందఱినిఁ జూచినచో వారి మొగములయందు నుత్సవదీప్తి కనుపించుచున్నది. మఱికొందఱి వదనములయందు దృప్తి కనిపించుచున్నది. కొందఱి ముఖారవిందములయందు

నేండ్లుగా తమ్ము బాధించుచున్న సూఁడు నేఁడు తీరినట్లు గర్వ
రేఖ కనిపించుచున్నది. ఉత్తుంగభుజునిచేత మువ్వురి రాజ
కుమారులచేత నే యే ధనవంతుల యిండ్లు దోఁచుకొనఁబడినవో
యే గృహముల యందలి స్త్రీలు మానభంగములందిరో
ఆ యా కుటుంబములోని పురుషులందఱు సముత్సాహ రేఖా
వికసితాపఘన ముఖాది లక్షణములు కలవారై గిరివ్రజపుర
వీథులయందు విభూషితాంగులై పరిధౌత వస్త్రధారులై విహ
రించుచుండిరి. ఆనాఁడు ప్రొద్దుక్రుంకును. ప్రొద్దు క్రుంకక
ముందున్నది వారి యుత్సాహముయొక్క పరమావధి భూత
మైన యుత్సవము. నందుఁ డుత్తుంగభుజుని మిథిలానగరము
నందు బంధించెను. కోసలపతిని కూడ బంధించెను. వారిద్ద
ఱిని క్రూరవన్యమృగములను బోనులలో పెట్టి తెచ్చినట్లు గిరి
వ్రజపురమునకుఁ దెచ్చినాఁడు. ఆనాఁటి సాయంకాలమున
కోటలోని పెద్ద మైదానములో వారిద్దఱిచేత కత్తియుద్ధము
చేయించునట. ఎవఁడు గెలుచునో వానికిఁ గోసలరాజ్య
మిచ్చునట. ఈ సందర్భములోఁ బ్రజ లనేక విధములుగాఁ
జెప్పికొనఁ జొచ్చిరి. కొంద ఱిట్లనిరి. – ఇది యేమయ్యా!
తొలఁగిపోయిన తద్దినమును నెత్తికిఁ దెచ్చికొన్నట్లు. ఒకవేళ
సుమిత్రుఁడు గెలుచు ననుకొమ్ము. మఱల నతఁడు క్షత్రి
యుఁడేకదా! రాజ్యాధిపతియైనవాఁడు క్షత్రియుఁడుగా నుండ
కూడదనికదా నందుఁడింత ప్రయత్నము చేసెను! మఱల
క్షత్రియుఁడే కోసలములకు రాజగునుకదా! కా దుత్తుంగ
భుజుఁడే గెలుచు ననుకొందము. ఉత్తుంగభుజుఁడును క్షత్రి
యుఁడే. వీనికన్న వాఁడే మంచివాఁడు. సుమిత్రుని మా

ఉత్తుంగభుజుఁడు రాజైనచో నుల్లు పుచ్చి కొట్టిడఁచి నట్లగును. ఆ యుత్తుంగభుజుఁ డిక్కడ చేసిన చేఁతలు చాలవా! ఈ మహాకార్యములు మఱల గోసలరాజ్యమునందు జరుగవలయునా – మఱికొంద ఱిట్లనిరి. ఓయీ! ఉత్తుంగభుజుఁడెంత ఖడ్గవిద్యావేత్తయో సుమిత్రుఁడు నంతటివాఁడని చెప్పుదురు. అన్నివిధాల సుమిత్రుఁడే గెలుచును. యుద్ధముచేయుటలో తన రాజ్యము పోవుచున్నదన్న దుఃఖము సుమిత్రుని కెక్కువగా నుండును. అందుచేత నతఁడు తెగఁబడి యుద్ధముచేయును, అతని నుత్తుంగభుజుఁడు గెలువనే లేఁడు. నందుఁడు తన వాగ్దాన ప్రకారము సుమిత్రునకు మఱలఁ గోసలరాజ్య మిచ్చెను. ఆ రాజ్య మే నియమముల ననుసరించి యిచ్చెనో–ఓయీ! నీవు నాకు లొంగియున్నచో నిత్తును. నీవుబౌద్ధమతమును వదలిపెట్టినచో నిత్తును. నీ క్షత్రియాభిమానము వదలిపెట్టినచో నిత్తును. నీ కొలువులో నా ప్రతినిధి నుంతును అతఁడు చెప్పినట్లు నీవు నడువవలయును. నీసేన యింతకు మించియుండరాదు. నీ సేన యెంత యుండునో నీ రాజ్యములో నా సేనయు నంత యుండును. నా సేనకయ్యెడు వ్యయముకూడ నీవే భరింపవలయును. వాని ముక్కునకు త్రాళ్లువోసి వానిని రాజును చేయును. అట్టిరాజు రాజైన నొకటియే, రాజు కాకపోయిన నొకటియే. మఱి కొంద ఱిట్లనిరి. ఐనను వాఁడు రాజే. వంద మంది భార్యలను పెండ్లాడవచ్చును. నందుఁడు వల దనఁడు. పది నాటకము లాడించవచ్చును. వలసినచో నందుఁడుకూడ పోయి చూచును. నందుఁడుపోయి యా నాటకమును చూచి నప్పుడు చక్రవర్తి వచ్చెనని యయోధ్యానగర మంతయు

కృతయుగమునాఁటినుండియు నున్న కష్ట్యాలు చాలక మఱి పది కృతకద్వారములను నిర్మింతురు. స్వాగతములు చెప్పుదురు. సభలు చేయుదురు. నందుని పరాక్రమమునుఁ బొగడుదురు. నందుని మెడలో సచ్ఛమైన వజ్రములతోడి హారములను వేయుదురు. అచ్చొటికి నందుఁడు శతవిధాల సంవత్సరమున కొకసారి పోవుచుండును. ఈలోపుగా సుమిత్రుఁడు సంపాదించిన రత్నములన్నియు హారరూపమున తెచ్చికొనుచుండును — ఇంక కొంద ఱిట్లనిరి. ఓయీ! ఆ యుద్ధములో నిటు సుమిత్రుఁడును మిగులఁడు. అటు ఉత్తుంగభుజుఁడును మిగులఁడు. పరస్పర తీవ్రఖడ్గ ప్రహారములచేతఁ బరస్పరము వారి శరీరములు గాయములుపొంది చివర కొకఁడు గెలిచినను గెలిచినవాఁడు బ్రతికెడి స్థితిలో నుండఁడు.

ఇది యిట్లుండఁగా నా మహానగరమునందలి యిండ్లలో స్త్రీలును, బాలురును, అవధ్యులును, వేఱే విషయము బహువిధములుగాఁ జెప్పికొనుచుండిరి. ఒక తల్లి యుడుగఁగా పదునేనేండ్ల కొడు కొకఁ డిట్లు చెప్పెను. నీ కీసంగతి తెలియదు. ఇంటిలోనున్న యాడువారి కేమి తెలియును? ఊరందఱు చెప్పికొనుచున్న మాటలే. మీరు వంటదగ్గఱ కూర్చుందురు. రాజ్యములు సాగిపోవుచుండును. మీ కీనాఁడు కూరయేమి? వంట పూర్తికాలేదని నాన్నగారు వచ్చి కోపపడుదురు. అన్న విషయముతప్ప మహానగరము మహానగరమెల్ల పేటు[illegible]ఁగి పోవుచున్నదని మీకు తెలియదు. ప్రధానముగా జరిగిన సంగతి యేమనఁగా పూర్వపు రాజుకొడుకులు మువ్వురు. పెద్దవానిపేరు కాలాశోకుఁడు, రెండవవానిపేరు రిపుంజయుఁడు.

మూఁడవవానిపేరు విధుసారుఁడు. విధుసారుని దేవభయంకరుఁ డన్న వాఁడు సోనాపురములో వధించెను. అతఁడు చాల పెద్ద జూదగాఁడట. దేవభయంకరుని చెల్లెలిని మానభంగము చేయఁబోయినాఁడట. అన్నగా రతనిని వధించెను. అనఁగా తల్లి యిట్లనెను. "మంచిపని చేసినాఁడు. వానికా శాస్తి జరుగవలసినదే. ఎన్నాళ్ళకు మంచిమాట విన్నాను! మన పొరుగుననున్న వస్త్రములు నేయువాని కూతురు రంభ. దానిని చూచినచోఁ గన్నులకుఁ బండువుగా నుండెడిది. ఆ దుర్మార్గుఁడు దానినిఁ బట్టించికొని పోయెను. రెండేండ్లైన తరువాత నది తిరిగి యింటికి వచ్చెను. దానిని చూచినచో నాకు కన్నులయందు నీరు గిఱ్ఱున తిరిగినది. ఓరి నాయనా! అది యిప్పు డెట్లుండె ననుకొన్నావు? పడిపోయిన గోడవలె నున్నది. విఱిగిపోయిన దూలమువలె నున్నది. బండి క్రిందఁబడి కాలు విఱిగిపోయిన కుక్కవలె నున్నది. మఱల నా కుఱ్ఱవాఁ డిట్లు చెప్పెను." అమ్మా! అది సరే, రెండవవాఁ డున్నాఁడు రిపుంజయుఁడు. అతఁడు నీలగిరి దుర్గాధిపతియైన రిపుంజయుని కుమార్తెను బలవంతము చేసెనట. శత్రువువలె కోట కెగఁబ్రాకెనట. ఆమె భర్త యొక సేనానియట. ఒక నాటి రాత్రి యా సేనాని రిపుంజయుని రమ్మన్నట్లు తన భార్యచేత నుత్తరము వ్రాయించి యితఁడు పోఁగా భార్యా భర్త లిద్దఱును కలిసి వానిని కీచకుని భీముఁడును ద్రౌపదియు వధించినట్లు వధించినారట, అనఁగా తల్లి "కీచకుని భీముఁ డొక్కఁడే వధించెనురా. ద్రౌపది దూరమునుండి చూచు చుండె నని. ఆ పిల్లవాఁ డిట్లనెను. ద్రౌపదికూడ నాల్గు

దెబ్బలు వేసియే యుండును. ఆ చీకటిలో మనము చూచి
తిమా! భీముడు చంపినాడని మనము పుస్తకములలో చదివి
తిమి గావున భీముడే చంపినాడనుకొనుచున్నాము.
అనగా దల్లి "ఔనులే. తమ భార్యయైన ద్రౌపదికూడ
యుద్ధము చేసెననగా భీమునకు గౌరవనష్టముకదరా! అందు
చేత నీ సంగతి దాచియుంచె ననెను. ఆ పిల్లవాడు నీ కీ
రింపు నాకు దెలియునులే. రిపుంజయుని కూతురు మాత్రము
నిస్సంశయముగా వానిని జంపుటలో సహాయ్యపడిన దనెను
తల్లి అది సరే. ఈ రెండువార్తలు నాకును దెలియును.
నీకే క్రొత్తగా దెలియవు. వారము దినములనుండి ఇవి
యందఱును చెప్పుకొనుచున్నమాటలే. కాలాశోకు డెట్లు
చనిపోయెను? అది నీకు తెలిసినచో జెప్పు మనెను. ఆ కుఱ్ఱ
వాడు "ఎట్లు చనిపోయెనేమిటి? చనిపోయెను. రాజ్యము
నందునకు వచ్చినది." అని పడలిపోయెను. మఱియొక
చోట నిద్దఱు యువకులు గూర్చుండి మాటాడుచుండిరి. వా
రిద్దఱు మేనత్త మేనమామ బిడ్డలు. ఒకడు గ్రామాంతరము
పోయి, నాడే వచ్చెను. అతడు తన బావమఱది నడిగెను.
"నేను పది దినము లైనది పల్లెటూరికిపోయి. మా పినతల్లి
కుమారుని వివాహము గాగా నేను చూడబోయితిని. మన
నగరములో పెద్ద గందరగోళముగా నున్నదని యట చెప్పుకొన
జొచ్చిరి. నేనంత బయలుదేరి వచ్చితిని. ఇచ్చట వార్తలు
చిత్ర చిత్రములుగా నున్నవి. ఎవ్వరు చెప్పినను రిపుంజయుని
యొక్కయు విధుసారునియొక్కయు మరణములను గూర్చి
కథలు కథలుగా జెప్పుదురు. కాలాశోకు డెట్లు మరణించెనో

యెవ్వానికినిం జెప్పకు. దాని నడిగెడివేళకు వచ్చిపోయెనని
తెలిపెదను. నీవు రాజకోటలోనికి రాకపోకలు కలవాఁడవు.
నీవు చెప్పవలయు ననెను. అతఁడిట్లు చెప్పెను. "ఓయీ!
ఇప్పుడన్నచో దోషము లేదు. ఈ మాటయే పది దినములు
క్రిందటఁ జెప్పినచో తల యెగిరిపోయి యుండును. నేఁడు
నందుఁడు రాజు గనుక రాక్షసుఁడు మంత్రి కనుక చెప్పు
చున్నాను. రాజ్యమునం దింతటి విప్లవము జరిగినది. ఆర్యా
వర్తమునం దింత విప్లవము జరిగినది. దీని యంతటికిని గార
ణము రాక్షసుఁడు. అనఁగా నా పొరుగూరినుంచి వచ్చినవాఁ
డిట్లనెను. "అదేమిరా! అట్లనెదవు? ఆ రాక్షసుని వయ
స్సెంత? పాతిక యేండ్లు లేవే, నాకంటె నైదారేండ్లు చిన్న
వాఁడు. మేము చిన్నప్పు డొక బడిలో చదువుకొన్నాము.
చిన్నప్పు డతనికి వట్టి మొద్దని పేరు. ఉపాధ్యాయుఁ డొకటి
చెప్పుచుండఁగా నతఁ డింకొకటి యనుకొనెడివాఁడు. అతఁ
డింతటివాఁ డెట్లయ్యె ననెను. రెండవవాఁడు. కాకియును
కోకిలయు చిన్నప్పు డొక్కరీతిగానే యుండునులే. దాని నట్లుం
చుము. ఆ రాక్షసుఁడు విచిత్రమైన వ్యూహమును నిర్మించి
నాఁడు. ఎప్పు డుత్తుంగభుజుఁడు కోసలపతి యుద్ధములోఁ దగు
లొక్కన్నాఁడో అప్పుడే కాలాశోకుని స్థితి గిరివ్రజ పురమున
నెందుకుఁ బనికిరాని దైనది. కాలాశోకుని తన చేతిలోఁ బెట్టు
కొని యుత్తుంగభుజుఁ డాడించినాఁడు. కాలాశోకుఁ డితర
మంత్రుల నెఱుఁగఁడు. ఇతర సేనాపతుల నెఱుఁగఁడు ఒక్క
యుద్ధకారి నెఱుఁగఁడు. మఱి యేమగును? ఉత్తుంగభుజుఁ
డున్నచో నితఁడు రాజు. అతఁడు లేనిచో గాజు. అట్టి కాలా

శోకుని సంహరించుట మిక్కిలి తేలికైనపని. అంతకు మించి బౌద్ధసంఘ సమావేశములు జరిపించినాఁడు. అంతయు నాటకమే. బౌద్ధులు కాలాశోకుని కలిసేసిరని వదంతి పుట్టించినాఁడు. వజ్జీయులకు కోపముఁ దెప్పించినాఁడు. ఆ వజ్జీయులను నందుఁడు రక్షించుచునని చెప్పినాఁడు. ఇదివఱకే యుత్తుంగ భుజుఁడు బౌద్ధభిక్షుకులలో కర్కోటకస్య నాగస్య గాఁడ్రదనుఁ జేర్చినాఁడు. ఎప్పుడు కాలాశోకుఁడు వజ్జీయులకు వ్యతిరేకముగా తీర్మానమిచ్చెనో — నిజానికి తీర్మాన మీయఁ లేదు— గీర్మాన మీయలేదు. అంతయుఁ గల్పనయే — ఆ కర్కోటక నాగులు కాలాశోకుని వధించిరి. ఎప్పుడు వధించిరి? ఎట్లు వధించిరి? ఇదియంతయు రహస్యము. మనకెవ్వరికిఁ దెలియదు. ఇందులో నాశ్చర్యములేదు. మహానంది చనిపోవుటలో నున్నది. అది పెద్ద కథ. రాక్షసుఁడు మహానంది వద్దకుఁ బోయెను. ఆ మహానంది స్థితి యెట్లుండెనందువు. నందుఁ డును కొడుకే. అతనిమీఁద ప్రేమ లేకపోలేదు. ఎట్లైనను తక్కిన ముగ్వురి కొడుకులమీఁద నెక్కువ ప్రేమ యుండును. ఆ ప్రేమలో నా ముగ్వురు కొడుకులు దుశ్శీలు రగుటచేతఁ గొంత కాలుష్య మేర్పడి యున్నది. నందునియెడల మహారాజునకుఁ గల ప్రేమ వట్టి పుత్రప్రేమయె కాని వాఁడు రాజు కాఁదగినవాఁ డన్న ప్రేమ కాదుకదా! నందుఁడు దుశ్శీలుఁడు కాకపోవుటచేత రా జతనియందుఁగల ప్రేమనుఁ బరిశుద్ధముగా నుంచుకొనెను. అతఁడు క్షత్రియుఁడు కాఁడు. రాజ్యార్హుఁడు కాఁడు. రాజ్యార్హతకల ముగ్వురును దుశ్శీలురు. అయినను మహారాజునకు వారిలో నెవ్వఁడో

వొకఁడు రాజుగా నుండవలయుననియే యనిపించునుకదా!
రాక్షసుఁడు మహామేధావంతుఁడని మహారాజుయొక్క యుద్దే
శ్యము. మువ్వురు కొడుకులును మరణించిరి. ఇప్పుడెవ్వరు
రాజు కావలయును? నందునకు రాజ్య మిచ్చునా? మఱలఁ
దానే రాజుగా వ్యవహరించునా? అంతటి యాపదయును
జరిగెడిదే. మఱల మహానంది రాజ్యపాలనము ప్రారంభించి
నచో నేమయ్యెడిది? తన మువ్వురు కొడుకులు నందుని మూల
ముగా చనిపోయినారని మహారాజునకుఁ దెలిసినచో నందు
నంగీకరించఁడు. అప్పుఁ డేమిచేయవలయును? మహానందిని
గూడ సంహరించవలయును. మహానందినిఁ గూడ సంహరించి
రాజ్యము నందుని కిచ్చుటలో రాక్షసుని కేమియు నభ్యంత
రము లేదు. నందునివలననే మువ్వురు కుమారులు చనిపోయి
నారని యెవ్వరికినిఁ దెలియదు. అంతయుఁ జూచినచో నెట్లుం
డును? సహజముగా రాజ్యము నందునకు వచ్చినట్లుండును.
మహానందుని వధించినచో నందుఁ డప్రతిష్ఠ పాలగును.
నందుఁడు రాజగుటకు మహానంది యంగీకరించు, నంగీక
రించఁడు. అది సంశయగ్రస్తమైన విషయము. అందుచేత
మువ్వురు కొడుకు లొక్కసారి చనిపోయినారన్న వార్త
మహానందికిఁ జేర్చవలయును. మొదట రిపుంజయుఁడు చని
పోయినాఁడు. తరువాత విధుసారుఁడు చనిపోయినాఁడు. చివ
రకు కాలాశోకుఁడు చనిపోయినాఁడు. ఎప్పటి మరణ మప్పుడే
మహారాజునకు తెలియఁజేయనీయలేదు. ఈ గోలయంతయు
మహారాజునకుఁ దెలియదు. బౌద్ధులలో ప్రఖ్యాతులై జగత్ప్ర
సిద్ధి పొందిన మహా పండితులు యోగులవంటివారు రాజ

ధానిలో నున్నారు. రాక్షసుఁ డేమిచేసెనో తెలియునా? వారందఱిచేతఁ దొలుత మహారాజ దర్శనము చేయించినాఁడు. ప్రక్క నున్నవారిచేత వారివలన మహారాజేదైన నుపదేశము పొందవలయుననియు, నియమములు బోధింపఁబడవలయు ననియు, నదియే మహారాజర్షి తాఁ డగుటకు యోగ్యమైన వేళ యనియు మహారాజుతోఁ జెప్పించినాఁడు. యశునిచేత, యశుఁడనగా నెవరో తెలియునా, రాక్షసుని నీతి పదకము లోని యొక యంగము, అతఁడే యీ మహాసంఘ సమావేశములకు మూలభూతుఁ డైనవాఁడు. వీరందఱిలో శాణవాసిమహాయోగియఁట, యశునిచేత వానికిఁ జెప్పించినాఁడు. అతఁడు రాజున కుపదేశము చేసినాఁడు. పది దినములు నుండి రాజునకు నాహారములేదు. స్థండిల శయనము. వట్టి నీళ్లే త్రాగుచున్నాఁడు. ఇట్లుండఁగాఁ బ్రాయోపవేశము, వాని లక్షణములు, సిద్ధుఁడై ప్రాణములువదలుట, నిర్వాణము పొందుట, లోకమునందు పరమమైన విరక్తియు ప్రక్కనఁ గూర్చుండి సర్వవేళల నివియే రాజున కుపదేశించెడి బౌద్ధభిక్షుకులను నియమించినాఁడు. ఒక పిడుగువంటి వార్త రాజు చెవినిఁ బడినచో రాజు ప్రాణములు సద్యోనిష్క్రమణమును పొందెడి శారీరకమైన మానసికమైన స్థితి రాజున కేర్పఱచినాఁడు. చిట్టచివరకు రాజుతో నతని ముప్పది కుమారులును జనిపోయిరని యెట్లు చెప్పించెనో తెలియునా? మూఁడు గడియలసేపు ముప్పది కుమారులు నెఱపిన దుష్కృత్యములను ప్రక్కనున్న కొందఱు మంత్రులచేత నుపన్యసింపఁ జేసెను. వారొకవైపున ముప్పది కుమారులయొక్క దుష్ప్రవర్తననుఁ

జెప్పుచుండిరి. మఱియొకవైపున నందుని బొగడుచుండిరి. కొంతసేపటికి రాజునకు దనముగ్గురు కుమారులును నుత్తుంగ భుజుడును నాశనమైనగాని యీ రాజ్యము బాగుపడదని యనిపించెను. ఒక్క నందుడు రాజైనచో మగధరాజ్యము బాగుపడును. లేనిచో నార్యావర్తమునకు నిష్కృతి లేదని పించెను. మహారాజట్లనుకొనునట్లు చేసిరి. అప్పుడు మహా రాజు నిస్సారపడియుండగా నిర్వేదము నందియుండగా నింత కంటె జనిపోవుట మేలనుకొనుచుండగా సులభముగా జనిపో వుటకు గొన్ని యోగమార్గములు బౌద్ధభిక్షుకులు పూర్వమే యుపదేశించియుండగా పది దినములు వానిని రాజుచేత జేయించియుండగా నొక్కసారి ముగ్గురు వార్తాహరు లొకరి వెంట నొకడు వచ్చి వెంట వెంటనే మూడు పిడుగులు పడ్డట్లు రాజునకు ముగ్గురి వధలను జెప్పునట్లు చేసెను. రాజు వెంటనే తాను నేర్చికొన్న యోగాభ్యాసము నవలం బించి ప్రాణములను వదలిపెట్టెను. ఇంకొక రహస్యముసన్నది. నిజముగా నాయన ప్రాణములు పోలేదట. ప్రక్కనున్న బౌద్ధ భిక్షువులు తమ యోగసిద్ధులయొక్క మాహాత్మ్యము నిరూ పింపబడవలయు ననియు, స్వేచ్ఛామరణము పొందెడు నొక విద్య బౌద్ధ సన్యాసులకు దెలియునని యందఱును జెప్పుకొన వలయుననియు, నారాజు కనులు మూసికొని నిస్సార పడిపోయి శరీరమునందు సర్వశక్తు లుడిగి ప్రాణము పట్టాడుచుండగా చనిపోయినాడు చనిపోయినాడని యఱచిరట. అంతట పెద్ద గందరగోళమైనది. ఆ యల్లరిలో రాజు ప్రాణములు పోయి నచో బోయి యుండవచ్చును. కాని మొన్న రాజభవన

పరిచారకుఁ డొకఁడు నాతో రహస్యముగాఁ జెప్పెను. ఒక నోటు బౌద్ధభిక్షుకుఁడు పడియున్న రాజుయొక్క శవమును సరియైన స్థితిలోనికిఁ ద్రిప్పినట్లు నటించి రాజుయొక్క పీక పిసికెనట. అదివఱకే కొనప్రాణములతోనున్న రాజు పీక నొక్కవను పిసుకనక్కఱలేదు. వాఁడు—అనఁగా ఆ బౌద్ధభిక్షుకుఁడు శరీరమునందలి నాడులయొక్క స్వరూపమును స్పందనమును శక్తియు తెలిసినవాఁడట. వాడు తత్కాలమునందలి శరీరము నందలి యొక నాడిని కొద్దిగా నొక్కినచోఁ జాలును. ప్రాణము పోవును. మహారాజిట్లు చనిపోయెను. ఇంకొక చమత్కార మేమనఁగా నిన్నిమాటలతో చెప్పకపోయినను వెనువెంట నందుఁడు రాజగుట మహానంది కిష్టమైనట్లు మంత్రుల యెదుట కొందఱు సేనానులయెదుట చూపించెను.' తరువాత రాజు నోటితో చెప్పెనని కొంద ఱన్నారు. వాని నీ మంత్రులందఱు నిజమే యన్నారు. ఆ రాక్షసుఁ డెఱిఁగిన మానవ స్వభావము బ్రహ్మదేవుఁ డెఱుఁగఁడు. మఱియు వెంటనే నందుఁడు పట్టాభిషేకము చేసికొనలేదు. రాక్షసుఁడు వారించినాఁడు. అందఱు మంత్రులును పోయి యతని నడుగవలయునట. అప్పుడతఁ డంగీకరించునట. తండ్రి చనిపోయినాఁడని సోదరులు మువ్వురు చనిపోయినారని నందుఁడు మహాదుఃఖములో నున్నాఁడట. కాని సర్వరాజ్య వ్యవహారములు నందుఁడే, చూచుచున్నాఁడు. ఇప్పుడు రాజతఁడే. పట్టాభిషేకము జరుగుటకు మంత్రులు పోయి యడుగవలయును. నేఁటి సాయంకాలమున సుమిత్రోత్తుంగభుజులు కత్తియుద్ధ మాడవలయును. అది పెద్ద యుత్సవము. ఆ యుద్ధమునుఁ

జూచుటకు జను లువ్విళ్ళూరిపోవుచున్నారు. సాయంకాలమున నిసుక వేసినచో రాలదు. ముందు కూర్చుండుటకు వీలు దొరుకునో దొరుకదోయని ఇప్పటికి పవలు రెండుజాములు కాలేదు, జనముపోయి యీముందు కూర్చున్నారు. సోదరులయు తండ్రియు మరణమున కంత దుఃఖపడెడివాఁడు నేఁటి సాయంకాలమున నీ వినోద మెందుకు పెట్టినాఁడు? ఈ ప్రశ్న నీవు వేసినచో నాతలి వా రేమని చెప్పుదురో తెలియునా? వారిద్దఱు రాజ్యమునకు విరోధులు. పట్టాభిషేకము కాకముందు వారికి విధింపబడెడు శిక్ష నిర్ణయింపబడ వలయును. అందు చేత నిప్పు డేర్పాటు చేసినారనును.

ఇట్లు జనము భిన్నభిన్న విధములుగా భిన్నభిన్న విషయములనుగూర్చి ముచ్చటించు కొనుచుండఁగా సూర్యుండాకాశపు పశ్చిమసౌధ సోపానములమీఁద గబగబ దిగిపోయెను. అతఁడు క్రింది సోపానమునకు వచ్చునప్పటికి నతఁడు తామర పూచుట్టము కనుక నతని పాదములుగూడ తమ్మిపూవునంత మెత్తనివి, ఆపాదము లెఱ్ఱఁబడిపోయెను. అది సహజమే అతఁడే యెఱ్ఱబడిపోయెను. ఆయన రాజులకు రాజాయెను. పరమ సుకుమారుఁడు. తొందరగా నడచినచో నెఱ్ఱబడిపోఁడా!

గరిడీప్రదేశమున వేయి కాగడాలు వెలిగింపఁబడెను. పట్టపగలుకూడ నంత విస్పష్టముగాఁ గనిపించదు. అందఱి కంటె బాగుగాఁ గనిపించవలయునని పగలు రెండుజాములకే వచ్చి గరిడీప్రదేశమున మునుముందు కూర్చున్నవారలలో ననేకులు తరువాత వచ్చిన గొప్పవారికోసము లేపఁగొట్టఁబడి,

ముందు కాదు సరికదా చిట్టచివరకుఁ బోవలసి వచ్చినది.
పురుషప్రయత్నముయొక్క వైయర్థ్యము దీనికంటె నధికముగా
నింకెక్కడ భాసించును? ఒక ప్రదేశమున నెత్తైన పీఠములు
వేసి యచ్చట బంగారపు టాసనములు పట్టు పఱుపులు వింజా
మరలు మొదలైన సర్వభోగములతో సమర్పఁబడిన పరిశుద్ధ
దేశమున నందుఁడు వచ్చి కూర్చుండెను. పురములోని ప్రజ
లా నందుని పూర్వ మెన్నివందలసార్లు చూడలేదు? అతఁడు
మహాబలశాలియనియు నుదాత్తమైన మూర్తికలవాఁడనియు,
చెంపకు చేరెడేసి కన్నులు కలవాఁడనియు. శిరస్సునందు
వాయలుగా తీర్చిన నల్లని శిరోజములు వెనుకకు దువ్వి
వెనుక గిరజాలుగా సమర్పఁబడియుండి బుగ్గల మీఁద
తుమ్మెద ఱెక్కలవంటి మీసాలు కలవాఁడనియు
నందఱు నెఱుఁగుదురు. అతఁడు తన తండ్రివలెనే సోదరుల
వలెనే బౌద్ధుఁడగుటచేత మొగమున నెప్పుడును తిలకమును
ధరించలేదు. ఈనాఁ డతని ఫాలమున యెఱ్ఱని కుంకుమబొట్టు
మెఱయుచుండెను. ఆ కుంకుమలో నరుగతీసిన రక్తపుపొడి
మిళనము చేసిరో యేమో! కాగడాల వెలుతురున ధగ ధగ
లాడుచుండెను. ఆ యెఱ్ఱని కుంకుమబొట్టునకు చుట్టును
మెఱయుచున్న చందనము తెల్లనిది పరివేషము దాల్చిన
ట్లుండెను. నందుఁడు పీఠముమీఁదికి వచ్చినంతనే ప్రజలనుండి
జయ జయ ధ్వానములు చెలరేఁగెను. పదిమంది వృద్ధులైన
బ్రాహ్మణులు వచ్చి వేదములతో నాశీర్వదించిరి. రాక్ష
సుఁడు ప్రక్కన నిలుచుండెను. ఆయన తెల్లని దోవతి, నడుము
పైన బంగారపు కమ్మిగలది ధరించి యుండెను. తెల్లనియంగీ

బంగారపు పూలతోడిది మేన వహించి యుండెను. మెడలో నొక బంగారపు గొలుసును రెండు ముత్యాలహారములును భాసించుచుండెను. కుత్తుక కంటికొని రెండువైపుల బంగారము పొదిగిన నడుమ నల్లగా రేకగాఁ గనిపించుచున్న రుద్రాక్షను బంగారపు గొలుపుతో మెడ వెనుకకు మలఁచిన దానిని ధరించి యుండెను. అతఁడు కుడిచేయి యెత్తినప్పుడెల్ల చేత నున్న బంగారపు సింహతలాటపు కంకణము ధగధగ లాడు చుండెను. ఆ కంకణమునందున్న ఎదురుఁబడియున్న రెండు సింహ ముఖములయందును నాల్గు సన్నని వజ్రములు నేత్రములవలె నమర్పఁబడి యుండెను. ఆయన శిరోవేష్టనము బంగారపు టంచుతోడి యెఱ్ఱని పట్టుబట్ట. దానియొక్క ముడుతలు చెదరిపోకుండ సూదులవలెనున్న రతనములు గ్రుచ్చఁబడి యుండెడు. ఆయన నడుమున మహాఖడ్గమొకటి వ్రేలాడు చుండెను. జనులందఱును చూచిరి. ఆయన యెవ్వరో తెలియలేదు. ఆ మహాపీఠముమీఁద సర్వాధికార మాయనదిగాఁ గనిపించు చుండెను. నందున కింకను పట్టాభిషేకము కాలేదు గాన నతని తలపైఁ గిరీటములేదు. అతని మేనఁగల దుస్తులు రాజయోగ్యములుగా నున్నను వాని ముఖమండలమునందున్న తీక్ష్ణతచేత నతఁడు పెద్ద దుస్తులను వేసికొన్నట్లు కనిపించుటలేదు. రాక్షసుఁడు దుస్తులు వేసికొన్నట్లు కనిపించుచుండెను. నందుఁడును చిన్నవాఁడే రాక్షసుఁడు చిన్నవాఁడే. ఇద్దఱకును పాతికయేండ్లుండును. కాని నందుఁ డేనుఁగువంటి శరీరము కలవాఁడు కనుక మహారాజువలె నందఱి నేత్రములకు నచ్చెను. రాక్షసుఁడు సింహమువంటి శరీరముగలవాఁడు. అతని

మొగమునందు తేజస్సు కలదు. కాని సింహ ముఖమువలె భయంకరమైనది కాదుకదా! అందుచేత రాక్షసుని శరీరమునందుఁ గల సింహలక్షణము గర్జించిన వేళగాని కనిపించదు. లంఘించిన వేళఁగాని తెలియదు.

అందఱును నిశ్శబ్దముగా నుంచఁబడిరి. అప్పుడు రెండు వైపులనుండి రెండు బోనులు గరిడీస్థలమునకుఁ దీసికొని రాఁబడినవి. వానిలోనుండి ఇద్దఱు పురుషులు దింపఁబడిరి. వారి పాదములయందు హస్తములయం దయశ్శృంఖలములు తగిలింపఁబడి యున్నవి. ఉత్తుంగభుజుఁడు వచ్చి గరిడీయందు నిలబడినతోడనే వాని మహా వరాహమువంటి శరీరమునుఁ జూచి జనులు దిగ్భ్రమపొందిరి. అంతట ప్రజలలోనుండి యొక వికారమైన సందడి బయలుదేరెను. వాఁడేరా! నా కుటుంబమును సంహరించినది. వాఁడేరా నా మేనకోడలి శీలమును హరించినది. వాఁడేరా నా కుటుంబమునంతయు ధ్వంసము చేసినది. వాఁడేరా! తన గుఱ్ఱపు డెక్కలతో మా పసిపిల్లవాని గుండెలమీఁద త్రొక్కించినది. ఇట్లు చెప్పుచు ననేకులు శాపములు పెట్టుచుండిరి. కొందఱు గరిడీలోనికివచ్చి వాని మీఁద నుమిసిపోవుచుండిరి. ఉత్తుంగభుజుఁ డంతసేపును తల వంచికొని నిలుచుండెను. కొంతసేపటికి రాజభటులు జనమును లోనికి రానీక వెనుక కదిమిరి. సుమిత్రుఁడును శృంఖలాబద్ధమైన పాణి పాదమున నుత్తుంగభుజునికి జరుగు నీయవమానము నంతయుఁ జూచుచుండెను. అరే! రాజై యధికారియై చేతిలో సేనలు గలిగి, యిచ్చిన యాజ్ఞలోని సదసత్త్వములు విచారించక, కడుపు నింపికొనుటకు, వేతనములు గ్రహించు వారి

చేత శిరాత కృత్యములు చేయించుట యొకటి. ఆ యధికారములు పోయిన తరువాత జనముచేత మొగమునందు నంబూకృతులు చేయించుకొనుట యొకటి యనుకొనెను.

ఇంతలో రాజభటులువచ్చి వారి హస్త పాదములయందలి శృంఖములనుఁ దీసివేసిరి. వారి యిద్దఱి చేతులయందును వాడి కరవాలముల నర్పించిరి. గరిడీ ప్రదేశము యొక్క పరిధి చుట్టును గుండ్రముగాఁ దీర్చి వందమంది కటారికాండ్రు నిలుచుండిరి. ఇద్దఱును వారితో వారు యుద్ధము చేయవలయునుగాని తెగఁబడి కోపముతోఁ బ్రజల మీఁదికిఁ దిరిగినచో వారి నా కటారికాండ్రు ముక్కలు ముక్కలుగా నరకుదురు. వారి హస్తములయందుఁ గరవాలములను సమర్పించిన తరువాత రాజభటులు వెనుకకు మఱలి పోయిరి. ఇద్దఱు వందులు వచ్చి వారితో నిట్లనిరి. "ఇంతలో శంఖారావము వినిపించును. వినిపించినంతనే మీ రిద్దఱు యుద్ధము చేయవలయును. ఎవఁడు గెలుచునో వానికిఁ గోసల రాజ్య మీయఁబడును. యుద్ధము న్యాయముగాఁ జేయవలెను. అన్యాయముగాఁ జేసినచో గెలిచినను కోసలరాజ్య మీయఁబడదు. మీరు యుద్ధము న్యాయముగాఁ జేయుదురో అన్యాయముగాఁ జేయుదురో నిర్ణయించువాఁడు మహారాజు" అని చెప్పి వెడలిపోయిరి. వా రెంతసేపటికిని పరస్పరము తలపడ లేదు. రాక్షసుఁడు భటులతో వెనుకనుండి యీటెలతో పొడువు డనెను. అప్పుడు సుమిత్రుఁడు తాను నందుని మహాపీఠ సన్నిధానమునకు వచ్చి "ఓయీ నందుఁడా! నేను వీనిని సంహరించినచో నాకు కోసలరాజ్య మక్కఱలేదు.

ఈ రాక్షసుఁడు నాతో యుద్ధము చేయవలయును. ఈ రాక్ష
సుఁడు పన్నిన వ్యూహములకు వానిని వధించినఁగాని నాకుఁ
దృప్తి లేదనెను. రాక్షసుఁడు నవ్వుచు నట్లేయని యంగీక
రించెను. వెంటనే యుత్తుంగభుజుఁడు ముందునకువచ్చి
"ఓయి నందుఁడా! ఈ సుమిత్రుఁడు నా చేతిలో నెంత? నేను
వానిని సంహరించిన తరువాత నీవు నాతో యుద్ధము చేయ
వలయును. నాకుఁ గోసలరాజ్య మక్కఱలేదు." అనఁగా
రాక్షసుఁ డిట్లనెను: "ఓయీ! నందుఁడు సర్వార్యావర్త
దేశమునకు నేఁడు చక్రవర్తి. నేఁటి సర్వదేశముల ధరాపతు
లును మహారాజుయొక్క దయచేత సింహాసనము లధిష్ఠించిన
వారు. ఆ చక్రవర్తి నీతో యుద్ధముచేయఁడు. సుమిత్రుఁడు
కోరినట్లే నీవును కోరుము. నేను నీతో యుద్ధము చేయుదు"
ననెను. ఉత్తుంగభుజుఁ డట్లే యనెను. కాని వారిద్దఱో కరితో
నొకరు యుద్ధము చేయుటకు తలపడనేలేదు. వాడిమిగల
యీటెలుపెట్టి పొడిచినను కదలలేదు. నందుఁడు రాక్షసుని
పిలిచి వారిని చిత్రవధ చేయింపు మనెను. రాక్షసుఁ డది
న్యాయముగాఁ గనిపించదని రహస్యముగాఁ జెప్పి తాను తన
భూషణాద్యలంకృతులను తీసివేసి కత్తియుద్ధమునకు వలసిన
వేషమును ధరించి ఖడ్గమునుఁ బూని గరిడీలోనికి వచ్చి వారిద్ద
ఱితో నిట్లనెను. ఓయీ! మీరిద్దఱు యుద్ధమాడి మీలో
గెలిచినవాఁడు నాతో యుద్ధమాడుట యెందులకు? మీరిద్దఱు
కలిసియే నామీఁదకు రండని కనుమూసి కనుతెఱచు లోప
నెఱపువలె మెఱయుచు వారిద్దఱను భుజములయందు గాఢ
ప్రహారములు చేసెను. వారు రెండు వైపులనుండి రాక్ష

డికొనిరి. వారి కత్తిదెబ్బ పడినచోట రాక్షసుఁడుండఁడు. రాక్షసుఁడున్నచోట వారిదృష్టియే ప్రసరింపదు. రాక్షసునియొక్క చిత్రలంఘనములకు గరిడీప్రదేశము చాలలేదు. ఒకపెట్టున పదిగజములకు వెనుక దూకినవాఁడు మఱల నంతలోననే యుత్తుంగభుజుని ముందు నిలుచుండును. మఱింతలో సుమిత్రుని పార్శ్వమునం దుండును. ఒక్క గడియసేపు గడచులోపున నుత్తుంగభుజునియు సుమిత్రునియొక్క శరీరములు రక్తసిక్తములై యుండెను. రాక్షసుని యొడల నొక్క గీసికొని పోయిన చాఱయులేదు. రాక్షసుఁడు మఱల లంఘించి యుత్తుంగభుజుని దక్షిణ భుజమును నరికెను. అంతలో పెడకు మలఁగి సుమిత్రుని వామోరువున్ ఖండించెను. సుమిత్రుఁడు నేలఁగూలెను. ఉత్తుంగభుజుఁడు ఖడ్గమును వామహస్తమున ధరించి రాక్షసునిమీఁద నరికెను. రాక్షసుఁడు వాని వామ భుజమును కూడ ఖండించి "వీఁడుగో విరాధుఁడు." అని యఱచెను. వాఁడు నేలఁబడిపోయెను. రాక్షసుడు సుమిత్రుని యొక్క రెండు భుజములను రెండవ పాదమును నరికి "వీఁడు కబంధుఁడు" అని వెడలిపోయెను.

౫వ నవల – "చంద్రగుప్తుని స్వప్నము"